తెలుగు అకాడమి ప్రచురణ - మోనోగ్రాఫ్ - 131
చరిత్ర



# 18, 19 శతాబ్దాలలో వచ్చిన నూతన ఆర్థిక, రాజకీయ పోకడలు



రచయిత
డా.కె. ఎస్. ఎస్. శేషన్
చరిత్ర విభాగం,
హైదరాబాదు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.



తెలుగు అకాడమి
హైదరాబాదు
1999

**Monograph :** 18, 19 Sataabdhaalaloo Vacchina nuuthana arthika, raajikiya pookadalu (Modern Trends in Economic, Political fields in 18th, 19th Centuries); **Author:** Dr. K.S.S. Seshan; First Edition : 1999; p p. xii + 136.



First Edition : 1999

Copies : 3000

Published by TELUGU AKADEMI Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally sponsored scheme of production of books and Literature in Regional languages at the University Level of the Government of India in the Ministry of Human Resource Development, New Delhi.



Price : Rs. 30=00

Printed in India
Laser Typeset and Printed at M/s Vani Press, Hyderabad,
Andhra Pradesh

# భూమిక

1968లో స్థాపన జరిగిన నాటి నుంచి ఉన్నత విద్యా స్థాయిలో బోధన భాషగా తెలుగు కుదురుకొనడంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప వ్యవధిలో ఇంటర్, డిగ్రీ, పి.జి. స్థాయి లకు కావలసిన పాఠ్య పఠనీయ గ్రంథాలు; ప్రామాణిక గ్రంథాల తెలుగు అనువాదాలు, మోనోగ్రాఫ్‌లు, జనరంజక గ్రంథాలు, వ్యాసావళులు, కరదీపికలు; ఎంసెట్, ఐ.ఐ.టి., టి.టి.ఐ. మొదలయిన పోటీ పరీక్షలకు కావలసిన గ్రంథాలు; పారిభాషిక పదకోశాలు; శాస్త్ర నిఘంటువులు మొదలయిన వాటిని ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమయిన సేవ చేయగలిగింది. అకాడమి ప్రచురించిన పుస్తకాలు ఎన్నో పునర్ముద్రణలు కూడా పొందాయి.

ఉన్నత విద్యాస్థాయిలో విద్యార్థుల పరిశ్రమ కేవలం పాఠ్య పఠనీయ గ్రంథాలకు మాత్రమే పరిమితం కారాదని, ఆయా పాఠ్యాంశాల మీద విస్తృతాధ్యయనం అత్యావశ్యకమని విద్యావేత్తల అభిప్రాయం. ఈ స్థాయిలో విస్తృతాధ్యయనానికి ప్రామాణిక గ్రంథాలు విరివిగా లభింపజేసే లక్ష్యంతో అకాడమి వివిధ అంశాలపై మోనోగ్రాఫ్‌లను, జనరంజక గ్రంథాలను, వ్యాసావళి గ్రంథాలను తయారుచేయించి ప్రచురిస్తున్నది.

ఈ కార్యక్రమంలో భాగంగా ఈ మోనోగ్రాఫ్‌ను ప్రచురిస్తున్నాం. ఆయా శాస్త్రాంశాల ప్రాముఖ్యాన్ని పురస్కరించుకొని అకాడమి ప్రచురిస్తున్న మౌలికమైన బృహత్ వ్యాసాలు (మోనోగ్రాఫ్ గ్రంథాలు) కేవలం విద్యార్థులకే కాక పోటీ పరీక్షలు రాసేవారికీ జిజ్ఞాసువులకూ సంప్రదింపు గ్రంథాలుగా విస్తృత అధ్యయనానికి ఉపయోగపడుతున్నాయి.

ఉన్నత విద్యా బోధన భాషగా తెలుగు సంపన్నం కావాలన్న కోరికతో శక్తివంచన లేకుండా మేము చేస్తున్న పని విజయవంతం చేయడంలో మాకు ఎంతోమంది అండదండలు లభించాయి. వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటూ ముందుముందు కూడా విద్యార్థులు, అధ్యాపకులు, విజ్ఞానులు మాకు సహాయ సహకారాలను అందించగలరని ఆశిస్తున్నాం.

మా పూర్వ ప్రచురణలన్నింటి మాదిరిగానే ఈ గ్రంథం అందరి ఆదరాభిమానాలు సంపాదించగలదని విశ్వసిస్తున్నాం.

# ప్రవేశిక

భారతదేశంలో బ్రిటిషుపాలనకు సంబంధించిన గ్రంథాలు చాలా ఉన్నాయి. అయితే అవి ప్రధానంగా రాజకీయ పరిస్థితులను తెలియజేయడానికీ పరిపాలనా విధానాలను వివరించడానికీ ఉద్దేశించినవి. అవి చాలా వరకు పాలకుల దృష్టితో రాసినవి. కాని పాలితులను దృష్టిలో ఉంచుకొని, వలసపాలనలోని ఆర్థిక, రాజకీయ పరిణామాలను వివరించే గ్రంథాలు ఎక్కువగా లేవు. అలాంటి కొరతను తీర్చడానికి "18, 19 శతాబ్దాలలో వచ్చిన నూతన ఆర్థిక రాజకీయ పోకడలు" అనే మోనోగ్రాపు గ్రంథాన్ని రాయడం జరిగింది.

ఇందులో ముఖ్యంగా రెండు విషయాలకు ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. మొదటిది - బ్రిటిషు పాలన భారతదేశంలో ఏ పరిస్థితులలో ఏ విధంగా ఉందో తెలియజేయడం, రెండోది - అధికారాన్ని స్థాపించిన బ్రిటిషు వలస ప్రభుత్వం ఎలాంటి ఆర్థిక పద్ధతులను అనుసరించి తమ పాలనకు ప్రయోజకత్వం చేకూర్చిందో తెలియజేయడం. ప్రభుత్వం తీసుకున్న చర్యలతోపాటు ఆ చర్యల పర్యవసానం ప్రజలపై ఏ విధంగా పనిచేశాయో అనే విషయాలను కూడా ఇందులో పొందుపరిచాం. కేవలం పరాయి దేశం నుంచి స్వాతంత్ర్యం పొందాలనే భావంతో మాత్రమేగాక, దోపిడిని అరికట్టడమనే ఉదాత్త ఆర్థిక జాతీయతత్వంలో కొనసాగిన భారత స్వాతంత్ర్యోద్యమానికి 18, 19 శతాబ్దాలలో వలస ప్రభువులు అనుసరించిన లోపభూయిష్టమైన ఆర్థిక పద్ధతులు కారణమని ఎత్తిచూపడం ఈ గ్రంథం ప్రధాన ఉద్దేశం.

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

మొగల్ చక్రవర్తి ఔరంగజేబు 1707 లో మరణించిన నాటి నుంచి 1905లో బ్రిటిష్ వలస పాలనను ఎదిరిస్తూ కొనసాగిన జాతీయోద్యమం తీవ్రతరమయ్యే వరకు ఉన్న రెండు శతాబ్దాల కాలం భారతదేశ సుదీర్ఘ చరిత్రలో ఒక సంధి యుగం. మొగలాయి సామ్రాజ్యం అంతరించడం, దాని స్థానంలో బ్రిటిష్ అధికార స్థాపన, భారతదేశాన్ని ఇంగ్లండు తన ఆర్థిక అవసరాలకు ఉపయోగించు కోడానికై పథకాలను రూపొందించి వలస విధానాన్ని తీవ్రతరం చేయడం ఈ 18, 19 శతాబ్దాల చరిత్ర యొక్క ప్రత్యేకత. కాని స్థానిక ప్రజల రాజకీయ కాంక్షలు పుంజుకోవడం, వలస పాలన పట్ల వారి వ్యతిరేకత తీవ్రరూపం దాల్చడం, ఫలితంగా బ్రిటిషు వారు తమ అధికారాన్ని ఉపసంహరించుకోడం, దేశం స్వాతంత్ర్యాన్ని పొందడం 20వ శతాబ్దంలో జరిగిన ప్రధాన విషయాలు. అందుచేత భారత దేశంలో బ్రిటిషు వలసతత్వం తన నిజ స్వరూపాన్ని బహిర్గతం చేసింది 18, 19 శతాబ్దాల కాలంలోనే.

మొగలాయిల అధికారం క్షీణించిన తరవాత బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీ కలకత్తాను కేంద్రంగా చేసుకొని క్రమేణ భారతదేశంపై రాజకీయ ఆధిపత్యాన్ని స్థాపించ గలిగింది. 18వ శతాబ్దాంతానికి దేశం మొగలాయిల సామ్రాజ్యతత్వం నుంచి బ్రిటిషు వారి వలస తత్వానికి మారిపోయింది. బ్రిటిషు వారు తమ వర్తకాభివృద్ధితో బాటు, సైనిక విజయాలను కొనసాగించి అనేక ప్రాంతాలను ఆక్రమించారు. కర్ణాటక యుద్ధాలు, మైసూరు, మరాఠాయుద్ధాలు అందులో సాధించిన విజయాల వల్ల బ్రిటిషు వారు అనేక ప్రాంతాలను స్వాధీనం చేసుకోగలిగారు. దౌత్య మంతానాలు సలిపి మరికొన్ని ప్రాంతాలను ఆక్రమించుకొన్నారు. సైన్య సహకార పద్ధతి, రాజ్య సంక్రమణ సిద్ధాంతంలాంటి వాటిద్వారాఅనేక ఇతర ప్రాంతాలు వారి ఆధీనమయ్యాయి. స్థానిక రాజుల అధికారాలను హరించి, వారిని తమ కీలు బొమ్మలుగావించారు. తమ ప్రతినిధులను ప్రధాన నగరాలలో నియమించి, స్వతంత్ర రాజుల ఆంతరంగిక పాలనా విషయాల్లో అనవసర జోక్యం కలిగించు కోకుండా ప్రోత్సహించారు. ఆక్రమిత ప్రాంతాలలో బ్రిటిష్ సైన్యాలు, అధికార్లు విచ్చల విడిగా దహనకాండ కొనసాగించి, దొమ్మి దోపిడి మూలంగా ధనాన్ని దోచుకొన్నారు. బెంగాల్‌లో రాబర్ట్ క్లైవ్ అయోధ్యలో రిచర్డ్ స్మిత్, మద్రాసులో రంబోల్డ్ మొదలయిన వారు అలాంటి దోపిడీ విధానాలకు మార్గదర్శకులు. సులభంగా చేజిక్కించుకున్న ధనరాసులతో బ్రిటిషు అధికార్లు తమ మాతృదేశంలో అన్ని సుఖాలను అనుభవిస్తూ ఇతరులకు ఈర్ష్య, అసూయ కలిగించే విధంగా విలాస జీవితాలు

గడిపి, "బ్రిటిషు నావాబులు" గా చలామణి అయ్యారు. వారి వల్ల ఇంగ్లండులో సామాన్యలు కొనే కోడిగుడ్డు నుంచి కోటీశ్వరులు కొనే ఎస్టేట్ల వరకు అన్ని వస్తువుల ధరలు అధికమయ్యాయని ఆరోజులలో వాపోయేవారు. అందుచేత 18వ శతాబ్దం మన దేశ చరిత్రలో దోపిడి శకంగా గుర్తించడం జరిగింది. బ్రిటిషు వారి అధికారం వారు కొనసాగించిన వ్యాపారం, తమ సైనికులు జరిపిన యుద్ధాలు వాటిలో సాధించిన విజయాలపైన ప్రధానంగా ఆధారపడింది.

రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన భారతదేశం 19వ శతాబ్దంలో ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కూడా పోగొట్టుకొనింది. వ్యాపారి, సైనికుని పై ఆధారపడిన బ్రిటిషు అధికారం ఈ శతాబ్దంలో పరిపాలకుని చుట్టూ పరిభ్రమించింది. పరిపాలనా యంత్రాంగం కొత్త పద్ధతులపై రూపొందించడం జరిగింది. అనేక సంస్కరణలు చోటు చేసుకున్నాయి. సంస్థాగత మార్పులు జరిగాయి. బ్రిటిషు ప్రభుత్వం భారతీయ సమాజంలో కొన్ని నిర్మాణాత్మక మార్పులను చేపట్టింది. ఆధునిక వార్తా, రవాణా సౌకర్యాలకు వాణిజ్య పెట్టుబడిదారి వ్యవస్థకు చెందిన అంశాలు తోడై జాతీయ మార్కెట్టులను సృష్టించాయి. పాశ్చాత్య భావాల ప్రభావం ఆర్థిక నిర్వహణలో వచ్చిన మార్పుల వల్ల సామాజిక మార్పుల పట్ల కొత్త దృక్పథానికి ప్రేరణ కలిగించింది. విద్యా సంపన్న మధ్య తరగతి పట్టణాలకే పరిమితమైనా, పాశ్చాత్య స్వేచ్ఛా భావాలను వ్యాప్తి చేస్తూ రాజకీయ, సామాజిక చైతన్యాన్ని కలిగించే మార్గదర్శకపాత్రను చేపట్టింది. దేశంలో గాఢంగా పాతుకుపోయిన సనాతన పద్ధతులకు పాశ్చాత్యుల నూతన దృక్పథాలకు కొన్ని సందర్భాలలో ఘర్షణ తప్పలేదు. బ్రిటిషు పాలన కింద రాజకీయంగా, సాంఘికంగా అధికారాలు పోగొట్టుకొన్న శక్తులన్నీ సంఘటితమై వలస ప్రభుత్వాన్ని పడగొట్టడానికి చేసిన ప్రయత్నమే 1857లో జరిగిన తిరుగుబాటు. కాని ఈ తిరుగుబాటును అణచివేసి బ్రిటిషు ప్రభుత్వం భారతదేశపు పరిపాలనా బాధ్యతలను స్వయంగా చేపట్టింది.

తిరుగుబాటుదార్లు బ్రిటిషు వారి అధికారాన్ని అంతమొందించడంలో విఫలంచెందినా కేవలం ఒక వర్తక సంఘం సువిశాల భారతదేశాన్ని పరిపాలించడమనే అసమంజస పరిస్థితిని బహిర్గతం చేయగలిగారు. కాని బ్రిటిషు ప్రభుత్వం పరిపాలనను నేరుగా నిర్వర్తించడానికి పూనుకున్నప్పటికీ మార్పులు పెద్దగా సంభవించలేదు. 1858 తదనంతర కాలంలో చేపట్టిన అనేక పథకాలు అంతకు ముందు కంపెనీ అధికార్లు తలపెట్టి రూపొందించినవే. పాలనా యంత్రాంగంలో అధికార్లు కూడా వారే కొనసాగారు. కాని దేశంలోని ప్రజాక్షేమం దృష్ట్యా, సుస్థిర పాలనా ధ్యేయంతో పరిపాలనా బాధ్యతలను ప్రత్యక్షంగా చేపట్టాలని బ్రిటిషు పార్లమెంటుముఖంగా ప్రభుత్వం ప్రకటించడమే ఒక ప్రధాన విశేషం.

1858 తరవాత కాలంలో పరిపాలనా యంత్రాంగాన్ని పటిష్ఠం చేయడానికి ప్రాధాన్యత ఇచ్చారు. పాలనా విధులను కట్టుదిట్టం చేసి, చట్టాలను రూపొందించి సివిల్ సర్వీసులను బలపరచారు. కాని ఈ చర్యలన్నీ మాతృదేశంలో ప్రబలిన కొన్ని రాజకీయ సిద్ధాంతాలకు, కొత్త పోకడలకు ఫలితంగా చేపట్టినవేగాని, భారతీయులపట్ల అభిమానంతో కాదు. బ్రిటిషు పాలన

భారతదేశంలో శాశ్వతంగా స్థాపించారనే అపోహ బలపడింది. అందుచేత బ్రిటిషు పెట్టుబడిదార్లకు భారతదేశం చాలా అనువైన రంగస్థలంగా తోచింది.

19వ శతాబ్ది ఉత్తరార్ధంలో పరిపాలనాపరమైన ఒత్తిడికి భారతదేశం గురిచేయడం జరిగింది. బ్రిటిషువారు తమ దేశీయ అవసరాలను దృష్టిలో ఉంచుకొని భారతదేశాన్ని పాలించారు. భారతదేశ ఆర్థికస్థితి రాను రాను ప్రపంచ పెట్టుబడిదారి పరిధిలో ఆధారిత స్థానాన్ని చేరింది. దేశీయ ఆర్థిక విధానాన్ని పడగొట్టిన వలసపాలన ప్రత్యామ్నాయ పద్ధతిని రూపొందించక పోగా బాహ్య ప్రపంచానికి చెందిన ఆర్థిక శక్తుల అధీనం చేసింది.

ప్రజాక్షేమం కోసమని ప్రకటించిన పథకాలన్నీ కూడా బ్రిటిషు ప్రభుత్వం స్వలాభంతో చేపట్టింది మాత్రమే. పారిశ్రామిక విప్లవం వల్ల యంత్రాల విస్తరణతో అధికోత్పత్తులు సాధించిన ఆంగ్లేయ ప్రభువులు మన స్థానిక ఉత్పత్తులకు మార్కెట్లు లేకుండా చేశారు. అనాదిగా పేరు పొందిన మన కుటీర పరిశ్రమలు, ముఖ్యంగా నేత పరిశ్రమ, పాశ్చాత్య మిల్లు బట్టల ధాటికి మరుగున పడిపోయింది. గ్లాస్కో, మాంచెస్టర్, లంకాషైర్‌లోని నూలు మిల్లులకు కావలసిన ముడిపత్తి భారతదేశం నుంచి తరలించడం జరిగింది. వారి అవసరాలకు తగ్గట్లు వ్యవసాయంలో మార్పులు చేసి వాణిజ్య పంటలను ప్రోత్సహించారు. ఎగుమతుల కోసమై నూనెగింజలు ఉత్పత్తి పెంచారు. జాతీయ ఆర్థిక జీవన విధానంలో అనేక మార్పులు తెచ్చారు. వీటి ఫలితంగా కరువు కాటకాలు విపరీత పరిణామాలతో విలయతాండవం చేశాయి. అలాంటి సమయాల్లో, నిర్దిష్ట పథకాలు ప్రభుత్వం చేపట్టనందు వల్ల ప్రజలు, పశువులు, దోమల్లాగా మరణించడం పరిపాటి అయింది. ఉత్పాదనకు అత్యవసరమైన నీటిపారుదలకు మొదట ఆసక్తిచూపని బ్రిటిషు ప్రభుత్వం, భారతదేశ సంపదను తరలించడానికై రవాణా సాధనాలకు ప్రాధాన్యత చూపింది. తమ దేశంలో రైల్వేలు ప్రవేశపెట్టిన సుమారు ఇరవై సంవత్సరాల్లో భారతదేశంలో రైల్వేలను నడిపించారు. ముడి సరుకులను తమ దేశానికి తీసుకుని పోవడానికై రేవు పట్టణాలకు తరలించడానికి, తయారైన వస్తువులను మార్కెట్లకు చేర్చడానికి, సైన్యాలను పంపి రక్షణ ఏర్పాట్లు కట్టుదిట్టం చేయడానికి ఈ రైలు మార్గాలు బ్రిటిషు వారికి ఉపయోగపడ్డాయి. తంతి తపాలలాంటి ఇతర సాధనాలు కూడా దేశ సంపదను త్వరగా సులభంగా చౌకగా తరలించడానికి ఉపయోగించడం జరిగింది. ప్రభుత్వ ప్రోత్సాహంతో స్థాపించిన భారీ పరిశ్రమలు, కాఫీ, తేయాకు, రబ్బరులాంటి తోటల పెంపకం కూడా బ్రిటిషు పెట్టుబడిదార్ల గుత్తాధిపత్యం కింద కొనసాగాయి. ఆ విధంగా 19వ శతాబ్దపు వలసతత్వం భారతదేశంలో తాను అనుకొన్నది, తమ మాతృదేశానికి అనువైనది ఏదైనా నిరాటంకంగా కొనసాగించింది.

బ్రిటిషు ప్రభుత్వ ఆర్థిక దురాగతాలు క్రమేణ తెలుసుకున్న భారత ప్రజల చైతన్యం 20వ శతాబ్దిలో బహిర్గతమైంది. అందుచేత బ్రిటిషు సామ్రాజ్యతత్వం ముందులాగా పూర్తి అధికారాన్ని నెరపలేక పోయింది. పరిపాలనా వ్యవస్థలో భాగంగా విద్యావ్యాప్తికి ఇచ్చిన ప్రోత్సాహం రాజకీయ చైతన్యానికి నాంది అయింది. దేశంలో తలెత్తిన కొత్త శక్తులు శరవేగంతో రంగప్రవేశం చేశాయి.

ఉపోద్ఘాతం

వాటిని అణచడానికై రాజ్యాంగ సంస్కరణలు ప్రకటించి చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. క్రమేణ తన పెట్టుబడులను ఉపసంహరించి, అనేక సందర్భాలలో తనకు తాను రాజీపడాల్సి వచ్చింది. రాజకీయంగా బ్రిటిషు ప్రభుత్వం శక్తివంతమైన జాతీయోద్యమాన్ని ఎదుర్కోవలసి వచ్చింది.

భారతదేశంలో బ్రిటిషువారు స్థాపించిన పరిపాలన, అనుసరించిన ఆర్థిక విధానాల స్వభావంపై చరిత్రకారులు, ఆర్థికతత్వవేత్తలు అనేక విధాలుగా విశ్లేషించారు. అలాంటి వారిలో రెండు ప్రధాన వర్గాలుండటం గమనించవచ్చు. ఒకటి బ్రిటిషు విధానాలను విమర్శించే వారు. రెండోది పొగడే వారు. వలస పాలనలో జరిగిన స్వేచ్ఛా వ్యాపారం, దేశీయ పరిశ్రమల క్షీణత, భూమిశిస్తు విధానాలు, ఆర్థిక సంపద తరలింపు వ్యవసాయ వాణిజ్యీకరణ, రవాణా సౌకర్యాల పెంపు, పారిశ్రామికాభివృద్ధి, విదేశీ వ్యాపారం లాంటి విషయాలు వివాదప్రదమైన చర్చనీయాంశా లయ్యాయి. ఇవి సమకాలీన విమర్శకులనే గాక పరిపాలకులు, జాతీయవాదులు, తరవాతి తరాలకు చెందిన పండితుల దృష్టిని కూడా ఆకర్షించాయి. బ్రిటిషు వలస పాలనా స్వభావంపై నేటికీ ఈ చర్చ కొనసాగుతూనే ఉండటం గమనించాల్సిన విషయం.

# అధ్యాయం 1

## మొగల్ సామ్రాజ్య పతనం-ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం

దాదాపు అర్ధ శతాబ్దం పరిపాలన కొనసాగించిన ఔరంగజేబు 1707 సం॥లో మరణించాడు. అతడు రాజ్యాన్ని తన ముగ్గురు కొడుకులకు సమానంగా పంచి ఇవ్వాలని మరణించడానికి ముందు అనుకొన్నాడు. వారసత్వ యుద్ధాలు లేకుండా చేయాలని అతని ఉద్దేశం. కాని అతని బోధనలు వినడానికి అతని కుమారులు సిద్ధంగా లేరు. అతని ఉద్దేశం ప్రకారం షా ఆలంకు పన్నెండు సుభాలు, ఆజంకు ఆరు, మూడోవాడైన కంబాష్‌కు రెండు సుభాలు చెందాలి. ఇది ఔరంగజేబు అనుకొన్న విభజన ప్రణాళిక. కాని ఆచార పరంగా మొగలు సామ్రాజ్య ఐక్యత అందరూ ఎరిగిందే. ఆజం తన అన్న షా ఆలంకు ఈ విధంగా ఉత్తరం రాశాడట "ఇంటిలో నేల నుంచి కప్పు వరకు నా భాగం. కప్పు పై నుంచి గల ఆకాశమంత నీ భాగం." అని. అన్నదమ్ముల నందరిని చంపి సింహాసనాన్ని ఆక్రమించుకొన్న ఔరంగజేబుకు రాజ్య ఐక్యత విలువ తెలుసు. ఇటాలియన్ యాత్రికుడైన మనూషి అన్నట్లు "మొగలు సామ్రాజ్యంలో కొడుకులు, మనుమలు, ముని మనుమలు ప్రతి వృద్ధ చక్రవర్తి మరణానంతరం ఘోర యుద్ధాలకై సదా ఆయత్తమవుతారు." ఔరంగజేబు మరణించిన తరవాత దాదాపు ఒక దశాబ్దం లోపల వారసత్వానికై ఏడు గొప్ప యుద్ధాలు జరిగి అనేక మంది రాకుమారులు, సైనికులు మరణించడం, ఖజానా పూర్తిగా ఖాళీగావడం, పరిపాలనా యంత్రాంగం అదుపు తప్పడం జరిగింది.

1707 మార్చి 3వ తేది ఔరంగజేబు మరణించాడు. అజిత్‌సింగ్ రాథోర్ ఒక పక్షం దినాల లోపల జోధ్‌పూర్ ను ఆక్రమించారు. విజయోత్సాహులైన మహారాష్ట్రులు విచ్చల విడిగా కొల్లగొట్టడం ప్రారంభించి అహమద్‌నగర్ వరకు వీరవిహారం చేశారు. మొగలు సామ్రాజ్యంలో తొలుత కనిపించిన శాంతి సౌఖ్యాలు పూర్తిగా అంతమయ్యాయి. దోపిడి యుగం ఆరంభమైందనవచ్చు.

చక్రవర్తి వ్యక్తిగత స్వభావంపై ప్రతిదీ ఆధారపడి ఉండేది. అతని సన్నిహితుడైన ప్రధానమంత్రి వజీర్‌మీర్ బక్షి, ఉన్నత మునసబ్‌దార్లుగూడ అన్ని విషయాలకు బాధ్యులు. సాష్టాంగ ప్రణామాలు, సలాములు, ముఖప్రీతి మాటలు, పొగడ్తల మధ్య వీరందరికీ సంఘాన్ని, రాజకీయాలను, తారుమారు చేయగల పలుకుబడి ఉండేది. ప్రజల విధేయత, రాజకుటుంబానికి ఉమ్మడిగా ఉండేది గాని అందులోని ఏ ఒక్క సభ్యునికి వ్యక్తి గతంగా మాత్రం గాదు. రాజ కుటుంబంలోని ప్రతి ఒక్కరు ప్రజల గౌరవ మర్యాదలు పొందడానికై పోటీ పడ ప్రారంభించారు. ఇట్టి అస్తవ్యస్త పరిస్థితి ఢిల్లీలో అనిశ్చితాన్ని

గలిగించింది. కుటుంబంలోని ఈర్ష్యలు జాతి ద్వేషాలు చాల ప్రధాన సమస్యలయ్యాయి. మంత్రుల మధ్య తగాదాలు కొన్ని సందర్భాల్లో జాతి విభేదాలు గలిగించాయి. రాజపుత్ర నాయకులతో విరోధం ఔరంగజేబు నుంచి తరవాత చక్రవర్తులకు వారసత్వంగా సంక్రమించింది. అజిత్‌సింగ్ రోఫార్ వంటివారు ఢిల్లీ చక్రవర్తికి విధేయులై యుండి ఉండవచ్చు. కాని అక్బర్ కాలంనాటి నుంచి వచ్చిన విధేయత లోపించింది. అక్బరు, జహంగీరు వంటి చక్రవర్తులు సైన్యాన్ని తరలించి తెలివితేటలను ఉపయోగించి, కొన్ని సందర్భాల్లో వైవాహిక సంబంధాలతో, అమిత ఖర్చులో, ఎన్నో విధాలుగా రాజపుత్ర స్థానాన్ని తమ ఆధీనం చేసుకోగలిగారు. ఔరంగజేబు వారసులు ఈ పద్ధతులన్నిటిని ఒకదాని తరవాత ఒకటి అనుసరించారు. కాని గతంలోని ఉత్సాహం క్షీణించింది. ఐక్యత అదృశ్యమైంది. రాజపుత్రులు కూడ దుర్దశకు చేరుకొన్న కారణంగా మొగలుల ఐక్యతకు ఏ విధంగానూ సహాయకులుగా లేరు.

మొగల్ మునసబ్‌దార్ల ఉన్నత, మధ్యవర్గాల్లో ఉన్న దాదాపు సగం సభ్యులు ప్రభువుల కుమారులు లేక దగ్గర బంధువులు ప్రాంతీయ గవర్నర్లలో మూడువంతులు ప్రభువులే. పదవుల నియామకాల్లో ఉద్యోగాల పెరుగుదల్లో స్వజాతి భావాలు, రాజకుటుంబ సాన్నిహిత్యం ప్రధాన పాత్ర వహించేవి. ప్రభువు స్వభావంపై అన్ని పరిస్థితులు ఆధారపడి ఉండేవి ఔరంగజేబు అనంతరం బలహీనులైన చక్రవర్తులున్న కారణంగా పాలన నిర్వహణ సమర్థవంతంగా లేక పోయింది. రాజుల అసమర్థతకు తోడు తిరుగుబాటు చేసే అన్నదమ్ముల మూలంగా పరిస్థితి మరింత క్షీణించింది.

ఔరంగజేబు మరణించే సమయంలో అసద్‌ఖాన్ అనునతడు వజీర్‌గా ఉండేవాడు. అతని కుమారుడు జల్ఫికార్ ఖాన్ మీర్ బక్షీగా ఉండేవాడు. అసద్‌ఖాన్ వంటి వజీర్ అప్పటికి లేడని, తరవాత గూడ ఉండబోడని ఔరంగజేబు అప్పుడప్పుడు అనేవాడు. కాని అటువంటి మంత్రి గూడ ఔరంగజేబు తదనంతరం బాధ్యతారహితంగా వ్యవహరించాడు. పలుకుబడిలోగాని, అధికారంలోగాని అసద్ ఖాన్, జల్ఫికార్ ఖాన్‌లు ప్రధానమైనవారు. వారు వారసత్వ యుద్ధంలో షా ఆలం కు వ్యతిరేకంగా ఆజంను సమర్థించారు. అసద్ ఖాన్ గ్వాలియర్‌లో ఉండిపోయాడు. జల్ఫికార్ ఖాన్ ఆజంను అనుసరించి యుద్ధానికి వెళ్లాడు. కాని కొద్దిపాటి గాయాలకు గురైన కారణంగా గ్వాలియర్‌కు పారిపోయాడు. అతని ఉదాహరణను అనేకులు అనుసరించారు. జల్ఫికార్‌చర్య ఆజం భవిష్యత్తును నిర్ణయించింది. తండ్రి కొడుకులు షా ఆలంను ఆశ్రయించారు. షా ఆలం, 'బహదూర్‌షా' పేరుతో ఢిల్లీ చక్రవర్తి కావడానికి వారు ముఖ్య కారకులు. బహదూర్‌షా మరణం తరవాత జల్ఫికార్ అత్యంత ప్రధాన పాత్ర నిర్వహిస్తూ వచ్చారు. జహందర్‌షా ఇతని చేతి చలవ మూలంగా విజయం పొందాడు. ఆగ్రావద్ద జరిగిన యుద్ధంలో జహందర్, ఫరూక్ సియర్ చేతిలో ఓడి

పోయాడు. అసద్ ఖాన్ సలహా మేరకు జల్ఫికార్ తన ప్రభువైన జహందర్‌ను బంధించి ఫరూక్ సియర్‌కు అప్పజెప్పాడు. నమ్మక ద్రోహంతో దీనికి మించిన దృష్టాంతం లేదు ఈ ఇద్దరు ఉన్నతాధికారుల ప్రవర్తన స్వామి ద్రోహం, మోసం, అవిధేయత మొదలైన వాటితో కూడిన దుర్దశకు నాంది పలికింది. ఔరంగజేబు తరవాత మొగలు సింహాసనం నిర్దుష్టమైన విధేయతగల మద్దతు దార్లను కోల్పోయింది.

చక్రవర్తి ఢిల్లీ నగరంలో ఉన్నప్పుడు నగరం హుందాగా కళకళలాడేది. దాదాపు నాలుగు లక్షల జనాభా గలిగి మిక్కిలి శోభ గలిగి ఉండేది. కాని చక్రవర్తి ముఖ్య పట్టణంలో లేనప్పుడు అది ఎడారిలాగా మారేది. ఔరంగజేబు దక్కనులో ఉన్న సుదీర్ఘ కాలంలో ఢిల్లీ ఏ విధంగా ఉండేదో ఊహించవచ్చు. ఎర్రకోట ప్రపంచ ప్రసిద్ధి చెందిన భవనాల్లో ఒకటిగా చెప్పవచ్చు. అక్కడి ఔన్నత్యానికి ప్రతి చక్రవర్తి తన శక్తి సామర్థ్యాలను, ధనాన్ని వెచ్చించారు. రాకుమారులకు, పెద్ద ప్రభువులకు గృహాలు యమునా నదీ తీరంలో ఒకే వరుసలో నిర్మించ బడ్డాయి. ఆ భవనాలు ఎంతో గంభీరంగాను, మహా రంజకంగాను, ప్రత్యేక వాస్తు శిల్పకళ ఉట్టిపడే విధంగాను ఉండేవి. వాటి పై భాగంలో ప్రభువులు సాయంకాల సమయంలో చల్లని గాలి పీలుస్తూ గడిపేవారు. విదేశీ వ్యాపారులు బసచేయడానికి ప్రత్యేక గృహాలుండేవి. అనేక స్నాన వాటికలు, మసీదులు, ఉద్యాన వనాలు ఢిల్లీ ఆగ్రా నగరాలలో ఉండేవి, మనోజ్ఞమైన ఉద్యానవనాలు వేయించడం మొగలు చక్రవర్తుల ప్రత్యేకత షాజహాన్ కాలంలో ఢిల్లీ నగరానికి అలి మర్దాన్ ఖాన్ త్రవ్వించిన కాలువ మూలంగా ప్రతి ఇంటిలోను జల యంత్రాలు వెలిశాయి. కళాత్మకమైన పూదోటలు ఎన్నో వేయడం జరిగింది. మొగలు ఆస్థానంలోని జీవన విధానానికి సామాన్య ప్రజల జీవన సరళికి ఏ కోశాన పోలిక లేదు. నిరాడంబరతకు మారుపేరైన ఔరంగజేబు విలాస జీవిత పద్ధతిని గర్హించారు. అతని దీర్ఘ పాలనాకాలంలో కళలను నిరుత్సాహ పరిచారు. కాని ప్రజల జీవన స్థితి గతులను మెరుగు పరచడానికి తీసుకొన్న చర్యలు మాత్రం ఎక్కడా గోచరించదు.

1707 సం॥ నాటికి మొగల్ ప్రభుత్వం ఆర్థికంగా అధ్వాన్న పరిస్థితికి చేరుకొనింది. జీతాలు చెల్లించడంలో మూడేండ్లు బకాయి పడింది. అమితకాలం కొనసాగిన యుద్ధాల మూలంగా, నిల్వగల ధనమంతా వ్యయమయింది. కాని అట్లాంటి పరిస్థితినుంచి కోలుకొనడం దుర్లభమైన దేమీకాదు. దాదాపు ఇరవై ఐదు సంవత్సరాల యుద్ధాల తర్వాత గూడ ఆగ్రాలోని ఖజానాలో 24 కోట్ల రూపాయల నిల్వఉండేది. భూమిశిస్తు దాదాపు 33 కోట్ల రూపాయలు సాలీనా ఆదాయ మివ్వగలదు. జిజియా పన్ను మూలంగా దాదాపు 4 కోట్లు ఆదాయముండేవి. ఇవిగాక వర్తక రుసుములు గూడ ఎంతో ఆదాయాన్ని తెచ్చిపెట్ట గలవు. జాగీర్ పద్ధతి క్షీణిస్తూ వచ్చినా పరిస్థితిని అదుపులో ఉంచి సమర్థవంతంగా పునరుద్ధరణ చేసి ఉండవచ్చు. కాని నిరంతర యుద్ధాల మూలంగా దీనికి వీలుగలుగ లేదు. దక్కను, మాళ్వా, బుందేల్ ఖండ్, గుజరాత్ మొదలైన ప్రాంతాల్లో మొగల్ పాలన బాగా క్షీణించింది. దోపిడీలు,

దొంగతనాలు, తిరుగుబాట్లు, యుద్ధాలు మొదలగు వాటి చేత పునరుద్ధణకు ఏవిధంగాను వీలు లేక పోయింది. పూర్వకాలం నుంచి వ్యవసాయంతో బాటు చేతి కళల ప్రోత్సాహం కొనసాగిన పద్ధతికి అంతరాయం ఏర్పడింది. గ్రామాల్లోని హస్త కళల నిపుణులకు ధాన్యరూపం లో ఉమ్మడిగా ప్రతి ఫలాన్ని ఇచ్చుపద్ధతి మారుమూలలలో మాత్రం కొనసాగింది కాని ప్రతి చోట ధనం మార్పిడి పద్ధతి క్రమీణ ప్రబలంగా వచ్చింది. వ్యవసాయం—హస్త కళలు గూడ వేరుగా ఏర్పడ్డం మొదలైంది. విదేశీ వ్యాపారం అభివృద్ధి చెందింది. దేశంలోని అనేక నదుల మూలంగా వర్తకం నిరాటంకంగా కొనసాగింది. దక్షిణదేశంలోని తీరప్రాంతాల్లో ముఖ్యంగా కోరమాండల్ తీరంలో తయారైన నూలు బట్టలు ఆగ్నేయ, ఆసియా దేశాల్లో మంచి గిరాకీ సంపాదించాయి. ఐరోపాకుగూడ ఎగుమతులు కొనసాగాయి.

మొగలాయి ప్రభువుల వైభవాన్ని, డాంబికాన్ని అభిలషించిన కారణంగా ప్రతి ఖరీదైన విలాసవస్తువు వారికి కావాల్సి వచ్చింది. అట్టి వస్తువుల తయారీకి తగు ప్రోత్సాహం ఉండడంచే, పట్టణాలు నగరాలు పెరిగాయి. సందడి గల మార్కెట్లు వెలిశాయి. మొగాలాయి ప్రభువుల సంపద గూర్చి ప్రతినోట వినిపించేది. దీనిచే తమ అవసరాలకు మించిన వస్తు చయాన్ని కొనగల ప్రభువర్గం ఉండేది. దాదావు అన్ని నగరాలు వర్తక వాణిజ్యాలకు పేరు పొందాయి. ఢిల్లీ ఆగ్రాలు మాత్రమే గాక శ్రీనగర్, లాహోర్. థట్టా, కరాచి, కాంబె, అహమ్మదాబాద్, సూరత్, పూనా, గోవా, కాలికట్, నాగపట్నం, కంచి, పులికాట్, మచిలీపట్నం, వరంగల్, గోల్కొండ, అహమద్ నగర్, బర్హాంపూర్, బనారస్. పాట్నా లక్నో, ఢక్కా, చిట్టగాంగ్, హుగ్లీ, కాసింబజార్, విశాఖపట్నం మొదలైనవన్నీ వర్తక కేంద్రాలు. సాధారణంగా బీద ప్రజానీకం భూకామందులకు అణగి మణగి, వారి అడుగులకు మడుగులొత్తాల్సి ఉండేవి.

ఇస్లాం మతం అప్పు ఇవ్వడం నిషేధించింది. కాని భారతదేశంలోని ముస్లింలు ఈ పద్ధతిని పూర్తిగా వదలలేదు. పెద్ద ఎత్తున ఏర్పడ్డ బాక్యింగ్ వ్యవస్థలో ముస్లిములు పాల్గొన లేదు. బెంగాలులో జగత్ సేనలు పెద్ద పెద్ద పెట్టుబడులకు ప్రతీకలైరి. ఇతర స్థలాలలో గూడ మార్వాడీలు ప్రముఖులుగా తయారైరి. చెట్టియార్‌లు, పార్సీలు, భోరాలు మొదలైన వర్తకులు రాజకీయంగా అరాచక మేర్పడిన తర్వాతగూడ తమ వ్యాపారాలకు లాభసాటిగా కొనసాగించారు వర్తక విషయాలలో నైతిక విలువలు ఉన్నతస్థాయిలో ఉండేవి. ఖరీదైన మస్లిన్ బట్ట , సామాన్యులు గూడ ఖరీదు చేయు ఉప్పువంటి వస్తువుల తయారీలో ఉమ్మడి వ్యాపార సంస్థలను స్థాపించి విజయ వంతంగా కొనసాగించిన అనేక వణిక్ ప్రముఖులు లేక పోలేదు. వారు ఆర్థిక విషయాలలో సిద్ధ హస్తులు, అమిత సంపద, ఉన్నతమైన వర్తక వర్గం బాగా పెంపొందిన బ్యాంకింగ్ వ్యవస్థ యూరపియనులు రాక మునుపు భారతదేశంలో బాగా నెలకొందని చెప్పవచ్చు

రైతులు సాధారణంగా చిన్న చిన్న భూ కమతాలను సాగుచేసేవారు. వారు చెల్లించే పన్నుల మూలంగా ప్రభుత్వానికి అత్యధిక ఆదాయం ఉండేది. మొగలుల కాలంలో పొగాకు వాడకంగూడ అతి త్వరితంగా పెరగసాగింది. 1617సం॥లో ఔరంగజేబు పొగాకు పీల్చడం నిషేదించాడు. కాని ఔరంగజేబు పాలన ప్రారంభంలో భారతదేశాన్ని సందర్శించిన మనూషి రచనలో ఢిల్లీ నగరంలోనే రోజుకు దాదాపు ఐదువేల రూపాయలు పొగాకుపై పన్ను వసూలయ్యేదని తెలిపి ఉన్నాడు. ఇదే కాలంలో నీలి మందు, పత్తి, పట్టు మొదలైన వాటి గిరాకీగూడ పెరిగింది.

మొగలాయిల కాలంలో ప్రభుత్వ బాధ్యత ప్రధానంగా రక్షణ, పోలీసు, న్యాయవిషయాలకు పరిమితమైంది. పదిహేడో శతాబ్దంలో నెలకొన్న న్యాయ పరిపాలనా పద్ధతి గమనించ దగ్గది. సాధారణంగా ఇస్లాంమత ప్రాతిపదిక పైగల ప్రభుత్వం న్యాయ విచారణకు చాల తక్కువ ప్రాధాన్యతను ఇచ్చింది. సివిల్ తగాదాలన్నీ గూడ సహృద్భావంతో గ్రామ పెద్దలు పరిష్కరించేవారు. కాని క్రిమినల్ తగాదాలకు శిక్షలు విధించడం మాత్రం ప్రభుత్వ బాధ్యత. సహజ న్యాయ పద్ధతులకు ముస్లిం క్రిమినల్ న్యాయ విచారణా పద్ధతులు భిన్నంగా ఉండేవి. శిక్షించడమనే అధికారం వ్యక్తికి చెందిందిగాని ప్రభుత్వానికి గాదు. ఈ అధికారం నిర్ణయించడం ఖాజికి గల బాధ్యత అంగ విచ్ఛేదం సర్వసాధారణమైన శిక్ష. ఇందులో అనుసరించిన పద్ధతి గాని ఉపయోగించిన సాధనం గాని చాల ప్రధానం. హత్య సందర్భాల్లో ఇచ్చిన సాక్ష్యం, ఇస్లాం మతేతరులు ఇచ్చు సాక్ష్యాలు చెల్లవు. దొంగలను బంధించి దొంగలించిన వస్తువులను సొంత దార్లకు అప్పజెప్పడం జమీందార్ల బాధ్యత. భూమి శిస్తు, న్యాయ విచారణ విధులు విలీనం చేయడం వల్ల కలుగు లోపాలు తలఎత్తలేదు. ఏకపక్షంగా తీర్పును నిర్ణయించు న్యాయస్థానాలే దప్ప విచారణతో కూడిన న్యాయస్థానాలు లేవు. దేశంలోని అప్పటి పరిస్థితులు ఆ పద్ధతులకు కారణం. గ్రామ పంచాయితీల్లో నేరస్తులెవరో నిర్ణయించడానికి అట్టే కష్టముండేదికాదు. అవగాహనాభావంతో ప్రజలు మెలగడం చేత తగాదాలకు మూల కారణాలను తొలగించడానికి ఆస్కారముండేది. విలువైన ఆస్తి పాస్తులకు సంబంధించిన వివాదాలు మాత్రమే ప్రభుత్వ విచారణ సంస్థలకు వెళ్లేవి. మోసాలకు, దొంగసంతకాలకు, దీర్ఘకక్షలకు, గ్రామ పంచాయితీలు తగు శిక్షలు విధించే అధికారం ఉండేవి.

## ప్రాంతీయ రాజ్యాలు :

మొగలు సామ్రాజ్య ప్రారంభదశలో చక్రవర్తులందరు మిక్కిలి సమర్థవంతులు. ప్రాంతీయ సుబేదార్లు స్వతంత్రించడానికి వీలులేకుండా తగు జాగ్రత్తలు గైకొనేవారు. వారి పరిపాలనా విధానంగూడ దానికి తగ్గట్లు అమరి ఉండేది. కాని ఔరంగజేబు తరవాత పాలించిన మొగల్ ప్రభువుల కాలంలో ముఖ్యంగా మహమ్మద్‌షా తరవాత అనేక విశాలమైన

రాష్ట్రాలన్ను ఒక్క గవర్నరు అధీనానికి తేవడం, శక్తిమంతమైన పర్యవేక్షణ దీనివల్ల లోపించడం జరిగింది. అందుచే ప్రాంతీయ నాయకులు స్వతంత్రించడానికి వీలుకలిగింది. దక్కనులో మొగలాయి సుబాల నన్నిటినీ తన ఆధీనంలో ఉంచుకొన్న నిజాం హైదరాబాదు రాజ్యాన్ని స్థాపించాడు. బెంగాలు, బీహారు, ఒరిస్సాలు కలసి ఒక స్వతంత్ర రాజ్యంగా రూపొందాయి. వారసత్వ విధానం ఈ ప్రాంతీయరాజ్యాలకు గూడ అన్వయించింది. ఈ ప్రాంతాలన్నీ కేంద్ర ప్రభుత్వానికి మిక్కిలి దూరంగా ఉండడంచేత స్వతంత్రించడం మరీ సులువైంది. దూర ప్రాంతాలే గాక ఢిల్లీకి దగ్గరగల అయోధ్య వంటి రాష్ట్రాలుగూడ సమయానుకూలంగా వ్యవహరించి. స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నాయి.

## హైదరాబాదు నిజాం :

మొగల్ సామ్రాజ్య క్షీణతను ఆసరాగాతీసుకొని స్వతంత్రించి, ప్రత్యేకమైన రాజ్యాన్ని మొదట స్థాపించిన ఘనత హైదరాబాదునేలిన అసఫ్ ఝాహీలకు దక్కుతుంది. హైదరాబాదు రాజ్యాన్ని స్థాపించినవాడు చిన్ ఖిలి చ్ ఖాన్. ఇతనికి నిజాం ఉల్‌ముల్క్ అనునది సుప్రసిద్ధపేరు. అతని తాత మధ్య ఆసియాలోని బుఖారా నుంచి భారత దేశానికి వచ్చినవాడు. ఉల్ ముల్క్ ఔరంగజేబు కాలంలో మొగలు కొలువులో చేరాడు ఒహదూర్‌షా కాలంలో అతడు అయోధ్యకు గవర్నగా నియమించబడ్డాడు. 1713లో దక్కను గవర్నరుగా బదిలీ అయ్యాడు. 1722 లో మహమ్మద్‌షాచేత వజీరుగా నియమించబడ్డాడు. కాని మొగలు ఆస్థానంలోని విలాసాలు. అనవసర ఆడంబరాలకు విసిగిన నిజాం ఉల్ ముల్క్ 1723 లో దక్కనుకు చేరాడు. అతని విధేయతను శంకించిన చక్రవర్తి ముహమ్మద్‌షా, దక్కనులో సహాయ గవర్నరుగా నున్న ముబరిజ్ ఖాన్‌ను ప్రోత్సహించి ఉల్‌ముల్క్‌ను ఎదిరించమని ఆదేశించాడు. కాని 1724 లో బీహర్‌లోని షాకర్ కెక్ వద్ద జరిగిన యుద్ధంలో నిజాం ముబరిజ్ ఖాన్‌ను చంపివేశాడు. చక్రవర్తి వెంటనే తన పరువు నిలుపుకోడానికై నిజాంను సుబేదారుగా గుర్తించి అసఫ్‌ఝా అనే బిరుదు ఇచ్చాడు. దక్కనులోని ఆరు సుబాలకు నిజాం సుభేదారుగా గుర్తించ బడ్డాడు. మొగల్ సామ్రాజ్యాన్ని మహారాష్ట్రుల నుంచి, నాదిర్‌షా నుంచి కాపాడ్డానికై అతడు 1736 నుంచి, దాదాపు నాలుగేండ్లు ఉత్తర భారత దేశంలో గడిపాడు. 1741లో దక్కనుకు తిరిగి వచ్చిన నిజాం ఉల్‌ముల్క్ తన కుమారుడు నాజర్ జంగ్ లేవదీసిన తిరుగుబాటును అణచివేశాడు. 1743లో నిజాం ఉల్‌ముల్క్ ఆర్కాటు తిరుచినాపల్లిపై తన అధికారాన్ని స్థాపించుకొన్నాడు. అతని ప్రతినిధి అయిన అన్వరుద్దీన్‌ను ఆర్కాటు నవాబు చేశాడు. 1748లో నిజాం మరణించే నాటికి హైదరాబాదు, స్వతంత్ర రాజ్యంగా దక్కనలో రాజకీయ ప్రాముఖ్యత పొందగలిగింది.

మొగల్ సామ్రాజ్య అంతిమదశలోని ప్రసిద్ధప్రభువుల్లో ఒకడుగా నిజాం ఉల్‌ముల్క్ గుర్తింపు పొందాడు. యుద్ధాల్లోనే గాక అతడు దౌత్యంలో గూడ సిద్ధహస్తుడు. హైదరాబాదు

స్వతంత్ర రాజ్య స్థాపకుడుగా అతడు భారత చరిత్రలో గొప్ప స్థానాన్ని పొందాడు. అతడు స్థాపించిన రాజవంశం స్వాతంత్ర్యానంతరం హైదరాబాదు పోలీసుచర్య ముఖ్యంగా 1948లో భారత రిపబ్లిక్‌లో విలీనమగు వరకు కొనసాగింది.

నిజాం ఉల్ ముల్క్‌కు మొత్తం ఆరుగురు కుమారులు, వారందరు తండ్రి మరణానంతరం వారసత్వానికై తగాదా పడ్డారు. మొదటి కుమారుడు ఘాజి ఉద్దీన్ ఢిల్లీలో ఉంటూ అచ్చట మొగల్ ఆస్థానంలో అనవసరంగా జోక్యం కలిగించుకొంటూ కాలక్షేపం చేశాడు. అందుచే రెండవ కుమారుడు నాసిర్ జంగ్ హైదరాబాదులో తండ్రి తర్వాత సుబేదారుగా ప్రకటించుకొన్నాడు. కాని నిజాం ఉల్ ముల్క్ మనుమడైన (కూతురు కొడుకు) ముజఫర్ జంగ్ హైదరాబాదు సుబేదారు పదవికి ప్రత్యర్థిగా నిలిచాడు. అతడు ఆదోనికి, బీజపూర్ ప్రాంతానికి గవర్నరుగా పనిచేశాడు. మంచి పాలనానుభవం సంపాదించాడు. దీనికితోడు రాజ్యాన్ని తన వశంచేసుకోవాలన్న తీవ్ర కాంక్షకలిగినవాడు. అతనికి ఫ్రెంచి తూర్పు ఇండియా కంపెనీ వారి, మద్దతుగూడ లభించింది. అందుచే నాసిర్‌జంగ్‌కు ముజఫర్ జంగ్‌కు మధ్య పోరాటం ప్రారంభమైంది. వీరిద్దరి మధ్య జరిగిన వారసత్వ యుద్ధం రెండో కర్ణాటక యుద్ధంగా చరిత్రలో ప్రసిద్ధి గాంచింది. అధికార స్థాపనకై ఫ్రెంచి వారికీ ఆంగ్లేయులకు దక్కనులో జరిగిన కర్ణాటక యుద్ధాల గూర్చి తరవాత అధ్యాయంలో విపులీకరించటం జరిగింది. వారసత్వపు యుద్ధం కొనసాగు సమయంలో మొదట నాసర్ జంగ్, తరవాత ముజఫర్ జంగ్ కూడ చంపబడ్డాడు. అందుచే నిజాం ఉల్‌ముల్క్ మరొక కొడుకైన సలాబత్ జంగ్ హైదరాబాదు నిజంగా ప్రకటించబడ్డాడు. అతడు ఏ విధంగానూ సామర్థ్యం లేనివాడు. జనరల్ బుస్సీ నాయకత్వంలోని ఫ్రెంచి సైన్యం అతనికి సహాయంగా హైదరాబాదులో మకాం వేసింది. కాని బుస్సీ నిష్క్రమణ తరవాత సలాబత్ అతని తమ్ముడైన నిజాం ఆలీ కి అన్ని అధికారాలు అప్పజెప్పాడు. మహారాష్ట్రులు సదాశివ బాహు నాయకత్వం క్రింద 1760 సం॥లో ఉద్గిర్ యుద్ధంలో నిజాం సైన్యాలను ఓడించారు. అసిర్‌ఘర్, దౌలతాబాద్, బిజపూర్ మొదలైన ప్రాంతాలను మహారాష్ట్రులకు అప్పజెప్పవలసి వచ్చింది. తక్కిన ప్రాంతాలపై కూడ చౌత్ పన్ను కట్టడానికి నిజాం అంగీకరించాడు. ఇది అసఫ్ ఝూహి ప్రతిష్టకు భంగంగా వారి వంశ నాశనానికి కూడ దారితీసి ఉండేది, కాని ఇంతలో 1761 సం॥లో మహారాష్ట్రులు పాణిపట్టు యుద్ధంలో ఓడిపోయిన కారణంగా, దాది తరవాత కొద్ది నెలలలోనే వారి నాయకుడైన పీష్వా బాజీరావు మరణించడంవల్ల హైదరాబాదు నిజాం తన అధికారాన్ని ప్రతిష్టను పునరుద్ధరించుకో కలిగాడు. నిజాం ఆలి తన అన్న సలాబత్ జంగ్‌ను కారాగారంలో బంధించి 1762 లో తనను తాను నిజంగా ప్రకటించు కొన్నాడు. నిజాం ఆలి సింహాసనానికి రాషడంతో అసఫ్ ఝూహి వంశం అధికార యుక్తంగా కొనసాగింది.

## బెంగాలు నవాబులు :

ముర్షిద్ కులీ ఖాన్ ఆధ్వర్యంలో బెంగాలు, బీహార్, ఒరిస్సాలు కలిసి స్వతంత్ర రాజ్యంగా రూపొందాయి ఔరంగజేబు ఆస్థానంలో పేరు పొందిన దివాన్ ముర్షిద్ కులి ఖాన్. ఔరంగ జేబు అవసాన దశలో అతడు బెంగాలుకు దివాన్ గాను. అజిమ్ అసఫ్ షా దివాన్ గాను నియమితులయ్యారు. కొద్దికాలం తర్వాత ముర్షిద్ బెంగాలుకు సంబంధించి సైనిక విషయాలు గూడ చూడటం ప్రారంభించాడు. ఫరూక్ సియర్ సింహాసనాన్ని అధిష్ఠించిన పిదప ముర్షిద్ కులి ఖాన్ బెంగాలుకు సహాయ గవర్నరుగా నియమితుడయ్యాడు. 1717 సం॥లో అతడు సుబేదారుగా నియమితుడయ్యాడు. 1727లో అతడు మరణించే వరకు ఆ పదవిలో కొనసాగాడు.

ముర్షిద్ కులి ఖాన్ బెంగాలీ హిందువులను నియమించి శిస్తు వసూలు చేయించాడు. ఈ పద్ధతి మూలంగా బెంగాల్లో కొత్త భూస్వాముల వర్గం తయారైంది. బ్రిటిషు వారికి తరవాత సంక్రమించిన భూమిశిస్తు వసూలు పద్దతి ఒక విధంగా అతడు రూపొందించిన పద్ధతి ప్రతిరూపమేనని చెప్పవచ్చు.

ముర్షిద్ కులిఖాన్ అల్లుడు షూజా ఉద్దీన్ తరవాత బెంగాల్ ప్రభువయ్యాడు. అతని కాలంలో బెంగాలు ఒరిస్సాలతో బీహారుకూడ చేరింది. 1739 సం॥లో అతడు మరణించగా అతని కుమారుడు సర్ ఫ్రాజ్ ఖాన్ బెంగాలు గవర్నయ్యాడు. కాని 1740 లో ఒక సహాయ గవర్నరుగా ఉండిన ఆలి వర్ది ఖాన్‌ను సర్ ఫ్రాజ్ ఖాన్ చంపాడు. మొగల్ చక్రవర్తి 1740 మే నెల్లో ఆలి వర్ది ఖాన్ ను బెంగాలు, బీహారు, ఒరిస్సా ప్రాంతాల సుబేదారుగా గుర్తించాడు.

కొత్త సుబేదారు వెంటనే తన రాష్ట్రాలు నాగపూర్ ప్రాంతాల్లోని మహారాష్ట్రుల దోపిడులకు లోనైనానని గ్రహించాడు. 1742 లో ప్రారంభమైన తగాదాలు దాదాపు 1751 వరకు కొనసాగాయి. ఈ కాలంలో ఆలి వర్ది ఖాన్ అమిత నష్టాలకు గురి అయినాడు. అందుచే నాగపూర్ ప్రభువైన రఘుజి భాంస్లే తో సంధి చేసుకొన్నాడు. సంధి షరతుల ప్రకారం ఒరిస్సా పూర్తిగా రఘుజికి అప్పజెప్పారు. బెంగాలునుంచి ఏటా పన్నెండు లక్షల రూపాయలు చౌత్ రూపంలో చెల్లించాలి. బెంగాలుకు సువర్ణ రేఖ నది సరిహద్దుగా నిర్ణయించడం జరిగింది 1756 లో ఆలి వర్ది ఖాన్ మరణించాడు. అతని మనుమడు సిరాజ్ ఉద్దౌలా బెంగాలుకు కొత్త వైస్రాయిగా పదవి నధిష్ఠించాడు. సిరాజ్ పరిపాలనా కాలం బెంగాలులో బ్రిటిషువారితో జరిపిన పోరాటంతో ప్రసిద్ధి చెందింది. బెంగాలులో బ్రిటిషు వారి అధికార స్థాపనకు నాంది పలికిన ప్లాసీ యుద్ధం ఈ సిరాజ్ ఉద్దౌలాతో జరిగింది మాత్రమే.

## అయోధ్య నవాబులు :

సాదత్ ఖాన్ అనునొక పర్షియా దేశస్థుడు 1720 లో మొగలాయి సైన్యంలో ఫౌజ్ దార్‌గా నియమితుడయ్యాడు. కొద్దికాలం ఆగ్రాలో పనిజేసిన సాదత్‌ఖాన్ వెంటనే అయోధ్యకు ప్రాంతీయ ప్రభువుగా నియమితుడయ్యాడు. అతనికి బర్హాన్ ఉల్ ముల్క్ అను బిరుదు ఇవ్వబడింది. కాని అతడు జాట్ల తిరుగుబాట్లను అణచడంలో విఫలు డయ్యాడు. ఇంతలో 1739 లో నాదిర్ షా దండయాత్ర సమయంలో బంధితు డయ్యాడు. ఢిల్లీవెళ్లి మొగల్ చక్రవర్తిని బంధించమని నాదిర్ షాకు సలహా ఇచ్చాడు కూడ. కాని తరవాత ఆత్మహత్య చేసుకొని షాదత్‌ఖాన్ మరణించాడు

అయోధ్యలో సాదత్‌ఖాన్ తరవాత అతని అల్లుడు అబ్దుల్ మన్సూర్ ఖాన్ అధికారం లోకి వచ్చాడు. మొగల్ చక్రవర్తి అహమద్ షాకు, వజీరుగా నియమితు డయ్యాడు. అతడు 1754 లో మరణించగా అతని కుమారుడు షుజా ఉద్దౌలా అయోధ్యను స్వయం ప్రతి పత్తిగల రాజ్యంగా రూపొందించాడు. ఇతడుగూడ మొగల్ చక్రవర్తి అయిన రెండో షా ఆలంకు కొద్దికాలం వజీరుగా వ్యవహరించాడు. కాని 1766 లో జరిగిన బక్సార్ యుద్ధం తరవాత అతడు క్రమేణా కంపెనీ ప్రభుత్వానికి చేరువయ్యాడు. వారికి సామంతుడుగా కొన సాగడానికి అంగీకరించాడు.

మొగల్ సామ్రాజ్య అవసాన దశలో అనేక స్వతంత్ర రాజ్యాలు వెలసినా, మొదటి మొగల్ చక్రవర్తులు భారతదేశంలో రాజకీయ ఐక్యతకు దోహదం చేశారు. మధ్య ఆసియా దేశాలతో ముఖ్యంగా వ్యాపార సంబంధాలు గలిగాయి. ఆఫ్ఘనిస్థాన్ భారత దేశంలో భాగం అయింది. దాదాపు రెండు వందల సంవత్సరాలు శాంతి భద్రతలు నెలకొన్నది. ప్రభుత్వం అనేక పరిశ్రమలను నెలకొల్పింది. మొగల్ చక్రవర్తులు తమ ఆధీనంలోని అమిత ధన సంపదను వెచ్చించి కళలను, వాస్తు శిల్పాన్ని పోషించారు. భారతీయ భాషలు వికాసం చెందాయి. ఉర్దూ భాష పెంపొందించబడింది. కాని ఔరంగజేబు తర్వాతి చక్రవర్తులు సామర్థ్యవంతులు కానందున, వారి వద్దగల ప్రభువులలో ఏర్పడ్డ ఈర్ష్య స్పర్ధల మూలంగా. ముఖ్యంగా మొగల్ సైన్యంలో క్రమ శిక్షణ లోపించడంవల్ల సామ్రాజ్య ఔన్నత్యం దిగజార సాగింది. క్షీణించిన ఆర్థిక వ్యవస్థ. ఔరంగజేబు అనుసరించిన మత విధానం ప్రత్యర్థులైన షియాలను అణచివేసిన తీరు, దక్కనులో ముఖ్యంగా మహారాష్ట్రులతో అతడు చేసిన యుద్ధాలు మొగలాయి సామ్రాజ్య క్షీణతకు దోహదం చేశాయి. మొగల్ ప్రభుత్వం స్వతహాగా పోలీసు ప్రభుత్వం. ఒక్క అక్బర్ కాలంలో తప్ప, తక్కిన సమయంలో ప్రభుత్వం కేవలం అంత రంగిక భద్రతకు, విదేశీదండయాత్రలు నెదిరించడానికి మాత్రమే కృషిచేసింది. దీనితోబాటు ప్రభుత్వ శిస్తు వసూలు చేయు విషయాలకు ప్రాధాన్యతనిచ్చింది. క్రమేణ ప్రభుత్వం బలహీన

పడి ఆంతరంగిక భద్రత, వైదేశిక శాంతి స్థాపించలేక పోయింది. తిరుగుబాట్లను అణచలేని శాంతిభద్రతల స్థాపించలేని ప్రభుత్వాన్ని ప్రజలు గూడ అభిమానించలేక పోయారు. ప్రాంతీయ గవర్నర్లు స్వతంత్రించడానికి ఇది మూల కారణమయింది. బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీ వాణిజ్య సంస్థగా ఉంది. భారత దేశాన్నంతా ఆక్రమించుకోనే ఉద్దేశం సైనిక శక్తిగా మారడం మొగలుల అధికార క్షయానికి ప్రత్యక్షంగా దారితీసింది. తమ పూర్వీకులు బాబర్ నాయకత్వంలో నాణ్యతగల యుద్ధ సామగ్రిని ఉపయోగించి ఢిల్లీ సుల్తానుల నోడించి నట్లే, బ్రిటిషువారు తమవద్దగల ఆధునిక ఆయుధాలను ఉపయోగించి, మొగలాయిలకు తెలియని నౌకా బలాన్నిగూడ ప్రదర్శించి విజయాన్ని సాధించారు. మొగలాయిల పతనానికి నౌకాదళం లేనిదిగూడ ప్రధాన కారణం.

# అధ్యాయం 2

## తూర్పు ఇండియా వర్తక సంఘం - అధికార స్థాపన

పదిహేడో శతాబ్ది అంతానికి ఐరోపాలో నూతన ఉత్తేజంతో కూడిన కొత్త శకం ఆరంభమైంది. నౌకాయానం అభివృద్ధిచెంది, భౌగోళిక పరిశోధనలు పారిశ్రామిక రంగం పెంపొంది విప్లవాత్మకమైన విధంగా ఉత్పత్తి జరిగి, వీటిమూలంగా వలస రాజ్యాల స్థాపన సామ్రాజ్యతత్వం పెంపొంది ఆర్థిక దోపిడి కొనసాగింది. ఐరోపాలోని ప్రధాన దేశాలన్నీ అట్టి వలస రాజ్యాల స్థాపనలో గట్టిగా పోటీ పడ్డాయి. ఆసియా, ఆఫ్రికా, అమెరికా ఖండాలు ఐరోపియనులకు వలసలుగా మారాయి. భారతదేశంలో గూడ పోర్చుగీసు డచ్. ఫ్రెంచ్, బ్రిటిషువారు వర్తక స్థావరాలను స్థాపించి, వారి వ్యాపార వాణిజ్యాలను అభివృద్ధి పరచ సాగారు. కాని బ్రిటిషువారు తక్కిన ఐరోపియనులను ఓడించి కడపటికి తమ అధికారాన్ని సుస్థిరం చేసుకొని దాదాపు రెండు శతాబ్దాలు భారత దేశంలో వారి పరిపాలనను కొనసాగించారు.

1600 సం॥లో బ్రిటిషు రాణి ఎలిజబెత్ నుండి అనుమతి పొంది స్థాపించబడ్డ బ్రిటిషు తూర్పు ఇండియా వర్తక సంఘానికి మొగల్ చక్రవర్తి జహంగీరు సూరత్ రేవును వర్తకానికై ఇచ్చాడు. క్రమేణా మచిలీపట్నం, మద్రాసు, బొంబాయి, కలకత్తా, కాశింబజారు, కడలూరు, విశాఖపట్నం వంటి అనేక రేవు పట్టణాలను బ్రిటిషువారు పొందారు. గోవా, డయ్యూ డామన్‌ల్లో పోర్చుగీసువారు, పాండిచ్చేరి, మాహి, కరైక్కాల్. యానాంల్లో ఫ్రెంచ్ వారు, పులికాట్, నాగపట్నం, మచిలీపట్నంలో డచ్‌వారు వ్యాపారం కొనసాగించారు. నౌకా బలంపై ఆధారపడ్డ ఈ బ్రిటిషు వర్తక కంపెనీల ధాటికి నౌకాబలం పూర్తిగా లోపించిన మొగలుల అధికారం తట్టుకోలేక పోయింది. భారత దేశంలో అనాదిగా అరబ్బులు కొన సాగించిన వ్యాపారాన్ని పోర్చుగీసువారు హస్తగతం చేసుకోగా, వారినుంచి డచ్‌వారు సొంతం చేసుకొన్నారు. కాని తక్కిన ఐరోపా వర్తక సంఘాలను ఓడించి బ్రిటిషువారు దేశాన్ని ఆక్రమించి తమ రాజకీయ అధికారాన్ని స్థాపించ గలిగారు.

18వ శతాబ్ది ఆరంభం నాటికి మొగల్ సామ్రాజ్యంలో ఏర్పడ్డ పరిస్థితులు బ్రిటిషువారి అధికార విస్తరణకు దోహదం చేసినా, ఉత్తర భారత దేశంలో వారు మహారాష్ట్రులను, వారితో బాటు శక్తిమంతమైన బెంగాలువంటి ప్రాంతీయ రాజ్యాలను ఎదుర్కోవాల్సి వచ్చింది. నిజాం ఉల్‌ముల్క్ మరణానంతరం బ్రిటిషువారు హైదరాబాదు సుబా విషయాలలో జోక్యం కలిగించుకొని, అందుమూలంగా రాజకీయ అధికారం పొందగలిగారు. తమ అధికారాన్ని ఎదిరించిన ఫ్రెంచి తూర్పు ఇండియా కంపెనీవారితో పోరాటం కొనసాగించి కడపటికి

విజయం సాధించారు. ఆంగ్లేయులకు. ఫ్రెంచివారికి మధ్య దక్షిణ భారత దేశంలో జరిగిన యుద్ధాలకు కర్ణాటక యుద్ధాలని పేరు. అవి మొత్తం మూడు అందు మొదటిది, మూడోది ఐరోపాలో ఆంగ్లేయులకు, ఫ్రెంచి వారికి మధ్య జరిగిన యుద్ధాలకు ప్రతిబింబాలు. కాని రెండో కర్ణాటక యుద్ధం మాత్రం, పై రెండు వర్తక కంపెనీలు హైదరాబాదు, ఆర్కాటు వంటి స్థానిక రాజుల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొన్న కారణంగా జరిగింది.

## కర్ణాటక యుద్ధాలు :

1740 లో ఐరోపాలో ఆస్ట్రియా వారసత్వ యుద్ధం ప్రారంభమైంది. జర్మన్ రాజ్యాలైన ఆస్ట్రియా, ప్రష్యాల మధ్య సంభవించిన ఈ యుద్ధంలో ఫ్రాన్సు, ఇంగ్లండు గూడ పాల్గొన్నాయి. అందుచేత, ఫ్రెంచి, బ్రిటిషు వర్తక కంపెనీలుగూడ మనదేశంలో యుద్ధానికి దిగాయి. బ్రిటిషు ప్రభుత్వం కల్నల్ బార్నెట్ అనే ఒక నౌకా దళాధికారిని భారత దేశానికి పంపింది. ఇది పాండిచ్చేరిలోని ఫ్రెంచి గవర్నరు డూప్లేకు ఆగ్రహం కలిగించింది అతడు వెంటనే ఆర్కాటు గవర్నరైన అన్వరుద్దీన్‌కు వర్తమానం పంపి, బార్నెట్ రాక శాంతి భద్రతలకు మంచిది కాదని వాదించి, బ్రిటిషు నౌకా దళాధిపతిని తిప్పి పంపివేసేట్లుగా చేశాడు. కాని డూప్లే వెంటనే మారిషస్ నుంచి కొత్త ఫ్రెంచి సైన్యాలను రప్పించి, బ్రిటిషు వారి వర్తక స్థావరమైన మద్రాసును ముట్టడించి ఆక్రమించు కొన్నాడు.

మద్రాసును తన వశం చేసుకోవాలనుకున్న ఆర్కాటు నవాబు అన్వరుద్దీన్‌కు డూప్లే చర్య సహించలేదు. అందుచే తన సైన్యాన్ని మద్రాసుకు పంపి ఫ్రెంచి సేనలను ఎదిరించాడు. అడయారు సమీపంలో జరిగిన యుద్ధంలో అన్వరుద్దీన్ సేనలు ఓడిపోయాయి. మద్రాసు ఫ్రెంచి ఆధీనంలో కొనసాగింది. కాని 1748 లో ఆస్ట్రియా వారసత్వ యుద్ధం ముగిసినప్పుడు కుదిరిన ఎరాషెపల్ సంధి ప్రకారం మద్రాసు మళ్లీ ఆంగ్లేయులకు అప్పజెప్పడంజరిగింది

మొదట కర్ణాటక యుద్ధంలో సాధించిన విజయం డూప్లేను మరింత ఉత్సాహ పరిచింది. అతడు బ్రిటిషు వారి పలుకుబడిని తగ్గించ డానికై స్వదేశీ రాజుల విషయాల్లో జోక్యం కలిగించు కోటం ప్రారంబించాడు. దానికి తోడు ఆర్కాటు, హైదరాబాదుల్లో జరిగిన వారసత్వం తగాదాలు డూప్లే అధికార దాహాన్ని పెంచడానికి దోహదం చేశాయి.

1748 లో హైదరాబాదు నిజాం ఉల్‌ముల్క్ మరణించగా అతని కుమారుడు నాజిర్ జంగ్‌కు, మనుమడు ముజఫర్ జంగ్‌కు జరిగిన వారసత్వ యుద్ధంలో బ్రిటిషువారు జోక్యం కల్పించుకోడానికి వీలు కలిగింది. అదే సందర్భంలో దోస్త్ అలి అల్లుడైన చందా సాహెబ్ ఆర్కాటు నవాబైన అన్వరుదిన్‌ను పదవీచ్యుతుని చేసి సింహాసనాన్ని ఆక్రమించ

డానికి ప్రయత్నించాడు. చందాసాహెబ్ ఫ్రెంచి గవర్నరైన డూప్లేను దీనికోసం సహాయం అర్థించాడు.

డూప్లే ముజఫర్ జంగ్‌ను ఆర్కాటు సమస్యలను మొదట పరిష్కరించడానికై ఆహ్వానించాడు. హైదరాబాదులో నాజిర్‌జంగ్‌తో తరవాత తలపడ వచ్చానని నిర్ణయించాడు. 1749లో డూప్లే ముజఫర్‌జంగ్ చందా సాహెబుతో కలసి అన్వరుద్దీన్ ఎదిరించారు. ఆంబూరు దగ్గర జరిగిన యుద్ధంలో అన్వరుద్దీన్ మరణించాడు. చందాసాహెబు ఆర్కాటు నవాబుగా ప్రకటితమైనాడు.

అంతకు ముందు పెద్దగా అధికారం లేని బ్రిటిషువారు భారత రాజకీయాల్లో జోక్యం కలిగించుకోవాలనుకొన్నారు. బ్రిటిషువారు డూప్లే, ముజఫర్‌జంగ్‌లకు వ్యతిరేకంగా తంజావూరు రాజును ప్రోత్సహించారు. హైదరాబాదునుంచి నాజిర్ జంగ్‌ను ఆహ్వానించారు. ఈ అందరి సహాయంతో డూప్లే అధికారాన్ని అణచ తలపెట్టారు. నాజిర్ జంగ్‌ను హైదరాబాదు నిజాంగాను, అన్వరుద్దీన్ కుమారుడైన మహమ్మదాలిని ఆర్కాటు నవాబును చేయటం బ్రిటిషువారి ఉద్దేశం. అదే ప్రకారం నాజిర్‌జంగ్ కర్ణాటక ప్రాంతానికి చేరుకొన్నాడు. కాని 1750 లో జింజికోట ముట్టడి సమయంలో నాజిర్ మరణించాడు. వెంటనే ముజఫర్ జంగ్ హైదరాబాదు నిజంగా ప్రకటించుకొన్నాడు. డూప్లే కొత్త నిజాంకు "ప్రతినిధి"గా గుర్తింపబడ్డాడు. అతనికి పాండిచ్చేరి సమీపంలోని విల్లీయ నల్లూరను గ్రామం జాగీరుగా ఇవ్వడం జరిగింది. దాంతో అతడు "డూప్లే సాహేబ్" అయ్యాడు. 1751లో ముజఫర్ పాండిచ్చేరినుంచి ఒక ఫ్రెంచిసేన వెంటరాగా హైదరాబాదుకు బయలుదేరాడు. ఫ్రెంచి సేనలకు నాయకుడు జనరల్ బుస్సీ. అతడు ధైర్య సాహసాలకు పేరు మోసినవాడు. హైదరాబాదుకు ప్రయాణమైన సమయంలో మార్గమధ్యలో కడప సమీపంలో లక్కిరెడ్డి పల్లె కనుమలో ముజఫర్‌జంగ్ తన అనుచరులైన కడప కర్నూలు నవాబుల కుట్రవల్ల చంపబడ్డాడు. కాని బుస్సీ తన సైన్యంతోబాటు హైదరాబాదు చేరి, నాజర్‌జంగ్ తమ్ముడైన సలబత్ జంగ్‌ను నిజాంగా ప్రకటించాడు. దానికి ప్రతిగా కొత్త నిజాం ఫ్రెంచివారికి ఉత్తర సర్కారులను—గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణ జిల్లాలను అప్పజెప్పాడు. సలాబత్ జంగ్‌కు అండగా బుస్సీ తనసేనలతో హైదరాబాదులో బసచేశాడు. హైదరాబాదులోను, ఆర్కాటులోను, ఫ్రెంచివారి అధికారం కొనసాగింది. బ్రిటిషువారి పలుకుబడి బాగా సన్నగిల్లింది.

ఆ పరిస్థితినుంచి రాబర్టు క్లైవు మూలంగా బ్రిటిషువారు ఉన్నట్టుండి అధికారం పొందగలిగారు. బ్రిటిషు సైన్యంలో క్లైవు అప్పటికి ఒక చిన్న కాప్టన్ మాత్రమే. మద్రాసు గవర్నరును మెప్పించి, కొద్దిపాటి సైన్యం సహాయంతో ఆర్కాటును ముట్టడించాడు. కావేరిపాక్, అరణి మొదలైన చోట్ల జరిగిన యుద్ధాల్లో ఆర్కాటు సైన్యాలను ఓడించాడు. చందాసాహెబ్ తంజావూరు రాజుతో పోరాడుతూ చనిపోయాడు. ఫ్రెంచి సేనలు డూప్లే నాయ

కత్వం కింద తిరుచునాపల్లెలో ఓడిపోయాయి. దీంతో 1754లో ఫ్రెంచి ప్రభుత్వం డూప్లేను స్వదేశానికి రావాల్సిందిగా ఆదేశించింది. అతని స్థానంలో గాడ్యు అనునతడు పాండిచ్చేరి గవర్నరుగా నియమితుడైనాడు. క్రొత్త గవర్నరు భారతదేశం చేరుకోగానే బ్రిటిషు వారితో సంధి చేసుకొన్నాడు. సలాబత్ జంగ్ హైదరాబాద్ నిజాంగా గుర్తించ బడ్డాడు. మహమ్మదాలి ఆర్కాటు నవాబుగా స్థిరపడ్డాడు. డూప్లే నిష్క్రమణలో ఫ్రెంచి అధికారం సన్నగిల్లింది. బ్రిటిషు వారి ఆధిక్యత కొంత మెరుగైంది. కాని మూడో కర్ణాటక యుద్ధంలో విజయం సాధించేవరకు బ్రిటిషువారు వేచి యుండాల్సి వచ్చింది.

మూడో కర్ణాటక యుద్ధం మొదటి యుద్ధంవలె ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాల మధ్య ఐరోపాలో జరిగిన తగాదాల మూలంగా ఏర్పడ్డదే. ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలు 1756లో సప్తవర్ష సంగ్రామంలో పాల్గొన్న కారణంగా రెండు దేశాలకు చెందిన వర్తక సంఘాలు గూడ భారత దేశంలో పోరాడ్డం ప్రారంభించాయి. బ్రిటిషు తూర్పు ఇండియా ప్రాబల్యాన్ని పూర్తిగా అణచివేయాలనే తలంపుతో ఫ్రెంచి ప్రభుత్వం ఒక పెద్ద సైన్యాన్ని కౌంట్–డి–లాలి నాయకత్వం కింద 1757 ఏప్రిల్‌లో హిందూదేశానికి పంపింది. దాదాపు ఒక సంవత్సరం ప్రయాణం తరవాత లాలి 1758లో భారతదేశం చేరుకొన్నాడు. అప్పటికి బెంగాల్లో బ్రిటిషువారు కొన్ని విజయాలు సాధించిన కారణంగా వారి అధికారం బాగా పెరిగింది. అందుచేత ఫ్రెంచివారికి బ్రిటిషువారి నెదిరించడం కొంచెం కష్టంతో కూడిన పని అయింది.

లాలి కడలూరులోని డేవిడ్ కోట ముట్టడించి ఆక్రమించాడు. తంజావూరునుగూడ ఆక్రమించాలనుకొన్నాడు కాని దానిపై విజయాన్ని సాధించలేక పోయారు. ఫ్రెంచి ప్రాబల్యం బాగా దెబ్బతింది. లాలి వెంటనే మద్రాసును ఆక్రమించాలనుకున్నాడు. అందుకై హైదరాబాదునుంచి బుస్సీని వెంటనే రప్పించాడు. బుస్సీ హైదరాబాదు వదలడంతో అచట ఫ్రెంచి ప్రాబల్యం క్షీణించ నారంభించింది. బ్రిటిషువారు అదను చూచకొని వెంటనే ఉత్తర సర్కారులను ఆక్రమించు కొన్నారు. 1760 లో వందవాశి వద్ద జరిగిన యుద్ధంలో సర్ ఐర్ కూట్ ఫ్రెంచి సైన్యాలను ఓడించి, పాండిచ్చేరిని కైవసం చేసుకొన్నాడు మాహి, జింజి వంటి స్థావరాలను గూడ ఫ్రెంచివారు పోగొట్టుకొన్నారు. ఫ్రెంచివారి ప్రాబల్యం పూర్తిగా అంతరించింది.

1763లో సప్తవర్ష సంగ్రామం పారిస్ సంధివల్ల ముగిసింది. ఆ సంధి షరతుల ప్రకారం భారత దేశంలో ఫ్రెంచి స్థావరాలైన పాండిచ్చేరి, మాహి మొదలైనవి తిరిగి ఫ్రెంచివారికి అప్పజెప్పాలి. అందువల్ల బ్రిటిషువారు పాండిచ్చేరిని ఫ్రెంచివారి స్వాధీనం చేశారు. కాని ఆ స్థావరాల్లో సైనిక బలాన్ని అభివృద్ధి చేయడం నిషేధించడం జరిగింది. కేవలం వ్యాపార కేంద్రాలుగా మాత్రం వాటిని ఉపయోగించుకోవాలి. ఫ్రెంచివారి అధికార పతనంతో బ్రిటిషువారి అధికారం విస్తరించబడింది. వెంటనే వారు ప్రధానమైన ఒక రాజ

కీయ శక్తిగా రూపొంద గలిగారు. కర్ణాటక యుద్ధాలు ఆ విధంగా బ్రిటిషువారి అధికార స్థాపనకు ఎంతగానో దోహదం చేశాయి. ఈ విజయాల పిదప బ్రిటిషువారికి ఇతర ప్రాంతాల్లో సైనిక విజయాలు సాధించాలనే కాంక్ష మరింత ఎక్కువ కాసాగింది.

## బెంగాలు ఆక్రమణ :

భారత దేశంలో బ్రిటిషువారి అధికార స్థాపన 1757 తో జరిగిన ప్లాసీ యుద్ధానంతరం పెద్ద ఎత్తున ప్రారంభమైందని చెప్పవచ్చు. వారు ఆక్రమించిన మొదటి రాష్ట్రం బెంగాలు. అందుచే బ్రిటిషువారి అధికార విస్తరణను నిర్ణయించింది బెంగాలు రాష్ట్రమని చెప్పవచ్చు. ఔరంగజేబు మరణానంతరం బెంగాలు గవర్నరయిన ఆలివర్దిఖాన్ అప్పటి రాజకీయ సంక్షోభాన్ని ఆసరాగా తీసుకొని, 1741 లో స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నాడు. బ్రిటిషువారితో సత్సంబంధాలుంచుకొన్నాడు.

1756 లో ఆలివర్దిఖాన్ మరణించగా, అతని మనుమడైన సిరాజుద్దౌలా వారసుడుగా బెంగాలు గవర్నరయ్యాడు. సిరాజ్ ఇరవైమూడేళ్ల యువకుడు. బెంగాల్‌లో బ్రిటిషువారి ఉనికినిగూడ సహించనివాడు. ఏ విధంగానైనా బ్రిటిషువారిని బెంగాలునుంచి తరుమగొట్ట ప్రయత్నిస్తూ వచ్చాడు. ఆ సమయంలో బ్రిటిషువారు కొన్ని సైనిక స్థావరాలను అభివృద్ధి చేసి కలకత్తాలోని విలియం కోట గోడలపై ఫిరంగులను అధిక సంఖ్యలో అమర్చారు. దీంతో పాటు, బెంగాలు ప్రభుత్వం బహిష్కరించినట్టి వారందరిని బ్రిటిష కంపెనీ అధికార్లు ఆశ్రయమివ్వ ప్రారంభించారు. ఇది బెంగాలు నవాబుకు ఆగ్రహం తెప్పించింది. తన రాజ్యంలోనే తన అధికారాన్ని ధిక్కరించిన బ్రిటిషువారిపై ఆగ్రహాన్ని చూపసాగాడు. 1756 జూన్‌లో సిరాజుద్దౌలా ఆంగ్లేయుల ఆధీనంలోని ఖాసిం బజారును ఆక్రమించుకొని కలకత్తాను ముట్టడించి పెద్దగా శ్రమలేకుండానే ఆక్రమించాడు. అనేకమంది బ్రిటిషు పౌరులు నవాబు సైనికులకు లొంగిపోయారు. ఆ ఖైదీలను నవాబు అనుచరులు గాలి వెలుతురు లేని ఒక చిన్న గదిలో బంధించారు. వేసవి వేడికి తట్టుకోలేక అందులోని అనేకమంది మరురోజు ఉదయానికి మరణించారు. ఇది చరిత్రలో కలకత్తా చీకటిగది ఉదంతంగా పేరు గడించింది.

ఈ చీకటి గది ఉదంతం అనేకుల ఉద్దేశంలో కట్టుకథ. దీన్ని గురించి విపులంగా వర్ణించిన హాల్‌వెల్ దురుద్దేశంతో కల్పించిన వర్ణన మాత్రమే అని అనేకమంది చరిత్రకారుల అభిప్రాయం. అతడన్నట్లు 146 మందిని 18 అడుగుల పొడవు 14 అడుగుల వెడల్పుగల ఒక చిన్న చీకటిగదిలో బంధించుటే దుర్లభం. అదీకాక ఆ సమయంలో కలకత్తాలో ఉన్న బ్రిటిషు వారందరినీ కలిపినా అంతమందిఉండరని మరికొందరి అభిప్రాయం. ఈ దురాగతం నిజంగా జరిగిన పక్షంలో రాబర్టుక్లైవు తప్పని సరిగా తరవాత కుదిరిన సంధి సమయంలో దీన్ని గురించి ప్రస్తావించి ఉండేవాడు. ఆ రోజు మరణించిన బ్రిటిషువారి పేర్లన్నీ ఏ పత్రం

లోనూ ఉదహరించలేదు. అందువల్ల ఇది కేవలం సిరాజుద్దౌలాపై ఆగ్రహం కలిగించడానికై బంధించిన వారిలో ఒకడైన హాల్‌వెల్ ఊహాగానంగా చేసిన వర్ణన. అయితే అతడు ఆశించినట్లు ఈ చీకటిగది ఉదంతం బ్రిటిషువారికి మిక్కిలి ఆగ్రహాన్ని మాత్రం కలుగచేసింది.

## ప్లాసీ యుద్ధం : (23 జూన్ 1757)

కలకత్తా ముట్టడి వార్త మద్రాసుకు చేరిన వెంటనే అచ్చటి అధికార్లు రాబర్టు క్లైవు నాయకత్వం కింద ఒక్క సైన్యాన్ని అక్కడికి పంపారు. అడ్మిరల్ వాట్సన్ నాయకత్వంలో ఒక పటిష్టమైన నౌకాదళాన్నికూడ పంపారు. క్లైవు 1757 జనవరి 2వ తేదీ తన సైన్యం సహాయంతో కలకత్తాను మరలా ఆక్రమించుకొన్నాడు. సిరాజ్ తన సైన్యంతో కలకత్తాను స్వాధీన పరచుకోడానికై ప్రయత్నించాడు. కాని రాత్రి సమయంలో మెరుపుదాడి చేసి క్లైవు బెంగాల్ సైన్యాలపై దెబ్బ దీశాడు. దాంతో సిరాజ్ క్లైవుతో సంధికి ఒప్పుకొని వారికి మునుపటి అధికారాలను అప్పజెప్పి కలకత్తాలో కొల్లగొట్టిన ధనాన్ని తిరిగి ఇవ్వడానికి అంగీకరించడమేకాక బ్రిటిషువారు వారి సొంత నాణేలను ముద్రించుకోడానికి, విలియం కోటను సైనికంగా పటిష్టం చేసుకోడానికి అంగీకరించాడు. పరిస్థితులను చక్కబరచే నెపంతో క్లైవు కలకత్తాలోనే మకాం వేశాడు.

కలకత్తాలోని బ్రిటిషు అధికార్లు బెంగాలు నవాబు ఆస్థానంలోని పరిస్థితులను రహస్యంగా కనిపెడుతూ వచ్చారు. ఆతని ముఖ్యనగరమైన మూర్షిదాబాద్‌లో నవాబుకు వ్యతిరేకులుగుడ ఉన్నారన్న విషయం వారు పసిగట్టారు. ధనవంతులైన సేఠ్‌లు అతనికి ప్రతికూలురు. సైనిక నాయకుడైన మీర్ జాఫర్‌గుడ నవాబుకు వ్యతిరేకి అన్న విషయం తెలుసుకొని అతనితో రహస్యంగా ఒప్పందం కుదుర్చుకొన ప్రయత్నించారు. బ్రిటిషువారు సిరాజ్‌ను గద్దె దింపి మీర్‌జాఫర్‌ను బెంగాలు నవాబు చేయాలని కుట్ర పన్నారు. పద్దెనిమిదో శతాబ్దంలో ప్రాంతీయ గవర్నరు పదవులకు ప్రభువుల మధ్య తగాదాలు మామూలే. ఇది ప్రధానంగా మొగల్ సామ్రాజ్య పతనం కారణంగా ఉత్పన్నమైన పరిస్థితి సైన్యంలో పారశీకులు. మధ్య ఆసియానుంచి వచ్చిన ఇతరులు, అఫ్ఘనులు, అధిక సంఖ్యలో ఉండేవారు. వారు సమయానుకూలంగా ప్రవర్తించి అధికారంకోసం వేచి ఉండేవారు. అట్టి వారందరు వారి నాయకునికై కృషి చేశేవారేకాని రాజ్య క్షేమం వారికి ప్రధానం కాదు. అందుచే సిరాజ్ ఉద్దౌలా స్థానంలో మీర్జాఫర్‌ను నవాబు చేయడానికి సైనికుల్లో అనేకులు సిద్ధంగానే ఉన్నారు.

బ్రిటిషువారు బెంగాలు పరిస్థితులను జారవిడువనీయక దాదాపు మూడువేల సైన్యంతో నవాబును ఎదిరించడానికి ఆయత్తమయ్యారు. మూర్షిదాబాద్‌లో బ్రిటిష రెసిడెంటుగా ఉన్న వాట్సన్ అప్పటికే మీర్జాఫర్‌తో అంగీకారానికి వచ్చి. యుద్ధం జరుగుపక్షంలో ముభావంగా ఉండడానికి అంగీకరింపజేశాడు. నవాబు సైన్యం దాదాపు యాభై వేలకు మించింది. కాని

ఈ పెద్ద సైన్యం అప్పటికే రహస్యంగా సహాయపడటానికి అంగీకరించిన మీర్జాఫర్ అధీనంలో ఉంది. ఇరు సైన్యాలు నదియా జిల్లాలో ప్లాసి అనేచోట 1757 జూన్ 23 న పోరాడాయి. యుద్ధభూమిలో మీర్జాఫర్ విరోధులకే సహాయపడుతున్న కారణంగా సిరాజ్ ఓడిపోయాడు. యుద్ధభూమినుంచి పారిపోవ తప్పించుకొన ప్రయత్నించాడు. కాని విరోధులకు పట్టుబడ్డ సిరాజ్, మీర్జాఫర్ కుమారుడైన మీరాన్‌చే చంపబడ్డాడు. రాబర్ట్ క్లైవు మీర్జాఫర్‌ను యుద్ధ భూమిలోనే బెంగాలు నవాబుగా ప్రకటించాడు.

## ప్లాసి తర్వాత పరిస్థితులు :

ప్లాసియుద్ధం బ్రిటీషువారి అధికార స్థాపనకు అమితంగా దోహదం చేసింది. బెంగాలులో నామమాత్రపు నవాబుల యుగం ప్రారంభమైంది. బ్రిటిషు కంపెనీవారు అధికారాన్ని కైవసం చేసుకొన్నారు. కొత్త నవాబు మీర్జాఫర్ వెంటనే బ్రిటీషువారికి ఇరవైనాల్గు పరగణాల జిల్లాను అప్పజెప్పారు. వారికి తగు విధంగా నష్టపరిహారం చెల్లించాడు. "బ్రిటిషువారి శత్రువులు నాశత్రువులు. వారు భారతీయులైనా, యూరోపియనులైనా కావచ్చు" అన్న సంధి షరతులను అంగీకరించి ప్రత్యక్షంగా బ్రిటిషు అధికార స్థాపనకు దోహదం చేశాడు.

మీర్జాఫర్ నవాబు ఐన తరవాత మొగలాయి సైన్యాలు ఒకవైపు, మహరాష్ట్రుల సైన్యాలు మరోవైపు వేధిస్తుండటం చేత, ఆర్థిక పరిస్థితి దిగజారిన కారణంచేత అతడు బ్రిటిషు వారిపై మరింత ఎక్కువగా ఆధారపడాల్సి వచ్చింది. కలకత్తా ముట్టడిలో బాధలుపడ్డ బ్రిటిషు వారికి నష్టపరిహారం చెల్లించడానికి నవాబు అంగీకరించాడు. బ్రిటిషు సైనిక, నౌకాదళాధికారులకు పెద్ద ఎత్తున బహుమానాలియ్యాల్సి వచ్చింది. క్లైవుకు ప్రత్యేకంగా పెద్ద జాగీరు లభించింది.

ప్లాసియుద్ధం బెంగాలు నవాబు అధికారాన్ని పూర్తిగా హరించింది. కాని రాబర్ట్ క్లైవు బెంగాలుకు గవర్నరుగా నియమితుడై, అతి చాకచక్యంతో బ్రిటిషు అధికారాన్ని పెంపొందింప జేశాడు. డచ్ అధికారాన్ని గూడ కనిపెడుతూ క్లైవు బ్రిటిషు సేనాని అయిన కల్నల్ ఫోర్డ్‌ను ఉత్తర సర్కారులనుంచి రప్పించి, వారిని ఓడించాడు. డచ్‌వారినుంచి 10 లక్షల రూపాయలు నష్టపరిహారంగా వసూలు చేశాడు.

క్లైవు 1760 ఫిబ్రవరిలో స్వదేశంవెళ్లాడు. అతని తరవాత హాల్‌వెల్ ఆరు మాసాలు అతని తరవాత వన్సిట్టార్ట్ దాదాపు నాలుగేండ్లు బెంగాలు గవర్నరుగా కొనసాగారు. బ్రిటిషు కంపెనీ ప్రభుత్వం బెంగాలు నవాబుకు తమ సైనిక బలాన్ని ఉపయోగించి తగిన రక్షణ కల్పిస్తూ వచ్చింది. కాని కేవలం ఆంగ్లేయుల చేతి చలవవల్ల సింహాసనానికి వచ్చిన మీర్జాఫర్ క్రమేణ తాను అంగీకరించిన మొత్తాలను బ్రిటిషు వారికి చెల్లించలేకపోయాడు. రెండో షా ఆలం 1759 లో మొగల్ చక్రవర్తిగా అధికారానికి వచ్చినా అప్పుడప్పుడు బీహారు వరకు

వచ్చి, మీర్జాఫర్‌ను వేధించ సాగాడు. మీర్జాఫర్ కుమారుడు మీరాన్ పిడుగుపాటుపాలై మరణించాడు. ఇది వారసత్వ తగాదాకు దారితీసింది. వన్సిట్టార్డ్ వెంటనే మీర్జాఫర్‌ను పదవీచ్యుతునిచేసి అతని అల్లుడైన మీర్ ఖాసింను బెంగాలు నవాబుగా ప్రకటించాడు. మీర్జాఫర్ కిమ్మనక మూర్షిదాబాద్ వదలి కలకత్తా చేరుకొన్నాడు.

మీర్ ఖాసింతో బ్రిటిషువారు కొత్త సంధి కుదుర్చుకొన్నారు. కొత్త నవాబు బ్రిటిషువారికి బుర్ద్వాన్, మిద్నపూర్, చిట్టగాంగ్ అను మూడు జిల్లాలను అప్పజెప్పాడు. మీర్ ఖాసిం పరిపాలనా విషయాల్లో మిక్కిలి సమర్థుడు. కొద్దికాలంలోనే దాదాపు రెండున్నర లక్షల రూపాయలు మద్రాసు ప్రభుత్వానికి చెల్లించాడు. ఆ ధనంతో వారు కర్ణాటక యుద్ధాల సమయంలో పాండిచ్చేరిని విజయవంతంగా ముట్టడించ గలిగారు.

మీర్జాఫర్‌వలె గాకుండా మీర్‌ఖాసిం బాగా చదువుకొన్నవాడు. ఆర్థిక విషయాల్లో నిర్దుష్ట అభిప్రాయాలు గలిగినవాడు, గణితంలో దిట్ట. తాను బ్రిటిషు వారికి దూరంగా ఉండాలనే ఉద్దేశంతో ముఖ్యనగరాన్ని మూర్షిదాబాద్‌నుంచి మాంఘైర్‌కు మార్చాడు. క్రమేణ బ్రిటిషు కంపెనీ అధికార్లకుగల వర్తక సౌకర్యాలను రద్దుచేసి తనకు రావాల్సిన సుంకాలను వసూలు చేయించాడు. మీర్‌ఖాసిం అనుసరించిన ఈ పద్ధతులన్నీ బ్రిటిషువారు సహించలేక పోయ్యారు. అందుచే 1763 లో మీర్‌ఖాసింను పదవినుంచి తొలగించారు. అతని స్థానంలో తిరిగి మీర్జాఫర్‌ను బెంగాలు నవాబుగా నియమించారు.

మీర్‌ఖాసిం వెంటనే అయోధ్యచేరి బ్రిటిషువారికి వ్యతిరేకంగా ఒక పెద్ద కూటమిని సమీకరించాడు. మొగలా చక్రవర్తి షా ఆలం, అయోధ్య వజీరైన షూజా ఉద్దౌలా మీర్ ఖాసింకు సహాయ పడటానికి ముందుకొచ్చాడు. వారందరూ కలసి సుమారు యాభై వేల సైన్యాన్ని ఆయత్తంచేశారు. బ్రిటిషుసైన్యాలు మొత్తం ఏడువేలకు మించిలేవు. సర్ హెక్టర్ మన్రో నాయకత్వం కింద బక్సార్ దగ్గర జరిగిన యుద్ధంలో కంపెనీ సేనలు మీర్‌ఖాసిం, అతని అనుచరులందరి సంఘటిక సైన్యాలను ఓడించింది. మీర్‌ఖాసిం యుద్ధభూమినుంచి పారిపోయాడు. షుజా రోహిల్ ఖండ్‌కు వెళ్లి తలదాచుకొన్నాడు. కాని మొగల్ చక్రవర్తియైన రెండో షా ఆలం బ్రిటిషువారితో సంధిచేసుకొన్నాడు. ప్లాసి యుద్ధంలో ప్రారంభమైన అధికార స్థాపనా కార్యక్రమం బక్సార్ యుద్ధంలో ఒక కొలిక్కి వచ్చింది. బీహార్, బెంగాలు, ఒరిస్సా ప్రాంతాలపై బ్రిటిషువారి అధికారం సుస్థిరమైంది.

మీర్జాఫర్ 1785 లో మరణించాడు. అతని వారసుడైన నాజిముద్దౌలా బ్రిటిషువారు సూచించిన మంత్రిని నియమించుకోడానికి అంగీకరించాడు. తన అవసరాలకు సరిపడే సైన్యాన్ని మాత్రం ఉంచుకొనాలని శాసించబడ్డాడు. బ్రిటిషువారికి అనేక అధికారాలు హస్తగతం కావడంతో బెంగాలు నవాబు వారికి పూర్తిగా దాసోహమనాల్సి వచ్చింది. కలకత్తాలోని అధికారులు యథాప్రకారం నవాబునుంచి బహుమానాలు విరివిగా పుచ్చుకొనడం, కొన

సాగించారు. ఆ పరిస్థితుల్లో రాబర్ట్ క్లైవు రెండోదఫా బెంగాలు గవర్నరుగా నియమితుడై 1765 మే నెలలో కలకత్తా చేరుకొన్నాడు.

## దివాని అధికారాలు—ద్వంద్వ ప్రభుత్వం ;

రాబర్ట్ క్లైవు బెంగాలు గవర్నరుగా అనేక సమస్యల నెదుర్కొనాల్సి వచ్చింది. మొగలుచక్రవర్తితో, అయోధ్య వజీరుతో, బెంగాలు నవాబుతో సంబంధాలను పునరుద్ధరించాల్సి వచ్చింది. పరిపాలనా విషయాల్లోకూడ ప్రధాన విషయాలను పునర్వ్యవస్థీకరించాల్సి వచ్చింది. సైనికుల్లో క్రమశిక్షణ నెలకొల్పి అంతకు ముందున్న పరిపాలనా లోపాలనుకూడా సరిదిద్దాల్సి వచ్చింది.

అంతకు ముందు గవర్నరు వన్సిట్టార్ట్ అయోధ్యను మొగల్ చక్రవర్తికి ఇయ్యడానికి అంగీకరించాడు. కాని క్లైవు సూజాఉద్దౌలాతో సంప్రదించి అతనితో అంగీకారానికి రావడం మేలని తలచాడు. అలహాబాదు సంధిషరతుల ప్రకారం షూజా ఉద్దౌలా కంపెనీకి 40 లక్షల రూపాయలు అంతకుముందు జరిగిన యుద్ధాలకు నష్టపరిహారం కింద చెల్లించాలి. కంపెనీ ప్రభుత్వంతో సన్నిహితంగా ఉండడానికి అంగీకరించాలి. మొగల్ చక్రవర్తి షా ఆలంకు కోరా, అల్లాబాదులు అప్పజెప్పడం జరిగింది. షూజా ఉద్దౌలాకు, కంపెనీకి మధ్య మంచి అవగాహన కుదిరిందనే చెప్పాలి. క్లైవు ఆ సమయంలో యుద్ధాన్ని అభిలషించలేదు. ఒక ప్రాంతం తరవాత మరో ప్రాంతాన్ని ఆక్రమిస్తూ వెళితే అనేక రాజ్యాల సైన్యాలను ఒకేసారి ఎదుర్కొనాల్సి వస్తుందని అతని ఉద్దేశం. అయోధ్య అతనికి నమ్మదగ్గ తటస్థ రాజ్యంగా ఉపయోగపడ గలదు.

బెంగాలులో నవాబు అధికారాలను కంపెనీ క్రమేణ వశపరచుకోడం కొనసాగించింది. 1765 అగస్టు 12 వ తేది ఒక ఫర్మానా ద్వారా క్లైవు మొగల్ చక్రవర్తినుంచి, బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాల్లో భూమిశిస్తు వసూలుచేసే అధికారాన్ని సంపాదించాడు. ప్రతిగా కంపెనీ ఏటా 26 లక్షల రూపాయలు ఇవ్వడానికి అంగీకరించింది. దీనికి దివాని అధికారాలు అని పేరు. దీంతో మొగల్ చక్రవర్తి కంపెనీకి కీలుబొమ్మగా తయారయ్యాడు. బెంగాలు నవాబుకు ఏటా 53 లక్షల రూపాయలు చెల్లించి అతనినుంచి నిజామత్ అధికారాలు, అనగా సైనిక అధికారాలు, క్రిమినల్ న్యాయవిచారణ కంపెనీ కైవసం చేసుకొంది. పై విధంగా క్లైవు బెంగాలులో ద్వంద్వ ప్రభుత్వాన్ని స్థాపించాడు. కంపెనీ దివాన్‌గాను, నవాబు నాజిమ్‌గాను కొనసాగారు. కాని నవాబు స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయి అటు సైనిక విషయాల్లోగాని ఆర్థిక విషయాల్లోగాని ఏ అధికారమూ లేక మిగిలి పోయాడు. క్లైవు పరిపాలనా బాధ్యతలను స్వయంగా స్వీకరించలేదు. సాధారణ పరిపాలనా వ్యవహారాలు స్థానికుల అధీనంలోనే కొనసాగాయి. బెంగాలులో రేజాఖాన్. బీహారులో షితాబ్‌రాయ్ మొదలైన డిప్యూటి

నవాబుల అధికారం కొనసాగింది. భూమిశిస్తు వసూలుకు కంపెనీ అధికార్లుగాక నవాబు అధికార్లను మాత్రం ఉపయోగించుకొన్నారు. దీనివల్ల అధికారాలు కంపెనీకి బాధ్యతలు నవాబుకు సంక్రమించాయి. క్లైవు ప్రవేశపెట్టిన ఈ దంద్వ పరిపాలన వల్ల కంపెనీ అధికారులు శిస్తు వసూలుపై అజమాయిషీ చేయటానికి నవాబు నుంచి ధనాన్ని గుంజుకోడానికి మాత్రమే తమ దృష్టిని కేంద్రీకరించారు. ప్రజోపయోగ కార్యక్రమాలతో వారికి ఎట్టి సంబంధంగాని బాధ్యత గాని లేదు. బాధ్యతలు గలిగిన నవాబుకు ఆదాయం లేదు.

దంద్వ ప్రభుత్వం రాజకీయ ప్రయోజనాల దృష్ట్యా మిక్కిలి అనువైందని బ్రిటిష అధికార్లు సమర్థించారు. జేమ్స్ మిల్ అనే ఆర్థిక శాస్త్రవేత్త ప్రకారం క్లైవు ప్రవేశపెట్టిన దంద్వ ప్రభుత్వం ఆనాటి బెంగాలు పరిస్థితులకు బేషరతుగా సరిపోయింది. ఫెర్మింజర్ పార్లమెంటుకు సమర్పించిన తన నివేదికలో ఇలా అన్నాడు. తమ అధికారం సంపదలకు సంబంధించినంత వరకు బ్రిటిష్‌వారు నారింజ పండు నుంచి రసాన్ని పిండినట్లు కాజేశారని నవాబుకు తెలుసు. కాని బల్లమీద రసాహీనమై మిగిలిన నారింజ పండు పిప్పి తోలును చూసి బెంగాలును పూర్తిగా కబళించలేదను భ్రమను ఇతర ఐరోపా శక్తులకు గలిగించారు.

రెండోసారి క్లైవు గవర్నరుగా నియమితుడైన సమయంలో కంపెనీ ఉద్యోగులు బహుమానాలు స్వీకరించడాన్ని రద్దుచేశారు. ఆ మేరకు వారు లిఖిత పూర్వకంగా కంపెనీకి వాగ్దానం చేయాల్సి వచ్చింది. ఇది తరవాత ఏర్పడ్డ సివిల్ సర్వీస్‌కు నాందిగా పరిణమించిందని చెప్పవచ్చు. మాతృదేశంలోని పరిస్థితుల దృష్ట్యా కంపెనీ డైరెక్టర్లకు ఉద్యోగుల జీతాలను పెంచ్చించమని సలహా ఇవ్వడానికి ఇష్టపడలేదు. క్లైవు కంపెనీ ఉద్యోగులు తీరిక వేళల్లో వ్యాపారాలు సాగించరాదని శాసించాడు. ఉద్యోగుల్లో ఉత్సాహం నశించకుండా 'సొసైటి ఫర్ ట్రేడ్' అనే సంస్థను స్థాపించి ఆ సంస్థ ప్రైవేటు వ్యాపారం కొనసాగించటానికి అనుమతి నిచ్చాడు వచ్చిన ఆదాయాన్ని కంపెనీ ఉద్యోగులు తమ హోదాకు తగినట్లు సమానంగా పంచుకొన వీలు గలిగింది. ఉప్పు. వక్కలు, పొగాకు మొదలైన వస్తువులను ఈ విధమైన ప్రైవేటు వ్యాపారానికి అనువుగా పరిగణించారు. కాని ఈ ప్రైవేటు వ్యాపార పద్ధతిని కంపెనీ ప్రభుత్వం 1768లో రద్దు చేసింది.

క్లైవు సైనికులకిచ్చే అలవెన్సులను తగ్గించిన కారణంగా బ్రిటిష సైనికాధికారులు తిరుగుబాటుకు ప్రయత్నించారు. కాని అతడు చాల చాకచక్యంతో వ్యవహరించి మద్రాసు నుంచి క్రొత్త సైన్యాలను రప్పించి తిరుగుబాటుకు ప్రయత్నించిన నాయకులను కఠినంగా శిక్షించాడు.

1767 ఫిబ్రవరిలో క్లైవు ఇంగ్లండుకు వెళ్లాడు. హిందూ దేశంలో బ్రిటిష సామ్రాజ్య స్థాపనకు పునాది వేసిన వాడుగా క్లైవును శ్లాఘించగా మెర్విన్ అను చరిత్రకారు డన్నట్లు. మొగల్ సామ్రాజ్య స్థాపనకు ఏ విధంగా బాబర్ కాదని అక్బర్ అని గుర్తించు కొంటామో,

ఆ విధంగా భారతదేశంలో ఆంగ్లేయుల అధికార స్థాపనకు క్లైవు కాని అతని తరవాత వచ్చిన వారు మాత్రమే కారకులు. అతనిలో సహనం లేదు. దూరదృష్టి లోపించింది. సామ్రాజ్య స్థాపనకు కనీసార్హతలైన తెలివి తేటలు, విషయ పరిజ్ఞానం, సహృదయత, కడపటికి తగిన ఓర్పు క్లైవులో లేవు.

క్లైవు పేరుతో ముడిపడ్డ దంద్వ ప్రభుత్వం అతని తరవాత అధికారానికి వచ్చిన వెరెలెస్ట్ (1767-69) కార్టియర్ (1769-72) కాలంలో కొనసాగింది ఈ కాలంలో నవాబు నామ మాత్రంగాను, అసలు అధికారం కంపెనీ ప్రతినిధియైన రేజాఖాన్‌కు ఉండేది ఆ విధంగా కంపెనీ సర్వ అధికారాలు హరించింది. లోపభు యిష్టమైన ఈ పద్ధతి 1772 వరకు కొనసాగింది. 1770లో బెంగాలులో దారుణమైన క్షామం సంభవించింది. దాదాపు మూడింట ఒక వంతు ప్రజలు దుర్మరణం పాలయ్యారు. కరువు కొనసాగుతున్నా ప్రభుత్వం యధా ప్రకారం పన్ను వసూలుచేసి, బాధపడుతున్న ప్రజలను మరీ బాధించింది. 1771లోని శిస్తు వసూళ్లు, 1768 కన్న మిన్నగా కొనసాగింది. అమానుషంగా ప్రవర్తించిన అధికార్ల వల్ల పరిపాలనా వ్యవస్థ మరీ అధ్వాన్నంగా రూపొందింది. ఈ పరిస్థితులను గమనించిన కంపెనీ 1772లో దంద్వ ప్రభుత్వాన్ని రద్దుచేసి, బెంగాలులో పరిపాలనా బాధ్యతలను స్వయంగా స్వీకరించింది.



# అధ్యాయం 3

## బ్రిటిషు వాణిజ్య విధానాలు :

1600లో కంపెనీ స్థాపన నుంచి 1758లో విక్టోరియా ప్రకటన ప్రకారం బ్రిటిషు ప్రభుత్వం స్వయాన ఆధిపత్యం చేపట్టేవరకు భారత దేశంలోని పాలనా వ్యవస్థను కంపెనీ యుగంగా పరిగణించవచ్చు. తొలి వర్తక స్థావరాలన్నీ కంపెనీ కాలంలో 17వ శతాబ్దంలోనే స్థాపించబడ్డాయి. ఉదాహరణకు సూరత్ 1612, మద్రాసు (1639) బొంబాయి (1669) కలకత్తా (1696) ఒకటి తరవాత మరొకటి ప్రధాన స్థావరాలయ్యాయి. కాని సైనిక విజయాలు సాధించిన అనంతరమే తూర్పు ఇండియా కంపెనీ బ్రిటిషు ప్రభుత్వం నుంచి 1698లో చార్టర్ చట్టాన్ని పొందగలిగింది. భారత దేశాన్ని జయించిన తూర్పు ఇండియా సంఘం, రాజకీయ విజయాలను సాధించిన బ్రిటిషు పాలకుల సామ్రాజ్య తత్వానికి దర్పణమనవచ్చు.

బ్రిటిషు వారి పాలనా కాలంలో కొనసాగిన సామ్రాజ్యవాద విధానంలో మూడు ప్రత్యేక ఘట్టాలు గోచరిస్తాయి. అందులో మొదటిది ఆంగ్లేయులు అనుసరించిన వ్యాపార పెట్టుబడి ఘట్టం. ఇది కంపెని పరిపాలనా కాలంలో దాదాపు 18వ శతాబ్దం వరకు కొనసాగింది. రెండోది పారిశ్రామిక పెట్టుబడి. ఇది 19వ శతాబంలో కొనసాగిన బ్రిటిషు ఆర్థిక పరిపాలనా వ్యవస్థకు మూలకందంగా పరిణమించి అమితంగా ధనాన్ని దోచుకోడానికి అవకాశమిచ్చింది. మూడోది గత శతాబ్దంలో తలెత్తిన 20వ శతాబ్దంలో ప్రధానంగా చెలామణియైన పెట్టుబడి పద్ధతి. మొదటి రెండు పద్ధతులైన వాణిజ్య, పారిశ్రామిక పెట్టుబడి ఘట్టాలు తరవాతి పద్ధతికి నాందిగా పరిణమించింది. భారత దేశంలో బ్రిటిషు ప్రభుత్వం అనుసరిస్తూ వచ్చిన పద్ధతులు స్థూలంగా తన ఆర్థిక ప్రయోజనాలను విస్మరించని కారణంగా పై మూడు ఘట్టాలు, ప్రభుత్వం అనుసరించిన విధానాలకు గూడ పరోక్షంగా తెలియజేయగలదు.

మొగల్ సామ్రాజ్య పతనానంతరం పద్దెనిమిదో శతాబ్దంలో భారతదేశంలో ఏర్పడ్డ రాజకీయ సంక్షోభం అస్తవ్యస్త పరిస్థితులను సృష్టించింది ఇది పాత విధానాలకు స్వస్తి చెప్పి. ఉద్వేగంలో అభివృద్ధి చెందే వ్యాపార నౌకాయాన పారిశామిక పద్ధతులపై ఆధారపడ్డ కొత్త ఆర్థిక విధానాల ఆవిర్భావానికి దారితీసింది. యూరోపియనుల అధిక సైనిక బలంచేత, అధునాతన సాంకేతిక విజ్ఞానంచేత కొనసాగిన వారి ఆక్రమణ మూలంగా మన దేశం వింత పరిణామాలకు లోనైంది. పాత విధానాల నుంచి నూతన పద్ధతికి మారటంలో సంభవించిన ఫలితాలు మరో విధంగా ఉండేవి. కొత్త విధానంతో సంబంధం ఉన్న ఆర్థిక అధికార వర్గం స్వదేశీయులు కాకుండా విదేశీయులవడం ఆ విపరీత పరిణామానికి కారణం. పాత పద్ధతిని పోగొట్టి తమ విధానాల వల్ల స్థానికుల సామర్థ్యాలను అణగదొక్కి విదేశీ విధానాలను సాంప్ర

దాయిక పద్ధతుల స్థానే రుద్దడం వల్ల భారతదేశంలో చాలా మార్పు వచ్చింది. బ్రిటిషు వారి ప్రయోజనాల కోసం జరిగిన ఈ అభివృద్ధి కృషి, జాతీయ సాంఘిక పురోగమనానికి అవరోధాలను కల్పించింది.

18వ శతాబ్దంలో ఏర్పడ్డ పరిస్థితులు విదేశీ శక్తులను వారి అధికార స్థాపనకై కలహాలు, కుట్రలకు ఉపక్రమించడానికి కావాల్సిన అవకాశాన్ని కల్పించాయి. యూరోపియన్లలో అందరికీ జరిగిన ఘర్షణల్లో బ్రిటిషువారి ఆధిక్యత నిరూపితమై వారి అధికార స్థాపనకు దారితీసింది. 18వ శతాబ్ద ఉత్తరార్థంలో ప్రాచీన పద్ధతిలోనే బెంగాలు ఆక్రమణ జరిగింది. దాంతో ప్రారంభమైన బ్రిటిషు సామ్రాజ్య విస్తరణ కార్యక్రమం 19వ శతాబ్దారంభానికి ఉన్నత శిఖరాల నందుకోగలిగింది.

1773లో రెగ్యులేటింగ్ చట్టం అమలు జరిపిన నాటినుంచి బ్రిటిషు ప్రభుత్వ సర్వాధికారం భారతదేశంలో కంపెనీ ఆక్రమిత ప్రాంతాలపై చెలామణి అవుతూనే వచ్చింది. ఈ రెగ్యులేటింగ్ చట్టం వల్ల గవర్నరు జనరల్–ఇన్–కౌన్సిల్, ఒక సుప్రీంకోర్టు ఏర్పాటైనాయి. 1784లో వచ్చిన పిట్ ఇండియా చట్టం రెగ్యులేటింగ్ చట్టంలోని కొన్ని లోపాలను తొలగించటమేగాక, బ్రిటన్‌లో ఉన్న కోర్టు ఆఫ్ డైరెక్టర్ల మీద ఒక బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌ను లండన్‌లో స్థాపించడం జరిగింది. వీటి వల్ల కంపెని వ్యవహారాలపై బ్రిటిషు ప్రభుత్వ అధికారం విదితమైంది. 1813లో కంపెనీకి భారతదేశపు వర్తకంపై గల గుత్తాధికారం తొలగించారు. దీంతో కంపెనీ ఒక వర్తక సంస్థగా అనుసరించిన ఆర్థిక పరమైన పాత్ర ముగిసిందని చెప్పవచ్చు. చైనా దేశంతో నల్లమందు వ్యాపారంపై కొనసాగిన గుత్తాధికారం గూడ 1833తో అంతమైంది. ఈ విధమైన పరోక్ష పాలన 1857లో జరిగిన తిరుగుబాటు వరకు కొనసాగింది. సిపాయి ఉద్యమం వల్ల బహిర్గతమైన లోపాల కారణంగా 1858 సం॥లో కంపెనీ అధికారం పూర్తిగా ఉపసంహరించడం జరిగింది.

కంపెనీ ప్రభుత్వం భారత దేశంలో అధికారాన్ని స్థాపించి నేర్పుగా ఆర్థికాభివృద్ధి సాధించిన కాలం బహుశా 18వ శతాబ్దపు ఉత్తరార్థమనవచ్చు. ఈ సమయంలోని కంపెనీ ఆర్థిక విధానాలకు తరవాత 19వ శతాబ్ద పారిశ్రామిక పెట్టుబడి విధానాలకు ఎంతో భేదం ఉంది.

తూర్పు ఇండియా వర్తక సంఘం భారత దేశంలో సాగించిన వ్యాపార పద్ధతిని గమనిస్తే అది కేవలం ఆనాటి గుత్తాధికారం గల వర్తక కంపెనీలు లాభాల నార్జించడానికై ఇతర దేశాల నుంచి వస్తువులను కొని విక్రయించే పద్ధతిని పోలి ఉండేది. బ్రిటిషు వస్తువులకు తగిన మార్కెట్లను వెతకడం అప్పట్లోవారి ప్రధాన ఉద్దేశంగాదు. కాని భారత దేశంలోను ఇతర తూర్పు ఇండియా దీవుల్లోను లభ్యమయ్యే సుగంధ ద్రవ్యాలు, నూలు, పట్టు బట్టలు మొదలైన వాటిని ఇంగ్లండుకు ఇతర ఐరోపా దేశాలకు చేరవేసి, వాటి వల్ల ఎక్కువ లాభా

లార్జించడం వారి ధ్యేయం. ఆ వసువుల కానాడు అన్ని పశ్చిమ దేశాల్లో ఎక్కువ గిరాకి ఉండేది. బ్రిటిష కంపెనీ కొనసాగించిన ప్రతి నౌకాయానం అత్యంత లాభదాయకంగా పరిణమించింది.

కంపెనీ, వ్యాపారానికై భారత దేశంలో కొనుగోలు చేయు వస్తువులకు బదులుగా ఏమి చెల్లించాలనే సమస్య ఎదురైంది. ఇంగ్లండులో అప్పటి పరిస్థితుల దృష్ట్యా, భారత దేశంలో తయారైన వస్తువులకు ప్రతిగా మార్పిడికై ఒక్క ఉన్ని దుస్తులు తప్ప ఏ నాణ్యమైన వస్తువూ లేదనే చెప్పాలి. కాని ఆ ఉన్ని దుస్తులు గూడ భారత దేశంలో అంతగా అవసరం లేదు. బంగారు, వెండి, రాగి, ఇత్తడి, తగరం మొదలైనవి ఎటూ భారత దేశానికి అవసరమే. అందువల్ల కంపెనీ వారు వెండిని అధిక మొత్తాల్లో వెచ్చించి భారత దేశంలో తయారైన వస్తువుల కొనుగోలును కొనసాగించింది.

మొదటి నుంచి కంపెనీ ఉద్యోగులు తమ ధనాన్ని వెచ్చించకుండా అధిక మొత్తాల్లో భారతీయ వస్తువులను తమ దేశానికి తరలించడానికి ప్రణాళికలు వేసేవారు. ప్రారంభంలో ఇండియా నుంచి తమ దేశాన్ని చేరడానికి చాలా దూరం ప్రయాణం చేయాల్సి ఉండేది. ఆఫ్రికా, అమెరికా ఖండాల్లోని తమ స్థావరాలను ఉపయోగించుకొని, బానిసలను కొని అమ్మటంతో ఆర్జించిన ధనాన్ని భారత వస్తువుల కొనుగోలుకు ఉపయోగించారు అందుచే ఉత్పత్తిదారుని కన్న, రైతులకన్న, నేత పనివారికన్న వర్తకుడు సంపన్నుడుగా రూపొందాడు. తన అధికారాన్ని ఉపయోగించి, వర్తకంలో ఎప్పుడూ తన కనువైన అధిక లాభాన్ని సులువుగా గడించ గలిగాడు. కంపెనీవారు అనేక గుమస్తాలను నియమించి వారి ద్వారా ఉత్పత్తిదార్లకు ముఖ్యంగా నేతపని వారికి రుణాల నిప్పించి వారితో తమకు తోచిన రీతిగా నూలు బట్టలు, ఇతర వస్తువులు తయారు చేయించేవారు.

బెంగాలులోని ఆదాయాలు వల్ల కంపెనీ ఆశించిన ఫలితాలు లభ్యమయ్యాయా లేదా అని తెలుస్తాయి. దివాని అధికారులు వచ్చిన ఆరు సంవత్సరాల్లో ఖర్చులన్నీ మినహాయించగా నికర ఆదాయం 40 లక్షల పౌన్లు బ్రిటిషు వారికి లభించింది. ఇది గాక కంపెనీ అధికార్లు తమ కిష్టం వచ్చినట్లు ధనార్జన గావించారు. ఉదాహరణకు ఖాళీ చేతులతో భారత దేశానికి వచ్చిన రాబర్ట్ క్లైవు పెద్ద ఐశ్వర్య వంతుడుగా స్వదేశానికి మరలి వెళ్లాడు. దాదాపు లక్ష పౌన్ల ధనం రెండేళ్లలో సంపాదించినట్లు స్వయంగా చెప్పుకొన్నాడు.

బ్రిటిషు వారి వ్యాపార పద్ధతుల మూలంగా బెంగాలు ప్రజానీకం ఏ దుస్థితికి లోనయ్యారన్న విషయం ఊహించవచ్చు 1770లో బెంగాలు ఘోర కాటకానికి లోనైనప్పుడు ప్రభుత్వం భూమి శిస్తు కచ్చితంగా వసూలు చేయడమే గాక, నిర్దాక్షిణ్యంగా శిస్తు అధికం చేసింది గూడ. ధాన్యాగారంగా ఉండిన బెంగాలు కంపెనీ పాలనలో ఆర్థికంగా బాగా దిగజారింది. రైతులపై పన్నుల భారం, ఉత్పత్తి దారులపై రుణ భారం, నేతగాండ్ల భృతికి ఉద్వాసనలు ఎదురయ్యా

యని బెంగాలు సందర్శించిన బ్రిటిషు పార్లమెంటు సభ్యులే వాపోయారు భారత దేశాన్నుంచి సంపాదించిన ధనం చాల వరకు ఇంగ్లండులో జరిగిన పారిశ్రామిక విప్లవానికి దోహదం చేసిందని చెప్పవచ్చు.

1750లో కూడ ఇంగ్లండు ప్రధానంగా వ్యవసాయాత్మక దేశంగా మాత్రం ఉండేది. ఉన్ని, నూలు బట్టలు తయారయ్యేవి. కాని నాణ్యతలో అవి భారత దేశంలో తయారయ్యే వాటితో ఏ విధంగాను సరితూగవు. కాని ఆ దేశంలో వెంట వెంటనే అనేక కొత్త యంత్రాలను కనిపెట్టడం జరిగింది. అవి పారిశ్రామిక విప్లవానికి దారితీశాయి. 1764లో స్పిన్నింగ్ జన్నీ మరు సంవత్సరం ఆవిరి యంత్రం కనుగొన్నారు. 1785లో మర మగ్గం కనిపెట్టడం జరిగింది. ఇవన్నీ కలసి యంత్రోత్పత్తికి దారితీసి అనేక పరిశ్రమల ఏర్పాటుకు దోహదం చేశాయి. ఇనుమును కరిగించడానికి కట్టె చెరకు బదులు బొగ్గును ఉపయోగించారు. బొగ్గు యంత్రాలు నడపడానికి సరసమైన ఇంధనంగా ఉపయోగ పడింది. పారిశ్రామిక ప్రగతికి సులభంగాను, సరసంగాను లభ్యమయ్యే ఇంధనం మిక్కిలి అవసరం.

పారిశ్రామిక విప్లవం సంభవించిన తరవాత అధికంగా తయారైన వస్తువులను విక్రయించడానికి తగు మార్కెట్లను వెతకడం ఇంగ్లండుకు వెంటనే ఎదురైన సమస్య. ప్రభుత్వ ఆర్థిక విధానంలో అందుచే విప్లవాత్మకమైన మార్పు అవశ్యకమైంది. వాణిజ్య ప్రధానమైన పెట్టుబడి వ్యవస్థ నుంచి, కంపెనీ స్వేచ్ఛా వ్యాపార పెట్టుబడి విధానానికి మార్పొచ్చింది. అందుచేత కంపెనీ వలస విధానంలో పూర్తిగా మార్పు సంభవించిందని చెప్పవచ్చు.

కొత్త అవసరాల దృష్ట్యా భారతదేశంలో స్వేచ్ఛా వ్యాపారాన్ని కల్పించి, పూర్వమున్న గుత్త వ్యాపారాన్ని రద్దు పరచారు. దీని ఫలితంగా ఒకప్పుడు నూలు బట్టలను ప్రపంచ వ్యాప్తంగా ఎగుమతి చేసిన భారతదేశం ఆ నూలు బట్టలనే ఎగుమతి చేసుకోవాల్సి వచ్చింది.

18వ శతాబ్దారంభంలోనే బ్రిటిషు ఉత్పత్తి దార్లు తూర్పు ఇండియా వర్తక సంఘం ద్వారా దిగుమతి అయిన భారత వస్తువులు నాణ్యతలో మిన్నగా ఉంది. తమకు పోటీగా తయారవడం వల్ల బాహ్యంగా ఆగ్రహం చూపుతూ వచ్చారు. 1720 నాటికి పట్టు, రంగులద్దిన కాలికో బట్టకో బట్టల దిగుమతులను నిషేధించారు. భారతదేశంలో తయారైన నూలు బట్టలపై అధికంగా సుంకాలు వేయడం వల్ల ఇంగ్లండుకు వాటి ఎగుమతి పరోక్షంగా ఆపివేయడం జరిగింది,

1776లో కంపెనీ అనుసరించిన వాణిజ్య పెట్టుబడి విధానానికి వ్యతిరేకంగా, స్వేచ్ఛా వ్యాపారాన్ని సమర్థిస్తూ ఆడమ్ స్మిత్ తన "వెల్త్ ఆఫ్ నేషన్స్" గ్రంథాన్ని ప్రచురించాడు. ఇది అంత వరకు కంపెనీ అనుసరించిన విధానాలను విమర్శించింది. పార్లమెంటుగూడ భారత దేశంలోని కంపెనీ వ్యవహారాలను మెరుగుపర్చడానికి అనేక విధాలు ప్రయత్నించింది.

అంతర్జాతీయ రంగంలో జరిగిన ఫ్రెంచి విప్లవం వంటి సంఘటనలు, వారన్ హేస్టింగ్‌పై వచ్చిన అభియోగం, బెంగాలులో కారన్ వాలీసు తెచ్చిన సంస్కరణలు అన్నీ కలిసి కంపెనీ విధానాల్లో మార్పులకు దారితీశాయి. 1813లో ఇంగ్లండులోని పలుకుబడి ఉన్న పారిశ్రామిక పెట్టుబడిదారుల ప్రమేయంలో కంపెనీకి గల గుత్తాధికారం అంతమైనందువల్ల భారతదేశంలో అప్పటి నుంచి పారిశ్రామిక పెట్టుబడి ఘట్టం ప్రారంభమైందని చెప్పవచ్చు.

1813కు ముందు భారతదేశంతో బ్రిటిషు వ్యాపారం తక్కువగా ఉండేది. కాని కంపెనీ గుత్తాధికారాన్ని రద్దుచేసిన తరవాత భారతదేశాన్ని బ్రిటీషువారి వస్తువుల విక్రయ స్థలంగా మార్చడానికి కృషి కొనసాగింది. వారన్ హేస్టింగ్స్ వంటి వారు కొందరు కంపెనీ అనుసరించిన పాత పద్ధతులను సమర్థించి, వ్యాపార పెట్టుబడి పద్ధతులను కొనసాగించాలని సలహా ఇచ్చినా అది ఫలితం లేకపోయింది. 19వ శతాబ్దారంభంలో సుంకాలను విధించడంలో పక్షపాత వైఖరిని చూపారు. ఉదాహరణకు 1840లో భారతదేశానికి దిగుమతైన బ్రిటిషు నూలు, పట్టు బట్టలపై 3½ శాతం సుంకం విధించం జరిగింది. కాని భారతదేశంలో తయారైన నూలు బట్టలపై ఇంగ్లండులో 10 శాతం పట్టు బట్టలపై 20 శాతం ఉన్ని బట్టలపై 30 శాతం పన్ను విధించేవారు. యంత్రాల్లో తయారైన కారణంగా నాణ్యత గలదని మాత్రమేగాక ప్రత్యక్షంగా ప్రభుత్వం పనిగట్టుకొని ఏక పక్ష స్వేచ్ఛా వ్యాపారాన్ని ప్రోత్సహించిన కారణంగా భారత దేశంలో బ్రిటిషువారు తప్ప తక్కిన యూరోపియన్లుగాని ఇతర విదేశీయులుగాని, వ్యాపారం చేయకూడని విధంగా చట్టాలు రూపొందించడం జరిగింది దీనివల్ల భారతదేశంలో బ్రిటిషువస్తువులు నిండి పోవడం, స్వదేశీ తయారీలు నశించడం జరిగింది. ఈ పద్ధతి 19వ శతాబ్దంలో సంభవించినా దీని పరిణామాలు మాత్రం ఆ శతాబ్దానికే గాక, ప్రస్తుత శతాబ్దారంభానికి కూడ విస్తరించింది.

యంత్రోత్పత్తితో వచ్చిన బ్రిటిషు నూలు బట్టలు మన దేశంలోని నేత పని వారిని నాశనం చేసింది. అదే విధంగా పట్టు బట్టలు, ఉన్ని, ఇనుము, మట్టి పాత్రలు, గాజు కాగితం తయారీలన్నీ స్థానికంగా సంభవించాయి. కర్మాగారాల్లో అధిక సంఖ్యలో తయారైన వస్తువులు చేతి వృత్తుల మూలంగా తయారైన వాటికన్న సరసంగా ఉండటమే దీనికి కారణం.

పెద్ద ఎత్తున కొనసాగిన భారత స్వదేశీ ఉత్పత్తుల వినాశం ఆర్థిక విధానంపై చూపిన ప్రభావాన్ని సులభంగా ఊహించవచ్చు. ఇంగ్లండులో ప్రాచీన చేనేత కార్మికులకు జరిగిన ఉద్వాసన వెంటనే అవిర్భవించిన యంత్రోత్పత్తికి దారితీసింది. కాని భారతదేశంలో అట్లాగాక లక్షలాది చేతిపనివారు తమ ఉపాధి కోల్పోయారే గాని వారి స్థానంతో ఎటువంటి పారిశ్రామికోత్పత్తి స్థానికంగా కలగలేదు. భారతీయ ఉత్పత్తులకు పేరు మోసిన ఢక్కా, మూర్షిదాబాద్, సూరత్ వంటి జనసమ్మర్దం ఉన్న నగరాలు కొద్ది సంవత్సరాల్లో జనహీనమైనాయి. ఢక్కా నగరంలోని ఒకటిన్నర లక్షల జనాభా ముప్పై లేక నలభై వేలకు తగ్గినట్లు 1840లో ఛార్లెస్ ట్రెవిలియన్ పార్లమెంటు విచారణ కమిటీకి ఇచ్చిన నివేదికలో తెలియజేశాడు. భారత

దేశ మాంచస్టర్‌గా పేరు పొందిన ఢక్కా తన ఉత్పత్తిని కోల్పోయి పేద పట్టణంగా మారింది. మాంట్ గో మర్టిన్ కూడ ఇదే విధమైన అభిప్రాయాన్ని తెల్పాడు. సూరత్, ఢక్కా ముర్షిదాబాద్ వంటి నగరాల్లోని ఉత్పత్తుల తరుగుదల మిక్కిలి విషాదకరమైంది. ఆ నగరాల్లో జరిగిన వ్యాపారం సరైన సమాన స్థాయిలో గాక అసమానతతో కూడినదిగా అనిపిస్తుందని అతడు అభిప్రాయ పడ్డాడు. 1890లో సర్ హెన్రీ కాటన్ ఈ విధంగా రాశాడు. "దాదాపు వంద సంవత్సరాల క్రితం ఢక్కా నగరంలోని పూర్తి వ్యాపారం సుమారు కోటి రూపాయ లున్నట్లు అంచనా వేయడం జరిగింది. అక్కడ జనాభా సుమారు రెండు లక్షలు. 1787లో ఢక్కా నుంచి ఇంగ్లండుకు ఎగుమతైన మస్లిన్లు 30 లక్షల రూపాయలకు మించి ఉండేది. కాని 1817 నాటికి అవి పూర్తిగా అంతరించాయి. తరతరాలుగా ఉపాధిని ప్రసాదించిన నూలు వడక డం, బట్టలు నేయడం వంటి వృత్తులు కూడ అడుగంటి పోయాయి. ఈ పద్ధతి ఒక్క ఢక్కా నగరానికి మాత్రమే పరిమితం కాలేదు. అనేక ఇతర ప్రాంతాలు కూడ ఇదే విధంగా తమ ప్రాభవాన్ని కోల్పోయాయి.

నేత పరిశ్రమల్లోనే గాక తోలు వస్తువుల తయారీ, లోహాల ఉత్పత్తి విషయంలో కూడ అరాచక పరిస్థితులు సంభవించాయి. ఇంగ్లండులో తయారైన అల్యూమినియం పాత్రలు అధికంగా దిగుమతి కావటంచేత మన దేశంలో ఇత్తడి మట్టి పాత్రల తయారి దెబ్బతింది. ఇనుము, ఉక్కు పరిశ్రమలకుకూడ ఇదే పరిస్థితి ఎదురైంది. అన్ని రకాల పనిముట్లు ఇంగ్లండు నుంచి దిగుమతైన కారణంగా స్వదేశీ పద్ధతిలో ఇనుము కరిగించు విధానం అదృశ్యమైంది. ప్రాచీన భారత దేశంలో యుద్ధ సామాగ్రి తయారీకి ఉక్కును ఉపయోగించేవారు. ఉక్కుతో అనేక పనిముట్లు, అలంకరణ వస్తువులుకూడ తయారు చేసేవారు. దమాస్కస్‌లో కత్తుల తయారీకి హైదరాబాదులో లభ్యమైన ఉక్కును వాడేవారు. ఢిల్లీలో కుతుబ్‌మినార్ సమీపాన ఉన్న 4వ శతాబ్దానికి చెందిన ఇనుప స్తంభం ఇప్పటికీ తుప్పు పట్టక నిలిచి ఉంది. ఇనుమును పోతపోయడంలో భారతీయుల నైపుణ్యానికి ఇది ప్రబల నిదర్శనం.

ప్రాచీన ఉత్పత్తి కేంద్రాలైన నగరాలు మాత్రమే గాక, గ్రామీణ ఉత్పత్తులు కూడ బ్రిటిషువారి వస్తువుల ప్రభావంతో నాశనమయ్యాయి. వ్యవసాయం, వస్తువుల ఉత్పత్తి మేళవించి కొనసాగిన భారత ఆర్థిక విధానం క్రమేణ కేవలం వ్యవసాయక ప్రాధాన్యం గల వలస రాజ్యంగా మారింది. నూలు వడకువారు, నేత పనివారు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, నగిషీ మొదలైన అనేకమైన చేతి పనులను చేసేవారు వ్యవసాయంపై ఆధారపడ్డానికి ఉపక్రమించారు. వ్యవసాయ రంగపై ఆధారపడ్డ ప్రజల నిష్పత్తి 19వ శతాబ్దంలో మితిమీరి పెరుగుతూ వచ్చి, 20వ శతాబ్దంలో కూడ కొనసాగింది.

భారత దేశంలో అమ్మకాలు అభివృద్ధి చేయడానికి ఉత్పత్తుల అభివృద్ధితోబాటు ముడి వస్తువుల దిగుమతికూడ అవసరం. అందువల్ల బ్రిటిషువారి వాణిజ్య విధానంలో ముడి సరకుల

అంతర్జాతీయ రంగంలో జరిగిన ఫ్రెంచి విప్లవం వంటి సంఘటనలు, వారన్ హేస్టింగ్‌పై వచ్చిన అభియోగం, బెంగాలులో కారన్ వాలీసు తెచ్చిన సంస్కరణలు అన్నీ కలిసి కంపెనీ విధానాల్లో మార్పులకు దారితీశాయి. 1813లో ఇంగ్లండులోని పలుకుబడి ఉన్న పారిశ్రామిక పెట్టుబడిదారుల ప్రమేయంలో కంపెనీకి గల గుత్తాధికారం అంతమైనందువల్ల భారతదేశంలో అప్పటి నుంచి పారిశ్రామిక పెట్టుబడి ఘట్టం ప్రారంభమైందని చెప్పవచ్చు.

1813కు ముందు భారతదేశంతో బ్రిటిషు వ్యాపారం తక్కువగా ఉండేది. కాని కంపెనీ గుత్తాధికారాన్ని రద్దుచేసిన తరవాత భారతదేశాన్ని బ్రిటిషువారి వస్తువుల విక్రయ స్థలంగా మార్చడానికి కృషి కొనసాగింది. వారన్ హేస్టింగ్స్ వంటి వారు కొందరు కంపెనీ అనుసరించిన పాత పద్ధతులను సమర్థించి, వ్యాపార పెట్టుబడి పద్ధతులను కొనసాగించాలని సలహా ఇచ్చినా అది ఫలితం లేకపోయింది. 19వ శతాబ్దారంభంలో సుంకాలను విధించడంలో పక్షపాత వైఖరిని చూపారు. ఉదాహరణకు 1840లో భారతదేశానికి దిగుమతైన బ్రిటిషు నూలు, పట్టు బట్టలపై 3½ శాతం సుంకం విధించం జరిగింది. కాని భారతదేశంలో తయారైన నూలు బట్టలపై ఇంగ్లండులో 10 శాతం పట్టు బట్టలపై 20 శాతం ఉన్ని బట్టలపై 30 శాతం పన్ను విధించేవారు. యంత్రాల్లో తయారైన కారణంగా నాణ్యత గలదని మాత్రమేగాక ప్రత్యక్షంగా ప్రభుత్వం పనిగట్టుకొని ఏక పక్ష స్వేచ్ఛా వ్యాపారాన్ని ప్రోత్సహించిన కారణంగా భారత దేశంలో బ్రిటిషువారు తప్ప తక్కిన యూరోపియన్లుగాని ఇతర విదేశీయులుగాని, వ్యాపారం చేయకూడని విధంగా చట్టాలు రూపొందించడం జరిగింది దీనివల్ల భారతదేశంలో బ్రిటిషువస్తువులు నిండి పోవడం, స్వదేశీ తయారీలు నశించడం జరిగింది. ఈ పద్ధతి 19వ శతాబ్దంలో సంభవించినా దీని పరిణామాలు మాత్రం ఆ శతాబ్దానికే గాక, ప్రస్తుత శతాబ్దారంభానికి కూడ విస్తరించింది.

యంత్రోత్పత్తితో వచ్చిన బ్రిటిషు నూలు బట్టలు మన దేశంలోని నేత పని వారిని నాశనం చేసింది. అదే విధంగా పట్టు బట్టలు, ఉన్ని, ఇనుము, మట్టి పాత్రలు, గాజు కాగితం తయారీలన్నీ స్థానికంగా సంభవించాయి. కర్మాగారాల్లో అధిక సంఖ్యలో తయారైన వస్తువులు చేతి వృత్తుల మూలంగా తయారైన వాటికన్న సరసంగా ఉండటమే దీనికి కారణం.

పెద్ద ఎత్తున కొనసాగిన భారత స్వదేశీ ఉత్పత్తుల వినాశం ఆర్థిక విధానంపై చూపిన ప్రభావాన్ని సులభంగా ఊహించవచ్చు. ఇంగ్లండులో ప్రాచీన చేనేత కార్మికులకు జరిగిన ఉద్వాసన వెంటనే ఆవిర్భవించిన యంత్రోత్పత్తికి దారితీసింది. కాని భారతదేశంలో అట్లాగాక లక్షలాది చేతిపనివారు తమ ఉపాధి కోల్పోయారే గాని వారి స్థానంతో ఎటువంటి పారిశ్రామికోత్పత్తి స్థానికంగా కలగలేదు. భారతీయ ఉత్పత్తులకు పేరు మోసిన ఢక్కా, మూర్షిదాబాద్, సూరత్ వంటి జనసమ్మర్దం ఉన్న నగరాలు కొద్ది సంవత్సరాల్లో జనహీనమైనాయి. ఢక్కా నగరంలోని ఒకటిన్నర లక్షల జనాభా ముప్పై లేక నలభై వేలకు తగ్గినట్లు 1840లో ఛార్లెస్ ట్రెవిలియన్ పార్లమెంటు విచారణ కమిటీకి ఇచ్చిన నివేదికలో తెలియజేశాడు. భారత

దేశంలో వ్యాపార పంటలకు ఇచ్చిన ప్రోత్సాహంతో బాటు ప్రాంతీయ ప్రాతిపదిక పై ఆహార ధాన్యాల ఉత్పత్తులు ప్రారంభమైన తరవాత మనదేశం నుంచి బియ్యం, గోధుమలు విశేషంగా ఎగుమతి అయ్యాయి. 1857 తరవాత బ్రిటిషు పరిపాలన దేశంలో సుస్థిరంగా నెలకొన్నందు వల్ల, తగు శాంతి భద్రతలు ఏర్పడినందు వల్ల, బ్రిటిషు పెట్టుబడిదార్లు భారత దేశంలో పెద్ద మొత్తాలను పెట్టుబడి పెట్టడానికి ముందుకొచ్చారు. దీనిచే విదేశీ వ్యాపారం చాల వరకు పెంపొందిందని చెప్పవచ్చు. రైలు రోడ్లు, కాల్వలు, తంతి తపాలా సౌకర్యాలు అభివృద్ధి చెందడంవల్ల రవాణా సౌకర్యాలు పెంపొంది దేశం నలుమూలలా ఎగుమతి దిగుమతుల ప్రోత్సాహనికి వీలు ఏర్పడింది.

19వ శతాబ్దాంతానికి భారతదేశం ఆహార ధాన్యాలు, ముడి సరకులు, తేయాకు వంటి వాటి ఎగుమతులకు నిలయంగా, తమ కనీస అవసరాలకు కావాల్సిన బట్టలు వంటి అనేక వస్తువుల దిగుమతి చేసుకొనే దేశంగా పరిణించబడింది. విదేశీ వ్యాపారం ఎక్కువగా అభివృద్ధి చెందినా అంతకు ముందు చేతి ఉత్పత్తుల వి క్రయాల ద్వారా లభించిన విశేష ఆదాయానికి బదులుగా, భారత దేశం ఆహార ధాన్యాలను ఎగుమతి చేసే దుస్థితికి దిగింది.



# అధ్యాయం 4

## భూమి శిస్తు పద్ధతులు :

బ్రిటిషు కంపెనీ భారత దేశంలో అధికారం స్థాపించిన పిదప అంతకు ముందున్న భూమి శిస్తు విధానాలను కొద్ది కాలం కొనసాగించింది కాని తరవాత కచ్చితమైన ఆదాయం ఎక్కువగా లభించే ఒకే రకమైన భూమి పన్ను విధానాలను ప్రవేశపెట్టింది. తొలుత కంపెనీ అధికారులకు మన దేశంలోని శిస్తు పద్ధతులు సులభంగా అవగాహన కాకపోయినందు వల్ల అప్పటికి గల పద్ధతులనే మొదట కొనసాగించారు. క్రమేణ భూస్వాములకై వెదకడం ప్రారంభించారు. తమ దేశంలోని భూమి శిస్తు విధానాలకు అనుగుణంగా ఉండే పద్ధతిలో ఆ విధానాలను మన దేశంలో కూడ ప్రవేశపెట్ట సాగారు, అందువల్ల దేశంలో భూమికి స్వంత దారుని గుర్తించుటలో, ఫలసాయంలోని ప్రభుత్వపు వాటాను నిర్ణయించడం వంటి విషయాలపై ప్రయోగాలు శిస్తు నిర్ణయాలు కొనసాగించి . ఒక ప్రాంతం తరవాత మరో ప్రాంతంలో నూతన భూమి శిస్తు పద్ధతులు ప్రవేశపెట్టడం జరిగింది. దీనివల్ల దేశంలో అనేక రకాల భూమి శిస్తు విధానాలు ఏర్పడ్డాయి. జమీందారీ విధానం, రైత్వారీ విధానం ఓటిలో మిక్కిలి ప్రధానమైనవి. ఇవి గాక మల్గుజారి. మహల్వారి వంటి కొన్ని తాత్కాలిక విధానాలు కూడ కొన్ని ప్రాంతాల్లో అమలు జరిపారు.

## శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి :

బెంగాలులో భూమి శిస్తు విధానం ఒక ప్రత్యేకమైన సాంఘిక ఆర్థిక తరగతిగా రూపొందిన జమీందార్ల ఆవిర్భావానికి దారితీసింది. 1765లో బెంగాలు రాష్ట్రంలో రెవెన్యూ వసూలు అధికారాన్ని బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీవారు మొగల్ చక్రవర్తి నుంచి పొందిన సమయంలో ప్రతి ఏటా రైతుల నుంచి రెవెన్యూ అధికార్ల మూలంగా పన్ను వసూలు పద్ధతి కొనసాగింది. పన్ను వసూలు చేసే అధికారాన్ని కంపెనీ అధికార్లు ప్రతిఏటా వేలం మూలంగా పొందేవారు. వేలంలో అధిక మొత్తానికి పాడినవారు ఆ సంవత్సరానికి రెవెన్యూ వసూలు చేసి ప్రభుత్వానికి కట్టాల్సిన మొత్తాన్ని చెల్లించి మిగిలిన మొత్తాన్ని లాభంగా పొందే వారు. ఆ విధంగా వేలం మూలంగా పన్ను వసూలు అధికారం పొందిన వారికి జమీందార్లని పేరు. వేలం పద్ధతిలో లోపాలున్నాయి కనక వారన్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్‌గా ఉన్న సమయంలో ప్రతి ఏటా జమీందార్లను మార్చు పద్ధతికి బదులు ఐదేండ్ల కొకసారి వేలం వేసే పద్ధతిని ప్రవేశ పెట్టాడు. కాని బ్రిటిష ప్రభుత్వం ఏటా శిస్తు వసూలు అధికారాన్ని కౌలుగా ఇచ్చే పద్ధతినే అంగీకరించినందు వల్ల ఆ ఐదేండ్ల పద్ధతి ఉపసంహరించడం జరిగింది. 1786లో కారన్ వాలీసు భారత దేశానికి గవర్నర్ జనరల్‌గా వచ్చిన వెంటనే ఇక్కడ గల రెవెన్యూ వసూలు

విధానం అతని దృష్టిని అమితంగా ఆకర్షించింది. పి. ఇ. రాబర్ట్స్ అన్నట్లు "కారన్ వాలీసు బెంగాలులో వ్యవసాయం, వాణిజ్యం క్షీణించడాన్ని రైతులు, జమీందార్లు ఆర్థిక ఇబ్బందులతో మగ్గడాన్ని గమనించాడు. వడ్డీ వ్యాపారులు మాత్రం అభివృద్ధి చెందుతూ లాభాలు గణించారు." మాతృదేశ ప్రభుత్వం నుంచి రెవెన్యూ పద్ధతులను సంస్కరించాల్సిందిగా నిర్దుష్టమైన ఆదేశాలు పొంది వచ్చిన కారన్ వాలీసు బెంగాలులో సంస్కరణలకు పూనుకొన్నాడు.

ఇంగ్లండులోని భూస్వాముల పతిలో శాశ్వత శిస్తు విధానాన్ని భారత దేశంలో ప్రవేశ పెట్టాలని కారన్ వాలీసు నిర్ణయించాడు. అంతకు ముందు 1766లో అప్పటి కౌన్సిల్ సభ్యుడైన ఫిలప్ ఫ్రాన్సిస్ శాశ్వత పద్ధతిని సూచించాడు. 1789లో సర్ జాన్ షోర్ శాశ్వత పద్ధతిని సమర్థిస్తూ తన నివేదికను సమర్పించాడు. ఈ సూచనలన్నింటినీ దృష్టిలో ఉంచుకొని కారన్ వాలీసు 1790లో పది సంవత్సరాల కొకసారి శిస్తు నిర్ణయించు పద్ధతిని ప్రవేశ పెట్టాడు. ఆ సంవత్సరం కుదిరిన ఒప్పందం పది సంవత్సరాలు కొనసాగునట్లు అంగీకరించ బడింది. కాని వెంటనే కారన్ వాలీసు మాతృ దేశంలోని అధికార్ల సుముఖతను తెల్సుకొని 1793లో శాశ్వత శిస్తు నిర్ణయ విధానాన్ని ప్రకటించాడు. దీంతో రెవెన్యూ ఏజెంట్లుగా వ్యవహరించిన జమీందార్లను భూమికి సొంత దార్లుగా చేయడం జరిగింది. వారు ఏటా ప్రభుత్వానికి కట్టాల్సిన సొమ్ము శాశ్వతంగా నిర్ణయించడం జరిగింది. ఈ పద్ధతికి జమీందారీ విధానమని, శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి అని, కారన్ వాలీసు విధానమని కూడ పేర్లు.

జమీందార్లకు శాశ్వతంగా సంక్రమించు అధికారం వల్ల వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమాల పట్ల ఆసక్తి, ఉత్సాహం ఏర్పడుతుందని ఈ పద్ధతి ముఖ్యంగా అభిలషించడం జరిగింది. ఫిలిప్ ఫ్రాన్సిస్ తన నివేదికలో గుప్తధనం ఏ మాత్రం ఉన్నా జమీందార్లు ఆ ధనాన్ని వెలికి తెచ్చి, భూములపై వెచ్చించి దాని మూలంగా మిగులు ఆదాయం పొందగల ఆస్కారముండేదని అభిప్రాయ పడ్డాడు. కారన్ వాలీసు కూడ అట్లాంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. జమీందార్లు కూడ తమ శ్రమకు తగ్గ ఫలితాలు పొందగల్గుదురు. తమ సోమరితనానికి, దుబారా ఖర్చులకు తగు ఫలితాలు అనుభవించే విధంగా చట్టాలను రూపొందించినట్లైతే వారికి వీలుగాక పోయినప్పుడు భూములను ఇతరులకు అమ్మివేశారు. అట్లా కనుక్కొన్నవారు సక్రమంగా భూములను వ్యవసాయానికి ఉపయోగించడం జరుగుతుందని కారన్ వాలీసు నమ్మకం. జమీందార్లు అతని ఉద్దేశంలో సమర్థులైన భూస్వాములు, ప్రజా క్షేమాన్ని కాంక్షించాల్సిన కార్యకర్తలు తన ప్రభుత్వమే గాక ఉత్తరోత్తరా ఏ ప్రభుత్వమైనా ఈ పద్ధతిలోని ఉపయోగాలను గుర్తించి హర్షిస్తుందని కూడ అతడు తెల్పాడు.

కారన్ వాలీసు శాశ్వత శిస్తు నిర్ణయ విధానాన్ని చేపట్టడానికి మరో ప్రధాన కారణం. భారత దేశంలోని క్లిష్టమైన రెవెన్యూ వ్యవహారాలపై కంపెనీ అధికారకు తగు అవగాహన లేకపోవడం. దానికి జమీందారీ పద్ధతి మిక్కిలి అనువైన సమాధానం. అంతేగాక కావాల్సినంత మంది కంపెనీ అధికార్లు లేరు. ఉన్న వారిని రెవెన్యూ విధులకై నియమించడానికి కారన్ వాలీసు నిర్ణయించాడు.

శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి జమీందార్లకు భూమిపై పూర్తి యాజమాన్యాన్ని కల్గజేసింది. నిర్ణతమైన మొత్తాన్ని చెల్లించు షరతులపై కేటాయించిన ప్రాంతంలో పన్ను వసూలు చేసే అధికారం ఇవ్వడం జరిగింది. ఏ కారణం చేతనైనా సక్రమంగా చెల్లించక పోయినట్లైతే వారికి చెందిన భూముల్లో కొంత భాగాన్ని అమ్మి కట్టాల్సిన మొత్తానికి సరిపెట్టడం జరిగేది. ప్రతి ఏటా ఆ మొత్తాలను చెల్లించడంలో జాప్యం జరిగిన, అట్టి జమీందార్లను తొలగించి వారి స్థానంలో ఇతరులను నియమించే అధికారం కంపెనీ ప్రభుత్వానికుండేది. రైతుల నుంచి వసూలైన మొత్తంలో దాదాపు 90 శాతం జమీందార్లు ప్రభుత్వానికి చెల్లించాల్సిన మొత్తంగా నిర్ణయించడం జరిగింది. వసూలు చేసే బాధ్యత చేపట్టినందు వల్ల ప్రతిఫలంగా సుమారు 10 శాతం జమీందార్లకు మిగులుతుందని ఈ పద్ధతి ప్రవేశ పెట్టినప్పుడు అంచనా వేయడంజరిగింది. జమీందార్లు ప్రతి ఏటా ప్రభుత్వానికి చెల్లించాల్సిన మొత్తానికి పెష్కష్ అని పేరు. జమీందారీ పద్ధతిలో జమీందారు ప్రభుత్వానికి చెల్లించాల్సిన పేష్కష్ మాత్రమే ఖరారు చేయడం జరిగింది గాని, రైతుల నుంచి జమీందారు వసూలు చేసే మొత్తాలను ప్రభుత్వం ఆయా జమీందార్లకే వదలి పెట్టింది.

శాశ్వత ప్రాతి పదికపై జమీందార్లకు భూమిపై అధికారం ఉండటంచేత భూములను అభివృద్ధి చేసే అస్కారం ఉటుందని భావించడం జరిగింది భూములపై అధిక మొత్తాలను వెచ్చించు అస్కారం, శాశ్వత పథకాలంతో వ్యవసాయ రంగాభివృద్ధి, బీడు భూములను సాగుతెచ్చే కార్యక్రమాలు, ఫలసాయాన్ని అభివృద్ధిచేసే పనులవల్ల రైతు జనానికి, కూలీలకు తగు ప్రతిఫలం లభించి అధిక సంతృప్తి కల్గుతుందని బ్రిటిషు అధికార్లు ఆశించారు. ఈ పద్ధతి వల్ల ప్రతి ఏటా వచ్చే రాబడి ప్రభుత్వానికి ముందుగా తెల్సుకోడానికి వీలైంది. అందువల్ల తాము వెచ్చించాల్సిన పద్దులను ముందుగా నిర్ణయించుకొనే అవకాశం కల్గింది. శాశ్వత శిస్తు నిర్ణయ విధానం వల్ల బ్రిటిషు వారికి విధేయులైన జమీందారీ వర్గం రూపొందింది. వారు స్థానికంగా గల ప్రజలను అదుపులో ఉంచి బ్రిటిషు వారి పరిపాలనను సమర్థిస్తూ వ్యవహరించారు. 1857 విప్లవ సమయంలో జమీందార్లు బ్రిటిషు వారికి విధేయులై మెలిగారు. ప్రతి ఏటా శిస్తు నిర్ణయించే పద్ధతిలోని లోపాలను దానివల్ల గల వ్యయ ప్రయాసలను శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి తొలగించింది. దీనిచే ప్రభుత్వానికి ఎక్కువ అదా కల్గింది.

కేవలం ప్రభుత్వానికి సమకూర్చే లాభాల దృష్టితో ప్రవేశ పెట్టబడ్డ జమీందారీ పద్ధతివల్ల రైతులకు అనేక అనర్థాలు వాటిల్లాయి. బ్రిటిషువారు అనుసరించిన వలస తత్వానికి వారి ఈ శిస్తు నిర్ణయ పద్ధతి ప్రతీక అని అనవచ్చు. ఈ పద్ధతి శాస్త్రీయంగా మలచడం జరగలేదు ఇందు భూమిని కొలపడం, భూసారాన్ని బట్టి శిస్తు నిర్ణయించడం మొదలైనవి జరగలేదు. జమీందార్లు భూమికి సొంతదార్లుగా ప్రకటించబడ్డ కారణంగా రైతుల హక్కులు హరించబడ్డాయి వారు పూర్తిగా భూస్వాములైన జమీందార్ల దయా దాక్షిణ్యాలకు లోనయ్యారు. శిస్తు రూపంగా జమీందార్లు ఎంత మొత్తాన్నైనా వసూలు చేయవచ్చు, శిస్తు చెల్లించలేని

యని బెంగాలు సందర్శించిన బ్రిటిషు పార్లమెంటు సభ్యులే వాపోయారు భారత దేశాన్నుంచి సంపాదించిన ధనం చాల వరకు ఇంగ్లండులో జరిగిన పారిశ్రామిక విప్లవానికి దోహదం చేసిందని చెప్పవచ్చు.

1750లో కూడ ఇంగ్లండు ప్రధానంగా వ్యవసాయాత్మక దేశంగా మాత్రం ఉండేది. ఉన్ని, నూలు బట్టలు తయారయ్యేవి. కాని నాణ్యతలో అవి భారత దేశంలో తయారయ్యే వాటితో ఏ విధంగాను సరితూగవు. కాని ఆ దేశంలో వెంట వెంటనే అనేక కొత్త యంత్రాలను కనిపెట్టడం జరిగింది. అవి పారిశ్రామిక విప్లవానికి దారితీశాయి. 1764లో స్పిన్నింగ్ జన్నీ మరు సంవత్సరం ఆవిరి యంత్రం కనుగొన్నారు. 1785లో మర మగ్గం కనిపెట్టడం జరిగింది. ఇవన్నీ కలసి యంత్రోత్పత్తికి దారితీసి అనేక పరిశ్రమల ఏర్పాటుకు దోహదం చేశాయి. ఇనుమును కరిగించడానికి వంట చెరకు బదులు బొగ్గును ఉపయోగించారు. బొగ్గు యంత్రాలు నడపడానికి సరసమైన ఇంధనంగా ఉపయోగ పడింది. పారిశ్రామిక ప్రగతికి సులభంగాను, సరసంగాను లభ్యమయ్యే ఇంధనం మిక్కిలి అవసరం.

పారిశ్రామిక విప్లవం సంభవించిన తరవాత అధికంగా తయారైన వస్తువులను విక్రయించడానికి తగు మార్కెట్లను వెతకడం ఇంగ్లండుకు వెంటనే ఎదురైన సమస్య. ప్రభుత్వ ఆర్థిక విధానంలో అందుచే విప్లవాత్మకమైన మార్పు అవశ్యకమైంది. వాణిజ్య ప్రధానమైన పెట్టుబడి వ్యవస్థ నుంచి, కంపెనీ స్వేచ్ఛా వ్యాపార పెట్టుబడి విధానానికి మార్పొచ్చింది. అందుచేత కంపెనీ వలస విధానంలో పూర్తిగా మార్పు సంభవించిందని చెప్పవచ్చు.

కొత్త అవసరాల దృష్ట్యా భారతదేశంలో స్వేచ్ఛా వ్యాపారాన్ని కల్పించి, పూర్వమున్న గుత్త వ్యాపారాన్ని రద్దు పరచారు. దీని ఫలితంగా ఒకప్పుడు నూలు బట్టలను ప్రపంచ వ్యాప్తంగా ఎగుమతి చేసిన భారతదేశం ఆ నూలు బట్టలనే ఎగుమతి చేసుకోవాల్సి వచ్చింది.

18వ శతాబ్దారంభంలోనే బ్రిటిషు ఉత్పత్తి దార్లు తూర్పు ఇండియా వర్తక సంఘం ద్వారా దిగుమతి అయిన భారత వస్తువులు నాణ్యతలో మిన్నగా ఉంది. తమకు పోటీగా తయారవడం వల్ల బాహ్యంగా ఆగ్రహం చూపుతూ వచ్చారు. 1720 నాటికి పట్టు, రంగులద్దిన కాలికో బట్టకో బట్టల దిగుమతులను నిషేధించారు. భారతదేశంలో తయారైన నూలు బట్టలపై అధికంగా సుంకాలు వేయడం వల్ల ఇంగ్లండుకు వాటి ఎగుమతి పరోక్షంగా ఆపివేయడం జరిగింది,

1776లో కంపెనీ అనుసరించిన వాణిజ్య పెట్టుబడి విధానానికి వ్యతిరేకంగా, స్వేచ్ఛా వ్యాపారాన్ని సమర్థిస్తూ ఆడమ్ స్మిత్ తన "వెల్త్ ఆఫ్ నేషన్స్" గ్రంథాన్ని ప్రచురించాడు. ఇది అంత వరకు కంపెనీ అనుసరించిన విధానాలను విమర్శించింది. పార్లమెంటుగూడ భారత దేశంలోని కంపెనీ వ్యవహారాలను మెరుగుపర్చడానికి అనేక విధాలు ప్రయత్నించింది.

అంతర్జాతీయ రంగంలో జరిగిన ఫ్రెంచి విప్లవం వంటి సంఘటనలు, వారన్ హేస్టింగ్‌పై వచ్చిన అభియోగం, బెంగాలులో కారన్ వాలీసు తెచ్చిన సంస్కరణలు అన్నీ కలిసి కంపెనీ విధానాల్లో మార్పులకు దారితీశాయి. 1813లో ఇంగ్లండులోని పలుకుబడి ఉన్న పారిశ్రామిక పెట్టుబడిదారుల ప్రమేయంలో కంపెనీకి గల గుత్తాధికారం అంతమైనందువల్ల భారతదేశంలో అప్పటి నుంచి పారిశ్రామిక పెట్టుబడి ఘట్టం ప్రారంభమైందని చెప్పవచ్చు.

1813కు ముందు భారతదేశంతో బ్రిటిషు వ్యాపారం తక్కువగా ఉండేది. కాని కంపెనీ గుత్తాధికారాన్ని రద్దుచేసిన తరవాత భారతదేశాన్ని బ్రిటిషువారి వస్తువుల విక్రయ స్థలంగా మార్చడానికి కృషి కొనసాగింది. వారన్ హేస్టింగ్స్ వంటి వారు కొందరు కంపెనీ అనుసరించిన పాత పద్ధతులను సమర్థించి, వ్యాపార పెట్టుబడి పద్ధతులను కొనసాగించాలని సలహా ఇచ్చినా అది ఫలితం లేకపోయింది. 19వ శతాబ్దారంభంలో సుంకాలను విధించడంలో పక్షపాత వైఖరిని చూపారు. ఉదాహరణకు 1840లో భారతదేశానికి దిగుమతైన బ్రిటిషు నూలు, పట్టు బట్టలపై 3½ శాతం సుంకం విధించం జరిగింది. కాని భారతదేశంలో తయారైన నూలు బట్టలపై ఇంగ్లండులో 10 శాతం పట్టు బట్టలపై 20 శాతం ఉన్ని బట్టలపై 30 శాతం పన్ను విధించేవారు. యంత్రాల్లో తయారైన కారణంగా నాణ్యత గలదని మాత్రమేగాక ప్రత్యక్షంగా ప్రభుత్వం పనిగట్టుకొని ఏకపక్ష స్వేచ్ఛా వ్యాపారాన్ని ప్రోత్సహించిన కారణంగా భారత దేశంలో బ్రిటిషువారు తప్ప తక్కిన యూరోపియన్లుగాని ఇతర విదేశీయులుగాని, వ్యాపారం చేయకూడని విధంగా చట్టాలు రూపొందించడం జరిగింది దీనివల్ల భారతదేశంలో బ్రిటిషువస్తువులు నిండి పోవడం, స్వదేశీ తయారీలు నశించడం జరిగింది. ఈ పద్ధతి 19వ శతాబ్దంలో సంభవించినా దీని పరిణామాలు మాత్రం ఆ శతాబ్దానికే గాక, ప్రస్తుత శతాబ్దారంభానికి కూడ విస్తరించింది.

యంత్రోత్పత్తితో వచ్చిన బ్రిటిషు నూలు బట్టలు మన దేశంలోని నేత పని వారిని నాశనం చేసింది. అదే విధంగా పట్టు బట్టలు, ఉన్ని, ఇనుము, మట్టి పాత్రలు, గాజు కాగితం తయారీలన్నీ స్థానికంగా సంభవించాయి. కర్మాగారాల్లో అధిక సంఖ్యలో తయారైన వస్తువులు చేతి వృత్తుల మూలంగా తయారైన వాటికన్న సరసంగా ఉండటమే దీనికి కారణం.

పెద్ద ఎత్తున కొనసాగిన భారత స్వదేశీ ఉత్పత్తుల వినాశం ఆర్థిక విధానంపై చూపిన ప్రభావాన్ని సులభంగా ఊహించవచ్చు. ఇంగ్లండులో ప్రాచీన చేనేత కార్మికులకు జరిగిన ఉద్వాసన వెంటనే ఆవిర్భవించిన యంత్రోత్పత్తికి దారితీసింది. కాని భారతదేశంలో అట్లాగాక లక్షలాది చేతిపనివారు తమ ఉపాధి కోల్పోయారే గాని వారి స్థానంతో ఎటువంటి పారిశ్రామికోత్పత్తి స్థానికంగా కలగలేదు. భారతీయ ఉత్పత్తులకు పేరు మోసిన ఢక్కా, మూర్షిదాబాద్, సూరత్ వంటి జనసమ్మర్దం ఉన్న నగరాలు కొద్ది సంవత్సరాల్లో జనహీనమైనాయి. ఢక్కా నగరంలోని ఒకటిన్నర లక్షల జనాభా ముప్పై లేక నలభై వేలకు తగ్గినట్లు 1840లో ఛార్లెస్ ట్రెవిలియన్ పార్లమెంటు విచారణ కమిటీకి ఇచ్చిన నివేదికలో తెలియజేశాడు. భారత

దేశ మాంచస్టర్‌గా పేరు పొందిన ఢక్కా తన ఉత్పత్తిని కోల్పోయి పేద పట్టణంగా మారింది. మాంట్ గో మర్టిన్ కూడ ఇదే విధమైన అభిప్రాయాన్ని తెల్పాడు. సూరత్, ఢక్కా ముర్షిదాబాద్ వంటి నగరాల్లోని ఉత్పత్తుల తరుగుదల మిక్కిలి విషాదకరమైంది. ఆ నగరాల్లో జరిగిన వ్యాపారం సరైన సమాన స్థాయిలో గాక అసమానతతో కూడినదిగా అనిపిస్తుందని అతడు అభిప్రాయ పడ్డాడు. 1890లో సర్ హెన్రీ కాటన్ ఈ విధంగా రాశాడు. "దాదాపు వంద సంవత్సరాల క్రితం ఢక్కా నగరంలోని పూర్తి వ్యాపారం సుమారు కోటి రూపాయ లున్నట్లు అంచనా వేయడం జరిగింది. అక్కడ జనాభా సుమారు రెండు లక్షలు. 1787లో ఢక్కా నుంచి ఇంగ్లండుకు ఎగుమతైన మస్లిన్లు 30 లక్షల రూపాయలకు మించి ఉండేది. కాని 1817 నాటికి అవి పూర్తిగా అంతరించాయి. తరతరలగా ఉపాధిని ప్రసాదించిన నూలు వడకడం, బట్టలు నేయడం వంటి వృత్తులు కూడ అడుగంటి పోయాయి. ఈ పద్ధతి ఒక్క ఢక్కా నగరానికి మాత్రమే పరిమితం కాలేదు. అనేక ఇతర ప్రాంతాలు కూడ ఇదే విధంగా తమ ప్రాభవాన్ని కోల్పోయాయి.

నేత పరిశ్రమల్లోనే గాక తోలు వస్తువుల తయారీ, లోహాల ఉత్పత్తి విషయంలో కూడ అరాచక పరిస్థితులు సంభవించాయి. ఇంగ్లండులో తయారైన అల్యూమినియం పాత్రలు అధికంగా దిగుమతి కావటంచేత మన దేశంలో ఇత్తడి మట్టి పాత్రల తయారి దెబ్బతింది. ఇనుము, ఉక్కు పరిశ్రమలకుకూడ ఇదే పరిస్థితి ఎదురైంది. అన్ని రకాల పనిముట్లు ఇంగ్లండు నుంచి దిగుమతైన కారణంగా స్వదేశీ పద్ధతిలో ఇనుము కరిగించు విధానం అదృశ్యమైంది. ప్రాచీన భారత దేశంలో యు సామాగ్రి తయారీకి ఉక్కును ఉపయోగించేవారు. ఉక్కుతో అనేక పనిముట్లు, అలంకరణ వస్తువులుకూడ తయారు చేసేవారు. దమాస్కస్‌లో కత్తుల తయారీకి హైదరాబాదులో లభ్యమైన ఉక్కును వాడేవారు. ఢిల్లీలో కుతుబ్ మినార్ సమీపాన ఉన్న 5వ శతాబ్దానికి చెందిన ఇనుప స్తంభం ఇప్పటికీ తుప్పు పట్టక నిలిచి ఉంది. ఇనుమును పోతపోయడంలో భారతీయుల నైపుణ్యానికి ఇది ప్రబల నిదర్శనం.

ప్రాచీన ఉత్పత్తి కేంద్రాలైన నగరాలు మాత్రమే గాక, గ్రామీణ ఉత్పత్తులు కూడ బ్రిటిషువారి వస్తువుల ప్రభావంతో నాశనమయ్యాయి. వ్యవసాయం, వస్తువుల ఉత్పత్తి మేళవించి కొనసాగిన భారత ఆర్థిక విధానం క్రమేణ కేవలం వ్యవసాయక ప్రాధాన్యం గల వలస రాజ్యంగా మారింది. నూలు వడకువారు, నేత పనివారు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, నగిషీ మొదలైన అనేకమైన చేతి పనులను చేసేవారు వ్యవసాయంపై ఆధారపడ్డానికి ఉపక్రమించారు. వ్యవసాయ రంగపె ఆధారపడ్డ ప్రజల నిష్పత్తి 19వ శతాబ్దంలో మితిమీరి పెరుగుతూ వచ్చి, 20వ శతాబ్దంలో కూడ కొనసాగింది.

భారత దేశంలో అమ్మకాలు అభివృద్ధి చేయడానికి ఉత్పత్తుల అభివృద్ధితోబాటు ముడి వస్తువుల దిగుమతికూడ అవసరం. అందువల్ల బ్రిటిషువారి వాణిజ్య విధానంలో ముడి సరకుల

ఎగుమతికి ఎక్కువ ప్రాధాన్యత ఉంది. నూనెలు, జంతు చర్మాలు, అద్దకపు రంగులు, జనుము పత్తి మొదలైన వస్తువుల ఎగుమతులు ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవానికి తోడ్పడ్డాయి. వారి దేశంలో తయారైన ఇనుము మిల్లు బట్టలు మన దేశంలో అధిక మొత్తాల్లో విక్రయానికై వచ్చాయి అన్నింటుకీ మించి ఆహార ధాన్యాల ఎగుమతులుకూడ అధికం అయ్యాయి. దేశంలో ఆహార కొరతకు, దానిచే సంభవించిన అనేక కరవులకు ఈ వలస పద్ధతిపై ఆధారపడ్డ వాణిజ్య విధానం ప్రధాన కారణమైంది.

బ్రిటిషువారి అధికారంలో ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతంలోని వస్తువుల ఉత్పత్తి వాటి వ్యాపారం కూడా అనేక మార్పులకు లోనైంది. కోస్తా ప్రాంతంలో తయారైన బట్టలు ముఖ్యంగా సున్నితమైన నూలు వస్త్రాలు, పాలంపోర్లు, మచిలీపట్నంలో నేయబడిన షిపాన్ బట్టలు ఇంగ్లండుకు మాత్రమేగాక ఫ్రాన్సు మొదలైన ఐరోపా దేశాలకు, తూర్పు ఆసియాలోని అనేక దేశాలకుకూడ ఎగుమతి అయ్యేవి. మచిలీపట్నం, విశాఖపట్నం, భీమునిపట్నం, కోరంగి మాదపాలెం, ఇంగేరం, కాకినాడ వంటి రేవు పట్టణాల నుండి అనేక ఇతర వస్తువులుకూడ ఎగుమతి అయ్యేవి. ఆహార ధాన్యాలు, వక్కలు, ఉన్ని టెంకాయలు, పొగాకు, అద్దకం వసువులు, కలప, పసుపు వంటి వస్తువులకు విదేశాల్లో ఎక్కువ గిరాకి ఉండేది నెల్లూరు దగ్గర గల ఇసుక పల్లెలో తయారైన నాణ్యమైన ఉప్పుకు విదేశాల్లోకూడ గిరాకి ఉండేది. ఆంధ్ర ప్రాంతం మాదిరిగా ఇతర కోస్తా ప్రాంతాల్లో కూడ వస్తూత్పత్తితో బాటు వాణిజ్యం కూడ ఎంతో ముమ్మరంగానే సాగించి.

1857 నుంచి ఆ శతాబ్దం చివరి వరకు ఉన్న కాలంలో భారతదేశంలో ఎగుమతి దిగుమతులు బాగా అభివృద్ధి చెందాయి. ఎగుమతులు 50 కోట్ల రూపాయల నుంచి 80 కోట్ల వరకు దిగుమతులు 31 కోట్ల నుంచి 74 కోట్ల వరకు పెరిగాయి. భారత దేశపు విదేశీ వ్యాపారం 19వ శతాబ్ద ఉత్తరార్ధంలో అనేక మార్పులకు లోనైంది. స్థానికంగా పరిశ్రమలు స్థాపించడం మన దేశంలో రైల్వేల పెంపువల, ఆవిరి నౌకల అభివృద్ధి దీనికి తోడు సూయజ్ కాలువ తవ్వకం విదేశీ వ్యాపారాభివృద్ధికి అమితంగా దోహదం చేశాయి.

1869లో సూయజ్ కాల్వను రవాణాకు తెరచిన తరవాత భారతదేశ విదేశీ వ్యాపార విధానంలో చాలా మార్పు వచ్చింది. దీనివల్ల భారత దేశానికి ఇంగ్లండుకు ఉన్న ప్రయాణం సుమారు మూడు వేల మైళ్ళు తగ్గింది. దాదాపు మూడు నెలల ప్రయాణం కేవలం ఒక పక్షం రోజులకు తగ్గింది ఎగుమతి ఖర్చులు కూడ తగ్గాయి. పూర్వం ఆఫ్రికాఖండాన్ని చుట్టి గుడ్ హోప్ అగ్రం మీదుగా వెళ్లడం వల్ల భూమధ్య రేఖను రెండుసార్లు సమీపించాల్సి ఉండేది. దీని వల్ల నౌకల్లోని బియ్యం, గోధుమలు చెడిపోయేవి. కాని సూయజ్ మార్గం వల్ల ఆహార ధాన్యాలు తాజాగా గమ్యాన్ని చేరగల్గాయి. సూయజ్ కాల్వ తెరచిన తరవాత భారతదేశానికి వచ్చే దిగుమతులు కూడ కొంత సరసంగా లభించాయి. ఇనుము, ఉక్కు, రైలు పరికరాలు వంటి వన్నీ సులభంగా దిగుమతి అయ్యాయి.

దేశంలో వ్యాపార పంటలకు ఇచ్చిన ప్రోత్సాహంతో బాటు ప్రాంతీయ ప్రాతిపదికపై ఆహార ధాన్యాల ఉత్పత్తులు ప్రారంభమైన తరవాత మనదేశం నుంచి బియ్యం, గోధుమలు విశేషంగా ఎగుమతి అయ్యాయి. 1857 తరవాత బ్రిటిష్ పరిపాలన దేశంలో సుస్థిరంగా నెలకొన్నందు వల్ల, తగు శాంతి భద్రతలు ఏర్పడినందు వల్ల, బ్రిటిష్ పెట్టుబడిదార్లు భారత దేశంలో పెద్ద మొత్తాలను పెట్టుబడి పెట్టడానికి ముందుకొచ్చారు. దీనిచే విదేశీ వ్యాపారం చాల వరకు పెంపొందిందని చెప్పవచ్చు. రైలు రోడ్లు, కాల్వలు, తంతి తపాలా సౌకర్యాలు అభివృద్ధి చెందడంవల్ల రవాణా సౌకర్యాలు పెంపొంది దేశం నలుమూలలా ఎగుమతి దిగుమతుల ప్రోత్సాహనికి వీలు ఏర్పడింది.

19వ శతాబ్దాంతానికి భారతదేశం ఆహార ధాన్యాలు, ముడి సరకులు, తేయాకు వంటి వాటి ఎగుమతులకు నిలయంగా, తమ కనీస అవసరాలకు కావాల్సిన బట్టలు వంటి అనేక వస్తువుల దిగుమతి చేసుకొనే దేశంగా పరిణించబడింది. విదేశీ వ్యాపారం ఎక్కువగా అభివృద్ధి చెందినా అంతకు ముందు చేతి ఉత్పత్తుల వి కయాల ద్వారా లభించిన విశేష ఆదాయానికి బదులుగా, భారత దేశం ఆహార ధాన్యాలను ఎగుమతి చేసే దుస్థితికి దిగింది.



# అధ్యాయం 4

## భూమి శిస్తు పద్ధతులు :

బ్రిటిష కంపెనీ భారత దేశంలో అధికారం స్థాపించిన పిదప అంతకు ముందున్న భూమి శిస్తు విధానాలను కొద్ది కాలం కొనసాగించింది కాని తరవాత కచ్చితమైన ఆదాయం ఎక్కువగా లభించే ఒకే రకమైన భూమి పన్ను విధానాలను ప్రవేశపెట్టింది. తొలుత కంపెనీ అధికారులకు మన దేశంలోని శిస్తు పద్ధతులు సులభంగా అవగాహన కాకపోయినందు వల్ల అప్పటికి గల పద్ధతులనే మొదట కొనసాగించారు. క్రమేణ భూస్వాములకై వెదకడం ప్రారంభించారు. తమ దేశంలోని భూమి శిస్తు విధానాలకు అనుగుణంగా ఉండే పద్ధతిలో ఆ విధానాలను మన దేశంలో కూడ ప్రవేశపెట్ట సాగారు, అందువల్ల దేశంలో భూమికి స్వంత దారుని గుర్తించుటలో, ఫలసాయంలోని ప్రభుత్వపు వాటాను నిర్ణయించడం వంటి విషయాలపై ప్రయోగాలు శిస్తు నిర్ణయాలు కొనసాగించి ఒక ప్రాంతం తరవాత మరో ప్రాంతంలో నూతన భూమి శిస్తు పద్ధతులు ప్రవేశపెట్టడం జరిగింది. దీనివల్ల దేశంలో అనేక రకాల భూమి శిస్తు విధానాలు ఏర్పడ్డాయి. జమీందారీ విధానం, రైత్వారీ విధానం వీటిలో మిక్కిలి ప్రధానమైనవి. ఇవి గాక మల్గుజారి, మహల్వారి వంటి కొన్ని తాత్కాలిక విధానాలు కూడ కొన్ని ప్రాంతాల్లో అమలు జరిపారు.

## శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి :

బెంగాలులో భూమి శిస్తు విధానం ఒక ప్రత్యేకమైన సాంఘిక ఆర్థిక తరగతిగా రూపొందిన జమీందార్ల ఆవిర్భావానికి దారితీసింది. 1765లో బెంగాలు రాష్ట్రంలో రెవెన్యూ వసూలు అధికారాన్ని బ్రిటిష తూర్పు ఇండియా కంపెనీవారు మొగల్ చక్రవర్తి నుంచి పొందిన సమయంలో ప్రతి ఏటా రైతుల నుంచి రెవెన్యూ అధికార్ల మూలంగా పన్ను వసూలు పద్ధతి కొనసాగింది. పన్ను వసూలు చేసే అధికారాన్ని కంపెనీ అధికార్లు ప్రతిఏటా వేలం మూలంగా పొందేవారు. వేలంలో అధిక మొత్తానికి పాడినవారు ఆ సంవత్సరానికి రెవెన్యూ వసూలు చేసి ప్రభుత్వానికి కట్టాల్సిన మొత్తాన్ని చెల్లించి మిగిలిన మొత్తాన్ని లాభంగా పొందేవారు. ఆ విధంగా వేలం మూలంగా పన్ను వసూలు అధికారం పొందిన వారికి జమీందార్లని పేరు. వేలం పద్ధతిలో లోపాలున్నాయి కనక వారన్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్‌గా ఉన్న సమయంలో ప్రతి ఏటా జమీందార్లను మార్చు పద్ధతికి బదులు ఐదేండ్ల కొకసారి వేలం వేసే పద్ధతిని ప్రవేశ పెట్టాడు. కాని బ్రిటిష ప్రభుత్వం ఏటా శిస్తు వసూలు అధికారాన్ని కౌలుగా ఇచ్చే పద్ధతినే అంగీకరించినందు వల్ల ఆ ఐదేండ్ల పద్ధతి ఉపసంహరించడం జరిగింది. 1786లో కారన్ వాలీసు భారత దేశానికి గవర్నర్ జనరల్‌గా వచ్చిన వెంటనే ఇక్కడ గల రెవెన్యూ వసూలు

విధానం అతని దృష్టిని అమితంగా ఆకర్షించింది. పి. ఇ. రాబర్ట్స్ అన్నట్లు "కారన్ వాలీసు బెంగాలులో వ్యవసాయం, వాణిజ్యం క్షీణించడాన్ని రైతులు, జమీందార్లు ఆర్థిక ఇబ్బందులతో మగ్గడాన్ని గమనించాడు. వడ్డీ వ్యాపారులు మాత్రం అభివృద్ధి చెందుతూ లాభాలు గణించారు." మాతృదేశ ప్రభుత్వం నుంచి రెవెన్యూ పద్ధతులను సంస్కరించాల్సిందిగా నిర్దుష్టమైన ఆదేశాలు పొందు పర్చిన కారన్ వాలీసు బెంగాలులో సంస్కరణలకు పూనుకొన్నాడు.

ఇంగ్లాండులోని భూస్వాముల పతిలో శాశ్వత శిస్తు విధానాన్ని భారత దేశంలో ప్రవేశ పెట్టాలని కారన్ వాలీసు నిర్ణయించాడు. అంతకు ముందు 1766లో అప్పటి కౌన్సిల్ సభ్యుడైన ఫిలప్ ఫ్రాన్సిస్ శాశ్వత పద్ధతిని సూచించాడు. 1789లో సర్ జాన్ షోర్ శాశ్వత పద్ధతిని సమర్థిస్తూ తన నివేదికను సమర్పించాడు. ఈ సూచనలన్నింటినీ దృష్టిలో ఉంచుకొని కారన్ వాలీసు 1790లో పది సంవత్సరాల కొకసారి శిస్తు నిర్ణయించు పద్ధతిని ప్రవేశ పెట్టాడు. ఆ సంవత్సరం కుదిరిన ఒప్పందం పది సంవత్సరాలు కొనసాగునట్లు అంగీకరించ బడింది. కాని వెంటనే కారన్ వాలీసు మాతృ దేశంలోని అధికార్ల సుముఖతను తెల్సుకొని 1793లో శాశ్వత శిస్తు నిర్ణయ విధానాన్ని ప్రకటించాడు. దీంతో రెవెన్యూ ఏజెంట్లుగా వ్యవహరించిన జమీందార్లను భూమికి సొంత దార్లుగా చేయడం జరిగింది. వారు ఏటా ప్రభుత్వానికి కట్టాల్సిన సొమ్ము శాశ్వతంగా నిర్ణయించడం జరిగింది. ఈ పద్ధతికి జమీందారీ విధానమని, శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి అని, కారన్ వాలీసు విధానమని కూడ పేర్లు.

జమీందార్లకు శాశ్వతంగా సంక్రమించు అధికారం వల్ల వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమాల పట్ల ఆసక్తి, ఉత్సాహం ఏర్పడుతుందని ఈ పద్ధతి ముఖ్యంగా అభిలషించడం జరిగింది. ఫిలిప్ ఫ్రాన్సిస్ తన నివేదికలో గుప్తధనం ఏ మాత్రం ఉన్నా జమీందార్లు ఆ ధనాన్ని వెలికి తెచ్చి, భూములపై వెచ్చించి దాని మూలంగా మిగులు ఆదాయం పొందగల ఆస్కారముండే దని అభిప్రాయ పడ్డాడు. కారన్ వాలీసు కూడ అట్లాంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. జమీందార్లు కూడ తమ శ్రమకు తగ్గ ఫలితాలు పొందగల్గుదురు. తమ సోమరితనానికి, దుబారా ఖర్చులకు తగు ఫలితాలు అనుభవించే విధంగా చట్టాలను రూపొందించినట్లైతే వారికి వీలుగాక పోయినప్పుడు భూములను ఇతరులకు అమ్మివేశారు. అట్లా కనుక్కొన్నవారు సక్రమంగా భూములను వ్యవసాయానికి ఉపయోగించడం జరుగుతుందని కారన్ వాలీసు నమ్మకం. జమీందార్లు అతని ఉద్దేశంలో సమర్థులైన భూస్వాములు, ప్రజా క్షేమాన్ని కాంక్షించాల్సిన కార్యకర్తలు తన ప్రభుత్వమే గాక ఉత్తరోత్తరా ఏ ప్రభుత్వమైనా ఈ పద్ధతిలోని ఉపయోగాలను గుర్తించి హర్షిస్తుందని కూడ అతడు తెల్పాడు.

కారన్ వాలీసు శాశ్వత శిస్తు నిర్ణయ విధానాన్ని చేపట్టడానికి మరో ప్రధాన కారణం. భారత దేశంలోని క్లిష్టమైన రెవెన్యూ వ్యవహారాలపై కంపెనీ అధికారకు తగు అవగాహన లేకపోవడం. దానికి జమీందారీ పద్ధతి మిక్కిలి అనువైన సమాధానం. అంతేగాక కావాల్సి నంత మంది కంపెనీ అధికార్లు లేరు. ఉన్న వారిని రెవెన్యూ విధులకై నియమించడానికి కారన్ వాలీసు నిర్ణయించాడు.

శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి జమీందార్లకు భూమిపై పూర్తి యాజమాన్యాన్ని కల్గ జేసింది. నిర్ణతమైన మొత్తాన్ని చెల్లించు షరతులపై కేటాయించిన ప్రాంతంలో పన్ను వసూలు చేసే అధికారం ఇవ్వడం జరిగింది. ఏ కారణం చేతనైనా సక్రమంగా చెల్లించక పోయినట్లైతే వారికి చెందిన భూముల్లో కొంత భాగాన్ని అమ్మి కట్టాల్సిన మొత్తానికి సరిపెట్టడం జరిగేది. ప్రతి ఏటా ఆ మొత్తాలను చెల్లించడంలో జాప్యం జరిగిన, అట్టి జమీందార్లను తొలగించి వారి స్థానంలో ఇతరులను నియమించే అధికారం కంపెనీ ప్రభుత్వానికుండేది. రైతుల నుంచి వసూలైన మొత్తంలో దాదాపు 90 శాతం జమీందార్లు ప్రభుత్వానికి చెల్లించాల్సిన మొత్తంగా నిర్ణయించడం జరిగింది. వసూలు చేసే బాధ్యత చేపట్టినందు వల్ల ప్రతిఫలంగా సుమారు 10 శాతం జమీందార్లకు మిగులుతుందని ఈ పద్ధతి ప్రవేశ పెట్టినప్పుడు అంచనా వేయడంజరిగింది. జమీందార్లు ప్రతి ఏటా ప్రభుత్వానికి చెల్లించాల్సిన మొత్తానికి పేష్కష్ అని పేరు. జమీందారీ పద్ధతిలో జమీందారు ప్రభుత్వానికి చెల్లించాల్సిన పేష్కష్ మాత్రమే ఖరారు చేయడం జరిగింది గాని, రైతుల నుంచి జమీందారు వసూలు చేసే మొత్తాలను ప్రభుత్వం ఆయా జమీందార్లకే వదలి పెట్టింది.

శాశ్వత ప్రాతి పదికపై జమీందార్లకు భూమిపై అధికారం ఉండటంచేత భూములను అభివృద్ధి చేసే ఆస్కారం ఉటుందని భావించడం జరిగింది భూములపై అధిక మొత్తాలను వెచ్చించు ఆస్కారం, శాశ్వత పథకాలంతో వ్యవసాయ రంగాభివృద్ధి, బీడు భూములను సాగుతెచ్చే కార్యక్రమాలు, పలసాయాన్ని అభివృద్ధిచేసే పనులవల్ల రైతు జనానికి, కూలీలకు తగు ప్రతిఫలం లభించి అధిక సంతృప్తి కల్గుతుందని బ్రిటిష్ అధికార్లు ఆశించారు. ఈ పద్ధతి వల్ల ప్రతి ఏటా వచ్చే రాబడి ప్రభుత్వం ముందుగా తెల్సుకోడానికి వీలైంది. అందువల్ల తాము వెచ్చించాల్సిన పద్దులను ముందుగా నిర్ణయించుకొనే అవకాశం కల్గింది. శాశ్వత శిస్తు నిర్ణయ విధానం వల్ల బ్రిటిష వారికి విధేయులైన జమీందారీ వర్గం రూపొందింది. వారు స్థానికంగా గల ప్రజలను అదుపులో ఉంచి బ్రిటిష వారి పరిపాలనను సమర్థిస్తూ వ్యవహరించారు. 1857 విప్లవ సమయంలో జమీందార్లు బ్రిటిష వారికి విధేయులై మెలిగారు. ప్రతి ఏటా శిస్తు నిర్ణయించే పద్ధతిలోని లోపాలను దానివల్ల గల వ్యయ ప్రయాసలను శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి తొలగించింది. దీనిచే ప్రభుత్వానికి ఎక్కువ ఆదా కల్గింది.

కేవలం ప్రభుత్వానికి సమకూర్చే లాభాల దృష్టితో ప్రవేశ పెట్టబడ్డ జమీందారీ పద్ధతివల్ల రైతులకు అనేక అనర్థాలు వాటిల్లాయి. బ్రిటిషవారు అనుసరించిన వలస తత్వానికి వారి ఈ శిస్తు నిర్ణయ పద్ధతి ప్రతీక అని అనవచ్చు. ఈ పద్ధతి శాస్త్రీయంగా మలచడం జరగ లేదు ఇందు భూమిని కొలవడం, భూసారాన్ని బట్టి శిస్తు నిర్ణయించడం మొదలైనవి జరగలేదు. జమీందార్లు భూమికి సొంతదార్లుగా ప్రకటించబడ్డ కారణంగా రైతుల హక్కులు హరించ బడ్డాయి వారు పూర్తిగా భూస్వాములైన జమీందార్ల దయా దాక్షిణ్యాలకు లోనయ్యారు. శిస్తు రూపంగా జమీందార్లు ఎంత మొత్తాన్నైనా వసూలు చేయవచ్చు, శిస్తు చెల్లించలేని

రైతులను నిర్దాక్షిణ్యంగా తొలగించే అధికారం వానికుండేది. భూముల అభివృద్ధి విషయంలో కారన్ వాలీసు అనుకొన్న విధంగా జమీందార్లు వ్యవహరించలేదని చెప్పవచ్చు. వారు ఎప్పుడూ నగరాల్లో నివశిస్తూ వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేశారు. వారికి గల ఆదాయం మాత్రం అమితంగా అభివృద్ధి అయింది. ఉదాహరణకు 1793లో బెంగాలు జమీందార్లకు సాలీన ఆదాయం 40 కోట్ల రూపాయలు కాగా, 1900లో ఇది 160 కోట్లుగా అంచనా వేయబడింది. తరవాత కాలంలో ఆ లాభాలు మరీ ఎక్కువైనాయి. కాని చిన్న తరహా జమీందార్లు అధిక పేష్‌కష్ కట్టాల్సి వచ్చేది. "సూర్యాస్తమయ చట్టాలు" **(Sunset acts)** అమలులో ఉన్న కారణంగా సక్రమంగా నిధులు చెల్లించని జమీందార్లు భూములను కొన్ని సమయాల్లో తమ పదవులను పోగొట్టుకున్నారు.

కారన్ వాలీసు, సర్ జాన్ షోర్, ఇతర సమకాలీన అధికార్లుగూడ 1793లో ప్రవేశ పెట్టబడిన శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని బనారస్ ప్రాంతానికి విస్తరించ సంకల్పించారు. 1795లో ప్రభుత్వం అప్పటికి అమలులో ఉండు గ్రామాధికారి పద్ధతిని తొలగించి పలుకుబడి గల వారితో ఒప్పందం కుదుర్చుకొని శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని ప్రవేశపెట్టారు.

మద్రాసు రాష్ట్రంలో 1778 వరకు ఉత్తర సర్కారులలో జమీందార్లతో ప్రతి ఏటా కౌలు పద్ధతితో శిస్తు వసూలు పద్ధతి కొనసాగింది. కాని తరవాత ఐదేండ్ల కొకసారి నిర్ణయించే పద్ధతే అనుసరించబడింది. 1783లో మరలా ఏటా నిర్ణయించు పద్ధతి కొనసాగింది. 1786 తరవాత మూడేండ్ల కొకసారి శిస్తు నిర్ణయించు పద్ధతి కొంత కాలం అనుసరించబడింది. వసూలైన శిస్తు మొత్తంలో మూడింట రెండు వంతులు జమీందార్లు ప్రభుత్వానికి చెల్లించాలి. కడపటికి వెల్లస్లీ ఒత్తిడి ఫలితంగా మద్రాసు రాష్ట్రానికి శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి విస్తరించబడింది.

కారన్ వాలీసు బెంగాలులో 1793లో ప్రవేశపెట్టిన రెవెన్యూ విధానాన్ని మద్రాసుకు గూడ విస్తరింపజేయాలను ఉద్దేశం కంపెనీ డైరెక్టర్లకు గూడ ఉండేది. అందువల్ల వారు మద్రాసు ప్రభుత్వానికి గూడ ఆ రెవెన్యూ విధులు తెలియజేయు పత్రాలను పంపాడు. కాని 1798లో గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ మద్రాసు రాష్ట్రంలో ఆదాయ వ్యయ విషయాలను నిర్దుష్టంగా తెలిపే నివేదికను తయారు చేయవలసిందిగా ఆదేశించాడు. బెంగాలులో అప్పటికి అమలులో ఉన్న రెవెన్యూ, న్యాయ విచారణ పద్ధతులను మద్రాసు రాష్ట్రంలో ప్రవేశ పెట్టడానికి తగు మార్గాలను సూచించమనిగూడ కోరాడు. మద్రాసు ప్రభుత్వ ఉతరవుల ప్రకారం రెవెన్యూబోర్డు అన్ని విషయాలను పరిశీలించి 1799లో శాశ్వత శిస్తు పద్ధతి ప్రవేశపెట్టు విషయంగా తన సూచనలను అందజేసింది. బోర్డు నివేదిక ప్రకారం రాష్ట్రంలో ఈ పద్ధతి మిక్కిలి అనువైంది కనక మొత్తం ప్రాంతాన్ని అనేక విభాగాలు చేసి, పలుకుబడి గల వ్యక్తులకు వాటిని అన్ని అధికారాలతో అప్పజెప్పాలని సూచించింది. జిల్లా కలెక్టర్లకు గల 1799 అక్టోబరు నెలలో ఈ క్రొత్త రెవెన్యూ విధానాన్ని అమలు జరపాల్సిన తీరుకు

సూచనలు పంపబడ్డాయి. బెంగాలులో గల పద్ధతులను అనుసరించాలన్న సూచన అందులో ప్రధానమైంది. రెవెన్యూ బోర్డుకు పని మిక్కిలి ఎక్కువైన కారణంగా, జమీందారీ పద్ధతిని ప్రవేశ పెట్టడానికై మద్రాసు గవర్నరు లార్డ్ క్లైవు ఒక ప్రత్యేక కమీషన్‌ను 1802లో నియమించాడు.

మద్రాసు రాష్ట్రానికి జమీందారీ విధానాన్ని విస్తరింప జేయడంలోని ప్రధాన ఉద్దేశం గవర్నరు చేసిన ప్రత్యేక కమీషన్ నియామక ఉత్తరువులోగూడ కొంత వరకు తెలుస్తుంది. కంపెనీ అధికారానికి వచ్చిన కొత్త ప్రాంతాల్లోని పరిపాలనా విషయాలను చక్కబరచాల్సిన అవసరం రెవెన్యూబోర్డుకు ఎంతైనా ఉంది. ఆ ప్రాంతాలను అభివృద్ధి చేయడానికి సక్రమమైన రెవెన్యూ విధానం మిక్కిలి అవసరం. అని గవర్నరు తెల్పాడు.

ప్రత్యేకంగా నియమించిన ఆ కమీషన్‌లోని సభ్యులు ముగ్గురు. విలియం పెట్రీ అధ్యక్షుడు, థామస్ కాక్ బర్న్, జోసియా వెబ్ ఇతర సభ్యులు. శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి గూర్చి ఈ కమిషన్ చేసిన సూచనల మేరకు ఉత్తర సర్కారులలో అప్పటికి రెవెన్యూ కౌలుదార్లుగా ఉన్న వారందరిని జమీందార్లుగా గుర్తించడం జరిగింది. పశ్చిమ పాళెలుగా గుర్తించబడిన వెంకటగిరి (నెల్లూరు జిల్లా) కాళహస్తి, కార్వేటి నగరం (చిత్తూరు జిల్లా) సైదాపూర్ చంగల్పట్టు జిల్లా మొదలైనవి గూడ 1802 లోనే జమీందారీలుగా ఏర్పాటు చేశారు. జమీందార్లందరికీ శాశ్వత సనద్‌లు ఇచ్చారు. 1802–1805 మధ్య కాలంలో మద్రాసు రాష్ట్రంలోని అనేక జమీందారీలు ఆ విధంగా గుర్తింపు పొందాయి. మద్రాసుకు చేరువగా ఉన్న అనేక జాగీరు భూములుగూడ అదేవిధంగా శాశ్వత పద్ధతిలో గుర్తించబడ్డాయి. జమీందార్లు లేని ప్రాంతాలలో భూములను బహిరంగంగా వేలం పద్ధతిలో జమీందారీలుగా ఏర్పరచారు.

కంపెనీ పాలనా కాలంలో వెల్లస్లీ, మింటో, లార్డ్ హెస్టింగ్స్, బెంటింక్ మొదలగు గవర్నర్స్-జనరల్ జమీందారీ పద్ధతి విస్తరణకు కృషి చేశారు. ఈ పద్ధతి మూలంగా వ్యవసాయం అభి వృద్ధి చెందుతుందని వారి ప్రధాన ఉద్దేశం. దేశ వ్యాప్తంగా ఆ పద్ధతిని ప్రవేశపెట్టాలనేది ప్రభుత్వ ఉద్దేశంగా అనేక ప్రకటనలు గూడ జరిగాయి. కాని సర్ థామస్ మన్రో, మెట్‌కాఫ్, ఎల్ఫిన్‌స్టన్ వంటి అధికార్లు రైత్వారి పద్ధతిని సమర్థించిన కారణంగా శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి వ్యాప్తికి కొంత వ్యతిరేకత ఏర్పడింది. ఈ రెండు పద్ధతులలో ఏది అనువైనదన్న విషయంపై ఉన్నతాధికారుల మధ్య జరిగిన సుదీర్ఘ చర్చ హిందూదేశంలో గాక, ఇంగ్లండులో కూడ దాదాపు అర్ధ శతాబ్దం కొనసాగింది.

1858లో కంపెనీ ప్రభుత్వం అంతమై బ్రిటిషు ప్రభుత్వం స్వయంగా అధికారాన్ని స్వీకరించడం రెవెన్యూ విధానంపై పునరాలోచనకు అస్కారమిచ్చింది. జమీందార్లు ఇతర భూస్వాములు సిపాయిల తిరుగుబాటు సమయంలో బ్రిటిషు వారికి మిక్కిలి విధేయులై తమ తమ ప్రాంతాలలో శాంతి భద్రతలు ఏర్పరచి ప్రజలు ప్రభుత్వానికి ఎదురు తిరగకుండా

చర్యలు తీసుకొని బ్రిటిషు వారికి సహాయపడ్డారు. దీని ఫలితంగా ప్రభుత్వం జమీందార్ల ఆవశ్యకతను గుర్తించి తాత్కాలిక ప్రాతిపదికపై నున్న జమీందార్లందరికీ శాశ్వత సన్నదుల ప్రసాదించింది. 1867 లో అప్పటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని దేశ వ్యాప్తంచేయమని సూచించాడు. కాని 1883 లో బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలోని పరిస్థితులకు అంత అనువైంది కాదను ఉద్దేశంతో శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని విస్తరించవలసిన అవసరం లేదని నిర్ణయించింది. అప్పటికే అమలు జరిపి యున్న ప్రాంతాలలో ఆ పద్ధతి కొనసాగింది, స్వాతంత్ర్యానంతరం 1948 లో జమీందారీల రద్దు చట్టం ప్రవేశపెట్టబడి ఆ ప్రాంతాలు రైత్వారీ పద్ధతికి మారిపోయి జమీందారీలు రద్దయినాయి. జాతీయోద్యమకాలంలో కాంగ్రెసు సంస్థాగత ఉద్యమాలు అనేకమైనవి జమీందారీలకు వ్యతిరేకంగా పోరాటాలు కొనసాగించాయి. ఎన్. జి. రంగా ఆధ్వర్యంలో జరిగిన ఉద్యమాలు జమీందారీ వ్యవస్థ రద్దుకు దారితీశాయి.

## జమీందారి విధానంలో రైతు రక్షణ చట్టాలు :-

శాశ్వత శిస్తు నిర్ణయ విధానం జమీందార్లు భూమికి స్వంత దార్లుగా గుర్తించడం వల్ల రైతులకు అధికారాలు లేకుండా పోయాయి. రైతు భూ కామందుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసి వచ్చింది. అధిక పన్ను వసూలుకోసం పన్ను చెల్లించలేని సమయాలలో జప్తులు మొదలైన వాటినుంచి రైతులను కాపాడటానికి ప్రభుత్వం కొన్ని చట్టాలను రూపొందించింది. 1859 లో బెంగాల్ భూ అమరిక చట్టం మూలంగా పన్నెండేండ్లు విడిచి పెట్టకుండా సాగుచేసిన పొలాలపై రైతుకు హక్కు వచ్చింది. ఆ రైతును తొలగించడానికి గాని, శిస్తు కోర్టు మూలంగా అధికం చేయడానికి కూడ వీలు లేదు. 1793 నుంచి కట్టిన శిస్తును మార్చడానికి గాని ఇరువది ఏండ్లు కొనసాగిన పక్షంలో గూడ మార్చడానికి వీలు లేదని ఈ చట్టం మూలంగా విశదపరచబడింది. చెల్లించిన భూమి శిస్తు మొత్తాలకు జమీందార్లు రసీదులు ఇవ్వాలి. కాని పన్నెండేడ్లు వరసగా భూమిని అదే రైతు అధీనంలో ఉంచక జమీందార్లు మారుస్తూ వచ్చిన కారణంగా ఈ చట్టం 1885 లో సవరించబడింది. దీని ప్రకారం ఏపాటి కొద్ది భూమిని సాగుచేసినా ఆ రైతు కౌలుదారుగా గుర్తింపు పొందుతాడు. అతనిని బహిష్కరించడానికి వీలు లేదు. శిస్తు బకాయి పడినందుకు తొలగించడం కేవలం చట్ట ప్రకారం జరగాలి. శిస్తు మొత్తాలను ఎప్పుడు పడితే అప్పుడు అధికం చేయడానికి వీలు లేదు, అట్లాగాకుండా శిస్తును ఎక్కువ చేసినట్లైతే రైతు న్యాయస్థానాలలో ఫిర్యాదు చేయడానికి వీలు కలిగింది. ఈ చట్టాల మూలంగా రైతుకు తన భూ కమతాలపై పూర్తి అధికారం ఇవ్వడం ప్రధాన ఆశయం. జమీందార్లు కూడ వ్యవసాయాభివృద్ధికి తగిన చర్యలు తీసుకొన్నందుకు వానికనుగుణంగా లాభాలు పొందాలి. అంతేగాక రైతుకు, భూస్వామికి మధ్య ఉత్పన్నమయ్యే తగాదాలు కూడ శాంతియుతంగా పరిష్కరించబడాలని ఈ చట్టాలు రూపొందించబడ్డాయి.

1894 లో జమీందారీ ప్రాంతాలలో భూములను సర్వేచేయించి హక్కుదారులైన రైతుల పేర్లను నమోదు చేయించడం ప్రారంభమైంది. ఈ శతాబ్దారంభంలో కూడ జమీందారీ రైతుల రక్షక చట్టాలు రూపొందించబడ్డాయి. మద్రాసు రాష్ట్రంలో 1931 లో టంగుటూరు ప్రకాశం అధ్యక్షతన నియమించబడిన కమిషన్ నివేదిక ప్రకారం జమీందారీ రైతులకు అనేక సౌకర్యాలు గలిగించ బడ్డాయి. బెంగాలు లో గూడ 1938 లో ఫ్రాన్సిస్ ఫ్లౌడ్ అధ్యక్షతన ఒక కమిషన్ నియమించబడింది. 1940లో సమర్పించబడిన ఆ కమిషన్ నివేదికలో జమీందారీ పద్ధతి తొలగించడం మేలని, దాని స్థానంలో రైత్వారీ పద్ధతి ప్రవేశ పెట్టాలని సూచించబడింది. కాని ఈ సూచనలను బ్రిటిష్ ప్రభుత్వం అమలు జరుప లేదు.

ప్రభుత్వం చట్టాలను రూపొందించినా వాటిని అమలుచేయడం జమీందార్లపై ఆధార పడింది. కనక రైతులు నిజానికి ఈ చట్టాల మూలంగా లాభాలను పొందలేక పోయారు. తమ లాభాలకు మాత్రం పనికి వచ్చే విధంగా జమీందార్లు ఆ చట్టాలకు భాష్యం చెప్పారు.

## రైత్వారి విధానం :

కారన్ వాలీసు విధానానికి పూర్తిగా విరుద్ధమైంది రైత్వారి విధానం. ఇది మధ్యవర్తులైన జమీందారుల ప్రమేయం లేకుండా సరాసరి రైతులపై వ్యక్తిగతంగా శిస్తు నిర్ణయించు పద్ధతి జమీందారీ పద్ధతి బెంగాలులో మొదలై ఇతర రాష్ట్రాలకు విస్తరించింది. రైతు వారి పద్ధతి మద్రాసు రాష్ట్రంలో మొదలై ఇతర ప్రాంతాలలో అమలు జరిగింది. సర్ థామస్ మన్రో రాయలసీమ జిల్లాలకు కలెక్టరుగా ఉన్న సమయంలో (1800–1807) ఈ రైత్వారి పద్ధతి ప్రవేశ పెట్టబడింది. మన్రో దీనిని ప్రవేశ పెట్టినందువల్ల దీనికి మన్రో పద్ధతి అని గూడ పేరు వచ్చింది.

రైత్వారి పద్ధతి రాయలసీమలో ప్రవేశ పెట్టడానికి ముందు సేలం జిల్లాలోని బారామహల్ ప్రాంతంలో 1792 లో కొన్ని ప్రయోగాలు చేయబడ్డాయి. మూడో మైసూరు యుద్ధంలో టిప్పు సుల్తానును ఓడించిన కారన్ వాలీసు ఆ ప్రాంతాలను స్వాధీనం చేసుకొన్న తర్వాత అచ్చట కాప్టన్ రీడ్ ను కలెక్టరుగా నియమించాడు. థామస్ మన్రో రీడ్ కు సబ్ కలెక్టరుగా పనిచేశాడు. రీడ్ భూమి శిస్తు వసూలు విషయంలో సరాసరి రైతుల నుండి మాత్రమే వసూలు చేయాలని అభిప్రాయ పడ్డాడు. ఈ పద్ధతి కంపెనీ డైరెక్టర్ల ఆమోదం పొందింది. దీనిని ప్రవేశ పెట్టడంలో మన్రో మిక్కిలి ఉత్సాహాన్ని చూపాడు. 1798 నాటికి బారామహల్‌లో శిస్తు నిర్ణయం పూర్తిచేయబడింది. ఈ పద్ధతిలో రీడ్ మధ్యవర్తులను తొలగించడమే గాకుండా భూములను కొలవడం అంటే సర్వేచేయించడం గూడ చేపట్టాడు. భూములపై వసూలు చేయవలసిన మొత్తాలను నిర్ణయించాడు.

బారామహల్ నుండి మన్రో కనరా జిల్లాకు బదిలీ అయ్యాడు. అక్కడ రైతులకు భూమిపై హక్కు ఉంది. రైతులకు మధ్యవర్తుల ప్రమేయం లేక ప్రభుత్వానికి శిస్తు చెల్లించే

వారు. దీన్ని చూచిన మన్రో అమిత ఆసక్తితో ఈ పద్ధతిని మరింత పరిశోధించి, ప్రయోగాలు జరిపి, వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి ఈ పద్ధతి మాత్రమే సరియైనదని నమ్మాడు. తనకున్న ప్రతిభ ఆసక్తిచేత మన్రో ఒక సంవత్సర కాలంలో కనరా జిల్లాలోని రెవెన్యూ పద్ధతులను ధృవీకరించడం పూర్తిచేశాడు. భూ కామందులతో శిస్తు కుదిర్చాడు. భూములపై ఆదాయం ఖచ్చితంగా మదింపు చేయించాడు. అందులో ప్రభుత్వం భాగంగూడ నిర్ణయించ బడింది. ఏ పరిస్థితుల్లోను ఆ భాగం మూడింట ఒక వంతుకు మించి ఉండదు. అనేక సందర్భాల్లో ఇది ఐదింట ఒక భాగం లేదా ఆరింట ఒక భాగంగూడ ఉండేది. కొన్ని సందర్భాలలో పదింట ఒక వంతుకు గూడ తక్కువగా నిర్ణయించబడేది. రాయలసీమలోని కడప, కర్నూలు, బళ్లారి అనంతపురం జిల్లాలను హైదరాబాదు నిజాం బ్రిటిషువారికి 1800 లో అక్టోబరు 12వ తేది దత్తం చేసిన కారణంగా వీటికి దత్త మండలాలని (సీడెడ్ మండలాలు) పేరు. ఆ జిల్లాలకు సర్ థామస్ మన్రో ప్రధాన కలెక్టరుగా నియమించ బడ్డాడు. మన్రో తన అభిమానమైన రైత్వారి పద్ధతిపై ప్రయోగాలు కొనసాగించి భూములను సర్వేచేయించి శాస్త్రీయ పద్ధతిలో శిస్తు నిర్ణయ విధానాన్ని ప్రవేశ పెట్టాడు. ఆతడు స్వయంగా ప్రత్యేక శ్రద్ధతో పల్లెలను పర్యటించి, తగిన సర్వేయర్లను నియమించి, రైత్వారి పద్ధతి విస్తరణకు పాటుపడ్డాడు.

మద్రాసు రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో కూడ రైత్వారి పద్ధతి ప్రవేశ పెట్టబడింది. 1799 లో తంజావూరు, కోయంబత్తూరు, రెండేండ్ల తర్వాత ఆర్కాటు నవాబు బ్రిటిషు వారి వశమయ్యాయి. ఆ ప్రాంతాలన్నిటిలో రైత్వారి పద్ధతి ప్రవేశ పెట్టబడింది. 1800 లో మలబారు బొంబాయి రాష్ట్రం నుంచి మద్రాసుకు బదిలీ చేసిన వెంటనే అక్కడ కూడ రైత్వారి పద్ధతి అనుసరించ బడింది.

1802–04 ప్రాంతంలో రైత్వారీ విధాన విస్తరణకు కొన్ని అవరోధాలు కలిగాయి. గవర్నరు జనరల్ లార్డ్ వెల్లస్లీ సూచనల మేరకు రాష్ట్రంలో జమీందారీ విధానం ప్రవేశ పెట్టబడింది. కాని ఈ విధానం అందరికీ అంగీకారం కానందువల్ల దానిని నిరోధించే ప్రయత్నాలు కొనసాగాయి. 1808-09 ప్రాంతంలో గ్రామస్థాయి శిస్తు నిర్ణయ పద్ధతి ప్రయోగాత్మకంగా ప్రవేశ పెట్టబడింది. పదేండ్ల కొకసారి శిస్తు నిర్ణయించు పద్ధతి గూడ ఇదే సందర్భంలో అనుసరించబడింది.

మద్రాసు రాష్ట్రంలోని శిస్తు వసూలు విధానాలను సమగ్రంగా పరిశీలించడానికై 1812 లో పార్లమెంటు సబ్ కమిటి నియమించ బడింది. కంపెనీ డైరెక్టర్లు గూడ శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతికి విముఖత చూపి ఆ పద్ధతిని మద్రాసు రాష్ట్రంలో ప్రవేశ పెట్టడంలో రెవెన్యూ బోర్డు చాల తొందర పడిందని అభిప్రాయపడింది. అందువల్ల మద్రాసు ప్రాంతంలో రైత్వారి విధానాన్ని కొనసాగించారు. అంతేకాక భూములను సర్వే చేయించి భూమి శిస్తు నిర్ణయించే అధికారం జిల్లా కలెక్టర్లకు ఇచ్చారు. వారికి న్యాయవిచారణ, పోలీసు అధికారాలు

గూడ వచ్చాయి. 1820లో సర్ థామస్ మన్రోను మద్రాసు రాష్ట్ర గవర్నరుగా నియమించడం వల్ల రైత్వారి విధానం మరింత ప్రాముఖ్యత పొందింది.

రైత్వారి విధానం ప్రవేశ పెట్టిన తొలి దశలో అందు చాల అవక తవకలు కనిపించాయి. సరియైన సర్వేలు లేక పోవడంచేత, ప్రతి భూకమతానికి నిర్దుష్టమైన ఎల్లలు ఏర్పాటు చేయకపోవడం వల్ల అట్టి అస్తవ్యస్థ పరిస్థితి ఏర్పడింది. శిస్తు గూడ అధికంగా ఉండేది. పల్లపు భూములపై 50 శాతం మెట్ట భూములపై 38 శాతం శిస్తు వసూలు చేయ బడింది. శిస్తు రేట్లలో ఒక గ్రామానికి మరొక గ్రామానికి వ్యత్యాసం ఉండేది. సరియైన లెక్కలు లేని కారణంగా ఒక రైతుకు గల బకాయి మరొక రైతు కట్టాల్సి వచ్చేది. కాని క్రమీణ భూముల గురించిన లెక్కలు తయారైన తరవాత తర్ఫీదు పొందిన సర్వేయర్లను నియమించి, భూములను వర్గీకరించి, పన్ను మొత్తాలను నిర్ణయించడం వల్ల ఈ లోపాలు క్రమీణ తొలగి పోయాయి.

1855 తర్వాత ప్రవేశ పెట్టబడ్డ మార్పుల మూలంగా రైత్వారి పద్ధతి ఆధునీకరణ చేయబడింది. 1857 లో ప్రత్యేకంగా ఒక సెటిల్‌మెంట్ విభాగం ప్రారంభించబడింది. సర్వే విభాగం గూడ పునర్వ్యస్థీకరించబడింది. రైత్వారి పద్ధతిలోని శిస్తు నిర్ణయ నియమాలు చట్టాల మూలంగా కాకుండా అనేక సూచనల మూలంగా రూపొందించబడింది. ఈ పద్ధతిలో గుర్తింపు పొందిన సొంతదారుడు ఆ భూమిపై సర్వాధికారాలు చెలాయించవచ్చు. దానిపై శిస్తు చెల్లిస్తూ తనకు ఇష్టం వచ్చినట్లు, ఉంచుకోవడానికి గాని, అమ్ముకోవడానికి గాని, ఇతరులకు స్వాధీనం చేయడానికి గాని అధికారముండేది. అతడు తన భూమిపై అభివృద్ధికై వెచ్చించినంత వరకు శిస్తు మినహా ఉండేది. రైత్వారి విధానంలో భూములన్నీ ప్రభుత్వానికి చెందినట్లుగా తెలియజేయబడింది. భూమిపై విధించు పన్ను అందులో వచ్చు ఫలసాయంపై గాక, భూమి విస్తీర్ణం, భూమి వర్గీకరణ ఆధారంగా నిర్ణయించ బడేది. భూమిపై పండు పంటల దిగుమతి ఆధారంగా భూమి వర్గీకరించ బడేది. రైతులు శిస్తును సరాసరి ప్రభుత్వానికే చెల్లించాలి. భూమి హక్కును తెలియజేసే లెక్కలన్నీ సేకరించబడేది.

బొంబాయి రాష్ట్రంలో రెవెన్యూ సంస్కరణలను లార్డ్ ఎల్ఫిన్‌స్టన్‌కు 1818 లో అప్పజెప్పబడింది. తర్వాత సంవత్సరంలో అతడు బొంబాయి గవర్నరుగా నియమించ బడ్డాడు. దక్కన్ కమిషన్ ఛాప్లిన్ నివేదిక ననుసరించి గవర్నరు సర్వే, సెటిల్ మెంటుకు ఉత్తరువులు జారీచేశాడు. బొంబాయి రాష్ట్రంలో అనుసరించిన శిస్తు విధానాలు, మద్రాసు రాష్ట్రంలో అనుసరించిన రైత్వారి పద్ధతుల మోస్తరుగా ఉండేవి.

బ్రిటిషువారు ప్రవేశ పెట్టిన భూమి శిస్తు విధానాల వల్ల ఆస్తిహక్కులలో మార్పులు వచ్చాయి. భూ అమరిక విధానాలలో వచ్చిన మార్పులు గ్రామీణ ఆర్థిక జీవనాన్ని క్రుంగ దీయడమే కాక వ్యవసాయయోగ్యమైన భూములు వాణిజ్యపరమైన లాభదాయకమైనవిగా

పరిగణకొచ్చాయి. భూములకు గిరాకి పెరిగిన కారణంగా శిస్తు రేట్లు గూడ పెరిగాయి. భూములపై లాభాలు అధికమగుటచేత భూస్వాములకు, రైతులకు మధ్య అనేక మధ్య వర్గీయ దళారులు పెరిగారు. వీటి మూలంగా వ్యవసాయ రంగంలో అభివృద్ధి పద్ధతులు సన్నగిల్లాయి. ఆధునీకరణ లోపించింది. ఫలితంగా బ్రిటిష పాలనలో, వ్యవసాయం అభివృద్ధి నిరోధకంగా తయారైందని చెప్పవచ్చు.

## ఆంధ్రలో భూ అమరక విధానాలు :—

1802 లో ఉత్తర సర్కారులలో చాల భాగంలో జమీందారీ విధానం ప్రవేశపెట్టబడింది. కాని రైతులకు జమీందార్లకు మధ్య ఉన్న సంబంధాన్ని, జమీందార్ల అధికారాలను పూర్తిగా నిర్వచించని కారణంగా అనేక లోపాలు బహిర్గత మయ్యాయి. జమీందార్లు భూమికి స్వంతదారుడుగా వ్యవహరించడమే దీనికి కారణం. గంజాం, విశాఖపట్నం ప్రాంతాలు నిరంకుశులైన జమీందార్ల ప్రాంతాలు. 1805 నాటికి ఆ ప్రాంతంలో పాలకొండ, చెముడు, కురుపం బొబ్బిలి మురిసింగి, సంగమ వలస, సాలూరు, ఆంధ్ర, కాశీపురం, జైపూర్ మొదలైన ప్రాంతాల జమీందార్లు గుర్తింపు పొందారు. 1836 ప్రాంతంలో ఆ ప్రదేశాలను పర్యటించిన జాన్ రసెల్, జమీందార్లు రైతులను పీడించి అధిక పన్నులను వసూలు చేయడాన్ని తన నివేదికలో ప్రస్తావించాడు. జైపూరు, విజయనగరం జమీందార్లు మొగల్ చక్రవర్తుల మాదిరిగా జీవిస్తూ, ఏనుగులు గుఱాలను కొనడంలో నిమగ్నులై యుండేవారని ఆ నివేదికలో తెల్పాడు. కరువు కాటకాలు, ఉప్పెన, వరదలు, మొదలైన వాటి వల్ల ఆ ప్రాంతంలోని రైతులు ఎక్కువగా ఇబ్బందులు పడేవారు. చిన్న తరహా జమీందార్లు అనేకులు బకాయి పడి తమ పదవులు పోగొట్టుకున్నారు. అధికంగా పన్నులు వసూలు చేయడం వంటి ధనవంతులైన జమీందార్ల దురాగతాలు అధికమౌతు వచ్చాయి. ఆంధ్ర కోస్త ప్రాంతంలో శాశ్వత శిస్తు విధానం విఫలమైందని చెప్పవచ్చు.

1859 లో గోదావరి ప్రాంతాన్ని రెండు జిల్లాలుగా విభజించడం జరిగింది. అనుభవం ఉన్న పరిపాలకులైన మాంట్‌గోమెర్రీ, ఎడ్వర్ట్ మొదలైన వారు భూములను సర్వే చేయించి, కృష్ణ, గుంటూరు ప్రాంతాలలో రైత్వారి పద్ధతిని అనుసరించినప్పటికీ గోదావరి ప్రాంతంలోని జమీందారీ పద్ధతి వల్ల గల లోపాలుండవని సూచించారు. "వీసబడి" "ఆసర" మొదలైన పద్ధతులు ప్రవేశ పెట్టి అంతకు ముందున్న గ్రామవారి పద్ధతిని తొలగించడం జరిగింది. 'వీసబడి' పద్ధతిలో గ్రామంలోని అన్ని భూములపై ఉన్న శిస్తును ప్రతి ఏటాగాని కొన్ని ఏండ్ల వరకు గాని రైతులు అందరూ సమానంగా పంచుకొంటారు. ఇది మెట్ట భూములకు అన్వయించబడింది. 'ఆసర' పద్ధతి పల్లపు భూములకు విస్తరించబడింది. దీనిలో ప్రభుత్వ భాగం నగదు రూపంలో నిర్ణయించబడింది. ప్రభుత్వానికి శిస్తు ఎగిదానికి 'ఆసర' పద్ధతి ఎక్కువ అనువైందిగా ఉండేది.

సీడెడ్ మండలాల్లో గూడ శిస్తు వసూలు పద్ధతి అస్తవ్యస్తంగానే ఉండేది. సర్ థామస్ మన్రో ప్రవేశ పెట్టిన సర్వే 1807 నాటికి పూర్తిగానందు వల్ల 1825 వరకు మూడేండ్ల కొక

సారి శిస్తు నిర్ణయించు పద్ధతి కొనసాగింది. రైత్వారి పద్ధతి అనుసరించినా శిస్తు ఎక్కువవడం వల్ల రైతులు మైసూరు, హైదరాబాదు ప్రాంతాలకు వలస వెళ్ళేవారు. రైత్వారి పద్ధతిలో గూడ శిస్తులు అధికంగా ఉన్నాయని గమనించిన మన్రో దాదాపు 25 శాతం ఉన్న శిస్తును తగ్గించాడు. బళ్ళారి, కడప ప్రాంతాలలోని రైతులు మరీ నికృష్ట జీవితాలను గడప వలసి వచ్చింది. నల్ల రేగడి నేలలున్న ఆలూరు, రాయదుర్గం, గుత్తి మొదలైన ప్రాంతాలలోని రైతులు గూడ అధిక శిస్తులకు భయపడి భూములను వదిలి పెట్టారు. కర్నూలు ప్రాంతంలో అధిక శిస్తుల మూలంగా రైతులు వ్యవసాయ కూలీలుగా మారారు. నెల్లూరు ప్రాంతంలోని రైతుల నుండి పన్ను వసూలు పంటల దిగుబడిపై గాకుండా రైతులకు గల సంపదపై ఆధారపడి ఉండేది. వెంకటగిరి జమీందారు కలెక్టరు అనుసరించిన విధానాలపై మద్రాసు ప్రభుత్వానికి ఫిర్యాదు కూడ చేశాడు. భూములు రైతుల చేతులు మారాయి. కౌలుదార్లు మారారు. లెక్కలు సక్రమంగా ఉండేవి కావు. ఫలితంగా వ్యవసాయం కుంటుబడింది.

దేశంలో అటు జమీందారీ విధానం, ఇటు రైత్వారి విధానం రెండూ అమలు జరుపబడినా ఈ రెండింటి మూలానా రైతులకు జరిగిన సౌకర్యాలకన్నా అసౌకర్యాలే ఎక్కువ. దీనికి కారణం, రెండు విధానాలు రైతుల నుంచి అధిక శిస్తు వసూలుకు మాత్రమే పనికి వచ్చాయి. దేశ ఆక్రమణ తర్వాత బ్రిటిషు వారు తమ పరిపాలనా సుస్థిరతకు ఒకే రకమైన పాలనా స్థాపనకు భూమి శిస్తు విధానాలలో మార్పు చేశారు వారు అనుసరించిన "భూస్వామికై వెదకడం" పద్ధతి జమీందారీ విధానానికి దారి తీసింది. ఇది ప్రధానంగా ఇంగ్లండులో అనుసరించబడిన పద్ధతి. రైతుతో సరాసరి ప్రత్యక్ష సంబంధముండాలను నియమంతో ఏర్పాటైనది రైత్వారి పద్ధతి. రెండు పద్ధతులలోను లాభ, నష్టాలు లేకపోలేదు.

భారతదేశంలోని బ్రిటిషు శిస్తు పద్ధతులపై కార్లమార్క్స్ ఒక న్యూయార్క్ పత్రికలో వ్యాఖ్యానిస్తూ యీ విధంగా వ్రాశాడు. "జమీందారీ రైత్వారి, రెండూ కూడ వ్యావసాయక విప్లవాలు. ఒకటి ప్రభు వర్గానికి చెందింది; మరొకటి ప్రజాస్వామ్యానికి చెందింది. ఒకటి బ్రిటిషు భూస్వామిక పద్ధతికి నమూన ఐతే మరొకటి ఫ్రాన్సు దేశంలోని రైతు స్వామ్యానికి ప్రతిబింబం—రెండూ కూడ వ్యవసాయం చేయు రైతులకు గాని భూమిని గలిగి యున్న సొంతదారునికి సౌకర్యానికి కల్పించబడినవి కావు. అవి కేవలం శిస్తు-వసూలు చేయు ప్రభుత్వానికై సృష్టించబడినవే".

బ్రిటిషువారు అనుసరించిన భూమి శిస్తు పద్ధతుల మూలంగా భారతదేశంలో ఆస్తికి సంబంధించిన విషయాలలో అనేక మార్పులు సంభవించినాయి. కొత్త పద్ధతులు ప్రాచీన గ్రామీణ వ్యవస్థను పూర్తిగా మార్చాయి. వ్యవసాయ భూములు వ్యాపార వస్తువులుగా మారాయి. భూమి విలువలు ఎక్కువైన కారణంగా, వాటిపై పన్ను ఎక్కువైంది. భూస్వాముల లాభాలు ఎక్కువైనాయి. ఆ లాభాల మూలంగా భూస్వాములకు, రైతులకు మధ్య అనేక రకాల భూమి కౌలు దార్లు అధికమైనారు. దీనివల్ల వ్యవసాయంలో ఆధునీకరణ, శాస్త్రీయ పద్ధతులు లోపించి భారతీయ వ్యవసాయదారుని నేర్పు, పని తనానికి ప్రతిబంధకాలుగా తయారైంది.

# అధ్యాయము 5

# గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో మార్పులు

భారత జాతీయ ఆర్థిక జీవన రంగంలో గ్రామాలు ప్రాచీన కాలం నుండి స్వయం సమృద్ధంగా ఉండి అత్యంత ప్రధాన పాత్రను నిర్వహించాయి. జాతీయ జనాభాలో దాదాపు 90 శాతం ప్రజలు గ్రామాలలో నివసిస్తారు. ప్రాచీన ఆర్థిక వ్యవస్థలో గ్రామాలు జీవనాడులు. అవి సర్వసాధారణంగా వ్యవసాయ భూములచే పరివేష్టితమై, ప్రజల, పశువుల అవసరాలాకు తగు బంజరు భూములను, మేత బీడులు గలిగి దాదాపు అన్ని సౌకర్యాలతో స్వయం సమృద్ధి కలిగి ఉండేవి. ఈ గ్రామాల ఆవిర్భావం కొన్ని ప్రత్యేక పరిస్థితుల వల్ల కలిగించని చెప్పవచ్చు. అడవులు నరికి భూముల వ్యవసాయయోగ్యం చేసుకోవడానికి, అందరూ కలసి ఒక చోట ఉండవలసి రావడం బహుశా గ్రామాల ఆవిర్భానికి మూలకారణమై ఉండవచ్చు. నీటి సదుపాయాలపై గూడ గ్రామాల స్థాపన జరిగి ఉండవచ్చు. రక్షణ అవసరాల దృష్ట్యా ప్రజలు సంఘీభావంతో గ్రామాలను ఏర్పచుకొని ఉండవచ్చు. క్రూరమృగాల నుండి కాపాడుకోడానికి, శతృత్వం గలిగిన ఇతర తెగల నుండి భద్రతకు ఉమ్మడి నివాస ప్రాతిపదికపై పూర్వకాలం గ్రామాల స్థాపన జరిగించని సామాజిక శాస్త్రవేత్తల ఉద్దేశం. గ్రామీణ వ్యవస్థ రాజకీయ మార్పులకు అతీతంగా శతాబ్దాల పాటు కొనసాగడానికి ఆ వ్యవస్థలోని అనుకూలత కన్న లోపించిన కారణాలు ఎక్కువ. రాకపోకల సౌకర్యాలు లేకపోవడం, ఎదగని బాహ్యసంబంధాలు, కేంద్రీకృతం గాని పరిపాలనా వ్యవస్థ మొదలైనవన్ని కారణాలుగా భావించవచ్చు.

## ప్రాచీన గ్రామీణ వ్యవస్థ తీరు :

రాకపోకలు, రవాణా సౌకర్యాలు లోపించిన కారణంగా బాహ్య ప్రపంచంతో ఎక్కువ సంబంధాలు లేకుండా ఏకాంత వాసం కొనసాగించిన గ్రామాలకు స్వయం సమృద్ధి సాధించడం తప్పనిసరి అయింది. రోడ్లు, రైలుమార్గాలు లేక పూర్వం గ్రామాలలో నివసించే సామాన్య ప్రజానీకానికి బాహ్య ప్రపంచంతో అతికొద్ది సంబంధాలు ఉండేవి. ఐబెట్సన్ అను బ్రిటిష్ ఆర్థికవేత్త ప్రాచీన గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మార్చి ఇలా అన్నాడు. "గ్రామాలు తమకు కావలసిన ఆహారాన్ని ఉత్పత్తి చేసుకొంటాయి. అన్ని పనిముట్లను తయారు చేసుకొంటాయి. గృహాలకు కావలసిన పాత్రలన్నీ అచటనే తయారవుతాయి. పురోహితులు అక్కడ నివసిస్తారు. వైద్యుని అవసరం పెద్దగా ఉండేదికాదు. బయటి ప్రపంచంతో ఆధారపడడం ఉప్పు, సుగంధ ద్రవ్యాలు, సున్నితమైన బట్టలు, శిస్తు చెల్లించడానికి కావలసిన నగదు మొదలగునవి పొందడానికి మాత్రమే."

గ్రామాలలో తయారైన వస్తువుల విక్రయానికి తగు మార్కెట్లు మరీ తక్కువైనందు వల్ల వస్తూత్పత్తిలో శ్రామిక విభజన, వస్తు విభాగాల ప్రాధాన్యత మున్నగునవి ఉండేది కాదు. ఒకేరకమైన వస్తువులు తయారు చేయడం వల్ల కొత్త అభిరుచులకు ఆస్కారంగానీ, కొత్త అవసరాలకు అనువైన విధంగా వస్తూత్పత్తి జరిగేదిగాని లేదు.

గ్రామాలలో వస్తుమార్పిడి పద్ధతి ప్రధానంగా అమలులో ఉండేది. కొనుగోలు విషయంలోగాని, సమకూర్చిన సేవలకు ప్రతిఫలం ముట్టజెప్పటంలోగాని నగదుకు అతి తక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. ధాన్యానికి ప్రామాణిక విలువ ఉండేది. వస్తుమార్పిడి ఆయా గ్రామాలకు మాత్రమే పరిమితమైన కారణంగా ధాన్యం ప్రామాణికత వల్ల ఎవరికీ ఇబ్బంది ఉండేది కాదు. ధాన్యంతోబాటు ప్రజలలో మిక్కిలి ముఖ్యమైనది ఆర్జన భూమి. గ్రామాధికారుల సేవలకు బదులు భూమిని ఇచ్చే పద్ధతి కొనసాగేది.

వలస స్థాపనకుముందు భారతదేశ గ్రామీణ వ్యవస్థలో ముఖ్యంగా సంప్రదాయాలకు ప్రాధాన్యత ఎక్కువగా ఉండేది. ఉమ్మడి కుటుంబాల ప్రాబల్యంలో కులాలు, వర్గాల కట్టుబాట్లకు అనువుగా వ్యక్తి జీవించాల్సి ఉండేది. తన వృత్తిని, జీవన పద్ధతిని, నివాసాన్ని కడకు తన దైనందిన చర్యను నిర్ణయించడానికిగూడ స్వాతంత్ర్యం తక్కువని చెప్పాలి. ఈ విషయాలు పుట్టుకతో నిర్ణయించ బడేవి. ఆనాటి ఆర్థిక విధానం భూమిశిస్తు నిర్ణయించే విషయంలో సాంప్రదాయాలకు ప్రాధాన్యత ఉండేది. కూలిరేట్లు, వస్తువుల ధరలు మొదలైనవన్నీ సంప్రదాయ ప్రకారం నిర్ణయించబడేవి. ఆ రోజుల్లో భూమి అట్టే కష్టం లేకుండా లభ్యమయ్యేది. అందువల్ల కౌలుదార్లకు భూకామందులకు మధ్య సత్సంబంధాలుండేవి.

వ్యవసాయ రంగంలో కూలీలకు ప్రతిఫలం చెల్లించు విషయంలో అనేక రకాల ఆచారాలు అమలులో ఉండేవి. వృత్తి పనివారు సంవత్సరాని కొకసారి ధాన్యరూపంలో ప్రతిఫలం పొందేవారు. ఈ ఏర్పాటువల్ల, ద్రవ్యానికున్న కొనుగోలు శక్తిలో గలుగు మార్పుల మూలంగా ఏర్పడు అవకతవకలు లేకపోయాయి. వస్తువుల క్రమవిక్రయాలలో సంప్రదాయాలు ఎక్కువచోటుచేసుకొన్నాయి. కాని కొన్ని సందర్భాలలో పోటీ అసంప్రదాయాలను అధికమించ గలిగింది. సమృద్ధిగా ఉన్న సమయాలలో ధరలు పడిపోవడం, లేమి సందర్భాలలో అవి పరాకాష్ట సందుకోవడం పరిపాటిగా ఉండేది. గ్రామాలు వేటికవి విడిగా ఉండడం చేత బాహ్య ప్రపంచంతో సంబంధాలు లేవు. ఆధునీకరణ ప్రభావంగూడ గ్రామాలపైన ప్రసరించలేదు. క్రమబద్ధమైన, కేంద్రీకృతం చేయబడ్డ మార్కెట్లుగూడ లేని కారణం చేత దేశంలో వస్తువుల ధరలు ఒకే రకంగా ఉండేవికావు.

## గ్రామ వృత్తులు :

గ్రామాలలోని ప్రజల్లో ప్రధానంగా మూడు వర్గాలు ఉండేవి. అవి : వ్యవసాయదార్లు గ్రామాధికార్లు, వృత్తి పనివారు భూకామందులు రైతులను వ్యవసాయదారులుగా భావించ

వచ్చు. చిన్న చిన్న భూకమతాలను రైతులు తమ కుటుంబ సభ్యులందరి కృషితో సాగు చేసేవారు. కొన్ని సమయాల్లో కూలీలను కూడ వినియోగించేవారు. సర్వ సాధారణంగా భూకామందుల నుంచి లేదా వడ్డీ వ్యాపారస్తుని దగ్గర నుంచి అప్పు తెచ్చుకొని వ్యవసాయంపై పెట్టుబడి పెట్టేవారు. తనకు తానుగా రైతు అతికొద్ది మాత్రం పొదుపు చేయగలడు. రైతు స్వయంగా పంటను పండించి, మిగులు పంటను అమ్మి కావలసిన సరకులు కొనుగోలు చేసేవాడు.

గ్రామాధికారుల్లో పటేల్ మిక్కిలి ప్రధాన అధికారి. గ్రామంలోని శాంతి భద్రతలకు అతడు బాధ్యుడు. భూమిశిస్తు వసూలు చేయడం, న్యాయనిర్ణయ విషయాల వంటివికూడ అతని అధీనంలో ఉండేవి. ప్రతిఫలంగా అతనికి భూమి ఇచ్చేవారు. గ్రామ లెక్కల తయారు చేయడానికి కరణం ఉండేవాడు. అతనిని కులకర్ణి, పట్వారి అనిగూడ కొన్ని ప్రాంతాలలో పిలిచేవారు. గ్రామాలలో తలారి, తోటి, వెట్టి అని సేవకులు గూడ ఉండేవారు. గ్రామాలలో జరిగే విషయాలను గమనించి, నేరస్థులను బంధించి, రక్షణ సదుపాయాలను గల్పించడానికి ఈ గ్రామ సేవకులు ఉపయోగపడేవారు. సర్వసాధారణంగా గ్రామాలలో పంచాయితీలు అమలులో ఉండేవి. ఇవి స్థానికంగా నేరాలను విచారించి శిక్షలు విధించి గ్రామాల పని తీరుతెన్నులను క్రమబద్ధం చేసేవి.

పూర్వకాలంలో ప్రతి గ్రామంలోను అవసరమున మేరకు అన్ని రకాల పనివారుండేవారు. వారు తమ తమ వృత్తుల ద్వారా గ్రామీణ జీవనానికి సంపూర్ణతను ప్రసాదించగలిగారు. పెద్ద పెద్ద గ్రామాలలో నేత పనివారు దుకాణాదార్లు వడ్డీ వ్యాపారులుగూడ ఉండేవారు. ఈ పనివారి సేవలు మిక్కిలి అవసరమైనవిగా గుర్తించినందు వల్ల వారికి నివసించడానికి గృహాలు తక్కువ శిస్తుపై భూములను కేటాయించేవారు. వారి కృషికి ప్రతిఫలంగా ఏటా ధాన్యం గూడ ఇచ్చేవారు. దీనికి "మేర" అని పేరు.

నేత అత్యవసరమైన పని కానందువల్ల, ఆ పనివారు తయారు చేసిన వస్తువుల విక్రయం పైన మాత్రమే ఆదాయం ఉండేది. ఇనాంలు, మేరల రూపంలో రాబడి ఉండేది కాదు. నాగలిని తయారు చేయడం, చెడిపోయిన నాగలిని బాగుచేయడం వడ్రంగికి ప్రధానమైన పనులు. కాని కొన్ని సమయాల్లో గృహ నిర్మాణంలేక ఎడ్ల బండి తయారు చేయడం లేదా మరొక వడ్రంగపు పనికి అతనిని వినియోగించుకున్నప్పుడు తగు ప్రతిఫలం ధన రూపంలో పుచ్చుకొనేవాడు.

పైన తెల్పినట్లు ప్రతి గ్రామంలోను అన్ని రకాల పనివారుండడం చేత బయటి ప్రాంతాలపై అమితంగా ఆధార పడవలసిన అవసరం లేక పోయింది. అందువల్ల గ్రామాలు స్వయం సమృద్ధి ఉన్న ప్రత్యేక నివాస స్థలాలుగా కొనసాగాయి. ఆర్థికంగా అవి తమకు తాము స్వతంత్రంగా నిలబడగల స్తోమత గలిగి ఉండేవి. ఏవో కొన్ని వస్తువుల మినహా, అన్ని అవసరలాలు గ్రామాలలో లభించేవి. లభించని వాటికి గ్రామస్థులు అల్పె అబ్బులు

చాచేవారు కాదు వృత్తులు కుల ప్రాతిపదికపై కొనసాగినందువల్ల వృత్తుల పరంగా క్రమంలో తమకు పోటీలుగాని తగవులుగాని ఉత్పన్నమయ్యేవికావు.

## గ్రామీణ వ్యవస్థలో మార్పులు :

బ్రిటిషు అధికార స్థాపనానంతరం జరిగిన అనేక మార్పులలో గ్రామీణ ఆర్థిక విధానంలో మార్పులు ముఖ్యమైనవి. పరిపాలనలో జరిగిన కేంద్రీకరణ ప్రధానంగా దీనికి కారణం. భూమిశిస్తు, పోలీసు న్యాయ విచారణ మున్నగు శాఖలు కేంద్రీకృతమైనాయి. దేశ వ్యాప్తంగా ఒకే విధమైన పద్ధతి ప్రవేశపెట్టే ఉద్దేశంలో జరిగిన ఈ మార్పు వల్ల గ్రామాల అధికారాలు దెబ్బతిన్నాయి. పూర్వపురోజులు, ప్రభుత్వాలు తమ అధికార స్థాపనలోను అధికారాన్ని కొనసాగించడానికి అవలంభించిన పద్ధతులలోను తమ సమయాన్ని ఎక్కువగా వెచ్చించడం వల్ల గ్రామాల వ్యవహారాలలో అట్టే జోక్యం చేసుకోలేదు. అంతేగాక సరియైన రవాణా సౌకర్యాలు లోపించిన కారణంగా గ్రామాలకు ప్రభుత్వ యంత్రాంగంతో సరాసరి సంబంధాలు కూడ దుర్లభమయ్యేది. కాని బ్రిటిషు ఆక్రమణ తర్వాత శక్తివంతమైన కేంద్రీకృత ప్రభుత్వ స్థాపనతో రవాణా సౌకర్యాలు మెరుగుపడి గ్రామాల స్వాతంత్ర్యం క్షీణించింది

గ్రామీణ వ్యవస్థలో మార్పురావడానికి మరొక కారణం పాశ్చాత్య ప్రభావంతో పెంపొందిన వ్యక్తి తత్వమని చెప్పవచ్చు. గ్రామాలలోని ప్రతి వ్యక్తి కులాలపై ఆచార వ్యవహారాలపై ఆధారపడియుండేది కాని బ్రిటిషు అధికార స్థాపనతో కులాలతో సంబంధం లేక వ్యక్తిగత చొరవ, తెలివితేటలతో స్వంత అభిరుచులకు అనుగుణంగా వృత్తులను చేపట్టి ప్రాచీన కట్టుబాట్లను తొలగించగలిగారు. మరీ చొరవ గలవారు గ్రామాల నుండి నగరాలకు ఇతర పారిశ్రామిక వాడలకు వెళ్లగలిగారు. మెరుగైన ఉద్యోగ అవకాశాలు కూడ నివాసాల మార్పిడికి దోహదం చేసింది. గ్రామాలలో ఉంటూ తమ వృత్తులకు ప్రతిఫలంగా ఏటా ఆర్జించే భృతికి బదులు, చేసిన పనికి అప్పటికప్పుడే దిన, వార, నెల పద్ధతిలో ప్రతిఫలం పొందే విధానం అమలులోనికి వచ్చింది. వ్యక్తి ప్రాధాన్య వాదం అభివృద్ధి గావడంతో ఉమ్మడి కుటుంబాలు అదృశ్యమైనాయి. వ్యవసాయ భూములు ఇతర చరాస్థుల వలెనే విభజనకులోనైంది. ఆచార వ్యవహారాలకు బదులుగా పోటీ అన్ని రంగాలలోను అమిత ప్రాధాన్యత సంతరించుకొనింది.

పారిశ్రామిక వాణిజ్య రంగాలలో జరిగిన విప్లవాత్మక మార్పులతో బాటు రవాణా సౌకర్యాలలో ఏర్పడిన గొప్ప అభివృద్ధి కూడ భారతదేశంలోని ప్రాచీన గ్రామీణ వ్యవస్థలో మార్పు తెచ్చింది. విదేశీ వస్తువుల పోటీ ధాటికి దేశీయ వస్తువులు నిలబడలేక పోయాయి. యంత్రాగారాలలో పెద్ద మొత్తాలలో తయారైన వస్తువుల ధరలు తక్కువైనందువల్ల స్థానికంగా తయారైన వస్తువులకు ప్రోత్సాహం సన్నగిల్లింది. భారతీయ పరిశ్రమలు

గడ్డు పరిస్థితుల నెదుర్కొవాల్సి వచ్చింది. సామాన్యంగా గ్రామీణ జనులు వాడుకొను పాత్రలు, పనిముట్లు, ఇనుము ఇత్తడి, రాగి మొదలగు లోహములతో పట్టణాలలో తయారై గ్రామీణ ప్రజల కందుబాటులోకి వచ్చాయి. అందువల్ల సనాతన చేతివృత్తులు నశించ నారంభించాయి. చేతిపనివారు వేలకువేలు ఉద్యోగావకాశాలు కోల్పోయారు. భృతికై వ్యవసాయ రంగంపై ఒత్తిడి ఎక్కువైంది. ఇట్టి సమయంలో వ్యవసాయం వాణిజ్యాకరణకు లోనైనందుచే మరింత మార్పులకు దోహదకారియైంది. గ్రామీణ ఆర్థిక విధానంలో జరిగిన మార్పులకు వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులు ప్రధాన కారణ మనవచ్చు.

ప్రాచీన కాలంలోని గ్రామీణ స్వయం సమృద్ధి అదృశ్యమైంది. ఇతర ప్రాంతాల నుంచి గ్రామాలకు నూనెలు, అల్యూమినియం పాత్రలు, పంచదార, తేయాకు, కాఫీ, అగ్గిపెట్టెలు, మందులు, విలాస వస్తువులు మొదలైన అనేక వస్తువులు దిగుమతి అయ్యాయి. వీటిని కొనడానికై గ్రామ ప్రాంతాలలో తయారైన అనేక వస్తువులు బయటి మార్కెట్లకు విక్రయానికై తరలించబడ్డాయి. ముడి వస్తువులు ఆహార ధాన్యాలు కూడ ఆ విధంగా మార్కెట్లకు సరఫరా అయ్యాయి.

రాకపోకలు, రవాణా సౌకర్యాలతో ఏర్పడిన మార్పుల మూలంగా గ్రామాలు స్వయం సిద్ధమైన ఏకాంత వాసాన్ని వదలి బయటి ప్రపంచంతో సంబంధాలు పెంచు కొన్నాయి. కాని ఈ మార్పుల మూలంగా కరువు కాటకాల ప్రభావంలో మార్పులు జరిగాయి. స్థానికంగా పంటలు విఫలమై కరువు సంభవించిన సమయంలో బయట నుంచి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొనే పద్ధతి వల్ల ధనం మాత్రమే గాకుండా ఆహార ధాన్యాల కొరతగూడ ఉధృతమైంది. కరువు వల్ల సర్వసాధారణంగా ధరల పెరుగుదల తాత్కాలిక నిరుద్యోగత ఏర్పడతాయి. అధికోత్పత్తులుగూడ అదే విధంగా ధరలు పడిపోవ డానికి కారణమౌతాయి. కాని మార్కెట్లను సమర్థవంతంగా నిర్వహించడం ద్వారా ఆ పరి స్థితిని నివారించవచ్చు. దూర ప్రాంతాల నుంచి ఆహార ధాన్యాల దిగుమతుల వల్ల గ్రామా లలో ధాన్యాన్ని నిల్వ చేసే పద్ధతి బాగా తగ్గిపోయింది. ఆహార ధాన్యాల ధరల పెరుగు దల వాటి ఎగుమతులలో పెంపుదల, ఉద్యోగవకాశాలు గ్రామీణ ప్రజల కందుబాటులో గల ద్రవ్య చలామణీ మొదలైన వాటివల్ల గ్రామాలలో ద్రవ్యం విరివిగా వాడుకలోనికి వచ్చింది. అందువల్ల అంతకు ముందున్న వస్తుమార్పిడికి బదులు ద్రవ్య మార్పిడి ఎక్కు వైంది. భూమిశిస్తు, ఇతర పన్నులు, అప్పులపై వడ్డీ, కూలి చెల్లింపుకు, అన్నిటికీ ద్రవ్యాన్నే ఉపయోగించే పరిస్థితి ఏర్పడింది. అన్ని సేవలకు ధాన్యం ఇచ్చే పద్ధతి పూర్తిగా వదలి వేయడమైంది.

గ్రామీణ ఆర్జనతోబాటు పట్టణ ప్రాంతాలలో తాత్కాలికంగా ఆర్జించు అధిక మొత్తాలు రైలురోడ్ల సౌకర్యాలు విస్తృతమైనందున గ్రామీణ ప్రజలలో చైతన్యం గలిగింది.

వృత్తులపై ముందున్న స్థిరత్వం తగ్గి కుల వర్గ కట్టుబాట్ల ప్రభావం క్రమేణ సడలింది. పూర్వకాలంలో సాంప్రదాయక పద్ధతిలో వసూలు చేసిన పన్నులకు బదులు మిక్కిలి కట్టు దిట్టంగా ధన రూపంలో శిస్తు వసూలు జరిగింది. గ్రామీణ వృత్తులవారు అధిక సంపాదనకై ఇతర ప్రాంతాలకు తరలి వెళ్లడానికి సిద్ధమయ్యారు. గ్రామీణ వృత్తులు దెబ్బతిన్న కారణంగా వడ్రంగి, కమ్మరి మున్నగువారు పట్టణాలకు నివాసాలు మార్చి తమ ఆదాయాల నభివృద్ధి చేసుకొన ప్రయత్నించారు. కాని అనేకులు తమ వంశ పారంపర్య వృత్తులను వదలి వ్యవసాయ కూలీలైరి మరి కొందరు గ్రామాల కంటిపెట్టుకొని మారిన పరిస్థితుల కనువుగా తమ వృత్తులను మార్చుకొన్నారు. ఉదాహరణకు నేత పనివారు చేతితో వడకిన నూలుకు బదులు తక్కువ ధరలకు లభించే మిల్లునూలు నుపయోగించ సాగారు. అదే విధంగా కంసాలి విదేశాల నుంచి దిగుమతియైన ఇనుము నుపయోగించి పనిముట్లను తయారు చేయసాగారు. బట్టల అద్దకం వంటి వృత్తులలో కృత్రిమ రంగుల వాడకం శాస్త్రీయ పద్ధతులను వెనుకకు నెట్టింది వడ్రంగికి క్రొత్త పనిముట్లు లభించాయి. కుట్టు మిషన్లు వంటివి విరివిగా ఉపయోగానికి వచ్చాయి.

గ్రామీణ పరిశ్రమలు దాదాపు అన్ని రంగాలలోను దిగజారిపోయాయని చెప్పవచ్చు కొద్ది మంది క్రొత్త పరిశ్రమలలో చేరగలిగినా అనేక వేలమంది జీవనభృతి కోల్పోయారు. అనేకులు వ్యవసాయంపై దృష్టి నిలిపి నమ్మకంలేని ఋతుపవనాలపై ఆధారపడి చిన్నకారు రైతులుగానో లేక భూమి కోల్పోయిన కూలి జనులుగానో మారారు. 1871 జనాభా లెక్కల ప్రకారం 68.5 శాతం ప్రజలు ప్రత్యక్షంగా వ్యవసాయంపై ఆధారపడ్డారు. ఈ శాతం తర్వాతి సంవత్సరాలలో అధికమవుతూ వచ్చింది.

దేశం మొత్తం మీద బొంబాయి రాష్ట్రంలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ మిగిలిన ప్రాంతాలకన్నా కొంత మెరుగుగా ఉండేది. బెంగాలు రాష్ట్రంలో జమీందారీల బారినుంచి రైతులను రక్షించడానికి ప్రభుత్వం ఎక్కువ చర్యలు తీసుకోలేదు. అందువల్ల వారు దుర్భర పరిస్థితి కెదుర్కొనవలసి వచ్చింది. మద్రాసు రాష్ట్రంలో ముఖ్యంగా రైత్వారి పద్ధతి అమలులోగల రాయలసీమ ప్రాంతంలో మొదట భూమిశిస్తు అధికంగా ఉండినందువల్ల రైతు లనేక కష్టాల నెదుర్కొన్నారు సామాన్య ప్రజలు అధిక సంఖ్యలో ఇతర ప్రాంతాలకు వలస వెళ్లవలసిన పరిస్థితి ఎదురైంది. బ్రిటిషువారు అనుసరించిన భూమిశిస్తు విధానాల గూడ గ్రామీణ ఆర్థిక వ్యవస్థపై గొప్ప ప్రభావాన్ని చూపాయి.

పూర్వకాలంలో వ్యవసాయాత్మక ఆర్థిక విధానం ఉన్నప్పుడు పట్టణాల ప్రాముఖ్యం మరీ తక్కువగా ఉండేది పట్టణాలలో నివసించిన వారి సంఖ్య దాదాపు 10 శాతం మాత్రమే ఉండేది. అప్పటి పట్టణాలు బహుశా పెద్ద గ్రామాలు మాత్రమేనని చెప్పవచ్చు. అనేక నగరాలు కేవలం మత ప్రాముఖ్యతపై ఆధారపడి ఉండేవి. అవి ప్రధానంగా తీర్థ యాత్రా స్థలాలు. కాశి, ప్రయాగ పూరి, గయ మొదలగు స్థలాలు అందుకు ఉదాహరణగా

చెప్పుకోవచ్చు మతాల పలుకుబడి ఉన్నంత వరకు యాత్రా స్థలాలు గొప్ప కేంద్రాలుగా కూడలి స్థలాలుగా కొనసాగాయి ఆ మతాల ప్రభావం తగ్గగానే ఆ కేంద్రాలు ప్రాముఖ్యత గూడ తగ్గేది. ఉదాహరణకు బుద్ధగయ బౌద్ధ మతం క్షీణించి నందువల్ల తన ప్రభావాన్ని కోల్పోయింది. ఆ క్షేత్రాలలో పూజా ద్రవ్యాలు, పాత్రలు మొదలైన వస్తువుల ఉత్పత్తి ప్రాధాన్యత ఇయ్యబడింది. కాశీ పట్టణం ఇత్తడి రాగి పాత్రల తయారీకి పేరుపొందింది.

రాజకీయంగా రాజుల ఆస్థానాలుండడం వల్ల కొన్ని నగరాలు రాజధానులుగా పేరు పొందాయి. ఢిల్లీ, లక్నో పూనా, లాహోరు తంజావూరు, గోల్కొండ, ఆర్కాటు మొదలగునవి ఆకోవకు చెందాయి. ఆ పట్టణాలలో విలాసవస్తువులు ఖరీదైన బట్టలు, నాణ్యమైన నగలు అనేక ఇతర వస్త్రైవులు తయారయ్యేవి. ఆ కేంద్రాలు కేవలం రాజులపై వారి ఆస్థానంలోని ప్రభువుల ప్రోత్సాహాలపై ఆధారపడి ఉండేవి. మరికొన్ని నగరాలు వ్యాపార, కేంద్రాలుగా కూడ వెలిశాయి. దేశీయ వ్యాపారం, వ్యాపార మార్గాల కూడలి ఆ కేంద్రాల ఆవిర్భానికి దోహదం చేశాయి. వ్యాపారంలోని ఒడుదుడుకులకు అనుగుణంగా ఈ కేంద్రాలు కొనసాగాయి

నగర పరిశ్రమలు కేవలం ఖరీదైన విలాసకర వస్తువుల తయారీకి మాత్రమే పరిమితమై ఉండేవి. వాటి గొప్పతనం పూర్తిగా స్థానిక ప్రభు వర్గీయుల ప్రోత్సాహంపై ఆధారపడి ఉండేది. ఆ వస్తువులు ఏ కొద్ది మందికి మాత్రమో అందుబాటులో ఉండగా సామాన్య జనులు గ్రామీణ ఉత్పత్తులపై ఆధారపడే వారు. ఆస్థానాలు పడిపోవడం, ఆ నగర పరిశ్రమలు అడుగంటిపోవడానికి కారణమైంది. ఆంగ్లేయుల అధికార స్థాపన తర్వాత స్వతంత్ర రాజ్యాల ఆక్రమణ సమయంలో ఈ పద్ధతి ఏర్పడింది. అందువల్ల అనేక నగరాలు తమ ప్రాముఖ్యతను కోల్పోయాయి.

బ్రిటిషు పాలనా కాలంలో దేశీయ ఆర్థిక విధానం మార్పులకు గురైంది. ప్రధానంగా గ్రామీణ ఆర్థిక జీవన విధానాలు ఎక్కువగా అట్టి మార్పులకు లోనయింది గ్రామాలలోని స్వయం సమృద్ధి అదృశ్యమైంది భారత దేశంలోని గ్రామాలు బాహ్య మార్కెట్టులతో సంబంధాలు ఏర్పరచుకొన్నాయి. ద్రవ్యానికి ప్రాధాన్యత ఎక్కువైంది. శిస్తు వసూలులోను వృత్తులలోను ఆచార వ్యవహారాలలో గల ప్రాధాన్యత తగ్గింది. సాంఘిక ఆచారాలలో కట్టుబాట్లలో కూడ ఈ ఆర్థిక ప్రభావం కొట్టవచ్చినట్లు ప్రతిబింబించిందని చెప్పవచ్చు.



# అధ్యాయం – 6

# బ్రిటిషు సామ్రాజ్య విస్తరణ

వ్యాపారం కొనసాగడానికై భారత దేశానికి వచ్చిన బ్రిటిషువారు లాభాలను అధికం చేసుకొనే ఉద్దేశంతో ఇతర యూరోపియనులైన ఫ్రెంచి, డచ్ వారితో పోటీపడి వ్యాపారాభివృద్ధితోబాటు రాజకీయాధికారం గూడ పొందారు. దక్షిణ భారతంలో కర్ణాటక యుద్ధాల తర్వాత బ్రిటిషువారు తమ సామ్రాజ్య స్థాపనకు పునాదులు వేశారు. బెంగాలులో ప్లాసి, బక్సారు యుద్ధాలవల్ల కూడ వారి అధికారం సుస్థిరమైంది. బెంగాలు ఆ రోజుల్లో మిక్కిలి సంపన్నమైన ప్రాంతమగుటవల్ల అచ్చటి అధిక ఆదాయం పెద్ద పెద్ద సైన్యాల తయారీకి పనికివచ్చింది. మద్రాసు రాష్ట్రంలో అవసరమైనప్పుడల్లా బ్రిటిషు సైన్యాలు బెంగాలు నుంచి తరలించబడేవి. బెంగాలు ఆక్రమణ పిదప బ్రిటిషువారు స్థానిక రాజులతో ఘోర యుద్ధాలకు తలపడి తమ సామ్రాజ్యాన్ని విస్తరింపజేయడానికి, సుస్థిరమొనరించడానికి కృషి చేయసాగారు.

1772లో తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వం వారన్ హేస్టింగ్‌ను బెంగాలు గవర్నరుగా నియమించి పరిపాలన పునర్వ్యవస్థీకరించమని ఆదేశించింది. రెగ్యులేటింగ్ చట్టం ప్రవేశపెట్టిన తర్వాత వారన్ హేస్టింగ్ భారతదేశం మొదటి గవర్నరు జనరల్‌గా నియమితుడై మరింత అధికారాన్ని చలాయించాడు. కానీ 1772–74 మధ్య కాలంలో బెంగాలు గవర్నరుగా అతడనేక సంస్కరణలను ప్రవేశపెట్ట గలిగాడు వారన్ హేస్టింగ్స్ నియామకం హిందూదేశంలోని కంపెనీ పాలనలో ఒక నూతన అధ్యాయానికి దోహదకారిగా పరిణమించింది. బ్రిటిషు సామ్రాజ్య విస్తరణకు అతడు పునాది వేసినవాడు. అతని తర్వాత అధికారానికి వచ్చిన కారన్ వాలీసు, లార్డ్ హేస్టింగ్స్, వెల్లస్లీ డల్హౌసీ మున్నగు వారు కొనసాగించి 1857 నాటికి భారతదేశంలో బ్రిటిషు అధికారాన్ని బహుళంగా విస్తరింపజేశారు.

## వారన్ హేస్టింగ్స్ ఆక్రమణలు :

బెంగాలు గవర్నరుగా వారన్ హేస్టింగ్స్ బ్రిటిషు పలుకుబడిని పెంపొందించే దృష్టితో తనకు పూర్వం గవర్నరుగా పనిచేసిన రాబర్ట్ క్లైవు అనుసరించిన విధానాన్ని విడనాడి అల్లాబాదు సంధి షరతులను పూర్తిగా మార్పు చేశాడు. పూర్వం కార, అల్లాబాదు మండలాలు మొగల్ చక్రవర్తికి చెందినాయి. కాని దాని తర్వాత మహరాష్ట్రులు 1771 ప్రాంతంలో ఢిల్లీని ఆక్రమించుకొనడం మొగల్ చక్రవర్తిని ఢిల్లీకి రప్పించి తమ ప్రభావానికి లోనుచేయడం వల్ల కార, అల్లాబాదులను అయోధ్య నవాబుకే ఇప్పించాడు.

షాఆలంకు క్షైత్ర 20 లక్షల రూపాయలు ఏటా ఇచ్చేటట్లు అంగీకరించాడు. దాన్నిగూడ వారన్ హేస్టింగ్స్ అపుచేశాడు. వారన్ హేస్టింగ్స్ అయోధ్య నవాబుకు మద్దతు ఇచ్చాడు. 1773లో అతనితో సంధిచేసుకొని మహారాష్ట్రుల దాడి నుండి రోహిల్ ఖండ్‌కు రక్షణ ఇయ్యడానికి అంగీకరించాడు.

అయోధ్యకు వాయవ్య సరిహద్దులో స్థిరపడిన రోహిల్లా ఆఫ్ఘనులను వారన్ హేస్టింగ్స్ విధానాలు హింసించాయి. రోహిల్‌ఖండ్ ప్రజలు మహారాష్ట్రుల దాడులకు తరచు గురి అవుతుండేవారు. రోహిల్లా ఆఫ్ఘనులు హిమాలయ పర్వత శ్రేణులకు చేరువగా మంచి సారవంతమైన ప్రాంతాలలో స్థిరపడి మిక్కిలి ఐక్యత ఉన్న ప్రజలు. వారి కీలకమైన ఉనికిని గురించి ప్రస్తావిస్తూ వారన్ హేస్టింగ్స్ "రోహిల్‌ఖండ్‌కు అయోధ్యకు ఉన్న రాజకీయ భౌగోళిక సంబంధాలు ఎలిజబెత్ రాణికి ముందు కాలంలో సరిగ్గా స్కాట్‌లాండ్‌కు ఇంగ్లండుకు ఉన్న సంబంధాలు వంటివి అని చెప్పాడు." అయోధ్య నవాబును తన చెప్పు చేతలలో ఉంచుకోడానికి బ్రిటిషువారు చేసిన ప్రయత్నాలకు నిదర్శనం వారన్ హేస్టింగ్స్ చేసిన రోహిల్లా యుద్ధం.

1772లో రోహిల్లా నాయకుడైన హాఫీజ్ రహమత్‌ఖాన్ అయోధ్య నవాబుతో ఒక ఒప్పందం కుదుర్చుకొన్నాడు. దాని ప్రకారం మహారాష్ట్రులకు వ్యతిరేకంగా తమకు సహాయం చేసినందుకు ప్రతిఫలంగా అయోధ్య నవాబుకు 40 లక్షలు ఇయ్యడానికి హాఫీజ్ అంగీకరించాడు. 1773లో మహారాష్ట్రులు తమకు తాముగా రోహిల్‌ఖండ్ నుంచి నిష్క్రమించారు. పీష్వా మాధవరావు మరణానంతరం దక్కనులో ఏర్పడిన పరిస్థితుల దృష్ట్యా మహారాష్ట్రులు ఉత్తర దేశంలో దాడులు కొనసాగింపదలచలేదు. అందుచేత షూజా ఉద్దౌలా తన సేనలను రోహిల్లాలకు సహాయంగా పంపవలసిన అవసరం లేకపోయింది. కాని వాగ్దానం చేసినట్లు 40 లక్షల రూపాయలు రోహిల్లాలు చెల్లించాలని పట్టుబట్టాడు. రోహిల్లాలు నిరాకరించిన కారణంగా షుజా వారన్ హేస్టింగ్స్‌తో సంధి కుదుర్చుకొని రోహిల్‌ఖండ్‌పై దండయాత్ర జరిపాడు. కల్నల్ ఛాంపియన్ అనే ఆంగ్ల అధికారి నాయకత్వంలో అయోధ్య సేనలు రోహిల్‌ఖండ్ ప్రవేశించి హాఫీజ్ రహమత్‌ను ఓడించి చంపివేశాయి అమాయకులైన వేలాది రోహిల్లాలను చంపాడు. రోహిల్‌ఖండ్‌ను అయోధ్య ఆక్రమించింది.

మహారాష్ట్రులదాడి నుండి అయోధ్యను రక్షించడానికి శాంతి కాముకులైన రోహిల్లాలను తుడిచిపెట్టడానికి వెనకాడలేదు. వారన్ హేస్టింగ్స్. బ్రిటిషు పార్లమెంటులో వారన్ హేస్టింగ్స్‌పై అభిశంస తీర్మానాన్ని ప్రవేశపెట్టిన సమయంలో ఎడ్మండ్‌బర్క్ వారన్ హేస్టింగ్స్ అనుసరించిన విధానాలను విమర్శిస్తూ అతడు రోహిల్‌ఖండ్‌పై సైన్యాలను పంపడాన్ని దుశ్చర్యగా వర్ణించాడు. "స్వతంత్ర ప్రతిపత్తి ఉన్న ప్రజల జీవితాలను వారి స్వాతంత్ర్యాన్ని వారన్ హేస్టింగ్స్ అయోధ్య నవాబుకు తాకట్టుపెట్టాడు" అన్నాడు.

మెకాలెకూడ తన రచనల్లో వారన్ హేస్టింగ్స్ దుశ్చర్యను నిశితంగా విమర్శించాడు. రోహిల్‌ఖండ్‌లో అనేక గ్రామాలను దగ్ధం చేశారని, చిన్న పిల్లలను చంపారని, అక్కడి స్త్రీలను అవమాన పరచారని అందుచేత ఆ చర్యల బాధ్యత వారన్ హేస్టింగ్స్‌దేనని అతడు అభిప్రాయపడ్డాడు. సైనిక పరంగా కీలకమైనదిగా మాత్రమే భావించిన వారన్ హేస్టింగ్స్ రోహిల్‌ఖండ్‌ను సర్వనాశనం చేయడంలో ఉన్న నైతిక విలువలను విడనాడదన వచ్చు.

వారన్ హేస్టింగ్స్ మహారాష్ట్రులపై కూడ తన దృష్టిని మళ్లించాడు. 1761లో జరిగిన మూడవ పానిపట్టు యుద్ధం మహారాష్ట్రుల అధికారాన్ని పూర్తిగా కుంగదీసింది. 1772లో పీష్వా మాధవరావు మరణం తరవాత అతని కుమారుడు నారాయణరావు పీష్వాగా ప్రకటించుకొన్నాడు. కాని రఘోబా ప్రోత్సాహంతో కొత్త పీష్వాను తొమ్మిది మాసాల తరవాత 1773లో చంపారు. నానా ఫడ్నావీస్ రఘోబాను ఆట పట్టించడానికి ముందు కొచ్చాడు. వెంటనే రఘోబా బ్రిటిషువారి సహాయాన్ని కోరాడు. 1775లో కుదిరిన సూరత్ సంధి ప్రకారం రఘోబా బ్రిటిషువారి సహాయానికి ప్రతిఫలంగా సాల్సెట్, బేసిన్, ప్రాంతాలను ఇయ్యడానికి అంగీకరించాడు. ఈ సంధి బొంబాయి ప్రభుత్వంతో కుదిరిన కారణంగా గవర్నరు జనరల్‌కు తెలియజేయలేదు. అందుచే గవర్నర్ జనరల్, కలకత్తాలోని కౌన్సిల్ ఈ సంధిని త్రోసి పుచ్చింది. మరు సంవత్సరం పురంధర సంధి కుదిరింది. కాని కంపెనీ డైరెక్టర్లు సూరత్ సంధిని గుర్తించి బ్రిటిషువారు ఆక్రమించుకొన్న ప్రాంతాలను తిరిగి అప్పజెప్పమని ఆదేశించారు. మరాఠా నాయకులందరు పీష్వాకు మద్దతును ప్రకటించారు. వారన్ హేస్టింగ్స్ బెంగాలు నుంచి బ్రిటిష్ సేనలను కల్నల్ గోడ్డార్డ్ నాయకత్వంలో సూరత్‌కు పంపాడు. అతడు అహమ్మదాబాద్‌ను ఆక్రమించుకొని బరోడా గాయక్వాడ్‌తో సంధి కుదుర్చుకొన్నాడు. కాని పూనావైపు వెళ్లిన బ్రిటిష్ సేనలు తిప్పికొట్టబడ్డాయి. 1779లో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పెద్ద ఐక్య కూటమి ఏర్పడింది. అందులో హైదరాబాదు నిజాం, మైసూరు ప్రభువు హైదరాలిగూడ మహారాష్ట్రులతో చేతులు కలిపారు. కాని వారన్ హేస్టింగ్స్ గ్వాలియర్ రాజుతోను, నాగపూర్ రాజుతోను సంధి చేసుకొన్నాడు.

1782లో కుదిరిన సాల్బాయ్‌తో మొదటి మరాఠా యుద్ధం ముగిసింది. ఈ సంధి షరతుల ప్రకారం సాల్సెట్ బ్రిటిష్‌వారి అధీనంలోనే ఉండాలి. బ్రిటిషువారికి 12 లక్షల రూపాయలు చెల్లించాలి. రఘునాథరావుకు సాలీనా 30 లక్షల రూపాయలు భృతి చెల్లించాలి. అతడు రాజకీయాల్లో జోక్యం కలిగించుకొనరాదు. బ్రిటిషువారు గుజరాత్‌లో ఆక్రమించుకొన్న ప్రాంతాలను తమ అధీనంలో ఉంచుకొని గ్వాలియర్ విషయంలో జోక్యం చేసుకోమని వాగ్దానం చేసారు.

సాల్బాయ్ సంధికి చారిత్రకంగా మిక్కిలి ప్రాధాన్యత ఉంది. ఈ సంధి మూలంగా బ్రిటిష్‌వారు తమ అధికారాన్ని, పలుకుబడిని అభివృద్ధి చేసుకోగలిగారు. శక్తిమంతులైన మహారాష్ట్రులతో దాదాపు ఇరవై సంవత్సరాలు బ్రిటిష్ వారికి శాంతి ఏర్పడింది. ఈ సంధి మూలంగా హైదరాలి వంటి శత్రువుల నెదుర్కొనడానికి బ్రిటిష్‌వారికి మహారాష్ట్రుల సహాయం లభించింది.

1766 బ్రిటిష్ కంపెనీ ప్రభుత్వం హైదరాబాదు నిజాంతో ఒక ఒప్పందం కుదుర్చుకొన్నది. దాని ప్రకారం బ్రిటిష్‌వారు హైదరాలికి వ్యతిరేకంగా నిజాంకు సహాయం చేయాలి. ప్రతిగా నిజాం బ్రిటిష్ వారికి తన అధీనంలోని ఉత్తర సర్కారులను ఇయ్యాలి. నిజాంతో బ్రిటిష్ వారికి కుదిరిన ఈ ఒప్పందం హైదరాలికి ఆగ్రహం తెప్పించింది. 1767లో బ్రిటిష్‌వారు హైదరాలిపై యుద్ధాన్ని ప్రకటించారు. 1769 వరకు కొనసాగిన మొదటి మైసూరు యుద్ధంలో హైదరాలి, అతని కుమారుడు టిప్పు బ్రిటిష్ వారిపై అనేక విజయాలు సాధించారు. మద్రాసుకు చేరువగా వెళ్లిన హైదరాలి తన షరతులను నిర్దేశించి బ్రిటిష్‌వారితో సంధి చేసుకోగలిగాడు. కాని 1771లో మహారాష్ట్రులు హైదరాలిని ఎదిరించినపుడు, ముందు కుదిరిన ఒప్పందం ప్రకారం బ్రిటిష్‌వారు మైసూరు ప్రభువుకు సహాయాన్ని అందజేయలేదు. అందువల్ల హైదరాలికి బ్రిటిష్ వారిపట్ల ఆగ్రహం కలిగింది.

తనకు సహాయాన్ని నిరాకరించిన బ్రిటిష్ వారిపై దెబ్బతియ్యడానికి హైదరాలి వేచి ఉన్నాడు. అతడు అనేక ఫ్రెంచి జాతీయులను తన సైన్యంలో నియమించాడు. ఫ్రెంచివారి సహాయంతో తన సైన్యాన్ని పటిష్ఠం చేసి ఫ్రాన్సు దేశం నుంచి ఆయుధ సామాగ్రిని తెప్పించాడు. తన రాజ్యంలోని దుర్గాలన్నిటిని సైనికంగా బలపరచాడు. 1780లో బ్రిటిష్ వారిపై హైదరాలి యుద్ధం ప్రకటించాడు. ఈ రెండవ మైసూరు యుద్ధ ప్రారంభంలో హైదర్ బ్రిటిష్ వారిపై కొన్ని విజయాలు సాధించి కర్నాటక తీరాన్ని ఆక్రమించుకొన్నాడు 1781లో సర్ ఐర్‌కూట్ అనే బ్రిటిష్ సేనాని మైసూరు నవాబు సైన్యాలను పోర్టునోవో దగ్గర ఓడించాడు షోలింగర్, నాగపట్నం, ట్రింకోమలి మొదలగు ప్రాంతాలనుకూడ బ్రిటిష్‌వారు ఆక్రమించారు. కాని హైదరాలి తన పోరాటాన్ని కొనసాగించాడు. 1782 డిసెంబరు 7వ తేది హైదర్ చిత్తూరుకు సమీపంలో ఎనిమిది మైళ్ల దూరంలో గల నరసింగరాయునిపేట దగ్గర గల తన సైనిక శిబిరాలను పర్యవేక్షణ చేయడానికి వెళ్లినపుడు పుట్టకురుపు వ్యాధిలో హఠాత్తుగా మరణించాడు. అతని కుమారుడైన టిప్పు యుద్ధాన్ని కొనసాగించాడు. 1784 మే నెల 11వ తేది రెండవ మైసూరు యుద్ధం మంగుళూరు సంధితో ముగిసింది. ఇరు పక్షాలు యుద్ధ సమయంలో ఆక్రమించుకొన్న ప్రాంతాలను తిరిగి అప్పజెప్పడానికి అంగీకరించాయి.

18వ శతాబ్దంలో ఏర్పడిన రాజకీయ అనిశ్చిత పరిస్థితులలో అధికారానికి వచ్చిన కొద్ది మంది భారతీయ నాయకులలో హైదరాలి ఒకడు. బెంగాలులో ఆలివర్దిఖాన్,

అయోధ్యలో సాదత్ ఆలి హైదరాబాదులో నిజాం ఉల్‌ముల్క్ వలె హైదరాలి కూడ పరిస్థితులను అనువుగా మలచుకొని అధికారానికి వచ్చాడు. నిరక్ష్యరాసుడైన హైదర్ గొప్ప ధైర్య సాహసాలకు, చురుకైన తెలివితేటలకు రాజకీయ పరిజ్ఞానానికి, దౌత్యనీతికి పేరుపొందినవాడు. అన్ని యుద్ధ విద్యలలో నైపుణ్యం గలవాడు. పరిపాలనా దక్షుడుగా నిరూపించుకొన్నాడు పూర్ణయ్య అనే తన మంత్రి సహాయంతో చక్కని పాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేశాడు. బ్రిటిషు వారిని భారతదేశాన్నుంచి తొలగించడానికి హైదర్ చేసిన ప్రయత్నాలు అతని కుమారుడు టిప్పు కూడ కొనసాగించాడు.

మంగళూరు సంధి బ్రిటిషు వారికి మైసూరు నవాబుకు మధ్య శాశ్వత శాంతిని ప్రసాదించలేకపోయింది. బ్రిటిషు వారు టిప్పును ప్రబల శత్రువుగా భావించారు. టిప్పు బ్రిటిషువారు తన స్వాతంత్రానికి అవరోధకులుగా తలచాడు. గవర్నర్ జనరల్ ఐన కారన్ వాలీసు నిజాంతోను మహారాష్ట్రులతోను, సంధిచేసుకొని టిప్పును ఓడించవలెనని నిశ్చయించి 1790లో మైసూరుపై యుద్ధం ప్రకటించాడు. గవర్నర్ జనరల్ మద్రాసు చేరుకొని స్వయంగా బ్రిటిషు సైన్యాలను నెల్లూరు, చిత్తూరు, కోలారుమీదుగా నడిపి బెంగుళూరును ముట్టడించాడు. ఈ మూడవ మైసూరు యుద్ధంలో అనేక దుర్గాలను ఆక్రమించుకొని బ్రిటిషువారు మైసూరు ముఖ్య పట్టణమైన శ్రీరంగ పటణాన్ని సమీపించారు. వేరే మార్గంలేని టిప్పు 1792లో సంధికి ఒప్పుకున్నాడు. కారన్ వాలీసుతో కుదుర్చుకొన్న ఈ సంధికి శ్రీరంగపట్నం సంధి అని పేరు. ఈ సంధి షరతుల ప్రకారం టిప్పు తన రాజ్యంలో సగభాగం ఇయ్యడానికి 3½ కోట్ల రూపాయలు నష్ట పరిహారం చెల్లించడానికి ఆమొత్తాలు పూర్తిగా చెల్లించే వరకు తన కుమారులలో ఇద్దరిని జామీనులుగా పంపడానికి అంగీకరించాడు. ఈ సంధి మూలంగా బ్రిటిషువారు మలబారుకు కూర్గ్, దిండిగల్ బారామహాల్ వంటి ప్రాంతాలు ఆక్రమించుకొన్నారు. మహారాష్ట్రులకు వాయవ్య మండలి ప్రాంతాలు, నిజాంకు అతని రాజ్యానికి చేరువగా గల ప్రాంతాలు మైసూరు నుంచి లభించాయి టిప్పు రాజ్యం ఈ యుద్ధం తర్వాత బాగా తగ్గిపోయింది. బ్రిటిషువారి ప్రాబల్యం అధికమైంది.

1798లో గవర్నర్ జనరల్‌గా నియమితుడైన వెంటనే లార్డ్ వెల్లస్లీ టిప్పు సుల్తానుపై యుద్ధం చేయడానికి నిర్ణయించాడు. మూడవ మైసూరు యుద్ధానంతరం టిప్పు బ్రిటిషు వారిని ఎదిరించి కసిదీర్చుకొన ప్రయత్నించాడు. ఫ్రెంచి నాయకుడైన నెపోలియన్‌తో ఉత్తర- ప్రత్యుత్తరాలు కొనసాగించాడు. మారిషస్ దీవులలోని ఫ్రెంచి గవర్నరు దగ్గరకు రాయబారులను పంపాడు. ఫ్రెంచి సైనికులను తన సైన్యంలో నియమించాడు. కాబూల్, కాన్‌స్టాంటినోపిల్ అరేబియా వంటి అనేక దేశాలకు తన రాయబారులను పంపాడు. బ్రిటిషు వారిని తరిమి కొట్టవలసిన ఆవశ్యకతను ప్రజలు గుర్తించే టట్లు శ్రీరంగ పట్నంలో "స్వేచ్ఛా వృక్షాన్ని" నాటాడు. వెల్లస్లీ టిప్పు చర్యలను గమనించి,

అతనిపై యుద్ధం తప్పదని నిర్ణయించుకొన్నాడు. ఫ్రెంచి వారితో సన్నిహితంగా మెలగు తున్న టిప్పును సంజాయిషీ పత్రాన్ని పంపి సమాధానమిమ్మని కోరాడు. టిప్పు దానిని ఖాతరు చేయని కారణంగా వెల్లస్లీ యుద్ధాన్ని ప్రకటించాడు.

మైసూరు తూర్పు పడమరల నుంచి ఒకేసారి దండయాత్రకు గురయింది. జనరల్ స్టూవర్డ్ నాయకత్వం కింద బొంబాయి నుంచి ఒక సైన్యం, మద్రాసు నుంచి జనరల్ హెరిస్ నాయకత్వంలోని మరొక సైన్యం కారన్ వాలీసు సహాయానికై వెళ్లాయి. హైదరాబాదు నిజాం కూడ తన సైన్యాలను బ్రిటిషు వారికి సహాయంగా పంపాడు. జనరల్ స్టూవర్డ్ మైసూర్ సైన్యాలను సిద్దాపూర్ వద్ద ఓడించాడు. శ్రీరంగ పట్టణానికి ముప్పై మైళ్ల దూరంలోని మాలవెల్లి దగ్గర మరొక పోరాటంలో జనరల్ స్టూవర్డ్ టిప్పు సేనలను ఓడించాడు. దీనితో టిప్పు సంప్రదింపులకు అంగీకరించాడు. బ్రిటిషువారు అతని రాజ్యంలో సగభాగాన్ని, రెండు కోట్ల రూపాయలను ఇమ్మని కోరారు. ఈ షరతులను అంగీకరించిన మొదట బెంగాలు నవాబు మాదిరిగా అశక్తుడుగా, బ్రిటిషువారి చేతులలో కీలుబొమ్మగా మారడానికి ఇష్టపడని టిప్పు ఈ సంధికి అంగీకరించక యుద్ధాన్ని కొనసాగించడానికే నిర్ణయించాడు. బ్రిటిషు సేనలు శ్రీరంగ పట్టణాన్ని నాల్గుమూలలనుంచి చుట్టుముట్టాయి. గవర్నర్ జనరల్ వెల్లస్లీ తమ్ముడు ఆర్థర్ వెల్లస్లీ నాయకత్వంలోని బ్రిటిషు సేనలు ఒక నెల రోజుల పోరాటానంతరం టిప్పును 1799 మేనెల 4వ తేదీన ఓడించాయి. టిప్పును ఓడించిన ఈ ఆర్థర్ వెల్లస్లీ తర్వాత ఫ్రెంచి చక్రవర్తియైన నెపోలియన్‌ను 1815లో వాటర్లూ యుద్ధంలో ఓడించి (డ్యూక్ ఆఫ్ వెల్లింగ్ టన్‌గా) ప్రసిద్ధి గాంచాడు. టిప్పు యుద్ధభూమిలో మరణించాడు. అతని మరణంతో బ్రిటిషువారు మైసూరు రాజ్యాన్ని పూర్తిగా సాధించారని చెప్పవచ్చు.

నాల్గో మైసూరు యుద్ధం తర్వాత కుదిరిన మైసూరు సంధి ప్రకారం టిప్పు అధీనం లోని కెనర, కోయంబత్తూరు, శ్రీరంగ పట్టణం మొదలైన ప్రాంతాలన్నీ బ్రిటిషువారు ఆక్రమించుకొన్నారు. హైదరాబాదు నిజాం తన సహాయానికి ప్రతిఫలంగా మైసూరు రాజ్యంలోని పలుప్రాంతాలను పొందగలిగాడు. మైసూరు మధ్య ప్రాంతాన్ని హైదరాలిచేత పదచ్యుతులైన వడయారు వంశానికి చెందిన కృష్ణరాజు అనే ఐదేండ్ల బాలునికి అప్పజెప్పి హైదర్ టిప్పుల కాలంలో దివానుగా పనిచేసిన పూర్ణయ్యను సంరక్షణ కర్తగా నియమించారు. మైసూరు పరోక్షంగా బ్రిటిషువారి అధీనంలోకి వచ్చింది. నలువైపులా బ్రిటిషువారి పాలనా యంత్రాలున్న కారణంగా మైసూరుకు సముద్ర తీరంతో ఉన్న సంబంధం తెగి పోయింది. ఉత్తర దేశంలో ప్లాసి బక్సార్ యుద్ధాల తర్వాత మైసూరు ఆక్రమణ బ్రిటిషు వారి అధికార విస్తరణకు మిక్కిలి దోహదం చేసింది.

టిప్పు తన తండ్రి హైదర్ వలె గొప్పనాయకుడు. ఐతే హైదర్ మాదిరి కాకుండా టిప్పు మంచి విద్యావంతుడు. అనేక భాషలు నేర్చినవాడు. ఆయన మహాయోధుడు గొప్ప సైనికుడు. బ్రిటిషు వారిని ఎదిరించి అనేక యుద్ధాలు కొనసాగించాడు. బ్రిటిషు వారన్న

ఎనలేని అసహ్యాన్ని ప్రదర్శించిన టిప్పు, వారి కబంధహస్తాల నుండి భారతదేశాన్ని తప్పించడానికి నిర్విరామంగా కృషి చేశాడు దేశంలోని ఇతర రాజ్యాలన్నీ బ్రిటిషువారికి సహాయం చేయడానికి నిర్ణయించుకొన్నప్పుడు ధైర్యంగా నిలిచి, దేశరక్షణకు ప్రాణా లర్పించిన వీరుడు టిప్పు సుల్తాను. అతడు జీవించినంత కాలం తాము సురక్షితంగా ఉన్నట్లు బ్రిటిషువారు భావించలేదు.

టిప్పు మరణించిన తరవాత మహారాష్ట్రులు మాత్రమే బ్రిటిషు వారికి ప్రధాన శత్రువులుగా మిగిలారు. దాదాపు ఐదు మహారాష్ట్రనాయకులు సంఘటితమై బ్రిటిషు వారికి ఎదురు నిలిచారు, వారు : పీష్వా, బరోడా గాయక్వాడ్, గ్వాలియర్ ఏలిన సింధియా, ఇండోర్‌కు చెందిన హోల్కార్, నాగపూర్‌కు చెందిన భాంస్లేలు. ఈ మరాఠా కూటమికి నాయకుడు పీష్వా. కాని పదునెనిమిదవ శతాబ్ధాంతానికి మహారాష్ట్రులలో నాయకత్వం విష యంలో పోటీలు ఏర్పడ్డాయి. రెండో బాజీరావును యశ్వంతరావు హోల్కార్, దౌలత్‌రావు సింధియాలు ఎదిరించారు. బాజీరావు 1802లో బేసిన్‌కు పారిపోయి బ్రిటిషువారి సహాయాన్ని అర్థించాడు. వారితో చేసుకొన్న సంధికి బేసిన్ సంధి అనిపేరు.

బేసిన్ సంధి ప్రకారం పీష్వా రాజ్యంలో బ్రిటిషు సైన్యాలను నియమించడానికి అంగీకారం కుదిరింది. ఆ సైన్యాల పోషణకై 26 లక్షల రూపాయల ఆదాయం వచ్చే ప్రాంతాన్ని పీష్వా బ్రిటిషు వారికియ్యడానికి అంగీకరించాడు సూరత్‌ను బ్రిటిషు వారికి అప్పజెప్పి, పీష్వా ఏ ఇతర యూరోపియన్లతోను మైత్రిచేయనని వాగ్దానం చేశాడు. పీష్వాను ఆంతరంగికంగా రక్షించడానికి బ్రిటిషువారు అభయమిచ్చారు. ఇదే సమయంలో గాయ క్వాడ్ రాజ్యానికి చెందిన గుజరాత్‌లో వారసత్వం గురించి తగాదాలు తలెత్తింది అప్పుడు బ్రిటిషువారు బరోడాను వశపరచుకొని గుజరాత్‌ను తమ అధీనం క్రిందికి తెచ్చుకున్నారు. గాయక్వాడ్ బ్రిటిషువారితో చేసుకొన్న ఒప్పందాన్ని పీష్వా గుర్తించడానికి అంగీకరించాడు.

మహారాష్ట్రుల అధికారాన్ని తొలగించి బ్రిటిషువారి పలుకుబడిని పెంపొందించడానికి బేసిన్ సంధి ఎంతగానో దోహదం చేసింది. దీనితో పీష్వా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి బ్రిటిషువారి అధికారాన్ని అంగీకరించాడు. కాని సింధియా మొదలైన వారిని సంప్రదించ నందున ఈ సంధికి వారు అంగీకరించలేదు. అందుచే 1803లో యుద్ధం ప్రారంభమైంది. మహారాష్ట్రుల అతః కలహాలను ఆసరాగా తీసుకొని వెల్లస్లీ వారిని ఒక్కొక్కరిని ఓడించ గలిగాడు. సింధియా భాంస్లే సేనలను అస్సామె యుద్ధంలో 1803లో ఓడించాడు. వారు తమ అధీనంలోని అనేక ప్రాంతాలను బ్రిటిషు వారికి అప్పజెప్పారు. అహమద్ నగర్, బ్రోచ్ గంగ - యమునల మధ్యగల అంతర్వేది, కటక్, బాలసోర్ మొదలైన ప్రాంతా లన్నీ బ్రిటిషు వారికి దక్కాయి. వార్ధాకు పశ్చిమంగా గ్వాలియర్‌కు దక్షిణంగా ఉన్న ప్రాంతమంతా నిజాంకు దక్కింది. నాగపూర్‌లో ఒక రెసిడెంటును నియమించడానికి నిర్ణయం జరిగింది.

ఇదే సమయంలో ఉత్తర భారతదేశంలో జనరల్ లేక్ అనే బ్రిటిషు సైనికాధికారి గ్వాలియర్‌ను ఆక్రమించుకొని ఢిల్లీకి సమీపంలో గొప్ప విజయం సాధించి ఢిల్లీ నగరాన్ని ప్రవేశించాడు. అక్కడ వృద్ధుడైన మొగల్ చక్రవర్తి షా ఆలం బ్రిటిషువారి సంరక్షణలో ఉన్నాడు. సింధియా బ్రిటిషు వారితో సంధిచేసుకొన్నాడు రెండో మరాఠా యుద్ధం మహరాష్ట్రులకు పెద్ద దెబ్బగా పరిణమించింది. సంధిలో భాగంగా సైన్య సహకార పద్ధతికి అంగీకరించమని వెల్లస్లీ హోల్కారును కోరాడు. దీనికి నిరాకరించిన కారణంగా 1804లో హోల్కారుపై యుద్ధం ప్రకటించబడింది. ఆవిధంగా మూడో మరాఠా యుద్ధం ప్రారంభమైంది. 1805లో వెల్లస్లీ స్వదేశానికి తిరిగే నాటికి హోల్కార్ అధికారం పూర్తిగా విచ్ఛిన్నం కాలేదు.

కడపటి మరాఠా యుద్ధం 1817లో లార్డ్ హేస్టింగ్స్ కొనసాగించాడు. దీనికి ప్రధాన కారణం రెండో మరాఠా యుద్ధం ముగిసిన తర్వాత మహరాష్ట్రులలో ఏర్పడిన అసంతృప్తి అనవచ్చు. పీష్వా బేసిన్ సంధిని రద్దుపరచి మహరాష్ట్రుల కూటమిని తన నాయకత్వం కింద పునరుద్ధరించడానికి తలచాడు. 1814లో బరోడా రాజ్యానికి మంత్రియైన గంగాధరశాస్త్రి పూనాలో హతుడయ్యాడు. దీనికి బాధ్యుడైన నిందితుని అప్పజెప్పమని బొంబాయి గవర్నరు ఎల్ఫిన్‌స్టన్ పీష్వాను కోరగా దానికి నిరాకరించిన కారణంగా బ్రిటిషువారు పీష్వాను కొత్త ఒప్పందానికి గురిచేశారు. దాని ప్రకారం మహరాష్ట్రుల ఐక్య కూటమికి నాయకత్వాన్ని వదులుకోడానికి పీష్వా అంగీకరించాడు. గాయక్వాడ్ స్వాతంత్ర్యాన్ని గుర్తించాడు. కొంకణ తీరాన్ని బ్రిటిషు కంపెనీకి అప్పజెప్పాడు. కాని 1818లో పీష్వా బాజీరావు బ్రిటిషు రెసిడెన్సీని ఎదుర్కొన్నాడు. ఐతే కిర్కి, కోరిగాన్, అర్కి మొదలైన చోట్ల బ్రిటిషు సేనల వల్ల ఓడిపోయాడు. కడపటికి మాల్కమ్‌కు లొంగిపోయాడు. అతని రాజ్యం ఆక్రమింపబడింది. బాజీరావు సాలీన ఎనిమిది లక్షల రూపాయల భృతిపై కాన్పూరు దగ్గర నివశించడానికి అనుమతింపబడ్డాడు. సతారా అనునొక చిన్న రాజ్యాన్ని సృష్టించి శివాజీకి వారసుడైన ప్రతాపసింహ అనే ఆయనకు ఇచ్చారు. ప్రతాపసింహ మహరాష్ట్రుల నాయకుడుగా గుర్తించబడ్డాడు.

జస్వంతరావు హోల్కార్ 1811లో మరణించిన తర్వాత మల్హార్‌రావు రాజ్యంలో శాంతి భద్రతలు సంరక్షించలేక పోయాడు. అంతః కలహాల వల్ల ప్రభుత్వంలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. 1818లో మల్హార్‌రావు గవర్నర్ జనరల్ లార్డ్ హేస్టింగ్స్‌తో సంధికి ఇష్టపడ్డాడు. ఫలితంగా మందసార్ సంధి కుదిరింది. దాని ప్రకారం హోల్కార్ అధీనంలోని ఇండోర్ రాజ్యం పూర్తిగా బ్రిటిష్ వశమైంది. మహరాష్ట్రుల పలుకుబడి దీనితో నశించింది. వెల్లస్లీ కాలంలో ప్రారంభమైన ఈ కార్యక్రమం లార్డ్ హేస్టింగ్స్ కాలంలో పూర్తి అయింది. బ్రిటిష్‌వారి అధికార ప్రాబల్యాన్ని అడుగడుగునా ఎదిరిస్తూ వచ్చిన మహరాష్ట్రులు తమ ఆంతరంగిక తగాదాల మూలంగా సమైక్యమైన కృషి చేయని కారణంగా

కడపటికి ఓడిపోయారు. మహారాష్ట్రులతో కొనసాగిన మూడు యుద్ధాల తర్వాత బ్రిటిష్‌వారి అధికారం అటు సట్లెజ్ నుంచి బంగాళాఖాతం వరకు, హిమాలయాల నుంచి దక్షిణాగ్రం వరకు నిరాటంకంగా కొనసాగిందని చెప్పవచ్చు.

## సైన్యసహకార పద్ధతి

బ్రిటిష్‌వారి అధికార విస్తరణకు భారతదేశంలో యుద్ధాల మూలంగా జరిగిన ఆక్రమణలతో బాటు అనేక ఇతర మార్గాలు కూడ అనుసరించబడినాయి. సైన్య సహకార పద్ధతి అందులో ఒకటి. యుద్ధాలు ప్రకటించకుండా, ధనం వెచ్చించకుండా బ్రిటిష్ సామ్రాజ్యాన్ని విస్తరింపడానికి లార్డ్ వెల్లస్లీ వేసిన పథకం, సైన్య సహకార పద్ధతి, దీని వల్ల "భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యము" "భారత దేశపు బ్రిటిష్ సామ్రాజ్యం" అనే స్థితికి పెరిగింది. బ్రిటిష్‌వారి పలుకుబడి, అధికారం దీనితో పరాకాష్ఠ చేరుకొనింది. భారత దేశంలోని స్వదేశీ రాజ్యాలను బ్రిటిష్‌వారి అధికారానికి లోబడిపోయేట్లు చేయడానికి ఈ పద్ధతి పనికివచ్చింది.

సైన్య సహకార పద్ధతికి అంగీకరించిన స్థానిక రాజ్యాలు తమ విదేశీ వ్యవహారాలను బ్రిటిష్‌వారికి అప్పజెప్పాలి. తమకు తాముగా యుద్ధాలు ప్రకటించడం రద్దయింది. ఇతర రాజ్యాలలో సంప్రదింపులు చేయడానికి కూడ బ్రిటిష్‌వారి అనుమతి పొందాలి. తమ అధీనంలోని సైన్యాలను తొలగించి బ్రిటిష్‌వారు తయారు చేసిన సేనలను స్వీకరించాలి. ఆ సైన్యాలకు అయ్యే ఖర్చు స్థానిక సంస్థానాధీశులే భరించాలి. పెద్ద పెద్ద సంస్థానాధీశులు ధన రూపంలో గాకుండా కొంత భూ భాగాన్ని సైన్యాల పోషణకై బ్రిటిష్ వారికి అప్పజెప్పాలి. సంస్థానాలలో బ్రిటిష్ రెసిడెంట్లు నియమించబడ్డారు. స్వదేశీ రాజ్యాలలో ఫ్రెంచి సేనలుగాని మరి ఏ అధికార్లుగాని నియమించరాదు. స్థానిక రాజుల ఆంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకోమని వారికి తగు రక్షణ నిస్తామని బ్రిటిష్‌వారు అభయమిచ్చారు.

భారత దేశంలో బ్రిటిష్‌వారి అధికార విస్తరణకు సైన్య సహకార పద్ధతి అమితంగా దోహదం చేసింది. ప్రతిబంధకంగా ఉన్న స్థానిక రాజ్యాల సైన్యాలు అదృశ్యమైనాయి. బ్రిటిషు పద్ధతులలో తర్ఫీదు పొందిన సైనికులు మాత్రమే దేశంలో నియమితులయ్యారు. దేశంలోని కీలక స్థావరాలలో బ్రిటిషు సేనలను ఏర్పరచారు ఫ్రెంచివారి ప్రాబల్యం పెరగకుండా చేయడానికి సైన్య సహకార పద్ధతి పనికి వచ్చింది. అనేక ప్రాంతాలు బ్రిటిష్ వారికి దత్తమయ్యాయి. ఈ సైన్య సహకార పద్ధతి మూలానా స్థానిక రాజుల స్వాతంత్ర్యం పూర్తిగా హరించుకొని పోయింది బ్రిటిష్ రెసిడెంట్లు స్థానిక రాజ్యాల అంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకొన్నారు. పాలనా సామర్థ్యం లోపించిందనే నెపంతో ఆ రాజ్యాలను తర్వాత ఆక్రమించుకోడానికి సిద్ధపడ్డారు. కంపెనీచే నియమించిన సైనికాధికార్లకు జీతభత్యాలు ఎక్కువ ఉండడం వల్ల స్థానిక రాజులకు ఖర్చు ఎక్కు

మైంది. స్థానిక రాజ్యాలు రద్దయిన కారణంగా సైనిక విద్యలు నేర్చి నిరుద్యోగులైన సైనికులు పునరావాసంలేని కారణంగా దొంగతనాలకు దోపిడీలకు దిగిన కారణం వల్ల ప్రజలకు భయాందోళనలు ఎక్కువయ్యాయి.

వెల్లస్లీ ప్రవేశపెట్టిన ఈ సైన్యసహకార పద్ధతికి అంగీకరించిన భారత సంస్థానాధీశులలో ముఖ్యులు హైదరాబాదు నిజాం, తంజావూరు రాజు, అయోధ్య నవాబు, పీష్వా, ఆర్కాటు నవాబు, సింధియా, బీరారు ప్రభువు రాజపుత్ర నాయకులైన జోద్‌పూర్, జైపూర్, భరత్‌పూర్, పరిపాలకులు మొదలైనవారు. బ్రిటిష్‌వారి సామ్రాజ్య సాధ నిర్మాణంలో సైన్యసహకార ఒడంబడిక అమితంగా దోహదం చేసింది.

## డల్హౌసీ, రాజ్య సంక్రమణ సిద్ధాంతం ;

1846–1856 మధ్య కాలంలో భారతదేశ గవర్నరు జనరల్‌గా పనిచేసిన లార్డ్ డల్హౌసీ పాలనకూడ బ్రిటిషు సామ్రాజ్య విస్తరణకు దారితీసింది. వెల్లస్లీ వలె డల్హౌసీకూడ గొప్ప సామ్రాజ్య వాది. అతని కాలంలో కొనసాగిన యుద్ధాలతో బాటు దత్తస్వీకార రద్దు చట్టాన్ని ప్రవేశపెట్టి దాని మూలంగా అనేక స్థానిక రాజ్యాలను ఆక్రమించుకోగలిగాడు. మరుగుపడిన మొగల్ సామ్రాజ్యాన్ని పూర్తిగా తొలగించి భారత స్వతంత్ర రాజ్యాలను నామమాత్రావశిష్టం చేయాలని సంకల్పించాడు. బ్రిటిషు పరిపాలన మిక్కిలి ఉదాత్తమైనదని ప్రజలను మెప్పించ ప్రయత్నించాడు. అందుచే స్థానిక రాజ్యాలను తొలగించి భారత దేశాన్ని పూర్తిగా బ్రిటిష్ పాలన క్రిందికి తేవడానికి కృషి చేశాడు.

డల్హౌసీ చేసిన యుద్ధాలలో ప్రధానమైనవి రెండు. అవి : రెండో శిక్కు యుద్ధం (1848–49) రెండో బర్మా యుద్ధం (1852). శిక్కుల సైనిక నాయకుడైన షేర్‌సింగ్‌ను ఛిలియన్‌వాలా దగ్గర, బ్రిటిష్ సేనలు ఓడించాయి. పంజాబు వ్యవహారాలలో బ్రిటిష్ ప్రభుత్వం అన్ని అధికారాలు చెలాయించింది పంజాబు సైనిక ఖర్చులక్రింద ఏటా 22 లక్షల రూపాయలు బ్రిటిష్ వారికి చెల్లించవలసి వచ్చింది. 1849లో డల్హౌసీ బాలుడైన మహారాజును తొలగించి, పంజాబును ఆక్రమించుకొన్నాడు. పంజాబు తరవాత డల్హౌసీ బర్మాపై దృష్టి మళ్లించాడు. అంతకుముందు కుదుర్చుకొన్న "యాండబూ" సంధి మూలంగా బర్మారాజు బ్రిటిష్ రెసిడెంటును "ఆవ" నగరంలో ఉండటానికి అనుమతించాలి. కాని బ్రిటిష్ రెసిడెంటును అవమానిస్తున్నాడనే నెపంతో బ్రిటిష్‌వారు బర్మాపై చర్యకుపక్రమించారు. ఇర్రవాడి నదీ ముఖ ద్వారంలో బ్రిటిష్ నౌకాదళాధిపతి బర్మాకు చెందిన నౌక నొకదానిని వశపరచుకొన్నాడు. దీనివల్ల ఇరుపైపులా వైషమ్యాలు పెరిగాయి గవర్నర్ జనరల్ డల్హౌసీకి ఇది మంచి అవకాశంగాతోచి, బర్మాపై యుద్ధాన్ని ప్రకటించాడు. 1852 డిసెంబరులో ప్రారంభమైన ఈ రెండో బర్మా యుద్ధానికి చాలా ప్రాముఖ్యముంది అనేక చోట్ల బర్మా సైన్యాలు ఓటమి పొందాయి. రంగూన్, మార్తబాన్, బాసిన్,

పెగూ మొదలైన ప్రాంతాలన్నీ ఆక్రమితమయ్యాయి. పాగన్ తరవాత మిందాన్ అను నతడు బర్మా రాజు అయ్యాడు. కొత్త రాజు బ్రిటిష్ వారితో సంధిచేసుకొన్నాడు. బర్మా పూర్తిగా బ్రిటిష్‌వారి వశమైంది.

యుద్ధాల మూలంగా లభించిన ప్రాంతాలు ఒక ఎత్తు, కాని రాజ్య సంక్రమణ సిద్ధాంతమును అమలుపరచినందున డల్హౌసీ ఆక్రమించుకొన్న ప్రాంతాలు మరియొక ఎత్తు. ఈ కొత్త సిద్ధాంతం ప్రకారం సంస్థానాధీశులకు పుత్రులు లేని సందర్భాలలో ఆ రాజ్యాలు దత్త పుత్రులకు చెందవని, అవి బ్రిటిష్ కంపెనీకి సంక్రమిస్తాయని ప్రకటించాడు. దీనికి "దత్త స్వీకార రద్దు చట్టమని పేరు. డల్హౌసీ ఈ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన ఆ సమయంలో అనేక సంస్థానాదీశులు కుమారులు లేకుండా మరణించిన కారణంగా బ్రిటిష్ అధికారం బహుళంగా వ్యాప్తి చెందింది. ఝాన్సీ, సతారా, సంబల్‌పూర్, నాగపూర్, జైత్‌పూర్, భాగల్ ఉదయపూర్ మొదలైన అనేక సంస్థానాలు రాజ్య సంక్రమణ సిద్ధాంతానుసారం బ్రిటిష్‌వారి అధీనమయ్యాయి. అతనికి ముందున్న పరిపాలకులు రాజ్యసంక్రమణను నివారించడానికి వీలున్నట్లయితే నివారించేవారు; కాని డల్హౌసీ అట్లాగాకుండా ఆక్రమణకు కొద్దిపాటి ఆస్కారమున్నా దానిని ఉపయోగించి ఆక్రమించుకోడానికి వెనుదీయలేదు.

డల్హౌసీ సిక్కింపై దాడిచేసి కొంత భూభాగాన్ని ఆక్రమించాడు. డార్జిలింగ్ రాజుకు ఇస్తూ వచ్చిన భరణాన్ని రద్దుచేశాడు. హైదరాబాదు నిజాం చెల్లించవలసిన ధనాన్ని చెల్లించలేదను నెపంతో బీరార్ ప్రాంతాన్ని ఆక్రమించాడు. అయోధ్యను అదే విధంగా హస్తగతం చేసుకొన్నాడు. డల్హౌసీ ఆక్రమణ విధానం ప్రజలలో ప్రభువులలో అమిత ఆందోళనను సృష్టించింది. తన దత్త స్వీకారం రద్దు చట్టం ద్వారా హిందూమత భావాలను కించపరుస్తున్నట్లుగాని అతడు గుర్తించలేదు. డల్హౌసీ అనుసరించిన పద్ధతులు చాలావరకు 1857లో జరిగిన తిరుగుబాటుకు ప్రధాన కారణాలైనాయని చెప్పవచ్చు.

బెంగాలు, కర్ణాటక ప్రాంతాల ఆక్రమణతో ప్రారంభమైన బ్రిటిష్ అధికార విస్తరణ మైసూరు, మరాఠా యుద్ధాల మూలంగా దేశవ్యాప్తంగా పరాకాష్ఠనందుకొనింది. కీలకమైన ప్రాంతాలన్నీ వారి స్వాధీనమైనాయి. స్థానిక రాజులు నామమాత్రంగా కొనసాగినా వారి సార్వభౌమత్వము బ్రిటిష్ వారికి సంక్రమించింది. రాబర్ట్ క్లైవుతో ప్రారంభమైనా, వారన్ హేస్టింగ్స్, కారన్ వాలీసు, లార్డ్ హేస్టింగ్స్, వెల్లస్లీల చొరవ, సామర్థ్యాలచే బ్రిటిష్ అధికారం సుస్థిరంగా స్థాపించబడింది. తరవాతి కాలంలో ఇది అభివృద్ధిచెంది బలమైన శక్తిగా రూపొంది సామ్రాజ్య తత్వాన్ని నిరాటంకంగా కొనసాగించడానికి పనికి వచ్చింది.

కంపెనీ సాధించిన అనేక సైనిక విజయాలకు తమకుగల సైనిక సంపద ప్రధాన కారణం. బ్రిటిష్ సేనలు మంచి శిక్షణ పొంది, నాణ్యతగల ఆయుధ సామాగ్రి గలిగి ఉండటంచేత యుద్ధాలలో శక్తివంతంగా పోరాడగలిగాయి. మాతృదేశం నుండి కొత్త సేనలు రప్పించడానికి, తగు యుద్ధ సామాగ్రిని తెప్పించుకోడానికి కావలసిన సముద్రాధిపత్యం గడించారు. భారతదేశంలోని స్వతంత్ర రాజుల వద్దగల ఆయుధ సామాగ్రికన్న బ్రిటిష్‌వారు ఉపయోగించిన ఆయుధాలు అధునాతనమైనవి. ఆర్థికంగా మిక్కిలి సంపన్నమైన కారణంగా కంపెనీ స్థానిక రాజ్యాలను సునాయాసంగా సాధించగలిగింది.

బ్రిటిష్‌వారి విజయాలకు తమ సైన్యాలేగాక, రాజకీయ వేత్తలు, దౌత్యనాయకులు కూడ తోడ్పడ్డారు. సర్వే అధికార్లు సైనిక దండయాత్రలకై తగు రేఖాపటాలను, ప్రణాళికలను తయారు చేశారు. సివిల్ మిలిటరీ ఉద్యోగులు, తమదేశ పేరు ప్రతిష్ఠలకై శక్తి వంచన లేక కృషిచేశారు. బ్రిటిష్‌వారి సైన్యంలో కూడ కొన్ని కొన్ని లోపాలు లేక పోలేదు. కాని భారతీయులలో లోపించిన ఐక్యత సంఘీభావాన్ని, వారు ఆసరాగా తీసుకొని విజయం సాధించగలిగారు.

సామాన్య ప్రజానీకానికి అత్యవసరమైన శాంతి, భద్రతలు ప్రసాదించుట తమ ధ్యేయమని కంపెనీ పాలకులు ఎరుకపరచిరి. దీనిచే ప్రజానీకంలో కంపెనీ అధికార స్థాపనకు సంఘటిత వ్యతిరేకత లేకపోయింది. బ్రిటిష్‌వారి రాక మూలంగా కొత్తగా అభివృద్ధి చెందిన వర్తకులు, దుబాసీల వంటి మధ్య తరగతివారు స్వప్రయోజనాలకై బ్రిటిష్ అధికార విస్తరణను సమర్థించడమేగాక వారికి సహాయ సహకారాలను కూడ అందజేశారు.



# అధ్యాయము 7

# పరిపాలనా వ్యవస్థలో మార్పులు

బ్రిటిషువారు భారత దేశంలోని వివిధ ప్రాంతాలను ఆక్రమించిన వెంటనే పరిపాలన, సివిల్ సర్వీసులు, సైన్యం, పోలీసు, న్యాయస్థానాలు, భూమిశిస్తు విధానాల వంటి అన్ని విషయాలలోను పాశ్చాత్య పద్ధతుల మేరకు మార్పులు ప్రవేశపెట్టారు ఈ మార్పులు ముఖ్యంగా బ్రిటిష్‌వారి అధికారాన్ని పెంపొందించడానికే వారి పరిపాలనకు వాస్తవికతను ఆపాదించే దృష్టితో చేసినవి ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఆర్థిక విధానాలు గూడ అట్లాంటి ఉద్దేశంతో కూడుకొన్నవే.

1765లో దివాని అధికారాలు తీసుకొన్న మీదట బ్రిటిష్ కంపెనీ బెంగాలులో ద్వంద్వ పరిపాలనను ప్రవేశపెట్టి, కంపెనీ తరపున శిస్తు వసూలు చేయడానికి భారతీయ అధికారులకు అనుమతిచ్చింది. దీనివల్ల స్థానికులకు అనేక ఇబ్బందులుండేవి కంపెనీ ఉద్యోగులు అవినీతికి లంచగొండితనానికి పాల్పడేవారు. వారు తీరిక సమయాల్లో కొనసాగించిన వ్యాపారంతో అధికంగా ధనార్జన చేసేవారు. కంపెనీ ఆదాయం తగ్గింపి. సైన్యం అనేక సందర్భాలలో ఆశించిన విజయాలు సాధింపలేక పోయింది. ఇంగ్లండులో ప్రజలు, పత్రికలు, పార్లమెంటు సభ్యులు భారత దేశంలో కంపెనీ పనిచేయు తీరుతెన్నులను విమర్శించారు, బ్రిటిష్ ప్రభుత్వం స్వయంగా కంపెనీ వ్యవహారాలలో జోక్యం కలిగించుకొంచేగాని అది సక్రమంగా వ్యవహరించదని తలచారు.

## రెగ్యులేటింగ్ చట్టము, 1733 :

భారతదేశంలో కంపెనీ పరిపాలనా వ్యవస్థను మెరుగు పరచడానికై బ్రిటిష్ ప్రభుత్వం 1773లో రెగ్యులేటింగ్ చట్టాన్ని అమలు పరచింది ఈ చట్టం ప్రవేశపెట్టడానికి అనేక కారణాలున్నాయి. అంతకు ముందు సంవత్సరంలో కంపెనీ పది లక్షల పౌన్ల ఋణం కావాలని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరింది. కంపెనీ వ్యవహారాలన్నీ సక్రమంగా ఉన్నట్లయితే ఋణాల అవసరం ఎందుకని ప్రభుత్వం అనుమానించింది. 1770లో సంభవించిన బెంగాలు కరువు మిక్కిలి ఉధృతమైంది. దీనిచే కంపెనీ ఆర్థిక పాలనా వ్యవస్థ బాగా దెబ్బతినింది ఇంగ్లాండులో సప్తవర్ష సంగ్రామం (1756—63) ముగిసిన పిదప శాంతి పరిస్థితులు నెలకొన్నందున పార్లమెంటు సభ్యులు కంపెనీ వ్యవహారాలకు ఆసక్తిచూపి అస్తవ్యస్తమైన పరిస్థితులను చక్కబెట్ట వలచారు. దీనికి తోడు కంపెనీ ఉద్యోగుల తీరు గూడ బ్రిటిష్ ప్రజలకు ఆగ్రహాన్ని, అసూయను కలిగించే విధంగా ఉండేది. కొద్దికాలం భారతదేశంలో పనిచేసి వెళ్లిన కంపెనీ ఉద్యోగులు అమిత ధనవంతులుగా స్వదేశాన్ని

చేరుకొనేవారు. కంపెనీకి ఒకవైపు ధనాభావం గలదంటూనే కంపెనీ ఉద్యోగులు విచ్చల విడిగా ధనమార్జించడం బ్రిటిష్ ప్రజలకు విడ్డూరంగా తోచింది. భారతదేశంలోని సంపాదనలతో "బ్రిటిష్ నవాబు"లుగా పేరుపొందిన ఉద్యోగులు అనేక స్థిరాస్తుల క్రయ విక్రయాలలో పెట్టుబడి పెట్టారు. వీరి మూలంగా వస్తువుల ధరలన్నీ అధికమయ్యాయని అనే వారు. ఉదాహరణకు రాబర్ట్‌క్లైవు ఒకసారి లండను బజారుకెళ్లి ఒక దర్జీ దుకాణంలో రెండువందల చొక్కాలకు ఒకేసారి ఆర్డరిచ్చాడట! కంపెనీ వ్యవహారాలు సక్రమంగా లేవని ప్రభుత్వం భావించి ఈ రెగ్యులేటింగ్ చట్టాన్ని పార్లమెంటులో ప్రవేశపెట్టింది.

రెగ్యులేటింగ్ చట్టం ప్రకారం కంపెనీ పాలక వర్గమైన "బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల" నియామకంలో మార్పులు వచ్చాయి. డైరెక్టర్లను నాలుగేండ్ల కొకసారి ఎన్నుకొంటారు. వారిలో నాల్గింట ఒక భాగం ప్రతి సంవత్సరం రిటైరవుతారు. ఒక సంవత్సర కాలం తరవాత తిరిగి డైరెక్టరుగా ఎన్నికగావడానికి ఆస్కారముండేది. ఓటింగులో పాల్గొనడానికి కనీసం వేయిపౌన్ల షేరుధన ముండాలి. దీనివల్ల కంపెనీ పాలకవర్గంలో పరిపాలనా సౌలభ్యం గలిగింది. పాత డైరెక్టర్లు కొత్త వారికి విషయవివరణ జేయు ఆస్కారముండేది.

రెగ్యులేటింగ్ చట్టం కంపెనీ రాజ్యాంగ చరిత్రలో కొత్త అధ్యాయాన్ని సృష్టించింది. భారత దేశంలోని కంపెనీ పరిపాలన కూడ ఈ చట్టం వల్ల మారింది. బెంగాలులో నాలుగు సభ్యులు గల కౌన్సిల్ ఏర్పాటయింది. గవర్నరు ఈ చట్టం మూలాన గవర్నరు-జనరల్‌గా వ్యావహరించబడ్డాడు. కౌన్సిల్ సభ్యులకు, గవర్నరు జనరల్‌కు పదవీకాలపరిమితి ఐదేండ్లు. కలకత్తాలో ఒక ఉన్నత న్యాయస్థానం (సుప్రీం కోర్టు) స్థాపించబడింది. అందులో ఒక ప్రధాన న్యాయమూర్తి, ముగ్గురు సాధారణ న్యాయమూర్తులు నియమింపబడ్డారు. వారందరి జీతాలు రెగ్యులేటింగ్ చట్టం నిర్ణయించింది. గవర్నరు జనరల్‌కు సాలీనా 25 వేలపౌన్లు, కౌన్సిలర్లకు 10 వేలు ఉన్నత న్యాయస్థానంలోని ప్రధాన న్యాయమూర్తికి 8 వేలు, సాధారణ న్యాయమూర్తులకు 6 వేలు. కలకత్తాలో అప్పటికి గవర్నరుగా నున్న వారన్ హేస్టింగ్స్ గవర్నరు జనరల్‌గా నియుక్తుడయ్యాడు. సర్ ఎలిజా ఇంపే అనునతడు మొట్టమొదటి ప్రధాన న్యాయమూర్తిగా నియమితుడయ్యాడు.

రెగ్యులేటింగ్ చట్టము అనేక విషయాలలో అసంపూర్ణమైన చట్టమని చెప్పవచ్చు. భారత దేశంలోని పాలనా అధికారాన్ని అటు కంపెనీగాని, ఇటు బ్రిటిష్ ప్రభుత్వంగాని పూర్తిగా స్వీకరించలేదు. ఈ చట్టం వల్ల సమర్థవంతమైన పరిపాలనా యంత్రాంగం ఏర్పాటు కాలేదు. గవర్నరు జనరల్ అధికారాలు ఇదమిత్థంగా తెలియజేయబడలేదు. మద్రాసు, బొంబాయి గవర్నరుపై గవర్నర్-జనరల్‌కు గల అధికారాలు విశదపరచలేదు, సుప్రీం కోర్టుకు గల అధికార పరిధినిగాని, అందులో పాటించే చట్టాలుగాని స్పష్టంగా తెల్పలేదు. గవర్నరు జనరల్ కౌన్సిలులోని సభ్యుల సంఖ్యను నాలుగుకు తగ్గించడం పొరపాటైనపని. అందు ముగ్గురు ఒక పక్షం వహిస్తే గవర్నరు జనరల్ ఏ కార్యము చేయడానికి వీలుండేది

కాదు. వారన్ హేస్టింగ్స్‌కు బద్ధవిరోధియైన ఫ్రాన్సిస్ సభ్యుడుగా కొనసాగిన సమయంలో ఆ విధంగా తక్కిన ఇద్దరి సహకారంతో గవర్నరు జనరల్‌ను ప్రతి విషయంలోను వ్యతిరేకించగలిగాడు. రెగ్యులేటింగ్ చట్టం కంపెనీ వ్యవహారాలను అనుకొన్న విధంగా క్రమబద్ధం చేయలేకపోయింది. ఈ చట్టంలోని లోపాలను సరిచేయడానికి 1784లో పిట్ ఇండియా చట్టం చేయడం జరిగింది.

బ్రిటిష్ ప్రధానమంత్రి అయిన విలియం పిట్ రెగ్యులేటింగ్ చట్టంలోని లోపాలను తొలగించడానికై ఒక ప్రత్యేక బిల్లును ప్రవేశపెట్టారు. ఇది 1784లో పిట్ ఇండియా చట్టమనే పేరుతో అమలులోకి వచ్చింది. కొత్త చట్టం కంపెనీ డైరెక్టర్ల అధికారాలన్నింటిని హరించింది. కంపెనీ పాలనా విషయంలో బ్రిటిష్ పార్లమెంటుకు ఎక్కువ అధికారాలు సంక్రమించాయి. కంపెనీకి వచ్చే ఆదాయంలో కొంత భాగాన్ని బ్రిటిష్ ఖజానాకు చెల్లించాలని కంపెనీ లెక్కల చిట్టాలు ప్రభుత్వ అజమాయిషీకి ఉంచాలని సూచించబడింది. పిట్ ఇండియా చట్టం మూలంగా ఒక బోర్డ్ ఆఫ్ కంట్రోల్ స్థాపితమయింది. భారతదేశపు పరిపాలనా విషయంలో ఈ బోర్డు అత్యున్నతమైంది. గవర్నర్ జనరల్‌కు తక్కిన ఇద్దరు గవర్నర్లపై పూర్తి అధికారం ఇయ్యబడింది. అతని కౌన్సిల్‌లోని సభ్యుల సంఖ్య మూడుకు తగ్గింది. కంపెనీ బ్రిటిష్ వ్యాపారంపై గుత్తాధిపత్యం కొనసాగించింది, కాని పరిపాలనా అధికారాలు కోల్పోయింది. 1813లో ఛార్టర్ చట్టం మూలంగా ఆ వ్యాపార అధికారంకూడ తొలగించింది. భారతదేశంలోని పరిపాలన నామమాత్రంగా కంపెనీ ఆధీనంలో కొనసాగింది. బోర్డ్ ఆఫ్ కంట్రోల్ నిజానికి పరిపాలనను పర్యవేక్షించింది.

## ఛార్టర్ చట్టాలు :

రెగ్యులేటింగ్ చట్టం తరవాత పిట్ ఇండియా చట్టాల ద్వారా గవర్నర్ జనరల్ అధికారాలు విస్తృతమైయినా భారత దేశంలోని పరిపాలనా విషయాలు బ్రిటిష్ ప్రభుత్వ ఆధీనంలోకి వచ్చాయి. దీని తరవాత అనేక ఛార్టర్ చట్టాల ద్వారా భారత దేశంలోని పరిపాలనా స్వరూపాన్ని మారుస్తూ వచ్చారు. 1786లో వారన్ హేస్టింగ్స్‌కు కౌన్సిల్ సభ్యుల నిర్ణయాలపై వీటో అధికారాన్ని గలుగ జేశారు. దీనిమూలంగా గవర్నర్ జనరల్ అధికారాలు కొంత మెరుగైనాయి. రెగ్యులేటింగ్ చట్టం తరవాత ప్రతి 20 ఏళ్లకొక ఛార్టర్ అమలులోకి వచ్చి ముఖ్యమైన మార్పులు ఏర్పడ్డాయి. కంపెనీ పరిపాలనలో జరిగిన అనేక నూతన సంస్కరణలకు ఈ ఛార్టర్ చట్టాలు కారణం. అవి 1793, 1813, 1833, 1853లో చేసిన చట్టాలు. ఇవి రెగ్యులేటింగ్ చట్టానికన్నా ఎక్కువ ప్రాముఖ్యం గలవి.

1793లో కౌన్సిల్ సభ్యుల నిర్ణయాలనుగూడ త్రోసిపుచ్చే అధికారాన్ని గవర్నర్ జనరల్‌కు ఇవ్వడం జరిగింది. కారన్ వాలీసు గవర్నరుగా వచ్చినప్పుడు ఆ విధంగా రెగ్యులేటింగ్ చట్టం మూలంగా వారన్ హేస్టింగ్స్ పడ్డ కష్టాలు కొత్త గవర్నర్ జనరల్‌కు

తొలగిపోయాయి. 1813లో చార్టర్ చట్టాన్ని సవరించవలసి వచ్చినప్పుడు ఇంగ్లండులో స్వేచ్ఛా వ్యాపారం అమలులో ఉండేది. భారత దేశంలో కంపెనీ వర్తక విషయాలపై గుత్తాధికారం వహించి ఉండటం అనేక మంది బ్రిటిష్ వ్యాపారులకు ఇష్టంలేదు. కంపెనీకి మాత్రం అటువంటి అవకాశాలుండడం ఇష్టం లేనందువల్ల చార్టర్ చట్టం సవరించబడింది. దానివల్ల 1813లో తూర్పు ఇండియా కంపెనీకి భారతదేశ వర్తకంపైన గుత్తాధిపత్యం పోయింది. బ్రిటిష్ పౌరులెవరైనా భారతదేశంలో స్వేచ్ఛా వ్యాపారం కొనసాగించవచ్చు. కాని తేయాకు వ్యాపారం మాత్రం కంపెనీకి మాత్రమే ఇచ్చారు. భారత దేశానికి వ్యాపారానికై వెళ్లవలసిన వారి పేర్లను నమోదుచేయడం వారి కంపెనీలకు పర్మిట్‌లను ఇవ్వడం వంటి పద్ధతులు ప్రవేశపెట్టబడినాయి. దీని తరవాత మరో 20 ఏండ్లకు 1833లో చార్టర్ చట్టం సవరణ జరిగింది.

గవర్నర్ జనరల్ అధికారాల విషయంలో ఈ 1833 చార్టర్ చట్టం చాలా ప్రధానమైనది. అంతవరకు కలకత్తా గవర్నర్ జనరల్‌గా పిలువబడిన భారతదేశంలోని అత్యున్నత అధికారి భారతదేశపు గవర్నర్ జనరల్‌గా పరిగణించబడ్డాడు. అతనికి భారత దేశంలోని అన్ని ప్రాంతాలపైన, న్యాయ సివిల్, మిలిటరీ విషయాలపైన సర్వాధికారాలు ఏర్పడ్డాయి. అతని అధీనంలోని కేంద్ర ప్రభుత్వానికి సర్వ అధికారాలు సమకూరాయి. కాని గవర్నరు జనరల్ కౌన్సిల్‌కు ఇచ్చిన అధికారాలన్నీ బ్రిటిష్ పార్లమెంటు పరిధిలో మాత్రమే చెలాయించడానికి వీలుంటుంది. 1833లో చట్టం ప్రకారం గవర్నర్ కౌన్సిల్‌లో నాల్గవ సభ్యుడు ప్రధానంగా న్యాయ విషయాలకై నియుక్తుడైనాడు. ఆ విధంగా లార్డ్ మెకాలె మొట్టమొదటి "లా" మెంబరు. భారతదేశంలోని శిక్షా స్మృతులను క్రోడీకరించాలని నిర్ణయించారు భారతదేశానికి రావడానికి అంతకుముందు బ్రిటిషు వారిపై ఉన్న కొన్ని నియమాలను తొలగించారు ఎటువంటి అనుమతిగాని పర్మిట్‌లు గాని లేకుండా బ్రిటిషువారు యధేచ్ఛగా భారతదేశానికి వచ్చే వీలు ఈ చట్టం కల్పించింది

1793, 1813, 1833 లోవచ్చిన పార్లమెంటు చట్టాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించిన మీదటే అమలులోకి వచ్చాయి. 1853 లో చార్టర్ చట్టం ప్రవేశ పెట్టడానికి ముందు పిట్ ఇండియా చట్టం మూలంగా కొనసాగుతున్న ద్వంద్వ పరిపాలనను అంతం చేయవలసిందిగా బోర్డ్ ఆఫ్ కంట్రోల్, బోర్డ్ ఆఫ్ డైరక్టర్ల మధ్య సంఘీభావం లేదని భారత ప్రజలు భావించారు. 1833 చట్టంలో భారతీయులకు ఉద్యోగాలిచ్చే విషయంలో కంపెనీ ప్రభుత్వం ఎట్టి చొరవ చూపలేదని గూడ ప్రజలు తమ ఆందోళనను తెలియజేస్తూ అనేక వినతి పత్రాలు సమర్పించారు. భారతదేశపు సివిల్ సర్వీసు పరీక్షలు భారతీయులకు గూడ అన్వయింప జేయాలని కోరారు.

1853 లో ప్రవేశపెట్టబడిన చట్టం కొన్ని విషయాలలో ముందు చట్టాల కన్న చాలా భిన్నమైనదనవచ్చు. అంతకుముందు ప్రతి చట్టంలోను 20 ఏళ్ల తరవాత ఈ పద్ధతులు పునః

పరిశీలింపబడతాయని తెలియజేసేవారు. కాని 1853 లో ఆవిధంగా తెలుపలేదు. బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల అధికారాలు కొత్త చట్టం మూలాన తగ్గాయి. 24 డైరెక్టర్లను 18 కి తగ్గించారు. అందులో 6 గురిని ప్రభుత్వం నియమిస్తుంది. 1833 లో లా మెంబరు నియమితమైనప్పుడు అతడు కేవలం న్యాయ విషయాలు చర్చించడానికి మాత్రమే అని తెలిపారు. కాని 1853 చట్టం ప్రకారం అతడు ఇతర అందరి సభ్యుల వలె సాధారణ సభ్యుడుగా పరిగణించబడ్డాడు ఇతడే గాక శాసన విషయాల చర్చ కోసం కౌన్సిల్‌ను విస్తృతం చేశారు. బెంగాలు న్యాయ స్థానంలోని ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టులోని ఒక సాధారణ న్యాయమూర్తి, వీరు గాక బొంబాయి, బెంగాలు, మద్రాసు, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల ప్రతినిధులు ఒక్కొక్కరు, వీరితో బాటు గవర్నర్ జనరల్, సైన్యాధ్యక్షుడు గూడ సభ్యులైనందువల్ల కౌన్సిల్ సభ్యత్వం 12 కు పెరిగింది. క్న్సిల్‌లో శాసన విషయాల చర్చకు అధికార సభ్యుల సంఖ్య ఆ విధంగా పనికి వచ్చింది. కొత్త చట్టం ప్రకారం బెంగాలుకు సంబంధించి నంత వరకు ఒక ప్రత్యేక గవర్నరు, పంజాబుకు ఒక లెఫ్టినెంటు గవర్నరు నియమించ బడ్డాడు.

1853 చట్టం డైరెక్టర్లకు గల అనేక అధికారాలను కుదించింది. ఉద్యోగుల నియామకంలో డైరెక్టర్లకు గల అధికారాలు తొలగినాయి. బోర్డ్ ఆఫ్ కంట్రోలుకు భారత దేశంలో ఉద్యోగుల నియమించే అధికారం ఇచ్చారు దీని మూలంగా సివిల్ సర్వీసు పరీక్షలు కేవలం బ్రిటిష్‌వారికే గాక భారతీయులకుగూడ అన్వయించారు. దీనిమూలంగా కంపెనీ అధికార్లు ఉద్యోగ నియామకాలలో కొనసాగించిన అవినీతి లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం అన్నీ తగ్గాయి. లార్డ్ మెకాలె అధ్యక్షతలో ఒక లా కమీషన్ స్థాపించారు. ఇది భారతీయ న్యాయచట్టాలను పరిశీలించి భారతీయ సాధారణ శిక్షాస్మృతి ప్రీమియర్ కోడ్ ప్రొసిజర్ మొదలైన వాటిని క్రోడీకరించింది. శాస్త్రీయ పద్ధతులపై న్యాయ విచారణకు దోహదం చేసింది. దీనితో బాటు గవర్నర్లు, గవర్నర్ జనరల్ ఆధీనంలో గాక కంపెనీ ఆధీనంలోని అనేక ప్రాంతాలలో చీఫ్ కమీషనర్‌లను నియమించి వాటిని గూడ రాష్ట్రాలుగా గుర్తించడం జరిగింది.

1853 చట్టం పై విధంగా అనేక మార్పులు చేసి భారతదేశంలో కంపెనీ ప్రభుత్వాన్ని దాదాపు బ్రిటిష్ ప్రభుత్వానికి జవాబు దారిగా చేసిందని చెప్పవచ్చు. ప్రతి 20 ఏళ్లకొకసారి కంపెనీ పాలనా వ్యవహారాలు పరిశీలించారనే విషయం ఇందులో తెలియజేయడం వల్ల ప్రభుత్వానికి కంపెనీ పాలన పట్ల గలిగిన ఉదాసీనత తెలుస్తుంది. కౌన్సిల్ సభ్యుల సంఖ్యను పెంచి, శాసనాలను రూపొందించే విషయంలో గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కు విస్తృత అధికారాలు ఇవ్వడం వల్ల భారతదేశంలో బ్రిటిష్ పార్లమెంట్ లాగా శాసనాలు కౌన్సిల్ చర్చల అనంతరం రూపొందించబడ్డాయి. ఇంగ్లండులోని అధినేతలు ఊహించని విధంగా ఈ కౌన్సిల్ కొన్ని సందర్భాలలో ప్రభుత్వ పక్షాన్ని విమర్శించడానికి గూడా పూనుకొనగలిగింది. కొందరు భారతీయుల దృష్టిలో ఈ కౌన్సిలు తరవాత భారతదేశంలో

ఏర్పడిన రాజ్యాంగ శాసన సభకు పునాది వంటిది. కాని అప్పటి బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడైన చార్లస్ ఉడ్ దృష్టిలో కౌన్సిల్ కేవలం ప్రభుత్వ అధికారాన్ని విస్తృత పరచడానికి మాత్రమే వినియోగించబడింది.

## సాధారణ పరిపాలన ;

బ్రిటిషు ప్రభుత్వం దాదాపు ఆరు వేల మైళ్ల దూరంలో ఉండటం, భారతదేశంలోని పరిపాలనా విషయాలను స్వయంగా గమనించలేని కారణంగా గవర్నర్ జనరల్‌కు, అతని కౌన్సిల్‌కు అప్పజెప్పింది. భారతదేశంలో పరిపాలనా అధికారాలన్నిటికి గవర్నర్ జనరల్ బాధ్యుడు. కాని అతడు బ్రిటిష్ ప్రభుత్వానికి లోబడి పరిపాలనను నిర్వహించాలి. భారత దేశంలోని పరిపాలన సివిల్ సర్వీసు, సైన్యం, పోలీసు మొదలగు సంస్థల పై ఆధారపడింది. బ్రిటిషు వారి పరిపాలనోద్దేశం వాణిజ్యాభివృద్ధి గాబట్టి, వాణిజ్యాన్ని నిరాటంకంగా కొన సాగించడానికి తగు రక్షణ దేశ వ్యాప్తంగా శాంతి భద్రతలు అవసరం. అందువల్ల పరిపాలనను కేంద్రీకరించారు.

మన దేశంలోని సివిల్ సర్వీసుకు పునాది వేసినవాడు లార్డ్ కారన్ వాలీసు. కంపెనీ అధికార్లు తీరిక సమయాల్లో కొనసాగించిన సొంత వ్యాపారాన్ని నిషేదించాడు. వారు బహుమానాల రూపంలో తీసుకొనే లంచాలను రద్దు పరచాడు. వారికి మంచి జీతాలిప్పించి ఉద్యోగ నిబంధనలను మెరుగు పరచాడు. బ్రిటిషువారు స్వతహాగా పరిపాల కులని, భారతీయులు పరిపాలనకు మాత్రమే అర్హులని కారన్ వాలీసు బహిరంగంగా చెప్పుకొనేవాడు. పరిపాలనలో అతి తక్కువ ఉద్యోగాలను మాత్రం స్థానికులకిచ్చేవాడు. లార్డ్ వెల్లస్లీ భారతదేశంలోని బ్రిటిష్ ఉద్యోగులకు తర్ఫీదు ఇవ్వడానికై ఒక ప్రత్యేక కళాశాలను ఏర్పాటు చేశాడు. 1806లో కంపెనీ డైరెక్టర్లు ఇంగ్లండులోని హైలీబ్యూరి కళాశాలను ఏర్పాటుచేశారు. ఇది 1858 వరకు కొనసాగింది. హిందూదేశంలో ఉద్యోగం లో చేరాలనుకొన్న ప్రతి ఒక్కరూ హైలీబరీ కళాశాలలో చేరి చదవాలనే నియమ ముండేది. 1853 చార్టర్ చట్టం ప్రకారం పోటీ పరీక్షలు నిర్వహించి అందులో ఉత్తీర్ణులైన వారికి మాత్రమే ఉన్నతోద్యాగ్యాలు ఇచ్చేవారు ఉద్యోగ విషయాలలో బ్రిటిష్ కంపెనీ అధికార్లు భారతీయులను దూరంగా ఉంచారు. మద్రాసు గవర్నరుగా పనిజేసిన సర్ థామస్ మన్రో అన్నట్లు "హిందూ దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం స్థానికులను వెలివేసిన విధంగా మరే దేశంలోను జరిగినట్లు ఉదాహరణకు గూడ లభించదు."

భారతదేశంలోని బ్రిటిష్ పాలనా వ్యవస్థలో వెన్నెముక వంటిది జిల్లా పాలనా యంత్రాంగం. రెగ్యులేటరీ రాష్ట్రాలలోని జిల్లాలకు కలెక్టరు, నాన్ రెగ్యులేటరీ జిల్లాలకు డిప్యూటి కమీషనర్ ప్రధాన అధికార్లు. అతని కింద అసిస్టెంట్ కలెక్టర్లు, లేదా డిప్యూటి కలెక్టర్లు ఉండేవారు. తాలుకా పరిధిలో తహసిల్దారు లేదా మామలత్‌దార్ అధికారి.

కలెక్టరుకు జిల్లాలోని రెవెన్యూ వసూలు బాధ్యత ఉండేది. జిల్లా మాజిస్ట్రేటుగా అతనికి కొన్ని న్యాయ విచారణాధికారాలు గూడా ఉండేవి. బ్రిటిష్ ప్రభుత్వ ఉత్తరవులను సక్రమంగా అమలు జరపడానికి శక్తివంతంగా రెవెన్యూ వసూలు చేయడానికి జిల్లా యంత్రాంగం మొదటి నుంచి ప్రధానపాత్ర వహించింది. భారతదేశంలో ఇప్పటికీ జిల్లాయంత్రాంగం అదే పద్ధతిలో కొనసాగుతున్నదనిన అతిశయోక్తి లేదు.

బ్రిటిష్ తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వానికి సైనిక సహాయం మిక్కిలి అవసరం. ఇతర ఐరోపా శక్తుల నెదుర్కొనడానికి, సామ్రాజ్య విస్తరణ కార్యక్రమాన్ని కొనసాగించడానికి, సైనిక అవసరం ఎక్కువగా తోచింది. సైన్యంలోని ఉన్నతోద్యోగులు ఇంగ్లండు నుంచి వచ్చినవారు. కాని తక్కువ స్థాయిలోని సైనికులందరు స్థానికులు. వెల్లస్లీ ప్రవేశపెట్టిన సైన్యసహకార పద్ధతి మూలంగా బ్రిటిష్‌వారు స్థానిక రాజుల సైన్యాలను రద్దు చేసి పాశ్చాత్య పద్ధతులలో సైన్యాలను రూపొందించడానికి వీలైంది. సైన్యంలో దాదాపు సైనికులందరు భారతీయులు. వీరు ప్రధానంగా ఉత్తర ప్రదేశ్ బీహార్ ప్రాంతం నుండి వచ్చారు. 1857 లో భారతదేశంలోని బ్రిటిష్ సైన్యం మొత్తం 311400. అందు 265,900 మంది భారతీయులు. సైన్యంలోని ఉన్నతోద్యోగాలన్నీ బ్రిటిష్ వారికి మాత్రమే కేటాయించబడినవి. కీలకమైన ప్రాంతాలన్నిటిలో బ్రిటిష్ సేనలు సమీకరించబడ్డాయి. దీనిచే సంస్థానాధీశులను తమ అధికారం క్రింద ఉంచడానికి వర్తకాన్ని పరిరక్షించడానికి కంపెనీ ప్రభుత్వానికి వీలైంది. బ్రిటిష్‌వారి ఉప్పు తిన్నామన్న దృష్టితో వారికి చేదోడు వాదోడుగా ఉండి, మన దేశంలోని స్వదేశీరాజులతో జరిపిన పోరాటాలలో ఆంగ్లేయుల విజయాలకు పాటుబడ్డారు.

పరిపాలనా యంత్రాంగానికి ప్రాధాన్యత ఇచ్చినట్లే కంపెనీ పాలకులు పోలీసులు విభాగానికి గూడా ప్రాధాన్యత ఇచ్చారు. కారన్ వాలీసు తన పరిపాలనా సంస్కరణలలో పోలీసు విభాగాన్ని సృష్టించడానికి గొప్ప కృషిచేశాడు. సుమారు 20 మైళ్ల విస్తీర్ణం గల ప్రతి ప్రాంతానికి ఒక పోలీసు ఠాణాను స్థాపించి, ఒక్కొక్క ఠాణాకు ఒక "దరోగా" అనునొక పోలీసు అధికారిని నియమించాడు. జిల్లా విభాగంలో పోలీసు సంస్థను పర్య వేక్షించడానికి జిల్లా సూపరెండెంటు ఉండేవాడు. కాని స్థానికులను అటువంటి ఉద్యో గాలకు దూరంగా ఉంచారు. హిందూదేశంలో శాంతి భద్రతల బాధ్యత చాల వ్యయ ప్రయాసలతో కూడుకొన్నదని కంపెనీ అధికార్లు గుర్తించారు. లార్డ్ హేస్టింగ్స్ పిండారీలను నిర్మూలించ గలిగాడు. విలియం బెంటింగ్ విలియం స్లీమన్ అనునతని ఆధ్వరంలో థగ్గులనే దొంగల ముఠాలను అణచగలిగాడు. 1858 తర్వాత పోలీసు విభాగం పునర్వ్యవస్థీకరమై పటిష్టమైంది.

వలస పాలనకు ముందు శిక్షా విధానాలు అతి క్రూరంగా ఉండేవి. అంగ విచ్ఛేదం, కొరడా దెబ్బలు మొదలైన కఠిన శిక్షలు సర్వసాధారణంగా ఉండేవి. కంపెనీ స్థాపనా

నంతరం శిక్షల విధింపు విధానంలో కొన్ని మార్పులు సంభవించాయనవచ్చు. అయినా భారతీయులను బ్రిటిష్ వారిని నేర విచారణలోనే గాక శిక్షల విధించుటలో గూడ భిన్నంగా చూసే వారు. భారతదేశంలోని జైళ్లు సంతృప్తికరంగా ఉండేవి కావు. ఖైదీలు మందలు మందలుగా ఆరోగ్య సదుపాయాలు లేని, కనీసం గాలి వెలుతురు కూడ సక్రమంగా లేని జైలు గదులలో క్రుమ్మబడుతుండేవారు. అటువంటి పరిస్థితులను జాన్ హోవార్డ్ సూచనల మేరకు సవరించారు. అనేక అభివృద్ధి పథకాలు చేపట్టారు జైలు కేవలం శిక్షలను అమలు పరచు స్థలంగా మాత్రమేగాక, ఆత్మవిమర్శనానికి, నడవడి మార్చుకోడానికి అవకాశం గల స్థావరంగా, సంస్కారాభివృద్ధికి అనువైన స్థలంగా రూపొందించవలసిన అవసరాన్ని గురించి అనేకులు సూచించడం జరిగింది. దీనితో ఖైదీల జీవితాలకు పనికివచ్చే వృత్తి పనులుగూడ జైళ్లలో నేర్పడం ప్రారంభించారు. జైళ్లు ఖైదీలను సంస్కరించడానికి కూడ కావలసిన జాగ్రత్తలు తీసుకొనడం ప్రారంభించాయి.

## న్యాయస్థానాలు :

కంపెనీ పాలన తొలి రోజుల్లో యూరోపియన్ల మధ్య ఉత్పన్నమైన తగాదాలను పరిష్కరించడానికి విచారణా న్యాయస్థానాల స్థాపనతో సంతృప్తి పడింది. 18వ శతాబ్ద ప్రారంభంలో మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలలో "మేయర్‌కోర్టులు" స్థాపిత. మయ్యాయి. బెంగాలు కంపెనీకి "దివాని" అధికారాలు సంక్రమించినప్పుడు క్రిమినల్ న్యాయవిచారాణాధికారం నవాబు అధీనానికి వదలి పెట్టడం జరిగింది. పన్ను వసూలుచేసే అధికారం సివిల్ నేర విచారణ కంపెనీ చేపట్టింది. కాని ఈ పద్ధతి కొద్ది కాలంలోనే సక్రమంగా పనిచేయలేదని తెలిపోయింది. వారన్ హేస్టింగ్స్ న్యాయపరిపాలన విధానాన్ని మార్చి వేశాడు. జిల్లాలో స్థానిక సివిల్ న్యాయ స్థానాలను కలెక్టరు అదీనంలో ఉంచాడు. అతనికి సహాయ పడటానికి హిందూ ముస్లిం అధికార్లు నియమిత మయ్యారు. చిన్న చిన్న ఫిర్యాదులకు ప్రత్యేక సబార్డినేట్ న్యాయాధి పతులుండేవారు. వీరిపై రాష్ట్రీయ న్యాయ స్థానాలు, వాటిపై "సాదర్ దివాని అదాలత్" అనబడే కోర్టులు స్థాపితమయ్యాయి. క్రిమినల్ న్యాయ విచారణకై "సాదర్ నిజామత్ అదలత్" ప్రత్యేకంగా స్థాపితమయింది.

రెగ్యులేటింగ్ చట్టం అమలులోకి వచ్చిన తర్వాత ఒక సుప్రీంకోర్టు స్థాపితమయింది. అందులో ఒక ప్రధాన న్యాయమూర్తి, ముగ్గురు సాధారణ న్యాయమూర్తులుండేవారు. వీరు బ్రిటిష్ ప్రభుత్వం నియమించినవారు. కాని సుప్రీంకోర్టులో ఏచట్టాన్ని అనుసరించాలనేది ఇదమిత్థంగా లేదు. ఐనా ఇంగ్లీషు చట్టాన్ని అందులో అనుసరించారు. దిగువ న్యాయ స్థానాలలో మాత్రం, హిందూ, ముస్లిం చట్టాలను రెండింటినీ అనుసరించారు. పరస్పర విరుద్ధభావాల న్యాయ విధులలో ఈ న్యాయస్థానాలు చాలా కాలం కొనసాగాయి.

సివిల్ క్రిమినల్ న్యాయచట్టాలను క్రోడీకరించడానికి న్యాయచట్టాలను పునర్వ్యస్థీకరించడానికి కంపెనీ ప్రభుత్వం చర్యలు తీసుకొంది. భారతీయ, బ్రిటిషు న్యాయచట్టాలలో మేలైన వాటినన్నిటిని కొనసాగింపజేయడానికై 1833లో ఒక ప్రత్యేక న్యాయ విషయాల సభ్యుడు గవర్నర్ జనరల్ కౌన్సిలులో నియమితమయ్యాడు. లార్డ్ మెకాలె ఆ విధంగా నియమితుడైన మొదటి న్యాయవిషయాల సభ్యుడూ అతని ఆధ్వర్యంలో క్రోడీకరించిన చట్టాల గురించి సర్ జాన్ స్ట్రాచి ఈ విధంగా చెప్పాడు. "హిందూదేశంలోని అన్ని చట్టాలలోను దీనికన్న ప్రధానమైంది మరొకటి లేదు. ఇది శాంతి సౌఖ్యాన్ని ప్రసాదించగలదు. అధికార యంత్రాంగాన్ని క్రమబద్ధం చేసి నేరాలను తగ్గించి నేరస్థులను శిక్షించగలదు."

చట్టాల ముందు అందరూ సమానులే అను సమన్యాయ భావాన్ని "రూల్ ఆఫ్ లా" బ్రిటిష్‌వారు మనదేశంలో ప్రవేశపెట్టారు. బ్రిటిషువారు రాక పూర్వం న్యాయ పరిపాలనలో కులతత్వ విషయాలు ప్రధానపాత్ర వహించాయి. అటువంటి వ్యత్యాసాలను తొలగించారు. కాని బ్రిటిష్ న్యాయస్థానాలలో కూడ కొన్ని లోపాలు లేకపోలేదు. అవి చాల వ్యయంతో కూడినవి. అవి అమిత కాలహరణకు, సంధిగ్ధతకు పేరు పొందాయి. కొందరి జీవితకాలంలో కొన్ని కేసులు ముగిసేవికావు. కోర్టు ఫీజులు ఎక్కువ. న్యాయవాదులు అమితంగా ధనాన్ని ప్రజలనుండి వసూలు చేసేవారు. సామాన్య ప్రజానీకానికి బ్రిటిష్ న్యాయస్థానాలు ఆవరోధాలుగానే ఉండేవి,



# అధ్యాయం – 8

## విద్యావ్యాప్తి భావ చైతన్యం

వర్తకులుగా భారత దేశానికి వచ్చిన బ్రిటిష్ వారు అనేక ప్రాంతాల నాక్రమించి అధికారాన్ని స్థాపించిన తరవాత పరిపాలనా నిర్వహణకు అనుకూలంగా వారి అధికారానికి స్థిరత్వం చేకూర్చే ఉద్దేశంతో భారతదేశంలోని సంస్థాగత మార్పులకు నాందిగా బ్రిటిష్ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టారు. బ్రిటిష్‌వారి మత ప్రచార కార్యకలాపాలు విద్య, ఆరోగ్య కార్యక్రమాలలో ముడిపడి ఉండేవి. పాశ్చాత్య విద్యా విధానాన్ని అమలు జరపడానికి ఇంగ్లీషును బోధనా భాషగా ప్రవేశపెట్టారు.

కంపెనీ అధీనంలో జరిగిర విద్యావ్యాప్తిని రెండు దశలుగా విభజించవచ్చు. 1772 నుంచి 1818 వరకు గలది మొదటి దశ, 1818 నుండి 1857 వరకు రెండవ దశ. మొదటి దశలో ఇంగ్లండు అమెరికాలో కొనసాగిన స్వాతంత్ర పోరాటాన్ని ఒకవైపు, మరొకవైపు ఫ్రెంచి విప్లవాన్ని దాని తరవాత నెపోలియన్ యుద్ధాలను ఎదుర్కొనవలసి వచ్చింది. అందుచేత విద్యా విషయకమైన మార్పులుచేసే అభిలాష ఏర్పడలేదు. రెంవవ దశలో అట్లా గాక ఆంతరంగికంగా ఇంగ్లండు శాంతియుతంగా కొనసాగింది. నెపోలియన్ యుద్ధాలు ముగిశాయి. బ్రిటిష్ పాలకులు భారతదేశంలో తమ పాలనా సౌలభ్యానికి తగు చర్యలు తీసుకొనే అవకాశం మెండుగా లభించింది. అన్నింటికిమించి విద్యావ్యాప్తిపై కచ్చితమైన దృక్పథాలు గల పరిపాలకులనేకులు భారతదేశంలో కంపెనీ అధికార్లుగా రావడం గమనార్హం. ఎల్ఫిన్‌స్టన్, సర్ థామస్ మన్రో, బెంటింక్ అటువంటి కోవకు చెందినవారు. వారు తీసుకొన్న చొరవ మూలంగా భారతదేశంలో ఇంగ్లీషు భాష ప్రవేశపెట్టడానికి వీలైంది.

1757లో ప్లాసీ యుద్ధంలో సాధించిన విజయంతో బెంగాల్ బ్రిటిష్ వారి అదీనం లోకి వచ్చింది. కాని 1764లో దివాని అధికారాలు పొందిన తరవాతనే బెంగాల్ ఆక్రమణకు సుస్థిరత ఏర్పడింది. బెంగాల్ పాలనాధికారాలను కంపెనీ ప్రభుత్వం చేపట్టింది. కంపెనీ ప్రభుత్వం భారతీయులను విద్యావంతులను చేసే బాధ్యత స్వీకరించలేదు కాని కంపెనీ ఉద్యోగులుగా భారతదేశానికి వచ్చిన వారందరూ విద్యావ్యాప్తికి తగు చర్యలు తీసుకోవాలని మాత్రం ప్రభుత్వాన్ని కోరుతూ వచ్చారు. విద్యాప్యాప్తికై కంపెనీ ప్రభుత్వం కొంత వరకు ప్రయత్నించింది. 1781లో అప్పటి గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ "కలకత్తా మదర్సా"ను స్థాపించి అరబిక్ పారశీక భాషలలో బోధించే ఏర్పాట్లు చేశాడు. అతని ఉద్దేశంలో అది "బాధ్యతాయుతమైన ఉన్నతోద్యోగాలకు దేశీయ ముస్లింలను తర్ఫీదు చేయడానికి" స్థాపితమయింది. కొద్ది సంవత్సరాల అనంతరం జాన్ ఓవన్ స్థానికులకు ఆంగ్లాన్ని బోధించడానికై పాఠశాలలను స్థాపించమని ప్రభుత్వాన్ని అర్థించాడు. అయితే

దీనిని ఎవరూ ఖాతరు చేయలేదు. 1791లో బెనారస్‌లోని ఒక కంపెనీ ఉద్యోగి జోనాథన్ డంకన్ అనే ఆయన చేసిన ప్రయత్నాలు ఫలించి అక్కడ ఒక సంస్కృత కళాశాల స్థాపితమయింది. హిందువుల చట్టాలను, వాఙ్మయాన్ని, మతాన్ని పరిరక్షించడానికి, ముఖ్యంగా బ్రిటిషు న్యాయ వేత్తలకు కావలసిన హిందూ సహాయకులను తయారు చేయడానికి ఇది ఉద్దేశించబడింది.

బ్రిటిష్ పార్లమెంట్‌లో భారతదేశంలో అనుసరించవలసిన విద్యా విధానాన్ని గురించి ప్రధానంగా 1792–93 ప్రాంతంలో చర్చలు కొనసాగిన తరుణంలో విల్బర్ట్‌ఫోర్స్ అనే పార్లమెంట్ సభ్యుడు కొన్ని సూచనలు చేశాడు. భారతదేశానికి ఉపాధ్యాయులను, మిషనరీలను, అధిక సంఖ్యలో పంపాలని అతడు సూచించాడు. కాని భారతీయులకు అప్పటికున్న విద్యా పద్ధతులను మార్చి, బ్రిటిష్ పద్ధతులను ప్రవేశపెట్టే అవసరంలేదని భావించి కంపెనీ ప్రభుత్వం విల్బర్ట్‌ఫోర్స్ సూచనలను తోసిపుచ్చింది.

తూర్పు ఇండియా కంపెనీ డైరెక్టర్లలో ఒకరైన చార్లెస్ గ్రాంట్ భారతదేశంలో విద్యా సౌకర్యాలు అభివృద్ధిచేసి ఆంగ్ల భాషను ప్రవేశపెట్టి విద్యావ్యాప్తి మూలంగా కొత్త విధానాలకు, ఉద్దేశాలకు ప్రాబల్యం కలిగించాలని, దీనికి కంపెనీ శ్రద్ధ వహించాలని సూచించాడు అతని ఉద్దేశం ప్రకారం మహమ్మదీయులకు పూర్వం, పారశీక అరబిక్ భాషలు ప్రవేశపెట్టి ప్రచారానికి తెచ్చినట్లు ఆంగ్లేయులు ఆంగ్ల భాషను బోధించాలి. క్రమేణ ఆంగ్లాన్ని బోధించే పాఠశాలలు స్థాపించి, ఆంగ్ల భాషా గ్రంథాలను విరివిగా పంచిపెట్ట భారతీయులకు ఆంగ్ల భాషాబోధనకు తగు తర్ఫీదు ఇవ్వాలని ఈయన భావించాడు. అటువంటి సూచనలతో క్రైస్తవ మిషనరీలు గూడ ఆంగ్ల భాష మూలంగా మత ప్రచారం సులభమని భావించి ఆంగ్ల విద్యావ్యాప్తికి ఇష్టం చూపారు. ముఖ్యంగా శెరంపూర్‌లోని క్రైస్తవ మిషనరీలు అటువంటి ఆంగ్ల విద్యావిధానానికి అమిత ఆసక్తి చూపారు. 1800లో లార్డ్ వెల్లస్లీ కలకత్తాలో ఫోర్ట్ విలియం కళాశాలను స్థాపించాడు. ఇది కంపెనీ అధికారులకు భారతీయ భాషలు, భారతీయ ఆచార వ్యవహారాలు నేర్పడానికి ఉద్దేశించబడింది. ఈ కళాశాల ఒక ఆంగ్ల–హిందూస్థాని నిఘంటువు, హిందుస్థాని వ్యాకరణ శాస్త్రం మొదలైన గ్రంథాలను, గూడా ప్రచురించింది. కాని కంపెనీ డైరెక్టర్లు ఈ కళాశాలకు విముఖత చూపిన కారణంగా రెండేళ్ళు మాత్రం కొనసాగిన ఈ కళాశాల 1802లో మూసి వేయబడింది.

1813లో ప్రవేశ పెట్టిన చార్టర్ చట్టంలో హిందూ దేశంలోని కంపెనీ అధీనంలోని ప్రాంతాలలో విద్యాభివృద్ధికి లక్ష రూపాయిలు కేటాయించడం జరిగింది. ప్రాచీన భారతీయ భాషలను పెంపొందింపచేయడానికి, ఈ మొత్తం వెచ్చించాలని ఉద్దేశించారు భారతీయులు తమ భాషలలో పాండిత్యాన్ని గడించినట్లయితే వారు కంపెనీ పరిపాలనకు పనికివస్తారని బ్రిటిష్‌వారు అప్పట్లో భావించారు న్యాయస్థానాలలో హిందూ మహమ్మదీయ చట్టాలను

అనుసరించిన కారణంగా న్యాయవేత్తలకు సంస్కృతం, అరబిక్ పారశీక భాషలు తెలిసిన భారతీయుల సహాయం అవసరమైంది. దేశంలోని సంస్థానాధీశులలో ఉత్తర ప్రత్యుత్తరాలు చేయడానికి ఇతర లావాదేవీలకు బ్రిటిష్ వారికి ఈ భాషలు తెలిసిన వారి సహాయం అవసరమైంది. రెవెన్యూ, వాణిజ్య శాఖలలో పనిచేసే అధికారులు తమ విధుల నిర్వహణకు భారతీయ భాషలు నేర్చుకోవలసిన అవసరముండేది. కాని ప్రభుత్వంలో ఉన్నత పదవులు పొందడానికి భారతీయులకు ఆంగ్ల భాష నేర్చుకోవాలనే ఆకర్షణ లేకపోలేదు. అందుచేత ఆంగ్ల భాషాబోధన అటు కంపెనీకి, ఇటు స్థానికులకు, లాభదాయకంగా ఉన్నట్లు భావించారు.

క్రైస్తవ మిషనరీలు భారతదేశంలో విద్యావ్యాప్తికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చాయి. 1717లో డేనిష్ మిషనరీలు మద్రాసులో రెండు పాఠశాలలను నిర్వహించాయి అనేక ఇతర ప్రాంతాలలో గూడ అటువంటి పాఠశాలలు స్థాపించారు. 1820 నాటికి దేశవ్యాప్తంగా మత ప్రచారోద్యమాన్ని కొనసాగించినా విద్యావ్యాప్తి వారి ప్రధాన ఉద్దేశంగాదు. ఆంగ్ల భాష మూలంగా మతవ్యాప్తి త్వరితగతితో సాగుతుందని వారి ఉద్దేశం. అందుచేత మత ప్రచారకులు అనేక విద్యాలయాలను స్థాపించారు. బొంబాయిలో "విల్సన్ కళాశాల" మద్రాస్‌లో "క్రైస్తవ కళాశాల" స్థాపితమైయ్యాయి. 1853లో ఆగ్రాలో "సెయింట్ జాన్ కళాశాల" ప్రారంభించడం జరిగింది. తరవాత మచిలీపట్నం నాగపూర్‌లలో గూడ అటువంటి కళాశాలలు స్థాపితమయ్యాయి. ఈ విద్యాసంస్థలలో బైబిల్ పఠనం తప్పనిసరిగా కొనసాగేది విద్యావ్యాప్తితో బాటు మత ప్రచారాన్ని అధికం చేయాలనే వారి ఉద్దేశం అటువంటి కళాశాలల స్థాపన మూలంగా తెలుస్తుంది.

## ఆంగ్ల విద్య పట్ల ఆసక్తి :

పాశ్చాత్య విద్యా విస్తరణకు, ఆంగ్ల భాష ప్రవేశానికి ముఖ్యకారణం ఆర్థిక అవసరం ఆంగ్ల భాష అధ్యయనం మూలంగా కంపెనీ పాలనలో ఉద్యోగావకాశాలు లభిస్తాయని అధిక సంఖ్యలో స్థానికులు ఆంగ్ల భాషను అభ్యసించడానికి సుముఖత చూపారు. ప్రాచీన భారతీయ భాషలను నేర్పడాన్ని వారు హర్షించలేదు. ఉదాహరణకు రాజారామమోహన్‌రాయ్ కలకత్తా మదర్సాను ప్రభుత్వం అభివృద్ధి చేయడాన్ని వ్యతిరేకించాడు. అలాగే అక్కడి సంస్కృత కళాశాలలకు అధిక నిధులను కేటాయించడాన్ని వ్యతిరేకించాడు. భారతీయులు ఐరోపియన్ భాషలు నేర్చుకోడానికి, విజ్ఞాన శాస్త్రాలను, అభ్యసించడానికి ప్రభుత్వం ఒక విద్యాలయన్ని స్థాపించాలని అర్థిస్తూ రాంమోహన్‌రాయ్ ఒక సంఘాన్ని గూడా స్థాపించాడు. ఫలితంగా 1817లో "హిందూ కళాశాల" స్థాపితమయింది. అది కేవలం ఉన్నత విద్య కేంద్రం మాత్రమే గాక 19వ శతాబ్దంలో జాతీయ పునర్వికాసానికి కీలకమైన సంస్థగా పేరుపొందింది. మరుసటి సంవత్సరం కలకత్తా బిషప్ మరొక విద్యాసంస్థ స్థాపించాడు. దానిలో యువకులైన క్రైస్తవ మత ప్రచారకులకు తగు శిక్షణ ఇవ్వడంతోబాటు భారతీయ

విద్యార్థులకు ఆంగ్ల భాషను బోధించే కార్యక్రమం కూడా కొనసాగించబడింది. 1835నాటికి కలకత్తాలో దాదాపు ఆరువేల మంది భారతీయ విద్యార్థులు ఆంగ్ల భాషను అభ్యసించేవారు. బొంబాయి గవర్నరైన ఎల్ఫిన్‌స్టన్ ఆంగ్ల విద్యను, విజ్ఞాన శాస్త్రాన్ని బోధించే పాఠశాలలను సాపించమని ప్రభుత్వాన్ని కోరాడు. ఉద్యోగాలకు స్థానికులను తయారు చేయడం బ్రిటిష్ కంపెనీ విద్యావిధానపు ముఖ్య ఉద్దేశమని అతడు భావించాడు.

ఇంగ్లీషు భాషను సమర్థిస్తూ రాజారాంమోహనరాయ్ భారతదేశంలో అప్పటికి అమలులో ఉన్న విజ్ఞానంతో యువకులు సంఘంలో సరైన సభ్యులు కాజాలరని ఖచ్చితంగా తెలిపాడు. ఆధునిక విజ్ఞాన శాస్త్రం, అధ్యయనవు ఆవశ్యకత గురించి రామమోహనరాయ్ ఇట్లా వ్రాశాడు. "దేశాన్ని పూర్తిగా అంధకారంలో ఉంచడం ప్రభుత్వ ఉద్దేశమైతే సంస్కృత విద్యకు ప్రాధాన్యం ఇవ్వవచ్చు, ఆ విధంగాకాక దేశ ప్రజల అభివృద్ధిని కాంక్షించినట్లైతే ఉదాత్తమైన కొత్త విద్యావిధానాన్ని చేపట్టి, గణితం, రసాయన శాస్త్రం, శారీరక శాస్త్రం మొదలైన ఉపయోగకరమైన శాస్త్రాల అధ్యయనాన్ని ప్రోత్సహించవచ్చు" రామమోహన్ రాయ్ ఆనాటి అభ్యుదయ భావాలు గల భారతీయుల ఉద్దేశాలకు అద్దం పట్టాడు అనవచ్చు.

క్రమేణ కంపెనీ ప్రభుత్వం అధీనంలోను, మిషనరీలు అధీనంలోను అనేక విద్యా సంస్థలు ప్రారంభం కావడం వల్ల ఆ భాషను అభ్యసించడానికి ప్రజలలో కుతూహలం ఎక్కువయింది. ఆంగ్ల భాషా గ్రంథాలు విరివిగా అమ్ముడయ్యాయి. అప్పటికే స్థాపితమై ఉన్న కళాశాలల్లో గూడా ఆంగ్ల భాషను బోధించడం ప్రారంభించారు. ఆ సమయంలో ఆంగ్ల భాషను బోధించాలా? లేదా! పారశీక, అరబిక్ భాషలు బోధించాలా అనే విషయమై వాదోపవాదాలు ప్రారంభమైయ్యాయి. వివాదాన్ని పరిష్కరించడానికి ఒక కమిటీ నియమింపబడింది... మయింది. కాని ఆ కమిటీకూడా ఏకాభిప్రాయానికి రాలేదు. ఆ కమిటీలో లార్డ్ మెకాలెగూడ సభ్యుడు. అతడు గవర్నర్ జనరల్ కౌన్సిలులో న్యాయ విషయాల సభ్యుడు. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్‌బెంటింక్ ఆంగ్ల భాషను బోధన భాషగా ప్రవేశపెట్టాలని భావించాడు. 1835 ఫిబ్రవరిలో మెకాలె ఆంగ్ల భాషను ప్రవేశ పెట్టటం వల్ల గల లాభాలను వివరిస్తూ తన అభిప్రాయాలను తెలియజేసే ఒక సుదీర్ఘ పత్రాన్ని తయారుచేసి గవర్నర్ జనరల్ కౌన్సిల్‌కు నివేదించారు. దానితో అతడు ఆంగ్లభాష ఆవశ్యకతను వివరిస్తూ ఇట్లా వ్రాశాడు. "భారతీయ భాషలన్నీ. కలసి అరబిక్, పర్షియన్‌తో చేర్చినా, ఒక చిన్న బీరువా లోని ఆంగ్ల గ్రంథాలకు దీటురావు" అతని ఉద్దేశంలో ఆంగ్ల పరిపాలకుల భాష ప్రపంచ వ్యాప్తంగా వాణిజ్యాన్ని పెంపొందించే భాష ఆంగ్లం మూలాన భారతదేశంలో ఒక కొత్త తరగతి ఉత్పన్నం కాగలదు. ఆతరగతి వారి రక్తం, రంగులో భారతీయులుగాను భావాలు ఆచార వ్యవహారాలలో ఆంగ్లేయులుగాను ఉంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే భారత దేశంలో "నల్లటి ఆంగ్లేయులను" తయారు చేయటమే మెకాలె ఉద్దేశం,

గవర్నర్ జనరల్ బెంటింక్, మెకాలె ఉద్దేశాలకు మద్దతునిచ్చి రామమోహన్‌రాయ్ వంటి భారతీయుల సహాయంతో 1835 మార్చినెల 7వ తేదీన ఆంగ్ల భాషను బోధనాభాషగా ప్రవేశపెట్టాడు. ఉన్నత వర్గీయులను ఆంగ్ల భాషద్వారా విద్యాధికులను చేయడం "మెకాలే పద్ధతి" లోని ప్రధాన ఆశయం. సామాన్య ప్రజల అవసరాలు మెకాలె మనసులో లేదు. ప్రభుత్వానికున్న పరిమితమైన నిధులతో భారతీయులందరిని విద్యావంతులను చేయడం అలవిగాని పని అని, ఆంగ్ల భాషను నేర్చుకొన్న ఉన్నత వర్గీయులు ఇతరులకు నేర్పగలరని, ఇతర భారతీయ భాషలుగూడా ఆంగ్లం వల్ల ప్రభావితమవుతాయని భావించాడు. ఆంగ్ల భాష బోధించే పాఠశాలలు కళాశాలలో మతబోధన ఉండదని ప్రత్యక్షంగా గాని పరోక్షంగా కాని క్రైస్తవ మత ప్రచారానికి ప్రోత్సాహం ఉండదని గవర్నర్ జనరల్ బెంటింక్ ప్రకటించాడు. ప్రభుత్వం మత మార్పిడిని ప్రోత్సహించే ఉద్దేశంతో ఆంగ్ల భాషను ప్రవేశ పెడుతున్నదని ఆందోళన చెందిన కలకత్తా ముస్లింలు సమర్పించిన విజ్ఞాపన పత్రానికి ఫలితంగా బెంటింక్ అటువంటి ప్రకటన చేశాడు.

ఆంగ్ల భాషను బోధనా భాషగా ప్రవేశ పెట్టడంతో పరిపాలనా యంత్రాంగాన్ని నడపడానికి తగు సిబ్బంది సులభంగా ఉత్పత్తి చేయడమేగాక, ఆ భాషా ప్రభావంచేత విద్యావంతులైన భారతీయులు సమకాలీన పాశ్చాత్య భావాలకు, పాశ్చాత్య విజ్ఞానానికి, పాశ్చాత్య సాంఘిక, సాంస్కృతిక భావాలు హిందూదేశానికి సులభంగా ప్రసరించి, హిందూదేశస్థుల మనోభావాలను, తీరుతెన్నులను అమితంగా ప్రభావితం చేసింది. ఐరోపాలో అప్పటికి రూపొందిన అన్ని ఉద్యమాలు హిందూదేశంలో ప్రతిధ్వనించాయి. ప్రజలు సులభంగా మార్టిన్ లూథర్, బేకన్, హ్యూమ్, హాబ్స్, బెంథమ్, టామ్‌పైన్ మొదలైన అనేక సంస్కర్తల భావాలు అవగాహన చేసుకోగలిగి ప్రభావితులయ్యారు. పాశ్చాత్య సంప్రదాయాలకులోనైన అటువంటి వర్గీయులు దేశంలోని సాంఘిక, రాజకీయ, మత, సంస్కరణ ఉద్యమాలను కొనసాగించారు. షెల్లీ, బైరన్, కీట్స్ వంటి ఆంగ్ల కవుల రచనలు, భారతీయులను ఆకర్షించాయి. భారతీయ భాషలన్నీ ఆంగ్ల వాఙ్మయంతో ప్రభావితమై నూతన పంథాలను తొక్కనారంభించాయి ఆంగ్లభాషా వ్యాప్తితో మూఢ నమ్మకాలకు తమ అసమ్మతిని బాహ్యంగా తెలియజేసారు. స్వేచ్ఛా, సత్యాలకు మత చట్టాల నుంచి విముక్తికి ఆలోచనా స్వాతంత్ర్యానికి, వ్యక్తి గౌరవానికి వారు ప్రాముఖ్యం ఇచ్చారు. బెంగాల్‌లో ప్రారంభమైన ఈ భావవికాసం ఇతర ప్రాంతాలకు గూడా ప్రసరించింది.

పాశ్చాత్య భావాల ప్రభావం, సంస్కరణాభిలాష, మత సంస్కరణోద్యమాలు, పశ్చిమ భారతదేశంలోకూడా కొనసాగాయి. బొంబాయి రాష్ట్రంలో అటువంటి ఉద్యమాల నాయకులు, ధనవంతులైన వ్యాపారులు, ఆంగ్ల విద్యనభ్యసించిన మధ్యతరగతి యువకులు బొంబాయి రాష్ట్రంలో ప్రభుత్వ అధికార్లు అంగ్ల విద్యావ్యాప్తికి చొరవ తీసుకొన్నారు. గవర్నరు వెల్లింగ్‌టన్ అనేక విద్యాసంస్థలు స్థాపించాడు. ఉన్నత వర్గాల హిందువులు,

పార్శీలు ఆంగ్ల విద్యను అభ్యసించి పాశ్చాత్య ఉద్దేశాలకు ప్రభావితులయ్యారు, 1840 నాటికి బొంబాయిలో ఎల్ఫిన్‌స్టన్ కళాశాల, పూనాలో హిందూ కళాశాల స్థాపితమయ్యాయి పార్శీలు, చిత్పవన్ బ్రాహ్మణులు, గుజరాతీ హిందువులు, పాశ్చాత్య విద్యావసరాలను గుర్తించి ఆంగ్ల భాషాధ్యయనాన్ని కొనసాగించారు. బాల్‌శాస్త్రి జంభేకర్ అనే ఆయన "బాంబే దర్పణ్" అనే మొదటి ఆంగ్లో మరాఠీ వార పత్రికను స్థాపించి భారతీయులకు పరిపాలనలో ప్రాతినిధ్యానికై పోరాడుతూ బ్రిటిష్‌వారి పరిపాలనా విధానాన్ని విమర్శిం చాడు. రామకృష్ణ విశ్వనాథ్ భారత చరిత్రను ప్రచురించి దానితో బ్రిటిష్ పాలనా విధానాలను గూడా దుయ్యబట్టాడు. గోపాలహరిదేశ్‌ముఖ్ భారతదేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోవడానికి గల కారణాలను వివరిస్తూ "ప్రభాకర్" అనే పత్రికలో వ్యాసాలు రాశాడు.

1854లో భారతదేశంలో ఆంగ్ల విద్యాబోధనకు అమిత ప్రోత్సాహమిచ్చే ఉద్దేశంతో అప్పటి బోర్డ్ ఆఫ్ కంట్రోలు అధ్యక్షుడైన చార్లెస్ ఉడ్ ఒక తులనాత్మక నివేదికను సమర్పించాడు. అది మిక్కిలి విశాలమైన పరిధి కలిగి, భవిష్యత్తులో భారతదేశంలో విద్యా వ్యాప్తికై ప్రభుత్వం ఏ చర్యలను చేపట్టవలెనో ఆ విషయాలన్నింటిని కూలంకుషంగా చర్చించింది. ఐరోపాలో అభివృద్ధిగాంచిన అన్ని శాస్త్రాలను భారతదేశంలో వ్యాప్తిచేయడం ఆంగ్ల విద్యావిధాన ప్రధాన ఆశయమని అతడు అందులో తెలియజేశాడు. కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో విశ్వవిద్యాలయాలు స్థాపించాలని, అవి లండన్ విశ్వ విద్యాలయం మాదిరిగా పరీక్షలను నిర్వహించే సంస్థలుగా ఉండవలెనని సూచించాడు. అతని సలహామేరకు 1857లో పై మూడు నగరాలలో విశ్వవిద్యాలయాలు రూపొందాయి. ఆంగ్ల విద్యావ్యాప్తికి చార్లెస్ ఉడ్ సూచనలు ఎంతగానో దోహదం చేశాయి.

పాశ్చాత్య విద్యావిధానం, ఆంగ్ల భాషావ్యాప్తి భావాలలో సాహిత్యంలో తెచ్చిన మార్పులతోబాటు ప్రజలలో జాతీయతా సిద్ధాంతాలను గూడా రేకెత్తించాయనవచ్చు. దృక్పథాలలో ఏకీకరణను కలిగించిన ఆంగ్ల విద్య భారతీయులలో ఒక చైతన్యాన్ని కలిగించింది. భారత ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలను, చరిత్ర, నాణేలు, పురాతన కట్టడాలు మొదలైన వాటిని దేశంలోని అన్ని ప్రాంతాలవారు అవగాహన చేసుకొనడానికి ఆంగ్లభాష దోహదం చేసింది. అనేక మంది ఆంగ్లేయులు భారతదేంలోని చరిత్ర, సంస్కృతి, ప్రాచీన నాగరికతలను అధ్యయనం చేయడానికి వీలుఏర్పడింది. స్వదేశ ప్రాచీన ప్రాశస్త్యం భారతీయులకు ఆత్మస్థైర్యాన్ని కలిగించింది.

## పత్రికలు :

పాశ్చాత్య విద్యావ్యాప్తికి భారతదేశంలో పత్రికలుగూడా మిక్కిలి దోహదం చేశాయి. భావవికాసంతోబాటు రాజకీయ చైతన్యాన్ని కలిగించడానికి గూడా పత్రికలు తోడ్పడ్డాయి. జాతీయోద్యమంలో పత్రికలు వహించిన పాత్ర మిక్కిలి ప్రధానమైంది.

భారతదేశంలో ముద్రణాలయాల స్థాపన యూరోపియన్‌లరాక తరవాతనే ప్రారంభ మయ్యింది. మొట్టమొదటి సారిగా భారతదేశానికి పోర్చుగీసువారు ముద్రణాలయాన్ని తెచ్చినట్లు తెలుస్తోంది. వారు 1557లో గోవాలో మొట్టమొదటగా పుస్తక ప్రచురణ చేశారు. 1684లో తూర్పు ఇండియా కంపెనీవారు బొంబాయిలో ఒక ముద్రణాలయాన్ని స్థాపించారు. కానీ దీని తరవాత కూడా దాదాపు ఒక శతాబ్దికాలం ఆంగ్లేయులు ఏ వార్త పత్రికనూ మనదేశంలో స్థాపించలేదు. వార్తా పత్రికల మూలంగా పరిపాలనా లోపాలు ప్రజలకు తెలిసిపోతాయని మాతృదేశానికి ఆ వార్తలు చేరతాయని వారు తలచడం వల్ల పత్రికలను ప్రోత్సహించలేదు. కానీ ముద్రణాలయాలలో బైబిల్ వంటి మత గ్రంథాలను ప్రచురించేవారు. 18వ శతాబ్దంలో ఆంగ్లో ఇండియన్లు యూరోపియన్‌లు పత్రికలను స్థాపించడం ప్రారంభించారు. కనుక తొలి దశలో స్థాపించిన పత్రికలకు సమాచారాన్ని అందజేయడానికి ప్రొద్దుపోకకు ఉద్దేశించడం జరిగింది.

1780లో "బెంగాల్ గెజెట్" అనే పత్రిక ప్రారంభమయింది. కానీ ఆపత్రిక గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్‌ను విమర్శించిన కారణంగా ప్రభుత్వం దానిని రద్దుచేసింది. దీని తరవాత అనేక పత్రికలు వచ్చాయి. కలకత్తా గజెట్, బెంగాల్ జర్నల్, కలకత్తా క్రానికల్, మద్రాస్ కేరియర్, బాంబే హెరాల్డ్ మొదలయిన పత్రికలను 1784–1790 మధ్యకాలంలో స్థాపించడం జరిగింది. పత్రికా చట్టాలులేని ఆ రోజులలో పత్రికల ఉనికి కంపెనీ అధికార్ల ఇష్టాయిష్టాలపై ఎక్కువగా ఆధారపడి ఉండేది. భారత దేశంలో పత్రికలపై సెన్సారును మొట్టమొదట 1799లో విధించినవాడు లార్డ్ వెల్లస్లీ. ఒక వైపు ఫ్రెంచివారితోను, మరొక వైపు టిప్పు సుల్తాను మొదలైన స్థానిక సంస్థానా ధీశులతో నిరంతరంగా యుద్ధాలు కొనసాగిస్తూ, సైన్య సహకార పద్ధతి మూలంగా బ్రిటిష్ అధికారం వ్యాప్తిచేసిన సమయమది. తన పలుకుబడిని కించపరచడాన్ని, విమర్శనూ, సహించని సామ్రాజ్యవాది వెల్లస్లీ. ప్రతి పత్రికలో ప్రచురణ కర్తపేరు, సంపాదకుని పేరు, సొంతదారుని పేరుగూడ ప్రచురించాలని ఆయన నిర్దేశించాడు. దీనిని ఉల్లంఘించిన వారికి శిక్షలు పడేవి. 1807లో పత్రికల సెన్సార్‌షిప్ చట్టాన్ని పుస్తకాలకు, కర పత్రాలకుగూడ వర్తింపజేశాడు.

1813–1823 కాలంలో గవర్నరు జనరల్‌గా వ్యవహరించిన లార్డ్ హేస్టింగ్స్ పత్రికలపై విధించిన ఆంక్షలను తొలగించాడు. పత్రికా స్వాతంత్ర్యాన్ని నమ్మినవాడు. కాని పత్రికలు ఉన్నతాధికారులపై విమర్శలు విసరరాదని సూచించాడు. పత్రికలపై విధించిన ఆంక్షలు తొలగిన కారణంగా అనేక కొత్త పత్రికలు ప్రచురణకు వచ్చాయి. 1818లో బకింగ్‌హామ్ అనే ఆయన "కలకత్తా జర్నల్"ను స్థాపించి నిర్భయంగా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి మద్రాసు గవర్నరును కలకత్తాలోని బిషప్ మొదలగు వారిని అందులో నిశితంగా విమర్శించేవాడు. 1820లో మద్రాసు గవర్నరుగా నియమితు

డయిన సర్ థామస్‌మన్రోను బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలోని పత్రికల సమస్యలను గూర్చి పరిశీలించడానికై నియమించింది. ఆంగ్ల పత్రికలకు సంబంధించినంత వరకు వాటి పనితీరులో ఏ భయమూలేదని, పత్రికా స్వాతంత్ర్యం వల్ల భారతీయ భాషా పత్రికలు సైన్యంలో అసంతృప్తి కలిగించి. దాని మూలంగా ప్రభుత్వ పతనానికి కూడ కృషిచేయ వచ్చని, అందుచేత ప్రాంతీయ భాషా పత్రికల అదుపు అవసరమని భావించాడు. అతని ఉద్దేశంలో పత్రికా స్వాతంత్ర్యం విదేశీపాలన రెండూ ఒకదానికొకటి విరుద్ధమైనవని, అవి ఎప్పుడూ అన్యోన్యంగా సహజీవనం కొనసాగించవని ఆయన భావించాడు. మన్రో సూచనల మేరకు ప్రభుత్వం ఉత్తరువు లేనిదే ఏ పత్రికగాని, గ్రంథంగాని ప్రచురించరాదనీ ఉత్తరుపు జారీ అయింది. ఉత్తరువు పొందిన ప్రచురిత పత్రిక ప్రతి ప్రభుత్వ పరిశీలనకై సమర్పించాలనే షరతు విధించడం జరిగింది. 1823 ఏప్రిల్ 15 వ తేదీన ఈ కొత్త పత్రికా చట్టాలు అమలులోకి వచ్చాయి. రామమోహనరాయ్ ద్వారకానాథ్ ఠాగూర్ వంటి అనేక నాయకులు ఈ చట్టాలకు అసమ్మతి తెల్పినా అవి అమలు జరుపబడ్డాయి.

లార్డ్ విలియం బెంటింక్ పత్రికల పట్ల ఎంతో సహన భావం ఉన్నవాడు. కనుక పత్రికల్లో ఏ అంశానయినా క్షుణ్ణంగా చర్చించవచ్చని అభిప్రాయపడ్డాడు. ఛార్లెస్ మెట్కాఫ్ పత్రికల స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. లార్డ్ మెకాలెగూడ పత్రికల స్వాతంత్ర్యాన్ని సమర్థించాడు, కానీ 1857 తరువాత ప్రభుత్వం పత్రికల స్వాతంత్ర్యాన్ని హరించింది. పత్రికలకు రిజిస్ట్రేషన్ పద్ధతితోబాటు లైసెన్సు నిర్బంధాన్ని గూడ ప్రవేశ పెట్టింది. ముద్రణాలయాలు స్థాపించడానికి పత్రికలు నడపడానికి ముందుగా అనుమతి పొందడం తప్పనిసరి అయింది.

కంపెనీ పాలనలో ఆంగ్ల విద్య పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయ స్థాపనలో పత్రికల ప్రమేయంతో అత్యంత ఆదరాన్ని పొందింది. ప్రవేటు విద్యా సంస్థలకు ఆర్థిక సహాయం అందజేసే విధానాన్ని ప్రభుత్వం అనుసరించింది. కాని ప్రభుత్వ సహాయాని కన్న ఆంగ్ల విద్యావ్యాప్తికి ఎక్కువ కృషి చేసింది. మత ప్రచారకులు, సంపన్నమైన వర్తక వర్గీయులు, ఈ వాఙ్మయ వికాసం ప్రజలను అనేక రంగాలలో ప్రభా వితం చేసింది. అంతేకాక భాషా వికాసం సాంఘిక సంస్కరణోద్యమాలకు, జాతీయోద్యమ భావాలకు తదితర కార్యక్రమాలకు ప్రజలను ఉత్తేజ పరిచింది, దేశంలో భావైక్యత దాని మూలంగా రాజకీయ చైతన్యం కూడ ఆంగ్ల భాషా ప్రభావంతో జరిగిందనవచ్చు. దేశంలో ప్రచురితమైన పత్రికలు, గ్రంథాలుగూడ ఇందుకు దోహదం చేశాయి. భారతదేశంలో పాశ్చాత్యభావాలు, సంప్రదాయాలు ప్రచారం పొందటానికి భారతీయుల ఆచార వ్యవహారాలు, ప్రాచీన సంస్కృతీ, నాగరికతలు విదేశీయులకు తెలియజేయడానికి, ఆంగ్ల భాషావ్యాప్తి, ఒక శక్తివంతమైన సాధనంగా ఉపకరించింది.

# అధ్యాయము 9

# 1857 తిరుగుబాటు - ఫలితాలు

బ్రిటిష్ పరిపాలనా వ్యతిరేక ఉద్యమాలు బహుశా బ్రిటిష్‌వారు దేశంలో అడుగు పెట్టిననాడే ప్రారంభమయ్యాయి. కానీ ఆ ప్రతిఘటనోద్యమాలన్నీ చెదురుమదురుగా జరిగాయి. ప్లాసీ యుద్ధం తరువాత సరిగ్గా ఒక శతాబ్దానికి జరిగిన 1857 తిరుగుబాటుకు రాజకీయ ప్రాధాన్యత చాలా ఉంది. దాని వలన తూర్పు ఇండియా కంపెనీని పునాదులతో సహా పెగిలించడం జరిగింది. కంపెనీ పరిపాలన అంతమై భారతదేశంలోని బ్రిటిష్ ప్రాంతాలు 'అన్నీ సరాసరి బ్రిటిష్ ప్రభుత్వం స్వాధీనమయ్యాయి. తూర్పు ఇండియా కంపెనీ అనేక యుద్ధాలు నిర్వహించి అటు తరువాత యూరోపియనులను ఓడించి అనేక స్థానిక సంస్థానాలను రద్దుచేసింది. మైసూరు, మహారాష్ట్ర, సిక్కు యుద్ధాలు జరిపించి రాజకీయ ఆధిక్యతను, వాణిజ్య అభివృద్ధిని సాధించింధి. కానీ రాజ్యవిస్తరణానంతరం అక్రమిత ప్రాంతాలను తమ అధీనంలో కొనసాగించడానికి, పరిపాలనా సంస్కరణలను ప్రవేశపెట్టడానికి కంపెనీ ఉద్యోగులనే గాక తిరుగుబాట్లు నెదుర్కొన వలసి వచ్చింది.

లార్డ్ వెల్లస్లీ ప్రవేశపెట్టిన సైన్యసహకార పద్ధతి ద్వార దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం సుస్థిరంగా విస్తరించిందనవచ్చు. ఆ సమయం నుంచే తిరుగుబాట్లు స్థానిక నాయకుల సైనిక చర్యలు గూడా ఎక్కువైనాయి. ఉదాహరణకు 1804లో చిత్తూరు పాళెగాండ్ర తిరుగుబాటు దక్షిణదేశంలో జరిగిన అతి ప్రధానమైన ప్రతిఘటనోద్యమాలలో ఒకటి. ఆర్కాటు నవాబును పదవిచ్యుతిని చేసిన బ్రిటిష్ కంపెనీకి కప్పం చెల్లించ నిరాకరించిన చిత్తూరు చంద్రగిరి పాళెగాళ్లు దాదాపు పదిమంది తమ సైనికుల సహాయంతో సుమారు రెండేండ్ల పాటు బ్రిటిష్ వారితో ఘోరంగా తగాదాలు పడ్డారు. 1807లో వెల్లూరులో జరిగిన విప్లవం మైసూరు రాజ్యంలో టిప్పు కుటుంబాన్ని పునః స్థాపించాలనే ఉద్దేశంలో జరిగినా ఆ సమయంలో అనేక మంది బ్రిటిష్ సైనిక అధికార్లు హతులయ్యారు. 1815లో బరైలి తిరుగుబాటు, 1831–33 ప్రాంతంలో చెలరేగిన కోల్ ఉద్యమం ఈ కోవకు చెందినదే. 1846లో ఆంధ్ర ప్రాంతంలో జరిగిన కోయిలకుంట్ల నరసింహారెడ్డి తిరుగుబాటు, దాని తరువాత మద్రాసు ప్రభుత్వం ఈనాము భూముల విషయంలో అనుసరించిన అనేక పద్ధతులను పునః పరిశీలించడానికి కారణమైంది. రాజకీయ ఫలితాల దృష్ట్యా నరసింహారెడ్డి తిరుగుబాటును చాల చిన్న సంఘటనగా త్రోసిపుచ్చినా, ఆ తిరుగుబాటు ఆర్థిక పరంగా, ముఖ్యంగా కంపెనీ అనుసరించిన భూ అమరిక విధానాల విషయంలో అతి ప్రధానమైందిగా భావించవచ్చు. కోయిలకుంట్ల నరసింహారెడ్డి తిరుగుబాటు బ్రిటిష్ వారిపట్ల స్థానిక నాయకులకు కలిగిన ఏవగింపుకు ఒక ఉదాహరణ. 1848లో కాంగల, జస్వర రాజుల ఉద్య

మాలు బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా కొనసాగాయి. 1855లో సంథాల్ తిరుగుబాటు గిరిజన రైతులు కంపెనీ పాలనలో ఏ విధంగా హింసకు గురయ్యారో తెలియజేసే చక్కని ఉదాహరణ. కాని ఈ తిరుగుబాట్లన్నీ ఒక ఎత్తు: 1857లో జరిగిన తిరుగుబాటు మరొక ఎత్తు.

1857లో జరిగిన తిరుగుబాటును బ్రిటిష్ సామ్రాజ్య వేత్తలు ఒక చిన్న సంఘటనగా సిపాయిల పితూరీగా వర్ణించారు. కాని జాతీయ దృక్పథంతో భారతీయులు దానిని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా అభివర్ణించారు. ఉదాహరణకు హెన్రీ లారెన్స్, సీలీ మొదలైన వారు దీనిని సిపాయిల తిరుగుబాటు అన్నారు. రీస్ మత యుద్ధమని వర్ణించాడు. టి.ఆర్. హోమ్స్ అనే చరిత్రకారుడు దీనిని నాగరికతకు, అనాగరికతకు మధ్య జరిగిన సంఘర్షణగా భావించాడు. తిరుగుబాటు సమయంలో బ్రిటిష్‌వారు భారతీయులపై అనేక దుష్కార్యాలు కొనసాగించారు. భారతీయులు ఢిల్లీ, కాన్పూర్, లక్నో మొదలైన ప్రాంతాలలో కొద్ది మంది బ్రిటిష్ వారిని, వారి కుటుంబాలను హతమార్చారు. కానీ బ్రిటిష్‌వారు ప్రతీకారం పేరుతో అనేకమంది స్థానికులను నిర్దాక్షిణ్యంగా కాల్చిచంపారు. హడ్సన్ ఢిల్లీలో అనేకులను తన తుపాకీతో కాల్చిచంపాడు. జనరల్ నైల్ విచారణలు లేకుండా వందలకొద్ది భారతీయులను ఉరితీయించినట్లు గొప్పలు చెప్పుకున్నాడు. అలహాబాదు పరిసరాలలో సామాన్య రైతులను ఉరితీయడానికి ఉపయోగించని చెట్టు ఒకటిగూడ ఉండేదిగాదు. బనారస్ వీధుల్లో ఆడుకొనే పసి వారినిగూడ పట్టి ఉరితీశాడు. లండన్‌టైమ్స్ కరస్పాండెంట్ ప్రకారం ముస్లిం ప్రభు వర్గీయులను పంది చర్మాలతో కుట్టి వారి గొంతులో పంది మాంసాన్ని కూరేవారని తెలుస్తుంది. ఇరు పక్షాలలోను ఉద్రేకాలు ప్రజ్వరిల్లి మిగిలిన విషయాలను విస్మరింపచేశాయి. వీర సావర్కర్ వంటి జాతీయ వాదులు 1857 తిరుగుబాటును భారత దేశ ప్రథమ స్వాతంత్ర్య సమరంగా అభివర్ణించారు. అశోక్ మెహతా, ఎస్. ఎన్. సేన్ మొదలైనవారు కూడా అదేవిధంగా భావించారు,

1857 తిరుగుబాటు అనేక సంవత్సరాలుగా పేరుకొని పోయిన బలమైన అసంతృప్తికి ప్రతీకగ సంభవించిన ఉద్యమం. దీనికి గల కారణాలను సాంఘిక మత, ఆర్థిక రాజకీయ సైనిక కారణాలుగా విభజించవచ్చు.

భారతదేశంలో బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన సంస్కరణలు, దేశీయ సంప్రదాయాలను పూర్తిగా మార్చివేసే ఉద్దేశంతో చేపట్టటం జరిగింది. డల్హౌసి భారతదేశంలోని రాజ కుటుంబాలను తుడిచివేసి సాంఘిక ఆర్థిక విధానాలలో తెచ్చిన మార్పులు గాఢ అసంతృప్తికి కారణాలై ఈ తిరుగుబాటును లేవదీశాయి. అతడు ప్రవేశపెట్టిన రాజ్యసంక్రమణ సిద్ధాంతం సంస్థానాధీశులందరిలోను, అనుమానాలను రేకెత్తించింది. హిందూ రాజులకు దత్తత చేసుకొనే అధికారం నిరాకరించడం జరిగింది. ఇది హిందూ సంప్రదాయ సిద్ధంగా వచ్చిన ఆచారం. ఆ సంప్రదాయాన్ని రద్దుపరచిన డల్హౌసిని భారతీయులు నిరసించారు. సిద్ధాంతాన్ని అమలు జరిపి సతారా, జైత్‌పూర్, సంబల్‌పూర్, భాగత్, ఉదయపూర్

ఝాన్సీ, నాగపూర్ మొదలైన అనేక స్వతంత్ర రాజ్యాలను ఆక్రమించుకొన్నాడు. ఆర్కాటు నవాబు బిరుదు తగ్గించి ప్రిన్స్ ఆఫ్ అర్కాటుగా మార్చాడు. తంజావూరు రాజా బిరుదును రద్దుచేయడం జరిగింది. బాజీరావు పీష్వాకు ఇచ్చే భరణం అతని దత్త కుమారునికి నిరాకరించడం జరిగింది. మొగల్ చక్రవర్తి బిరుదును గూడ రద్దుచేయ నిర్ణయించాడు. కాని దీనికి బ్రిటిష్ కంపెనీ డైరెక్టర్లు సమ్మతించలేదు. కడపటికి చక్రవర్తిని అతని అనుయాయులను ఢిల్లీ ఎర్రకోట నుంచి అయోధ్యకు తరలించాలని తలపెట్టాడు. అయోధ్యను వశపరచుకొన్న విధానం గూడ భారతీయ ముస్లింలకు ఆగ్రహావేశాలు తెచ్చాయి. మొగలాయిలకు, మహారాష్ట్రులకు ఇద్దరికీ గూడ బ్రిటిష్‌వారు శత్రువులయ్యారు. ఇద్దరి సామ్రాజ్యాలు కబళించిన బ్రిటిష్ వారిపై వారు ఆగ్రహం వహించారు. దేశంలోని తాలుక్దార్ల వంటి భూస్వాములు గూడ బ్రిటిష్ పాలనపట్ల అసంతృప్తి చెందారు. బెంగాలులోని జమిందార్లు బ్రిటిష్ పరిపాలనచేత లాభాలు పొందినా, అయోధ్య మధ్య పరిగణాలు మొదలైనచోట్ల లార్డ్ బెంటింక్ శిస్తు మినహాయింపు పొందిన భూములను వశపరచుకొనడం చేత భూస్వాములు అసంతృప్తి చెందారు. మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో ప్రభుత్వం ఈనాం భూములను స్వాధీనం చేసుకొన్న కారణంగా, ఆ భూముల నుంచి ఫలసాయాన్ని పొందుతున్న పాళెగార్లు, స్థానిక ప్రభు వర్గీయులు అసంతృప్తి చెందారు.

రాజకీయ సంచలనంతోబాటు బ్రిటిష్ కంపెనీ పాలన సాంఘిక అసమానతను, మత పీడననుగూడ ప్రోత్సహించింది. బ్రిటిష్ పరిపాలన సామాన్య ప్రజల సాంఘిక, మతజీవన విధానాలతో అనవసర జోక్యం కలిగించుకొనడం ప్రారంభించింది. క్రైస్తవ మిషనరీలు, హిందువులను, ముస్లింలను తమ మతంలోకి మార్చించారు. అధికార్లు హిందూ ఇస్లాం మతాలను బహిరంగంగా విమర్శించాడు. మిషనరీలకు దేశంలో అనేక సౌకర్యాలను కల్పించడం జరిగింది. లార్డ్ కానింగ్ ప్రత్యేకంగా క్రైస్తవ మతవ్యాప్తికై భారతదేశానికి గవర్నరు జనరల్‌గా పంపబడినాడని వదంతులుగా చెప్పుకొనేవారు. 1856లో ప్రవేశ పెట్టిన ఒక చట్టం ప్రకారం మతం మార్పిడి వల్ల తండ్రి ఆస్తిని తనయుడు ఏ పరిస్థితిలోను కోల్పోరని ప్రకటించడం జరిగింది. ఇంగ్లండులో తూర్పు ఇండియా సంఘం డైరెక్టర్ల అధ్యక్షుడు మాంగెల్స్ పార్లమెంట్‌లో ఈవిధంగా ప్రకటించాడు. "భారతదేశంలో ఒక చివరి నుంచి మరొక చివరి వరకు క్రైస్తవ పతాకం విజయవంతంగా ఎగరవేయడానికి దైవవశాత్తు భారతదేశం ఇంగ్లండుకు అప్పజెప్పబడింది, అందుచేత ప్రతి ఒక్కరు తమ శక్తిని ధారపోసి భారతదేశంలోని అందరిని క్రైస్తవులుగా మార్చడానికి కృషిచేయాలి". మేజర్ ఎడ్వార్డ్ అనే ఆయన "హిందూదేశాన్ని మనం పాలించడానికి అర్థం అచ్చట క్రైస్తవీకరణ జరిగినప్పుడే గోచరిస్తుంది" అని ప్రకటించాడు. సైన్యంలో సిపాయిలకు ఉద్యోగాలలో ప్రమోషన్ల ఎరతో మతమార్పిడి చేయించారు. ఆగ్రాలోని అమెరికన్ మిషనరీ సొసైటీ ఒక పెద్ద ముద్రణాలయాన్ని నెలకొల్పి మత గ్రంథాలను, కర పత్రాలను ముద్రించి మత వ్యాప్తిగావించింది.

బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన విద్యావిధానం జాతీయ విలువలను మార్చింది. పండితుల, మౌల్వీల పలుకుబడి వారి అవసరాలు తగ్గాయి. వారు తమ మతం, ఆచార వ్యవహారాలు అపదలో ఉన్నాయని భయపడ్డారు. వారికి సామాన్య సహాయ సానుభూతులు లేకపోలేదు. సామాన్య ప్రజానీకంగూడ బ్రిటిష్‌వారి మతవ్యాప్తి కార్యక్రమాలను నిరసించారు.

భారత ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి ఏర్పడడానికి అతి ప్రధాన కారణం వారు అనుసరించిన ఆర్థిక దోపిడీ విధానం తమ దేశ ఆర్థిక ప్రగతిని కోరి కంపెనీ ప్రభుత్వం హిందూదేశంలోని సహజ సంపదలను కొల్లగొట్టి ముడిసరకులను, స్వదేశానికి చేరవేశారు. మన దేశంలోని పరిశ్రమలు మరుగున పడ్డాయి. భారతదేశంలో తయారైన వస్తువులకు ఎగుమతులు లేకుండా చేయడానికై వాటిపై సుంకాలు వసూలు చేశారు. వ్యవసాయ రంగంలో జరిగిన మార్పులు రైతులకు అనేక ఇబ్బందులు కలిగించాయి, భూస్వాముల సౌకర్యాల దృష్ట్యా ఈ మార్పులను చేయడం జరిగింది. సంస్థానాధీశులు తమ అధికారం పోగొట్టుకొన్న కారణంగా వారి సైన్యాలు రద్దయినాయి. సైనికులకు జీవనాధారం లేకుండ పోయింది. వారు అనేక అలజడులకూ, అశాంతికి కారకులయ్యారు. ఉన్నతోద్యోగాలకు బ్రిటిష్‌వారు మాత్రమే నియమితులయ్యారు. చదువుకున్న భారతీయులు ఉన్నత ఉద్యోగాలకు అనర్హులని బహిరంగంగా బ్రిటిష్‌వారు చెప్పేవారు. బ్రిటిష్‌వారు అనుసరించిన ఆర్థిక విధానాలు భారత రైతాంగాన్ని, చేతిపనుల వారిని, స్థానిక ప్రభువులను అందరినీ పీడించింది. అందుచేత దాదాపు అన్ని తరగతులవారు తిరుగుబాటు సమయంలో ఎదురు తిరిగారు.

భారత సైన్యంలో అసంతృప్తి చెలరేగడానికి అనేక కారణాలున్నాయి. సైన్యంలో క్రమశిక్షణ లోపించింది. సైనిక నాయకులు బ్రిటిష్‌వారు మాత్రమే ఉండవలెనన్న నియమం వలన వయోవృద్ధులైనవారు సైన్యంలో కొనసాగారు. అనేక బ్రిటిష్ సైనిక అధికారులు న్యాయ పరిపాలనా శాఖలకు బదిలీ చేయడంచేత అనుభవం ఉన్న సైనికాధికారుల సేవలు సైన్యానికి లేకపోయాయి. భారత సైన్యాల ఏర్పాటు విషయాలలోగూడ అనేక లోపాలుండేవి. బెంగాలు సైన్యం బెంగాల్‌లోని వారికేగాక వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని ప్రజలకు, ఇతర రాష్ట్రాలవారికి గూడ అన్వయింపబడి ఉండేది. అయోధ్య దాదాపు 40వేల సైనికులను బ్రిటిష్ సైన్యానికి సమకూర్చింది. కంపెనీ సైన్యంలో బ్రాహ్మణ కులానికి చెందిన వారనేకులు ఉండేవారు. వాయవ్య సరిహద్దులో సింధు ప్రాంతానికి, బర్మా సరిహద్దులకు ఇతర సుదూర ప్రాంతాలకు వెళ్ళి యుద్ధాలు చేయవలసి వచ్చింది. 1856లో లార్డ్ కానింగ్ బర్మాలో పనిచేయడానికి సైనికులు సుముఖంగాలేరని తెలిసి ఒక ప్రత్యేక చట్టాన్ని ప్రవేశ పెట్టారు. ఇది జనరల్ సర్వీసెస్ ఎన్‌లిస్ట్‌మెంట్ చట్టం. **(General Service Enlistnent Act)** దీని ప్రకారం ఉత్తరోత్తర సైన్యంలో చేరేవారు ఎక్కడికి వెళ్ళమని ప్రభుత్వం ఆదేశించినా అక్కడికి వెళ్ళడానికి సిద్ధంగా

ఉండాలి. కాని అప్పటికే సైన్యంలోని వారు ఆ విధంగా దూర ప్రాంతాలకు, ముఖ్యంగా సముద్రయానం చేసి బర్మా వెళ్ళడానికి అంగీకరించలేదు. అయోధ్యను డల్హౌసి వశపరచుకొన్నప్పుడు అయోధ్యలోని సైన్యాన్ని రద్దు చేశాడు. దీనిచే అనేక మంది స్థానిక సైనికులు అసంతృప్తి చెందారు.

హిందూదేశంలోని బ్రిటిష్ సైన్యం స్థానికులైన భారతీయులు, యూరోపియనులతో కూడుకొన్నది. యూరోపియన్లను "సోల్జర్లు" అని, భారతీయులను "సిపాయిలు" అని పిలిచేవారు. వీరిద్దరి సంఖ్యాపూర్వక నిష్పత్తి వ్యత్యాసం రోజురోజుకు అధికమవుతూ వచ్చింది. 1856లో భారత సైన్యంలో రెండు లక్షలకు మించిన స్వదేశీయులుండేవారు. కాని బ్రిటిష్‌వారు కేవలం 45 వేలకు మాత్రమే పరిమితమై ఉండేవారు. సైన్యంలో ఇరు జాతీయుల మధ్య స్నేహ సౌభ్రాతృత్వాలు లోపించాయి. భారతీయ సైనికులను బ్రిటిష్ సిపాయిలకన్నా లోకువుగా చూచేవారు. భారతీయులు బ్రిటిష్ వారికి తమ సామ్రాజ్య స్థాపనలో సహాయపడినా అత్యంత అధములుగా చూడబడ్డారు. సిపాయిలకు తగు జీత భత్యాలిచ్చేవారు కాదు. వారికి ఉద్యోగాలలో ప్రోత్సాహం చూపేవారు కాదు. సుబేదారులకు మించిన హోదాలకు భారతీయులను నియమించే వారు కాదు. అనేకమైన ఈ అసమానతలున్న కారణంగా భారతీయ సిపాయిలు మిక్కిలి అసంతృప్తి చెంది బ్రిటిషువారిపై ఎదురు తిరగడానికి సహాయం కోసం వేచి ఉన్నారు.

1857 తిరుగుబాటుకు తక్షణ కారణం కొవ్వు పూసిన తూటాలు అంతకు ముందు సంవత్సరం గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ ఒక కొత్త రకమైన ఎన్‌ఫీల్డ్ రైఫిల్‌ను ప్రవేశపెట్టాడు. ఈ రకమైన తుపాకులను ఉపయోగించడంలో తూటాలకున్న సీలు కాగితాన్ని నోటితో తొలగించవలసి ఉంది. ఆ తూటాలకు తేమ అంటకుండా చేయడానికై ఆవు, పంది కొవ్వును పూశారనే వదంతి 1857 జనవరిలో బయలుదేరింది. ఇది హిందువులను, మహమ్మదీయులను ఆందోళన పరిచింది. వారి మతాలను కించపరచడానికి అటువంటి చర్య తీసుకొన్నట్లు భావించారు. కొవ్వు పూసిన తూటాలను ఉపయోగించడానికి నిరాకరించిన సిపాయిలను క్రమశిక్షణా నెపంతో శిక్షింపసాగారు. 1857 మార్చి 29వ తేదీన సిపాయిలు బారక్‌పూర్‌లో కొత్త తూటాలను ఉపయోగించడానికి నిరాకరించారు. మంగళ్‌పాండే అనే ఒక సిపాయి బ్రిటిషు అధికారిని కాల్చి చంపాడు. కొత్త తూటాలను ఉపయోగించడానికి నిరాకరించిన 85 మంది సిపాయిలను బంధించి వారిని కఠినంగా శిక్షించారు. 1857 మే నెల 10వ తేదీ ఆదివారం మీరట్‌లో గల మూడు భారతీయ సైనిక దళాలు ఎదురుతిరిగి అధికార్లను కాల్చి, బంధించి సిపాయిలను విడుదల చేసి ముప్పైమైళ్ళ దూరంలో ఉన్న ఢిల్లీని ముట్టడించడానికి బయలుదేరి వెళ్ళారు.

మరునాడు ఢిల్లీ ప్రవేశించిన మీరట్ దళాలు అక్కడి సైన్యాలతో చేరి ఎర్రకోటను ఆక్రమించాయి అనేకమంది బ్రిటిషు అధికార్లను చంపి మొగలాయి రాజవంశానికి చెందిన బహదూర్‌షాను తమ నాయకుడుగా ప్రకటించుకొన్నారు. ఢిల్లీ నగరాన్ని తిరుగుబాటు సైనికులు ఆక్రమించుకొన్నారు. వేసవికాలమైన కారణంగా బ్రిటిష్ సైన్యాధ్యక్షుడు అన్‌సన్ అతని అధికార్లతో బాటు సిమ్లాలో ఉన్నాడు. కొద్ది కాలంలోనే విప్లవం, ఉత్తర, మధ్య హిందూ దేశానికి వ్యాపించింది. కాన్పూరులో నానాసాహెబ్ తిరుగుబాటు సైన్యాలతో జనరల్ వీలర్‌ను చుట్టుముట్టాడు. లక్నోలో సర్ హెన్రీ లారెన్స్ సైన్యాలు పూర్తిగా ప్రతిష్టంభన చేయబడ్డాయి. జూన్‌లలో ఝాన్సీలోని సేనలు రాణి ఝాన్సీ లక్ష్మీబాయిని తమ నాయకురాలిగా ప్రకటించాయి. కాని సర్ హ్యూరోస్ అనే బ్రిటిషు సైనికాధికారి ఝాన్సీ రాజ్యాన్ని 1858 ఏప్రిల్ మూడో తేదీన ఆక్రమించాడు. కానీ లక్ష్మీబాయి తాంతియాతోపేతో కలసి సిపాయిలకు నాయకత్వం వహించింది. గ్వాలియర్ రాజైన సింధియా బ్రిటిష్‌వారికి

విధేయుడై ఉండి వారి శరణుజొచ్చాడు. గ్వాలియర్‌ను బ్రిటిషువారు ఆక్రమించారు. ఝాన్సీరాణి లక్ష్మీబాయి బ్రిటిషు వారితో పోరాడుతూ వీరమరణం పొందింది. తాంతియాతోపే తన అనుచరుడైన మాన్‌సింగ్ మోసంచేత బంధించబడి ఉరితీయబడ్డాడు.

ఢిల్లీ నగరాన్ని తిరుగుబాటుదార్ల నుండి రక్షించటం చాలా ప్రధానమని తలచిన బ్రిటిష్‌వారు దానికై మిక్కిలి కృషి చేశారు. పంజాబ్ నుంచి రప్పించిన సేనలు ఢిల్లీ వెలుపల సమీకరించటం జరిగింది. 1857 సెప్టెంబర్‌లో ఢిల్లీ పునరాక్రమణ జరిగింది. జనరల్ హడ్సన్ బహదూర్‌షాను బంధించాడు. యావజ్జీవ ఖైదు శిక్ష విధించబడిన బహదూర్‌షా తన శేషజీవితాన్ని రంగూన్‌లో గడపవలసి వచ్చింది. అతని ముగ్గురు కుమారులు అతని కళ్ళ ఎదుట చంపబడ్డారు. మొగలు సామ్రాజ్యం అతనితో అంతమైంది.

లక్నోలో హెన్రీలారెన్సు నివాసాన్ని తిరుగుబాటుదార్లు ముట్టడించి అతన్ని చంపారు. జనరల్ హేవ్‌లాక్ నెయిల్, నికోల్సన్ ఛాంబర్లైన్ అనేవారిని పరిస్థితిని అదుపులో పెట్టడానికి రప్పించడం జరిగింది. బనారస్, అలహాబాద్‌లలో అతి దారుణంగా భారతీయులను చంపిన నెయిల్ లక్నోలో చంపబడ్డాడు. (ఇతని జ్ఞాపకార్థం బ్రిటీషు ప్రభుత్వం మద్రాసులో ఒక కంచు విగ్రహాన్ని ప్రతిష్ఠించింది. కాని 1937లో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడినపుడు ఈ విగ్రహాన్ని తొలగించారు). కాలిన్ కాంప్ బెల్ లక్నోచేరి తిరుగుబాటు దారులను ఓడించాడు. లక్నో తిరిగి బ్రిటిషు వారి స్వాధీనమైంది. తిరుగుబాటు సమయంలోను, దాని తర్వాత కూడా పెద్ద ఎత్తున భారతీయులను విచక్షణా రహితంగా చంపారు. విప్లవ జెండాలు ధరించిన పసివారిని కూడా కాల్చి చంపారు. ఒక్క అలహాబాదులోనే ఆరువేలమందిని చంపినట్లు అంచనా. లక్నోలో యుద్ధం ముగిసిన తర్వాత నగరంలోని మగవారినందరిని వధించినట్లు బ్రిటిషు అధికార్లు చెప్పుకొన్నారు. ఢిల్లీని పునరాక్రమించటం జరిగినపుడు ప్రతి ఇంట్లోనూ నలభై, యాభైమంది దాక్కొన్నారని, వారందరిని బ్రిటిషువారు తుపాకులకు అమర్చిన కత్తులతో పొడిచి చంపినట్లు తెలియజేశారు.

1857 తిరుగుబాటు విఫలమైంది. విప్లవకారులు తమ ధ్యేయాన్ని సాధించలేకపోయారు. దీనికి అనేక కారణాలు చెప్పవచ్చు. తిరుగుబాటు దేశవ్యాప్తంగా కాక కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితమైంది. బొంబాయి, మద్రాసు సైన్యాలు తిరుగుబాటులో చేరలేదు. సింధు, రాజస్థాన్, కాశ్మీర్, తూర్పు బెంగాల్, పంజాబ్ ప్రాంతాలు తిరుగుబాటులో పాల్గొనలేదు. అనేక సంస్థానాలు తిరుగుబాటుకు సానుభూతి చూపలేదు. ఇండోర్ హోల్కార్, హైదరాబాద్ నిజాం బ్రిటిషువారికి విధేయులుగా కొనసాగారు. 1856 నాటికి ఐరోపాలో క్రిమియా యుద్ధం ముగిసింది. చైనాతోటి యుద్ధం కూడా ముగిసిన కారణంగా బ్రిటిషు సేనలకు భారతదేశంలో మరింత శక్తిసామర్థ్యాలలో అధిక సంఖ్యతో పోరాడటానికి వీలు కలిగింది. భారత సిపాయిలతో పోల్చినప్పుడు బ్రిటిషు సేనలకు ఉన్న ఆయుధాలు మిక్కిలి మెరుగయ్యాయి. తంతి, తపాల, రైలు మొదలైన రాకపోకల సౌకర్యాలు బ్రిటిషువారి చేతుల్లో ఉన్నందువల్ల సైన్యాల తరలింపు, కీలక స్థావరాలపై ఆధిక్యత సులభమైంది. తిరుగుబాటుదార్లు శక్తి సామర్థ్యాలు లోపించినవారు కాకపోయినా సమైక్యతతో పోరాడడానికి వీలు లేకపోయింది.

విప్లవ నాయకులలో ఒక ధ్యేయం లేకుండా పోయింది. ప్రతి నాయకుడు తన స్వంత అసంతృప్తిచే తిరుగుబాటులో ప్రవేశించాడు. కొన్ని సందర్భాలలో తిరుగుబాటు నాయకులు, తర్ఫీదు పొందిన సైనిక నాయకులు గారు. తాంతియా తోపే, నానాసాహెబ్, ఝాన్సీ లక్ష్మీబాయి అసమాన దేశభక్తులు; అమిత ధైర్య

సాహసాలను ప్రదర్శించిన వీరులు. కానీ సైనిక నాయకత్వం, సైనిక శిక్షణ, వారివద్ద ఉన్న యుద్ధ సామగ్రి విషయాలలో బ్రిటిషువారితో సరితూగలేదు. బ్రిటిషు సైన్యంలో లారెన్సు సోదరులు నికోల్సన్, ఔట్రామ్, హేవ్‌లాక్, ఎడ్వర్డ్ మొదలైన అధికార్లు అతి ప్రమాదకర యుద్ధాల్లో పాల్గొని సమర్థవంతంగా తమ సేనలను నడిపించారు. భారతీయ నాయకులు స్వయంగా యుద్ధం చేయడానికి ముందుకు వచ్చారు.

## తిరుగుబాటు ఫలితాలు:

1857 విప్లవం, అణచివేయబడ్డ ఒక మామూలు తిరుగుబాటని త్రోసివేయలేము. అది బ్రిటిషువారి పరిపాలనకు వ్యతిరేకంగా పేరుకుపోయిన అసంతృప్తికి సంకేతంగా గుర్తించవలసి ఉంది. పాశ్చాత్య పద్ధతులకు, ఉద్దేశాలకు, వారు స్థాపించిన సంస్థలకు వారు అనుసరించిన పాలనా విధానాలకు వ్యతిరేకంగా ప్రజ్వరిల్లిన అసంతృప్తి సుడిగాలి ఈ తిరుగుబాటు. భారతీయులకు 1857 సంఘటనలు చేదు కలగా నిలిచి పోయింది. విద్య, రాజకీయ పరిజ్ఞానంకన్న యుద్ధం ప్రజలను ఎక్కువగా ప్రభావితం చేయగలదు. కాన్పూరు, ఢిల్లీ, లక్నో, అయోధ్య మొదలగు నగరాలలో జరిగిన హింసాకాండ తాంతియాతోపే, ఝాన్సీరాణి మొదలగు వారు పొందిన దారుణ మరణం భారతదేశంలోని సామాన్య ప్రజలలో బ్రిటిష్ వారిపట్ల వ్యతిరేక భావాలను రేకెత్తించాయి అని, భారతీయ సైనికులు బ్రిటీషు వారిని ఓడించలేదని కాని బ్రిటీషు సైనిక నాయకులు, సైనిక పాలన విధించి అక్రమాలు కొనసాగించి, తిరుగుబాటుదార్లను, ఏరి కాల్చి చంపిన విషయాలు ప్రతి భారతీయుని హృదయంలో నిలచిపోయాయి అని లార్డ్ క్రోమర్ అనే బ్రిటిషు నాయకుడు పేర్కొన్నాడు. 1857 తిరుగుబాటులో అనేక పాఠాలు, హెచ్చరికలు ఉన్నాయి అని ఇంగ్లండులోని యువకులు సిపాయిల తిరుగుబాటు చరిత్రను చదివి మననం చేసుకొని, దానిని ఆద్యంతం మనసుల్లో జీర్ణించుకోవాలని అదే అతని కోరిక అని చెప్పాడు.

తిరుగుబాటులో ప్రధానంగా ఉన్నత కులాలకు చెందిన సిపాయిలు పాల్గొన్న కారణంగా బ్రిటిష్ సైనికాధికారులు అప్పటి నుంచి వారిని నమ్మడానికి శంకించారు. మీరట్ అనుభవం దృష్ట్యా సైన్యంలోని ఏ విషయాన్నయినా వెంటనే పరిశీలించడానికి ప్రభుత్వం చర్య తీసుకోనారంభించింది. ముఖ్యంగా మత విషయాల్లో బ్రిటిషువారు తలదూర్చడం వదిలిపెట్టారు. సైనికేతరులు, తిరుగుబాటులో పాల్గొనడం, డల్హౌసీ దురుసు చర్యలవల్ల భారతీయుల సామాన్య సాంఘిక జీవనాన్ని పీడించిందనే భావం ప్రబలినందువల్ల అని తెలిసింది. దీని తర్వాత దాదాపు ఎనభై ఏండ్లు బ్రిటిషువారు భారతదేశంలో మత, కుల విషయాలలో జోక్యం కలిగించుకొనలేదు. బ్రిటీషు ప్రభుత్వం శాంతిని నెలకొల్పి, చట్టాల్ని పరిరక్షించి ఐరోపాలోని వస్తూత్పత్తిని భారతదేశంలోనికి తేవడానికి ప్రయత్నాలు చేసిందేగాని భారతీయుల కుటుంబ విషయాలు, వ్యక్తిగత నైతిక విలువల జోలికి పోలేదు.

1857 తిరుగుబాటుకు ముందులేనంత విధంగా జాతి వైషమ్యాన్ని సృష్టించింది. దీని తర్వాత బ్రిటిషువారు అధిక సంఖ్యతో తమ భార్య పిల్లలతో భారతదేశానికి వచ్చారు. కంపెనీ ప్రభుత్వం అంతరించినందున బ్రిటీషు ప్రభుత్వానికి సరాసరి అధీనంలో ఉండడం వల్ల భారతదేశంలో బ్రిటిషువారి అధికారం శాశ్వతమైంది అనే భావం వారిలో కలిగింది. యూరోపియనుల సంఖ్య దేశంలో అధికమైంది. వారు ఒక ప్రత్యేక తెగగా గుర్తింపు పొందారు. ఇది బహుశా భారతీయుల బాధ్యతాయుతమైన పదవులకు తగరు అనే భావంచేత ప్రభుత్వం బ్రిటిషువారి సంఖ్యను పెంచుతూ వచ్చింది.

తిరుగుబాటు పరిపాలనా రంగంలో ప్రధానంగా మూడు విధాల మార్పును తెచ్చింది. కంపెనీ పాలన అంతమై భారతదేశం పరిపాలన బ్రిటీషు ప్రభుత్వానికి బదలీ చేయడం జరిగింది. భారతదేశంలోని సైన్యాన్ని పూర్తిగా పునర్వ్యవస్థీకరించడం జరిగింది. 1858 నవంబరు ఒకటవ తేదీన విక్టోరియారాణి ప్రకటన జారీ అయ్యింది. దీని ప్రకారం "భారతదేశ కార్యదర్శి ఈ దేశం విషయాలు గమనించడానికై నియమించడం జరిగింది. భారతదేశంలోని గవర్నర్ జనరల్‌కు 'వైస్రాయి' బిరుదును చేర్చడం జరిగింది.

కంపెనీ అధికారం బదులు, బ్రిటీషు ప్రభుత్వం నేరుగా అధికారాన్ని చేపట్టడం చేత జరిగిన మార్పు అతి గొప్పదిగా చెప్పడానికి వీలు లేదు. కంపెనీ అధికారం అప్పటికి నామ మాత్రంగానే కొనసాగింది. డైరెక్టర్లు కూడా పేరుకు మాత్రం కొనసాగారు. భారతదేశానికి సెక్రటరీలుగా బాధ్యత ఉన్న వ్యక్తుల్ని నియమించారు. డ్యూక్ ఆఫ్ ఆర్గయిల్, లార్డ్ సాలిస్‌బరీ, లార్డ్ హోల్టింగ్‌టన్ మొదలైన వారు రాజకీయంగా మిక్కిలి పలుకుబడి ఉన్నవారే. కంపెనీ పాలనలో గవర్నరు జనరల్ పరిపాలనా విషయాలలో దాదాపు పూర్తి స్వేచ్ఛ ఉండేది. కాని వైస్రాయి ప్రతి చిన్న విషయానికి కూడా ఇంగ్లండులోని సెక్రటరీని సంప్రదించవలసి వచ్చేది. ఉదాహరణకు లార్డ్ ఎల్జిన్ లండన్ నగరంలోని సెక్రటరీ ఆఫ్ స్టేటుకు రోజుకు రెండుసార్లు తంతి పంపేవాడట.

తిరుగుబాటుకు ప్రధాన కారణంగా భారత సైన్యంలో ఉన్న అసంతృప్తి కావడంవల్ల సైన్యంలో అనేకమైన మార్పులను చేయడం జరిగింది. కొన్ని దళాలు రద్దు చేయడం జరిగింది. క్రమశిక్షణ, సైనికుల నియామకం, తర్ఫీదు మున్నగు అన్ని విషయాలలో మార్పులు చేయడం జరిగింది. సైన్యంలో యూరోపియన్‌ల సంఖ్యను పెంచడం జరిగింది. 1863 నాటికి వారి సంఖ్య దాదాపు 65 వేలకు దాటింది. తిరుగుబాటు అణచడానికి సహాయపడిన శిక్కు, గూర్ఖాల కోసం ప్రత్యేక దళాలను రూపొందించారు. 1879లో నియమించిన ప్రత్యేక కమీషన్ భారతదేశంలోని శతఘ్ని దళం. బ్రిటిషు అధికార్ల అధీనంలో మాత్రమే ఉండాలని సూచించింది. నమ్మకమైన బ్రిటిషు సేనలున్న దళాలను భారతదేశంలో ఉంచాలని కూడా ఈ కమీషన్ చేసిన సూచనలలో తెలియజేయడం జరిగింది. తిరుగుబాటు జరిగింది ప్రధానంగా ఉత్తర భారతదేశంలో కాబట్టి ఆ ప్రాంతంలో అమితంగా సైనిక సమీకరణ జరిగింది. యుద్ధ నైపుణ్యానికి పేరుగాంచిన శిక్కులు పంజాబు మహమ్మదీయులు, డోగ్రాలు, జాట్లు మొదలగు వారిని ప్రధానంగా సైన్యంలో చేర్చుకొన్నారు.

సైనిక సంస్కరణలతో దగ్గరి సంబంధం ఉన్న స్థానిక రాజుల విషయంలో కూడా తిరుగుబాటు తర్వాత ప్రభుత్వం శ్రద్ధ చూపింది. ఉత్తరోత్తర భారతదేశంలో బ్రిటిషు ప్రాంతాలైన రాష్ట్రాలను, స్థానిక రాజుల అధీనంలోని సంస్థానాలను కలిపి ఒక ఫెడరేషన్‌గా రూపొందించే ఉద్దేశం 19వ శతాబ్దాంతానికి ప్రభుత్వానికి కలిగింది. కాని ఈ ఊహ కానింగ్ కాలానికి లేదు. భారతదేశంలో సుమారు ఐదింట రెండు వంతుల భూభాగాన్ని ఆక్రమించుకొన్న దాదాపు ఏడు వందల సంస్థానాలు, వాటి భవిష్యత్తు విషయాలలో బ్రిటీషు ప్రభుత్వం అమితమైన ఆసక్తిని చూపింది. వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో రష్యా దండెత్తుతుందనే భయం కొనసాగడం కూడా స్థానిక రాజులతోటి దౌత్యానికి దోహదం చేసింది. సంస్థానాధీశులకు అధికారులు గౌరవ మర్యాదలు ఎప్పటిలాగా కొనసాగుతాయని తెల్పడం జరిగింది. బ్రిటీషు సామ్రాజ్య విస్తరణను నిలుపుదల చేసినట్లు ప్రకటించడం జరిగింది. అయోధ్య ప్రాంతంలో తిరుగుబాటు చేసిన తాలూకదార్లకు భూములు తిరిగి ఇవ్వడం జరిగింది. సంస్థానాధీశులకు తీవ్రమైన అసంతృప్తిని కలిగించిన రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని రద్దు చేయడం జరిగింది. బ్రిటిషు రెసిడెంట్ల అధికారాలు విస్తృతం అయ్యాయి. తిరుగుబాటు తర్వాత దాదాపు ముప్పై ఏండ్లకాలంలో బ్రిటీషు ప్రభుత్వానికి సంస్థానాధీశులతో ఏ సంబంధాలు ఉండాలి అనే విషయంపై

నిర్దిష్టమైన ప్రణాళిక లేవీ రూపొందలేదు. 1875లో దుష్పరిపాలనా నెపంతో బరోడాను బ్రిటిషువారు స్వాధీనం చేసుకొన్నారు. కానీ 1881లో వైస్రాయి రిప్పన్ జోక్యం చేసుకొని మైసూరు రాజ్యాన్ని యాభై ఏండ్ల బ్రిటిష్ పాలన తర్వాత స్థానిక రాజవంశానికి అప్పజెప్పాడు.

తిరుగుబాటు తదనంతరం స్థానికరాజుల విషయాలలో బ్రిటిషు వారికి ఏర్పడ్డ ఘర్షణలు తక్కువనే చెప్పాలి. 1891లో మణిపూర్‌లో వారసత్వం తగాదాలో బ్రిటిషువారు జోక్యం చేసుకోవలసి వచ్చింది. ఆ మహారాజు మూడో తమ్ముడు సింహాసనం తనకు చెందాలని ఈ తిరుగుబాటు లేవదీశాడు. అస్సాం చీఫ్ కమీషనర్ వివాదాన్ని పరిష్కరించడానికి వెళ్ళగా అతన్ని తిరుగుబాటుదార్లు చంపారు. మణిపూర్‌ను బ్రిటిష్ సైనికులు ఆక్రమించారు. దానిని కొంతకాలం బ్రిటీషు ప్రభుత్వం తన అధీనంలోనే ఉంచుకొని మహారాజు మైనారిటీ తీరిన తర్వాత అతనికి అప్పజెప్పింది.

# అధ్యాయం 10

# రైళ్ళ, రోడ్ల విస్తరణ - ఆర్థిక ఫలితాలు

భారతదేశంలో 19వ శతాబ్ది మధ్యభాగంలో బ్రిటిషువారు చేపట్టిన అత్యంత శీఘ్రగతిలో పెంపొందిన రైల్వేలు ప్రజల జీవన విధానాలను, దేశీయ ఆర్థిక పద్ధతులను, సంస్కృతిని అమితంగా ప్రభావితం చేశాయి. రైల్వేల స్థాపన జరిగేంత వరకు నిజానికి బ్రిటిషు వారు భారతదేశీయ జీవన విధానంలోకి చొచ్చుకొని వెళ్ళలేదు. పెరుగుతున్న ప్రపంచ మార్కెట్టులకు. దేశీయ మార్కెట్టులకు లంకె చేకూర్చి పెట్టుబడిదారీ పెరుగుదలకు దోహదం చేసింది భారతీయ రైల్వేలు. ఆర్థిక సమస్యలన్నింటికి రైల్వేలు సరియైన సమాధానాలని భావించిన బ్రిటిషు పాలకులు అత్యంత చొరవ చూపి తక్కిన అన్ని విషయాలకన్న రైల్వేలకు అత్యంత ప్రాధాన్యత చూపారు. రైల్వేలను ప్రవేశపెట్టడంలో బ్రిటిషువారు ఆర్థిక లాభాలు ప్రధానంగా దృష్టిలో ఉంచుకొన్నారు. రాజకీయ లాభాలు, సైనిక సౌకర్యాలు కూడా ఇందుమూలంగా లేకపోలేదు.

భారతదేశం కనీసం రెండు విషయాలలో నిరుత్సాహపరచిందని ఇంగ్లండు భావించింది. అందు మొదటిది : బ్రిటిష్ ఉత్తర్వులకు ముఖ్యంగా నూలు బట్టలు మొదలైన వాటికి తగు మార్కెట్లు లేకుండా జేసింది. బ్రిటిషు సామ్రాజ్యంతో సంబంధం లేని దేశమైన బ్రెజిల్ వంటివి కూడా బ్రిటిషు దిగుమతులకు. ప్రాధాన్యమిచ్చి దాదాపు పది రెట్లు అధికంగా దిగుమతి చేసుకొన్నాయి. దిగుమతులే కాకుండా ఎగుమతులలో కూడా భారతదేశం ఇంగ్లండు ఆశించినంత సహాయకారిగా లేదు. ఇంగ్లండు చాలవరకు పత్తి దిగుమతులకు అమెరికాపై ఆధారపడవలసి ఉండేది. తన సామ్రాజ్యంలో లేని అమెరికా సంయుక్త రాష్ట్రాలపై అంత ఎక్కువ ఆధారపడడం బ్రిటీషు ప్రభుత్వానికి ఇష్టంలేదు. ముఖ్యంగా 1860 తరువాత అమెరికాలోని అంతర్యుద్ధం తర్వాత బానిస వ్యవస్థ క్రమేణ రద్దు కావడం దీని ప్రభావం పత్తి ఉత్పత్తిపై ప్రసరించడం అట్లాంటి అనుమానాలకు కారణం. ఇండియా వర్తక సంఘానికి వ్యాపారంపై ఉన్న గుత్తాధికారాన్ని ప్రశ్నించింది. 1813లోను 1833లోను ప్రవేశ పెట్టబడిన చార్టర్ చట్టాల మూలంగా స్వేచ్ఛా వ్యాపారం అనుసరించబడింది. అందువల్ల బ్రిటిషు ఆర్థిక పెంపుదలకు భారతదేశ వస్తువులు మాత్రమే ఇంగ్లండుకు చేరనవసరం లేదు. వారికి కావలసిందల్లా నిలకడలో ముడిపత్తి దిగుమతి దీనికి తోడు భారతదేశంలో తమ నూలు బట్టల విక్రయానికి తగు మార్కెట్లు మాత్రమే. భారతీయ వస్తువులను కైవసం చేసుకోవాలనే నిర్ణయానికి వచ్చారు. అప్పటి పరిస్థితులలో భారతీయ మార్కెట్లను పూర్తిగా స్వాధీనం చేసుకోడానికి తగినంత రవాణా సౌకర్యాలు కలిగించవలసిన అవసంర ఏర్పడింది. అందుచేత దేశవ్యాప్తంగా రైలు, రోడ్ల నిర్మాణం అత్యవసరమైంది.

19వ శతాబ్ది ఆరంభంలో భారతదేశంలో రవాణా సౌకర్యాలు చాల తక్కువ. ఉన్నరోడ్లు స్థానిక అవసరాలకు మాత్రమే పనికివచ్చేవి. కొన్ని మట్టిరోడ్లు, రహదార్లు ఉండేవి. కాని అవి రక్షణ సదుపాయాలకు ఉద్దేశించబడినవి. కంపెనీ ప్రభుత్వం రహదార్లకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వలేదు. పత్తి మొదలగు ముడి వస్తువులు ఎడ్లబండ్ల ద్వారా రవాణా అయ్యేవి. వర్షాకాలంలో అట్లాంటి వస్తువుల రవాణా దుర్లభమయ్యేది.

అందుచేత బీహార్ నుంచి బొంబాయికి ఎగుమతి చేసే పత్తిని వర్షాకాలానికి ముందే చేరవేసేవారు. కలకత్తాకు పంపాలంటే బండ్ల ద్వారా మీర్జాపూర్‌కు అక్కడ నుంచి గంగానది ద్వారా కలకత్తాకు చేర్చేవారు. రవాణా సౌకర్యాలు లేని కారణంగా వస్తువుల ధరలలో కూడా అత్యంత వ్యత్యాసాలు ఉండేవి.

భారతదేశంలో రైల్వేలను ప్రవేశపెట్టడం కోసం తొలి సూచనలు 1831-32లో మద్రాసులో జరిగాయి. కాని అప్పుడు రైలు పెట్టెలను నడపడానికి ఎద్దులను ఉపయోగించవచ్చని భావించారు. ఆవిరి శక్తితో రైళ్ళను నడపడానికి 1843లో తగు సూచనలు చేశారు. కంపెనీ డైరెక్టర్లు దానికి ఎక్కువ ఆసక్తి చూపలేదు. కాని రాజకీయ, ఆర్థిక ప్రాధాన్యం ఎక్కువ కావడంతో, రైల్వేలను చేపట్టడానికి ముందుకు వచ్చిన బ్రిటిషు పెట్టుబడిదార్ల ఒత్తిడి, భారతదేశంలో వ్యాపారం చేసేవారి అభ్యర్థలను, ఎక్కువ కావడంతో కంపెనీ డైరెక్టర్లు రైల్వేలను గురించి శ్రద్ధగా పరిశీలించారు. అప్పటి గవర్నరు జనరల్ అయిన లార్డ్ హార్డింజ్ హిందూ దేశంలో రైల్వేల నిర్మాణం ప్రభుత్వానికి, వ్యాపారాభివృద్ధికీ, సైనిక అవసరాలకూ ఎంతో అవసరమని తన నివేదికలో తెలిపాడు. రైల్వేల నిర్మాణాన్ని గురించి అంగీకారం కుదిరిన వెంటనే కంపెనీ డైరెక్టర్లకు, పెట్టుబడిదార్లకు మధ్య రైలురోడ్ల నిర్మాణానికి సంబంధించి ఒప్పందాలు కుదిరాయి.

1845లో "తూర్పు ఇండియా రైల్వే కంపెనీ", "గ్రేట్ ఇండియా పెనిన్సులర్" కంపెనీ అనే రెండు రైలు కంపెనీలు స్థాపితమయ్యాయి. అవి రెండూ స్వతహాగా అవసరమైన ధనాన్ని చేకూర్చుకొనలేక, ప్రభుత్వానికి ధన సహాయంకోసం అర్జీ పెట్టుకొన్నాయి. ఈ ప్రైవేటు కంపెనీలకు తమ పెట్టుబడికి ఫలితంగా వడ్డీ రూపంలోను, డివిడెండుగాను, కొంత శాతం గ్యారంటీ ఇవ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది. భారతీయ రైల్వేల బాధ్యతను ప్రైవేటు కంపెనీలు చేపట్టి ప్రభుత్వ పర్యవేక్షణలో కొనసాగాలనే డల్హౌసీ నిర్ణయానికి అనుకూలంగా ఉండేది. 1849లో పై రెండు కంపెనీలతో రాతపూర్వకంగా అంగీకారం కూడా కుదిరింది. 1853లో "పెనిన్సులర్ రైల్వే" బొంబాయి నుంచి ఠాణా వరకు రైలు మార్గాన్ని పూర్తి చేసింది. "తూర్పు ఇండియా రైల్వే కంపెనీ 1854లో కలకత్తా నుంచి రాణిగంజ్ వరకు రైలుమార్గాన్ని వేసింది. 1856లో "మద్రాసు రైలు కంపెని" మద్రాసు నుంచి అర్కోణం వరకు రైలుమార్గ నిర్మాణాన్ని పూర్తిచేసింది.

భారతదేశంలో చాలా పెద్ద ఎత్తున రైల్వేల నిర్మాణం 1853లో లార్డ్ డల్హౌసి సమర్పించిన నివేదికానంతరం చేపట్టడం జరిగిందనవచ్చు. అందులో రైల్వేల వల్ల కలిగే సాంఘిక రాజకీయ వాణిజ్యపరమైన లాభాలను తెలియజేయడంతో బాటు దేశంలోని మూడు ప్రధాన ప్రెసిడెన్సీలైన బొంబాయి, మద్రాసు, కలకత్తాలను ట్రంకు మార్గాల ఏర్పాటు వల్ల రేవు పట్టణాలను, ఇతర నగరాలతో సంబంధాల ఆవశ్యకతను గుర్తుచేశారు. గవర్నరు జనరల్ చేసిన ఈ సూచనలన్నీ 1857లో జరిగిన సిపాయిల కలహం సమయంలో యథార్థాలుగా తోచి వెంటనే కంపెనీ డైరెక్టర్లు ఆ సూచనలను అంగీకరించి అతి త్వరితంగా రైల్వేలను విస్తరించారు. 1859 అంతానికి దాదాపు ఎనిమిది రైల్వే కంపెనీలు స్థాపితమయ్యాయి. బారతదేశంలో రైలు, రోడ్ల విస్తరణ మూడు దశలుగా జరిగిందనవచ్చు. మొదటిది : పాత గ్యారంటీ పద్ధతి (1850-69) రెండోది ప్రభుత్వ యాజమాన్యం (1869-79) మూడోది : కొత్త గ్యారంటీ విధానం (1879 నుండి).

**పాత గ్యారంటీ పద్ధతి :** దేశీయ పెట్టుబడి, భారతీయ, రైలు మార్గాల నిర్మాణానికై ముందుకు రాకపోవడం చేత విదేశీ పెట్టుబడులను, ఆకర్షింప చేయడానికై కొంత లాభాలను కనీస గ్యారంటీ ఇవ్వడానికి 1850లో

ప్రభుత్వం నిర్ణయించింది. ప్రైవేట్ కంపెనీలతో కుదుర్చుకొన్న ఒప్పందాలలో ఈ క్రిందివి ప్రధాన అంశాలుగా ఉండేవి. రైల్వేల నిర్మాణం ప్రైవేట్ కంపెనీలకు అప్పజెప్పాలి. తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వం ఐదు శాతం వడ్డీ గ్యారంటీ, తొంభై తొమ్మిది సంవత్సరాల వరకు ఇవ్వడానికి అంగీకరించింది. కావలసిన భూమిని ప్రభుత్వం ఉచితంగా కంపెనీలకు అప్పజెప్పాలి. రైళ్ళను నడుపుట వాటిపై పాలనా బాధ్యతలు ప్రైవేట్ కంపెనీలకే ఇవ్వడమైంది. తపాలా సంచులన్నీ ఉచితంగాను, సైనికులను, సైనిక సామగ్రిని తక్కువ రేట్లతో రైళ్ళలో చేరవేయడానికి రైలు కంపెనీలు అంగీకరించాయి. గ్యారంటీ ఇచ్చిన మొత్తానికన్నా ఎక్కువైన లాభాలను, కంపెనీ ప్రభుత్వం, రైలు కంపెనీలు పంచుకోవాలి. తొంభై తొమ్మిది సంవత్సరాల తరవాత రైల్వేలు. ఏ నష్టపరిహారం లేకుండా ప్రభుత్వానికి స్వాధీనం చేయడం జరుగుతుంది. కాని దానికి ముందు ఇరవై అయిదేళ్ళ తరవాత యాభై ఏండ్ల తర్వాతగాని పెట్టుబడి మొత్తాలను చెల్లించి రైల్వేలను స్వాధీనం చేసుకోవచ్చు. కంపెనీలు ఆరు నెలల ముందుగా నోటీసు ఇచ్చి ఎప్పుడైనా తమ రైలు మార్గాలను తూర్పు ఇండియా వర్తక సంఘానికి అప్పజెప్పవచ్చు.

పై గ్యారంటీ పద్ధతిని బ్రిటీషు ప్రభుత్వ అధినేతలు విమర్శించడం ప్రారంభించారు. 1869లో అప్పటి గవర్నర్ జనరల్ సర్‌జాన్ లారెన్స్ దీనిలోని లోపాలను వివరించాడు. పెట్టుబడిదార్లను రైల్వేల నిర్మాణానికి ఆకర్షింప చేయడానికై ఉద్దేశించిన ఈ గ్యారంటీ పద్ధతిలో ప్రభుత్వానికి అమితమైన ఆర్థిక బాధ్యత ఏర్పడింది. కంపెనీలు గ్యారంటీ లాభాలను గడించని కారణంగా 1869 నాటికి దాదాపు 166.5 లక్షల రూపాయిల లోటు చూపించాయి. గ్యారంటీ లాభం ఉన్న కారణంగా రైలు కంపెనీలు, పొదుపు విషయం పట్ల అశ్రద్ధ చూపాయి. ఐదు శాతం లాభం ఎట్టి పరిస్థితిలోను ప్రభుత్వం నుంచి వస్తుందనే ధీమా ఉన్నందువల్ల బ్రిటిషు పెట్టుబడిదారునికి తాను పెట్టుబడి పెట్టిన ధనం "హుగ్లీ నదిలో పారవేసినా లేదా దాన్ని ఇటుకలు, సున్నంగా మార్చినా" అతనికి అట్టే నష్టమేమీ లేదు. అంతే కాకుండా ఈ పద్ధతి మూలంగా కంపెనీలు మరీ విపరీతంగా ఖర్చు పెడతాయనీ, ఆ పరిస్థితులను అదుపులో ఉంచి అజమాయిషీ చేసే అధికారాలు ప్రభుత్వానికి లేకపోవడం మరీ పెద్ద లోపమనీ భావించారు. ఇంగ్లండులోని పెట్టుబడిదారులు ప్రపంచ వ్యాప్తంగా అన్ని రంగాలలోను పెట్టుబడి పెట్టడానికి ఆసక్తి చూపే సమయంలో భారతదేశానికి వారిని ప్రత్యేకంగా ఆకర్షించాలనుకోవడం మరీ హాస్యాస్పదమని కొందరు విమర్శించారు. బాధ్యతను అటు కంపెనీలుగాని ప్రభుత్వంగాని గ్రహించకపోవడం కూడా ఈ పద్ధతిలోని లోపంగా భావించవచ్చు.

సర్‌జాన్ లారెన్స్ నివేదిక ననుసరించి ప్రభుత్వమే స్వయంగా రైల్వేలను నిర్మించే పథకాలను పరిశీలించింది. ప్రభుత్వ యాజమాన్యంలో రైలు మార్గాలు ఎంతో ఆర్థిక లాభాలకు దారితీస్తాయని ఆ నివేదికలో ఉంది. సిబ్బందిని నియమించి నిధులను కేటాయించి ప్రభుత్వం స్వయంగా రైలు మార్గాలను వేయడం చేపట్టాలని లారెన్స్ సూచన. ఈ సూచనలను అతని తర్వాత గవర్నరు జనరల్‌గా నియమించిన లార్డ్ మేయో దీనికి సుముఖత చూపాడు. అందువల్ల 1869 నాటికి రైల్వే విధానాలలో గొప్ప మార్పు వచ్చింది

ప్రభుత్వ యాజమాన్యంలో ప్రైవేట్ కంపెనీలు రైలు, రోడ్లు నిర్మించడం వల్ల సంభవించిన నష్టాలను అధిగమించే ఉద్దేశంతో ప్రభుత్వమే సరాసరి ఆ రైలు మార్గాలను వేసి, వాటిని సక్రమంగా నడిపించే పద్ధతిని చేపట్టింది. ఈ పద్ధతి 1869 నుంచి 1879 వరకు అనగా సుమారు పది సంవత్సరాలు అమలు జరిగింది. ఈ సమయంలో అన్ని మార్గాలు ప్రభుత్వ ధనంతో మాత్రమే నిర్మితమయ్యాయి. ఉత్పాదక విషయాలకై

ప్రభుత్వం తక్కువ వడ్డీపై అప్పులు సమకూర్చి నందువల్ల రైలుమార్గాల నిర్మాణం ఎంతో తక్కువ ఖర్చుతో జరిగింది. వాయవ్య సరిహద్దులో కొనసాగిన యుద్ధాల వల్ల, అనేక కరువులు సంభవించినందువల్ల పంజాబ్ ప్రాంతంలో మీటర్ గేజ్ రైళ్ళను, బ్రాడ్ గేజ్‌గా అధిక వ్యయానికోర్చి మార్చడమైంది. 1880లో ప్రకటించిన కరువు కమీషన్ నివేదిక దాదాపు 5000 మైళ్ళ రైలు మార్గ నిర్మాణం వెంటనే చేపట్టాలని సూచించింది. ఇంత ఎక్కువ రైలు మార్గాలను ప్రభుత్వం మాత్రమే చేపట్టాలన్న కష్టతరమైంది. దీనికి తోడు 1870 ప్రాంతంలో రూపాయి మారకం విలువ తగ్గడం వల్ల ప్రభుత్వం ఆర్థికమైన ఇబ్బందుల్లో పడింది. రైల్వేలకు కావలసిన ధనాన్ని కేటాయించడం దుర్లభమైంది. అందుచేత 1879లో పూర్వపు పద్ధతి ప్రకారం గ్యారంటీ పునరుద్ధరించబడింది.

**కొత్త గ్యారంటీ పద్ధతి :** ప్రైవేట్ కంపెనీలు స్వయంగా రైలు మార్గాల నిర్మాణానికి ముందుకు రాకపోవడం వల్ల ప్రభుత్వం గ్యారంటీ పద్ధతిని పునఃప్రవేశ పెట్టవలసి వచ్చింది. ఈ కొత్త పద్ధతి ప్రకారం రైళ్ళ నిర్మాణం కంపెనీలు, ప్రభుత్వం కలసి చేపట్టాయి. ప్రభుత్వం ధనాన్ని సేకరించి కంపెనీలకు అప్పులు ఇచ్చేది. దీనిపై వడ్డీ చాల తక్కువగా ఉండేది. కంపెనీలు వెచ్చించిన పెట్టుబడులకు కనీస వడ్డీ గ్యారంటీ ఉండేది. ఈ కనీసపు గ్యారంటీ 3.5 శాతానికి తగ్గించి పూర్వం లాగానే కంపెనీలకు భూమి ఉచితంగా ఉండేట్లు ఏర్పాటు చేయబడింది. లాభాలలో దాదాపు అరవై శాతం ప్రభుత్వానికి చెందేది.

1893లో రైల్వేల నిర్మాణంలో రిబేట్ పద్ధతిని ప్రవేశపెట్టడంచేత ఇంకొక గొప్ప మార్పు జరిగింది. ఈ పద్ధతిలో ఒక కంపెనీకి ఆర్థికంగా అభివృద్ధి చెందేంత వరకు అనుమతించిన రైలు మార్గాలను నిర్మించి, దాని తరువాత వచ్చే లాభాలలో ఇరవై శాతం రిబేట్ లభించేది. కావలసిన భూమి ప్రభుత్వం ద్వారా ఉచితంగా పొందడంతో బాటు కంపెనీలకు తక్కిన అన్ని ఆర్థిక సదుపాయాలు కొనసాగాయి.

19వ శతాబ్దాంతం వరకు ప్రభుత్వం తన అధీనంలోని రైలు మార్గాలపై వచ్చే నష్టాలన్నీ భరించవలసి వచ్చింది. 1900లో మొట్ట మొదటిసారిగా భారతీయ రైల్వేల మూలంగా ప్రభుత్వానికి సుమారు 11 లక్షల రూపాయిల లాభం చేకూర్చింది. ఈ లాభాలను దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం రైళ్ళ విస్తరణ కార్యక్రమాన్ని చేపట్టింది. అందుచే "ప్రోగ్రాం పద్ధతి"ని ప్రవేశ పెట్టింది. ఈ పద్ధతిలో ప్రతి ఏటా రైల్వేలకు ప్రభుత్వం అప్పటి పరిస్థితుల ననుసరించి ధనం నిల్వలను గుర్తించుకొని కొంత మొత్తాన్ని రైల్వేల విస్తరణకు ఉపయోగించేది. ప్రతి సంవత్సరారంభంలో రైలు మార్గాల నిర్మాణాల కోసం కేటాయించిన మొత్తాలను విభిన్న (వివిధ) ప్రాంతాలలో రైల్వే అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించేవారు.

1901లో నియమించిన రాబర్ట్‌సన్ కమిటీ నివేదిక ప్రకారం ఐదేండ్ల తర్వాత ఒక ప్రత్యేక రైల్వే బోర్డ్ స్థాపితమైంది. అంతవరకు రైల్వేలు పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ అధీనంలో ఉండేవి. 20వ శతాబ్దారంభంలో రైల్వే పరిపాలనా విషయాలలో అనేక మార్పులు జరిగాయి. వీటికి సర్ జేమ్స్ మేకీ 1908లో సమర్పించిన నివేదిక, 1924లో 'అక్వర్త్ కమిటీ' నివేదిక చాలా ముఖ్యమైనవి. రైల్వేలు మొత్తం విస్తరణ కార్యక్రమాలలో త్వరితంగా అభివృద్ధి చెందాయి.

19 వ శతాబ్దంలో రైల్వేల అభివృద్ధి తీరును పరిశీలిస్తే ఈ క్రింది విషయాలు ప్రధానంగా తెలుస్తాయి. రైలు వ్యవహారాలతో స్వదేశీ కట్టుబడికి చాల తక్కువ ప్రాధాన్యత ఉండేది. భారతీయ రైళ్ళ

చాలా వరకు బ్రిటిషువారి పెట్టుబడులతో మాత్రమే చేపట్టడం జరిగింది. ఇంగ్లండు నుంచి ఇండియాకు వచ్చిన ఆ మొత్తాలు ఆ శతాబ్దంలో కెల్లా అంతర్జాతీయ రంగంలోని పెట్టుబడి చరిత్రలోనే పెద్దవి అనవచ్చు.

శతాబ్దాంతం వరకు ప్రభుత్వం నుంచి తీసుకొన్న మొత్తాలకు కంపెనీలు వడ్డీలు చెల్లించడానికి కష్టంగానే ఉండేది. గ్యారంటీ ఇవ్వడం చేత ప్రభుత్వానికి దాదాపు 76 కోట్ల రూపాయలు అధికంగా వ్యయం అయ్యింది. రైలు మార్గాలు వేయడం క్రమేణా ఉధృతం చేయడం జరిగింది. ఆ సమయంలో కరువులు ప్లేగు మొదలైన అవాంతరాలు ఉన్నా రైల్వే మార్గాల నిర్మాణం కుంటుబడకుండా కొనసాగాయి. 1850 నుంచి 1891 వరకు వేసిన రైలు మార్గం దాదాపు 10.308 మైళ్ళు. 1892 నుంచి 1905 వరకు 10.746 మైళ్ల ఇనుప దారివేయడం జరిగింది. ఇంగ్లండు, ఫ్రాన్సులలో కూడా ఇంత త్వరితగతిలో రైలు మార్గాలు వేయలేదని చెప్పవచ్చు.

**రైల్వేలు - ఆర్థిక ప్రయోజనాలు :** రైల్వేలు భారతీయ ఆర్థిక విధానంపైన తెచ్చిన ప్రభావాన్ని గురించి అనేకమంది ఆర్థిక శాస్త్రవేత్తలు చర్చించారు. రైల్వేల విస్తరణ వల్ల దేశానికి కలిగిన అనేక లాభాలనుగూర్చి కూడా ఎక్కువగానే చర్చించడం జరిగింది. భారతదేశం అనేది ఒక భౌగోళిక పదమనే భావం పోయి ఒక రాజకీయ ఆర్థిక శక్తిగా దేశానికి గుర్తింపు వచ్చింది. భారతదేశీయ ఆర్థిక విధానం బయటి ప్రపంచ ఆర్థిక విధానానికి సంబంధం కుదుర్చుకో గలిగింది. ముఖ్యంగా బ్రిటీషు ఆర్థిక విధానంతో సరాసరి సంబంధాలు ఏర్పరచుకోసాగింది. వ్యవసాయరంగంలో వాణిజ్యీకరణ పెంపొందింది. అమెరికా అంతర్యుద్ధానంతరం దేశం నుంచి ఎగుమతుల పెరుగుదలకు ముఖ్యంగా రైల్వేలు దోహదం చేశాయి. కర్మాగారాల ప్రాతిపదిక ఉన్న ఉత్పత్తులు ఎక్కువయ్యాయి. పారిశ్రామిక విధానం దేశంలో ప్రారంభం కావడానికి రైల్వేలు, అమితంగా ఉపయోగపడ్డాయి. కాని బ్రిటిషు వారు ప్రవేశపెట్టిన రైల్వే విధానాలు జాతీయ నాయకులచే విమర్శలకు గురి అయ్యాయి. భారతదేశంలో రైల్వేల వల్ల జరిగిన అభివృద్ధి తీరుపై ఆ విమర్శలు చేశారు.

రైల్వేల వల్ల నీటిపారుదల సౌకర్యాలు కుంటుబడ్డాయన్న విమర్శ ప్రధానమైంది. కంపెనీ అధికారంలో ఉన్న సమయంలోనే అనేక ప్రాజెక్టులు చేపట్టింది. 1858 తరువాత రైల్వేలకిచ్చిన ప్రాధాన్యతవల్ల నీటి పారుదల కుంటుబడిందని చెప్పవచ్చు. దీనికి నిదర్శనంగా పెద్దపెద్ద నీటిపారుదల వనరులు ఎగువ గంగకాలువ, ఉత్తర బారిదోఆబ్ కాలువ, కృష్ణా, గోదావరి ఆనకట్టలు - అన్నీ కూడా కంపెనీ ప్రభుత్వంలోనే నిర్మించడం జరిగింది. కాని రైల్వేల అభివృద్ధి కార్యక్రమం ఉధృతమైన 1880 ప్రాంతంలో నీటి పారుదల పనులు నిర్లక్ష్యం చేయడం జరిగింది. ఈ సమయంలో చేపట్టిన సర్హింద్, దిగువ గంగా ఆగ్రా, మధుర కాల్వలు, ఆనాటి అవసరాలకు సరిపడినవి మాత్రం కావు 1876-78లో కలిగిన పెద్ద కరువు తరువాత 1882లో ప్రభుత్వం సాలీనా 115 లక్షల రూపాయిలు కరువు నివారణకై ప్రత్యేకంగా కేటాయించడం జరిగింది. అందులో సగం రైల్వేలకు, నీటిపారుదలకు వెచ్చించాలని కూడా సూచించింది. దక్షిణ భారతదేశంలో అనేక ప్రాజెక్టులకు పితామహుడుగా పరిగణించబడిన "సర్ ఆర్థర్ కాటన్" తన నివేదికలలో నీటిపారుదల ప్రాజెక్టులకు కాలువలపై రవాణా సౌకర్యాలకు, రైల్వేలకన్నా ఎక్కువ ధనాన్ని కేటాయించాలని సూచించాడు. కాని బ్రిటీషు పరిపాలనా యంత్రాంగం రైల్వేల అభివృద్ధికి ఆసక్తి కనబరిచింది. రెవిన్యూ అధికార్లు నీటిపారుదల విస్తరణకు తమ విముఖతను బహిరంగంగా తెలియజేశారు. ఆంధ్ర ప్రాంతంలో కృష్ణా, గోదావరి నదులపై ఆనకట్టల నిర్మాణంలో కాటన్‌కు గోల్డింగ్ హామ్‌కు మధ్య సుదీర్ఘ వివాదం జరిగింది. దానివల్ల నీటిపారుదల అభివృద్ధి

విషయంలో అధికారులకు ఉదాసీనత ఉండేదనీ రైల్వేల అభివృద్ధి విషయంలో ఆసక్తి ఉండేదని తెలుస్తుంది. ముడి సరుకుల ఎగుమతికి బ్రిటిషు వస్తువులు భారతదేశంలోని మార్కెట్లు చేరడానికి రైల్వేలు మిక్కిలి అవసరమని వారు గుర్తించడం దీనికి కారణం.

భారతీయ నాయకులు బ్రిటిషు వారి రైల్వే విస్తరణ కార్యక్రమాలను విమర్శించారు. జాతీయోద్యమంలో ప్రధానంగా రైల్వేలు భారతీయ ఆర్థిక వినాశనానికి మూలకందంగా వర్ణించారు. 1902 నాటికి దేశంలో నీటి వనరులకై బ్రిటీషువారు 43 కోట్ల రూపాయిలు ఖర్చు పెట్టారు. కాగా రైల్వేలపై బ్రిటీషు ప్రభుత్వం గ్యారంటీ పద్ధతిలో దాదాపు 350 కోట్ల రూపాయలు వెచ్చించింది. రమేష్ చంద్రదత్ ముఖ్యంగా ఈ వ్యత్యాసాన్ని తన రచనల ద్వారా ప్రభుత్వం దృష్టికి తేవడానికి ప్రయత్నించాడు. నిర్విరామంగా రైల్వే మార్గాలు వేయడం వల్ల ప్రతి ఏడూ ఐదారు కోట్ల రూపాయల వ్యయం అయ్యేది. కాని ఆహార ధాన్యాల ఉత్పత్తికి అత్యవసరమైన నీటిపారుదల గురించి, ఆనకట్టల నిర్మాణం గురించి ప్రభుత్వం పట్టించుకోలేదు. రైల్వే విస్తరణ మూలంగా ఉన్న ఆహార పదార్థాలను దేశంలో నలుమూలలకు పంపిణీ చేయడానికి మాత్రమే వీలవుతుంది. కాని నీటి ప్రాజెక్టులు అతి ముఖ్యమైన ఆహార ధాన్యాల ఉత్పత్తికి ముఖ్య కారణం. కరువు కాటకాల నివారణకు రైల్వేలకన్న నీటిపారుదల అత్యవసరం. నీటి ప్రాజెక్టులపై వెచ్చించిన ధనం స్వదేశీయులలో ఉద్యోగావకాశాలు ఎక్కువగావడానికి దోహదం జేసింది. కాని రైల్వేవల్ల విదేశీయులు లాభాలు పొందారు. ఆ ధనాన్ని వారు మనదేశంనుంచి తరలించిందే. బ్రిటీష్ పెట్టుబడిదార్లు, వ్యాపారస్తులు, ఉత్పత్తిదార్లు, రైల్వేల మూలంగా ఎన్నో లాభాలు గడించారు. ఏ కొద్దిమంది విదేశీయుల క్షేమానికై లక్షలాది భారతీయుల అవసరాలు నిర్లక్ష్యం చేయడం జరిగింది.

రైల్వేలకు కావలసిన సామగ్రిని స్థానికంగా తయారు చేయకపోవడంవల్ల యంత్ర సామగ్రి మొదలుకొని ప్రతి వస్తువు ఇంగ్లండు నుంచి దిగుమతి చేయవలసి వచ్చేది. దీనికి తగినట్లు కాంట్రాక్టర్లు కూడా విదేశీయులే. రైల్వే మార్గాలకు కావలసిన ఇనుము, ఉక్కు కొనుగోలు విధానం కూడా విదేశీ అవసరాలకు పనికి వచ్చే విధంగా మాత్రమే ఉండేది.

కాని ఆధునిక కాలంలో సాంఘిక ఆర్థిక మార్పులకు చేయూత నిచ్చిన ప్రధాన అంశాలలో రైల్వేలు ముఖ్యమైనవిగా గుర్తించడం జరిగింది. వ్యాపారంలో వచ్చిన విప్లవాత్మకమైన పెరుగుదలకు కరువు పరిస్థితులలో సంభవించిన మార్పులకు ఆర్థికంగా లాభదాయకమైన విధంగా కర్మాగారాలు నెలకొల్పడానికి రైల్వేలు పనికి వచ్చాయని చెప్పవచ్చు. గ్రామాల 'ఏకాంత వాసం' తొలగించడానికి వాటిని బాహ్య ప్రపంచంతో కలిపి మారుమూల ఉన్న వస్తువులకు కూడా ప్రపంచ వ్యాప్తంగా అమలులో ఉండే మార్కెట్టు ప్రభావాన్ని కలిగించడం రైల్వేల అద్వితీయ కృషి అని చెప్పవచ్చు. వ్యవసాయంలో వాణిజ్యీకరణ రైల్వేల మూలంగా జరిగింది. ముడి సరుకుల ఉత్పత్తి పెరుగుదలకు రైల్వేలు దోహదం చేశాయి.

కరువు నివారణకై నియమించిన కమీషన్‌లు రైల్వేల అవసరాన్ని పరిశీలించాయి. రైల్వేల విస్తరణ కరువు నివారణకు అన్ని విధాల ఉపయోగమని సూచించాయి. 1900 తరువాత సంభవించిన కరువులు ప్రాణ నష్టం విషయంలో ముందు కరువులకన్న ఎంతో నయం. ఇది ప్రధానంగా రైల్వేలు ఆహార ధాన్యాలను పంపిణీ చేయడంలో తోడ్పడినందువల్ల వీలైంది. భారత దేశంలో నగరాలు, పట్టణాలు అభివృద్ధి చెందడం ప్రధానంగా

పారిశ్రామిక కేంద్రాలు పెంపొందడం వంటివి రైళ్ళ నిర్మాణం వల్ల జరిగాయి అని చెప్పవచ్చు. రైల్వేల వల్ల కలిగే లాభాలను పరిశీలించినప్పుడు ప్రధానంగా బ్రిటీషు పరిపాలన పద్ధతి పటిష్ఠం కావడానికి తోడ్పడింది. విశాలమైన భారతదేశం ఏదో భౌగోళికంగా నామమాత్రాన విశిష్టమైనదనే భావన తొలిగి శక్తివంతమైన కేంద్రీకృత ప్రభుత్వ స్థాపనకు రైల్వేలు దోహదం చేశాయి. దూరప్రాంతాలను సందర్శించే అవకాశంతో బాటు భిన్న ప్రాంతాల ప్రజల అవగాహనకు వివిధ ప్రాంతాలలో ఉత్పత్తి అయిన వస్తువుల క్రయ విక్రయాలకు రైల్వేలు సహాయపడ్డాయి. మొదట రైల్వేలు ప్రభుత్వానికి లాభాలు చేకూర్చ లేకపోయినా ఒక శతాబ్దంలో రైల్వేల వల్ల ప్రభుత్వానికి లాభాలు ఎక్కువగానే కలిగాయి.

రైల్వేలు నాగరికత సంప్రదాయాల అభివృద్ధితో బాటు దేశీయ ఐక్యతకు, కులవర్గ శృంఖలాల సడలింపులకు కూడా దారి తీశాయి. అన్ని వర్గాల వారు కలిసి ప్రయాణం చేయడం సాధ్యమైనందు వల్ల ఈ లాభాలు చేకూరాయి. కాంగ్రెసు స్థాపన తరువాత ప్రజలు అనేక ప్రాంతాలలో జరిగే సభలు, సమావేశాలలో స్వయంగా పాల్గొనటానికీ దానివల్ల జాతీయతా భావం పెరగడానికీ రైల్వేలు దోహదం చేశాయని చెప్పవచ్చు. కాని లాభాలు - నష్టాలు బేరీజు కట్టిన రైల్వేల వల్ల చేకూరిన లాభాలు ఏదో కొద్దిపాటికేన్నసీ తాత్కాలికమైన వేననీ, పరోక్షమైనవనీ అనిపిస్తాయి. నిజానికి ఇవి బ్రిటీషు వారి ఆర్థిక అవసరాలకు వారి ముడి పదార్థాల రవాణాకు వారి వస్తువులను శక్తివంతంగా మనదేశంలోని మార్కెట్లను నింపడానికి, పరిపాలనా పట్టుత్వానికి సరిహద్దు రాష్ట్రాలపై సుస్థిరమైన అధికార స్థాపనకు, సైన్యాలను సునాయాసంగా దేశం నలుమూలలకు తరలించడానికీ, తమ తపాల బంగీలను చౌకగా, త్వరగా పంపడం వంటి ప్రభుత్వ స్వలాభాలకూ రైల్వేలు అంత త్వరితగతిలో మనదేశంలో విస్తరించబడ్డాయని చెప్పవచ్చు.

# అధ్యాయం II

# వ్యవసాయ రంగం - వాణిజ్యీకరణ

19వ శతాబ్దంలో భారతదేశంలోని ఆర్థిక సమస్యలన్నింటిలోను వ్యవసాయరంగం ఎదుర్కొన్న సమస్యలు మిక్కిలి ప్రధానమైనవి. దేశంలో దాదాపు 80 శాతం జనాభా వ్యవసాయంపైన ఆధారపడిన సమయంలో బ్రిటీషు ప్రభుత్వం ఆ రంగంలో తీసుకొన్న నిర్ణయాలు, చేసిన మార్పులు, ఆర్థికాభివృద్ధికి ఎక్కువగా దోహదం చేయలేదనే చెప్పాలి. వ్యవసాయంపై దేశం ఎంత ఆధారపడిందో రమేష్ చంద్రదత్ మాటల్లో తెలుస్తుంది."వ్యవసాయం బాగా ఉంటేనే ప్రజలు సుఖపడేవారు. కానీ పంటలు నాశనమైన వెంటనే కరువు కాటకాలు తాండవించేవి" వ్యవసాయం ఎంతో వెనుకబడిన కారణంగా సామాన్య వ్యవసాయదారుడు మిక్కిలి నికృష్ట జీవనాన్ని గడపవలసి ఉండేది. 19వ శతాబ్దంలో భారతీయ రైతు సుఖంగా లేడనడానికి ఆ కాలంలో జరిగిన అనేక రైతు ఉద్యమాలు, అలజడులు నిదర్శనం. 1873లో బెంగాల్‌లో పట్నా తిరుగుబాటు. 1875లో దక్కన్ ఆలజడులు, 1878లో బొంబాయిలో ఫాడ్కే తిరుగుబాటు 1894లో అస్సామ్ వ్యవసాయదార్ల తిరుగుబాటు మొదలైనవి ఈ కోవకు చెందినవే. ఈ సమయంలో సంభవించిన కరువులు కూడా వ్యవసాయంలో సంభవించిన మార్పులకు, ప్రభుత్వం నిర్లక్ష్య వైఖరికి నిదర్శనాలు.

వ్యవసాయ రంగంలో ఏర్పడ్డ మార్పులకు మూల కారణం అధిక భూమిశిస్తు. బ్రిటిషు వారు అనుసరించిన, జమిందారీ, రైత్వారీ, మహల్వారి మొదలైన పద్ధతులన్నింటిలోను రైతులకు భారం కలగజేసే పద్ధతిలో భూమి శిస్తు విధించడం జరిగింది. దీని ఫలితంగా రైతులు శిస్తులు చెల్లించడానికి. రుణాలు చేసినగానీ లేదా భూమిపై గాకుండా ఇతర మార్గాల ద్వారా ఆర్జించిన ధనాన్ని గానీ ఉపయోగించ వలసి వచ్చేది. అంటే భూములపై వచ్చే ఆదాయం ఆ భూమి శిస్తు కట్టడానికి కూడా సరిపోయేది కాదు. దీని మూలంగా రైతులు అనేక సందర్భాలలో తమ భూములను పోగొట్టుకొని కూలీ జనులుగా మారడం కూడా జరిగింది. దీనితోబాటు భూమిశిస్తు నిలకడగా లేక ప్రభుత్వం అప్పుడప్పుడు శిస్తు మొత్తాలను సవరించేది శిస్తు వసూలు చేసే అధికార్లు తమ ఇష్టం వచ్చినట్లు ఈ మార్పులు చేసేవారు. రైతుల నుంచి పన్ను వసూలు చేయడానికి మిక్కిలి క్రూరమైన దయ దాక్షిణ్యంలేని పద్ధతులను ఉపయోగించేవారు. అతివృష్టి, అనావృష్టి కారణాల వల్ల సంభవించిన కరువుకాటకాల సమయాల్లో. వ్యవసాయం దెబ్బతిన్న సమయాల్లో కూడా రాయితీలుండేవి కావు.

జమిందారీ పద్ధతి ఉన్న బెంగాలు, బీహారు, ఒరిస్సా, ఉత్తర మద్రాసు ప్రాంతాలలో బొంబాయి, పంజాబు మొదలైన చోట్ల భూమిని పండించే రైతు, జమిందారుకు భూమిశిస్తు చెల్లించు కౌలుదారుచే మాత్రమే. ఈ ప్రాంతాలలో జమిందారుకు కౌలుదారుకు మధ్య మధ్యవర్తులు ఎక్కువగా ఉండేవారు. రైత్వారీ విధానంలో కూడా రైతుకు, భూకామందుకు మధ్య పరిస్థితులు క్షీణించాయి. రైతులుతమ స్వంత భూములను క్రమేణ వడ్డీ వ్యాపారులకో, వ్యాపారులకో, భూస్వాములకో పోగొట్టుకొనే వారు. ఆ విధంగా భూములు పోగొట్టుకొన్న రైతులు వ్యవసాయ కూలీలుగా మారడం మామూలైంది. భూస్వామి - కౌలుదారుల మధ్య సంబంధాలు దిగజారిన కారణంగా ఇది ఆర్థిక రాజకీయ సమస్యలకు కారణమయ్యింది. అందుచేత

ప్రభుత్వం అసంతృప్తి చెందిన కౌలుదార్ల సంరక్షణకై అనేక రాష్ట్రాలలో కొన్ని కౌలుదార్ల చట్టాలను, ప్రవేశపెట్టింది కానీ ఈ చట్టాలు జమిందారీ ప్రాంతాలకే పరిమితమయ్యాయి. రైత్వారీ ప్రాంతాలలోని సామాన్య కౌలుదార్ల అగచాట్లను ప్రభుత్వం పట్టించుకోలేదు.

రైతాంగాన్ని బాధించిన మరింత ఉపద్రవం రుణభారం. 19వ శతాబ్దాంతంలో ఈ సమస్య గ్రామీణ జీవనానికి అనేక సమస్యల్ని కల్పించింది. వడ్డీ వ్యాపారులు, అధికంగా వసూలు చేసినందువల్ల రెండు ప్రధానమైన ఉపద్రవాలు ఏర్పడ్డాయి. రైతుల సంపాదనలో అధికభాగం వడ్డీ చెల్లింపులకు సరిపోయేది. రుణాలు చెల్లించని పరిస్థితులలో రైతుల భూములు దనవంతులైన వడ్డీ వ్యాపారుల ఆదీనమయ్యాయి అందువల్ల రైతు తన స్వంత భూమిని కోల్పోయి, కౌలుదారు అయ్యాడు లేదా కూలీగా మారాడు. రైతు రుణగ్రస్తుడు కావడానికి అనేక కారణాలున్నాయి. బ్రిటిషు పరిపాలకుల దృష్టి భారతీయ రైతు రుణ భారానిక్ ప్రధాన కారణం వడ్డీ వ్యాపారి. అతడు వసూలు చేసిన అధిక వడ్డీలు. కాని భారత జాతీయ నాయకుల దృష్టిలో వడ్డీ వ్యాపారి కన్న రైతుల రుణభారానికి ప్రధాన కారణం బ్రిటిషువారి భూమిశిస్తు విధానాలు. బ్రిటిషు వారు రాకపూర్వం వడ్డీ వ్యాపారులు రైతులకు రుణాలిచ్చి ప్రతిఫలంగా వడ్డీ మాత్రమే ఆశించేవారు. కానీ బ్రిటీషు వారు వచ్చిన తర్వాత వడ్డీ వ్యాపారులు రైతుల భూములను ఆశించారు. ఆ వ్యాపారులందరూ భూస్వాములుగా తయారయ్యారు. బ్రిటీషువార్కి భూమిశిస్తు విధానాలు రైతుల రక్తాన్ని తాగే "షావుకార్ల"ను తయారు చేశాయి. బ్రిటిషు పాలనాకాలంలో వడ్డీ వ్యాపారుల సంఖ్య అమితంగా పెరిగింది. వీరి దురాగతాలను అణచడానికి బదులు ప్రభుత్వం వారికి తగు ప్రోత్సాహాన్నిచ్చింది. కాని 1875లో జరిగిన దక్కన్ అలజడుల దృష్ట్యా 1879లో ప్రభుత్వం దక్కన్ వ్యవసాయదార్ల రక్షణ చట్టాన్ని ప్రవేశపెట్టి వడ్డీ వ్యాపారుల బారినుంచి రైతులను రక్షించడానికి ప్రయత్నించింది.

పై చట్టం మొదట బొంబాయిలోని దాదాపు నాలుగు దక్కన్ జిల్లాలకు మాత్రం పరిమితమయినా తర్వాత ఇతర ప్రాంతాలకు విస్తరించడం జరిగింది. దీని మూలంగా రైతు రుణాలకు సంబంధించిన వివాదాలపై విచారణాధికారాలు న్యాయ స్థానాలకు ఇవ్వడం జరిగింది. తన భూముల అమ్మకంపై రుణగ్రస్తునికి రక్షణ గలిగించబడింది. గ్రామాధికారి వద్ద రైతు గ్రహించిన రుణాల విషయాలను తెలుపు లెక్కలు సేకరించబడ్డాయి. రుణాన్ని చెల్లించలేని పక్షంలో రైతుకు అరెస్టుల నుంచి రక్షణ కలిగింది. ఈ చట్టం తర్వాత 1900లో పంజాబ్ భూ ఆక్రమణ నిషేద చట్టం వచ్చేవరకు రైతుల రుణభారాన్ని తగ్గించే చర్యలేవీ ప్రభుత్వం చేపట్టలేదు.

రుణభారం మాదిరిగానే వ్యవసాయం రంగాన్ని బాధించిన మరొక సమస్య రైతాంగంలోని విభిన్న తరగతులు, వాటి మధ్యగల తారతమ్యాలు. భారతదేశంలోని వ్యవసాయ రంగంలో ఫ్యూడల్ వ్యవస్థ కొనసాగిందా లేదా పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగిందా అన్న విషయంపై సదా చర్చ కొనసాగుతూనే ఉంది. కాని బ్రిటీషువారి పాలనలో రైతుల మధ్య వ్యత్యాసం మరీ విపరీతంగా పెరిగిందన్న విషయం ఎక్కువమంది గ్రహించలేదు. రైతులందరూ ఒకటే అన్న అపోహ కూడా లేకపోలేదు. రైతులలో విభిన్న వర్గాలు, తరగతులు, వారి లక్ష్యాలు, ఆకాంక్షల వైవిధ్యం వల్ల ఏర్పడిందన్న సత్యాన్ని అనేకులు విమర్శించారు. రైతుల వర్గీకరణలో కొన్ని ప్రతిబంధకాలు లేకపోలేదు. ముఖ్యంగా మనకు లభించే జనాభా లెక్కలు వంటి వాటిలో "రైతు", "కౌలుదారు", "భూమి సొంతదారు" వంటి పదాల్ని మాత్రమే వాడటం గమనించదగినది. కాని భారత

రైతాంగంలోని వర్గాలు ఇవి మాత్రమే కావు. కుటుంబంలోని. సభ్యుల సంఖ్యపై, వారికి ఉన్న భూ విస్తీర్ణంపై ఆ భూమికి ఉన్న నీటి సదుపాయాలు. మార్కెట్టు సౌకర్యాలు మొదలైన అనేక విషయాలపై ఆధారపడి ప్రతివర్గంలో కూడా అనేక చిన్న. పెద్ద తరగతులు ఉండటం గమనించ తగ్గది.

రైతులలో వర్గీకరణ బ్రిటిషు పరిపాలన స్థాపనానంతరం బాగా ప్రచారం లోనికి వచ్చింది. ఇది సాంఘికమైన మార్పుల ప్రభావానికి కూడా లోనైందని చెప్పాలి. పరిశ్రమల స్థాపన పారిశ్రామిక కేంద్రాల ఆవిర్భావం. పట్టణాలు. నగరాలకు ప్రజలు వలస వెళ్ళడం వంటివి. గ్రామీణ జనాభాపై అమిత ప్రభావాన్ని చూపాయి. రైతు జనాలు పెట్టుబడిదారీ విధానానికి చేరువైన కారణంగా వ్యవసాయ కూలీలుగా. కార్మికులుగా మారారు. మార్కెట్లు అభివృద్ధి చెందడం మూలాన వ్యవసాయంతో సంబంధం ఉన్న ధనవంతులు వ్యవసాయోత్పత్తులకు మార్కెట్లకు చేరవేయడాన్ని చేపట్టి మరీ లాభాలు పొందారు. వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం సులభంగా చొరబడింది. 19వ శతాబ్దంలో రైతులలో వర్గ విభేదం మరీ ఎక్కువకావడం గమనించవచ్చు. 1880లో విడుదలైన మొదటి కరువు కమిటీ నివేదికను పరిశీలించిన రైతులు ఏ విధంగా తమ భూములను కోల్పోయి సామాన్య కూలీ జనంగా మారిపోయారన్నది తెలుస్తుంది. 1888లో ప్రచురించిన డఫ్రిన్ విచారణ కమిటీ నివేదిక కూడా పెరుగుతున్న వ్యవసాయ కూలీల కౌలుదార్లను గూర్చి తెలియజేసింది. దీని మూలంగా 18, 19 శతాబ్దాలలో బ్రిటిషు వారి పరిపాలన ప్రభావంతో రైతులు తమ భూములు కోల్పోయి. అధిక సంఖ్యలో కూలీలుగా మారారని చెప్పవచ్చు. రైతాంగంలో ఏర్పడిన ఈ మార్పు వ్యవసాయ రంగంపై అమిత ప్రభావాన్ని చూపింది.

ధనరూపంలోగాని, ధాన్యం రూపంలోగాని ప్రతిఫలం పొందిన వ్యవసాయ కూలీల సంఖ్య అమితంగా పెరగడానికీ, సాధారణ రైతు దుస్థితికీ అవినాభావ సంబంధముంది. భూమిపై అధికారం పోగొట్టుకొన్న రైతు తన భూమిని తనఖా పెట్టి అదే వ్యక్తి వద్ద కౌలుదారుడుగానో లేదా వారపుదారుడుగానో కొనసాగే అవకాశముంది. కాని ఆ వసతి కూడా కోల్పోయినప్పుడు భూములను పరాధీనం చేసినప్పుడు ఆ రైతులకు కూలీలుగా మారటంకన్న గత్యంతరం లేదు. గ్రామీణ జీవనంలో ఒక్కరైతులు మాత్రమే గాక వ్యాపారులు, భూస్వాములు, వడ్డీ వ్యాపారులు పనివారు కూడా ఉన్నారు. ప్లాసీ యుద్ధానంతరం దేశీయ పరిశ్రమలు అడుగంటిపోయాయి. దీనితో ప్రాచీన పట్టణాలైన ఢాకా, ముషీరాబాద్. లక్నో వంటి నగరాలు క్షీణించాయి. ఆ ప్రాంతాలలోని చేతి పనివారందరు జీవనోపాధికై వ్యవసాయరంగంపై ఆధారపడి కూలీలుగా మారారు. ఆ విధంగా వ్యవసాయ రంగంపై రద్దీ ఎక్కువైంది. గ్రామ ప్రాంతాలలోని అధిక జనాభా కర్మాగారాలలో తేయాకు తోటలలో, ఇనుప గనులలో కార్మికులుగా కూడా తయారయ్యారు. మిల్లు యజమానులు అధిక సంఖ్యలో కార్మికులను నియమంచుకొని తక్కువ కూలి రేట్లు నిర్ణయించి అధికంగా లాభాలు పొందగలిగారు.

19వ శతాబ్ది మధ్య భాగంలో దేశంలో పలుచోట్ల వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగినట్లు లెక్కలున్నాయి. ఉత్తరప్రదేశ్‌లో ఉదాహరణకు, పెద్ద కులస్థులు, నాగలి పట్టరాదనే నియమం ఉన్నందువల్ల జాట్‌లు, అహీర్‌లు, గర, కుమ్రీలు మొదలైన తెగలవారు వ్యవసాయ కూలీలుగా పనిచేశారు. గోరక్‌పూర్ ప్రాంతంలో కూలీలు రెండు మూడు నెలలు మాత్రం వ్యవసాయ పనులు చేసుకొనేవారిన వారికి ధనమో లేదా ధాన్యమో కూలీగా ఇచ్చేవారని తెలుస్తుంది. కొంత భూమి ఉండి తమ తీరిక సమయాల్లో భూకామందుల

క్షేత్రాల్లో పనిచేసే మరొక వర్గం కూడా ఆ ప్రాంతంలో ఉండేది. దినాజ్‌పూర్ ప్రాంతంలో 'వారం' పద్ధతిలో వ్యవసాయాన్ని కొనసాగించిన పేద రైతులు అధికంగా ఉండేవారు. 1876 నాటికి బీహార్‌లోని దర్భంగలో నూటికి ఇరవైఐదు (25) మంది భూమిలేని కూలీజనులని లెక్కించడమైంది. 20వ శతాబ్దారంభంలో ఈ సంఖ్య మరీ విపరీతంగా పెరిగిపోయింది. 1882 జనాభా లెక్కల ప్రకారం మద్రాసు రాష్ట్రంలో 7.5 మిలియన్ల వ్యవసాయ కూలీలున్నట్లు అంచనా. ఇది 1921 నాటికి 21 మిలియన్లకు, 1931 నాటికి 33 మిలియన్లకు పెరిగింది. కోస్తా ప్రాంతంలోని ఆంధ్ర జిల్లాలో ప్రాజెక్టుల నిర్మాణం తర్వాత వ్యవసాయదార్లు తమ భూములను, కౌలుదార్లకి ఇవ్వకుండా సొంతంగా అజమాయిషీ చేయించి వ్యవసాయాన్ని కొనసాగించిన కారణంగా వ్యవసాయ కూలీలు మరీ ఎక్కువ సంఖ్యలో పెరిగారు. కౌలుదారు ఆర్థికంగా కూలీజనం కన్న అనేకరెట్లు మిన్న. కౌలుదారుకు భూమి లేకపోయినా వ్యవసాయ పనిముట్లుండేవి. గ్రామంలో మెరుగైన సాంఘిక స్థానం, దీనితోబాటు అప్పుచేయగల సౌకర్యం ఉండేవి. వ్యవసాయ కూలీకి ఇవేవీ ఉండేవి కావు.

వ్యవసాయ రంగంలో సంభవించిన విప్లవాత్మకమైన మార్పులతో దేశంలోని అనేక ప్రాంతాలలో వాణిజ్య పంటల వ్యాప్తి ప్రధానమైంది. ప్రభుత్వ యంత్రాంగం ఆ వాణిజ్య పంటల విస్తరణకు తగిన వాతావరణాన్ని సృష్టించింది. పారిశ్రామిక విప్లవం వల్ల బ్రిటిషు పరిశ్రమలకు విస్తృతమైన మార్కెట్లు ముడి సరకులు అవసరమయ్యాయి. లంకాషైరు, మాంచెస్టర్ గ్లాస్గో వంటి కేంద్రాలలోని నూలు మిల్లులకు అమితంగా పత్తికావలసి వచ్చింది. ఇంగ్లండులోని వ్యాపార సంస్థలు భారతదేశంలో ముడిసరకులు దిగుమతులను ఎక్కువ చెయ్యాలని వాదించాయి. 1846లో పత్తి అభివృద్ధి సంస్థ దక్కనులో అనేక రైలు రహదార్లను వేసి పత్తి ఉత్పత్తికి ప్రోత్సాహం ఇవ్వాలని ప్రభుత్వానికి సూచించింది. 1853లో డల్హౌసీ రైలు మార్గాలకు సంబంధించిన నివేదికలో వాణిజ్య పంటల ప్రాధాన్యత గూర్చి సవివరంగా చర్చించాడు. పారిశ్రామిక అభివృద్ధికి వాణిజ్య పంటల విస్తరణ కార్యక్రమాన్ని ఉపయోగించడమైంది.

18వ శతాబ్దాంతం నుంచి భారతదేశంలో భూమి విలువల విషయంలోను, హక్కుల విషయంలోను, అనేక మార్పులు సంభవించాయి. వ్యవసాయ రంగంలో వాణిజ్యీకరణమనే విప్లవం ప్రధానంగా అమెరికాలో అంతర్యుద్ధానంతరం సంభవించింది. ఇంగ్లండుకు కావలసిన పత్తి కొనుగోలుకు భారతదేశంపై ఆధారపడవలసి వచ్చింది. 19వ శతాబ్దంలో మనదేశంలో జరిగిన రాకపోకల పెంపుదల కూడా వాణిజ్యీకరణకు మిక్కిలి దోహదం చేసింది. భారతీయ వ్యవసాయంలో జరిగిన ఈ వాణిజ్యీకరణ ఆర్థికంగానే కాక ఇతర విధాలుగా కూడా అనేక పరిణామాలకు దోహదకారి అయ్యింది. స్థానికంగా ఆహారానికి అవసరమైన పంటలను పండించడానికి బదులు మార్కెట్లలో విక్రయం కోసం పంటలు పండించడాన్ని వ్యవసాయంలో వాణిజ్యీకరణ అనవచ్చు. అందులో ఆర్థిక లావాదేవీలలో ధనం మార్పిడికి ప్రాధాన్యత ఇవ్వబడింది. రవాణా సౌకర్యాల అభివృద్ధి గ్రామాల ఏకాంతాన్ని తొలగించడమే గాకుండా గ్రామీణ స్వయం సమృద్ధి పద్ధతిని కూడా నశింపచేసింది. గ్రామీణ జనానికి సరిపోయే పంటలు మాత్రమే రైతు పండించాలనే పద్ధతి పోయింది. క్రమంగా వాణిజ్య పంటలను విస్తరింప జేశారు. ఒకే రకమైన పంటలను పండించే పద్ధతి చేపట్టబడింది. ఇది విక్రయానికి దూరప్రాంతంలోని మార్కెట్లకు పంపడానికి సౌకర్యంగా ఉండేది. లాభదాయకమైన పంటలను గుర్తించి వాటికి ప్రాధాన్యత నిచ్చారు. నీటి పారుదల పెంపొందించడం చేత లాభదాయకమైన పంటలు చేపట్టడం జరిగింది. వివిధ పంటలు పండించే విస్తీర్ణం కన్నా పంటలను పండించే ప్రాతిపదికలో మార్పు సంభవించడం గమనార్హం. ఈ మార్పు మూలంగా ముందు లేనటువంటి వ్యవసాయోత్పత్తుల మార్కెట్లు

ఏర్పడింది. దీని చేత వ్యవసాయదారుడు తాను పండించిన పంటలో అధికభాగం విక్రయించేవాడు. గ్రామీణ స్వయం సమృద్ధి అదృశ్యమై, గ్రామాలు బయటి ప్రపంచంతో వాణిజ్య సంబంధాలు కుదుర్చుకొనడానికి ఇది ప్రధాన కారణమైంది. వ్యవసాయంతో వాణిజ్యీకరణకు ప్రధానంగా భూమి శిస్తు ధన రూపంలో వసూలు చేయించడం, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందడం దీనిమూలంగా వ్యవసాయోత్పత్తులకు తగు మార్కెట్లు అభివృద్ధి చెందడం వంటిదనవచ్చు. దీనివల్ల రైతు తన పంటలో అధికభాగాన్ని అమ్మవలసి వచ్చింది. తన కుటుంబ అవసరాలకు కావలసి వచ్చినప్పుడు మళ్ళీ తనే కొనేవాడు. దేశంలోని విభిన్న ప్రాంతాలలో విదేశీ ఎగుమతులకు ప్రోత్సాహం లభించినచోట్లలో వ్యవసాయ వాణిజ్యీకరణ మిక్కిలి వేగం పుంజుకొంది. అందుచే బర్మా ప్రాంతం వరికి, పంజాబు గోధుమలకు, బెంగాల్ జనుపనార పంటకు పేరుగాంచాయి. కట్టుదిట్టమైన మార్కెట్టు వ్యవస్థ పెంపొంది ఎగుమతిదార్లు, సరాసరి ఉత్పత్తి దార్ల నుంచి ధాన్యాన్ని కొనుగోలు చేయడం జరిగేది. దీనవల్ల దళారీల ప్రభావం కొంతమేరకు తగ్గింది.

వాణిజ్యపు పంటలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం ఆహార ధాన్యాలు కూడా వాణిజ్యపరంగా పండించడం చేత దేశంలో పలుచోట్ల ఆహార ధాన్యాలను పండించే ప్రాంతం తగ్గి వాణిజ్య పంటల ప్రాంతం అధికమైంది. కాని ఇది ఇతర దేశాలలోలాగా కాకుండా పారిశ్రామికీకరణకు దోహదమివ్వ లేదు. పండించిన పంటలలో అధికభాగం మార్కెట్‌కి చేరడం అవి ఎగుమతులు గావడం వల్ల ఆంతరంగికంగా పారిశ్రామికాభివృద్ధి జరగనందున ఈ పరిస్థితి ఏర్పడింది. కాని వ్యవసాయం మాత్రం వాణిజ్యీకరణ పొందింది.

విదేశీ గిరాకి అమితంగా పెరిగినందువల్ల పంటలు పండించే రైతుకు ఎక్కువ లాభాలు చేకూరలేదు. ఇది ముఖ్యంగా వ్యవసాయంలో సంస్థాగత మార్పు రాకపోవడం, వ్యవసాయంలో కావలసిన యాంత్రికాభివృద్ధి లేకపోవడం, అన్నింటికీ మించి రైతుకు కావలసిన ఆర్థిక సహాయం లభించక పోవడం వల్ల జరిగింది. విదేశీ ఎగుమతుల అభివృద్ధి దాని మూలంగా వ్యవసాయోత్పత్తుల ధరల పెరుగుదల సన్నకారు రైతుకు అట్టే లాభాలను చేకూర్చలేదు. తన అవసరాలకు మించి అమ్మదగిన ధాన్యం అతనికి అతి తక్కువ కావడమే దీనికి కారణం. అనేక సందర్భాలలో రైతు కౌలుదారుడుగా ఇతరుల భూములను సాగుచేయడం వల్ల ఆ భూమిపై ధనాన్ని చెల్లించి వ్యవసాయ పద్ధతులలో ఏ మార్పులు తేలేని అశక్తుడయ్యాడు. దీనితో ధరలు పెరిగినా దానికి తగ్గట్టు వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడానికి తగు ప్రోత్సాహం కౌలుదారునికి లేదు.

దేశంలో కొన్ని ప్రాంతాలలో రైతులు వాణిజ్య పంటల స్థానంలో ఆహారధాన్యాలు, పశువుల మేతకై కావలసిన పచ్చగడ్డి, మరికొన్ని సనాతన పంటలు కూడా పండించారు. దీని మూలంగా శీతోష్ణస్థితిని అనుసరించి పంటలు పండించడం కూడా అలవాటైంది. ప్రాంతీయ ప్రాదిపదిక ననుసరించి పంటలు పండించడం వాణిజ్యీకరణలోని ఒక ప్రధాన అంశం. గతంతో గల ఒక సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసినా, ఈ పద్ధతి మన దేశంలోని వ్యవసాయ చరిత్రలో ఒక ప్రధానమైన మలుపు అని చెప్పవచ్చు. వ్యవసాయ వాణిజ్యీకరణ మూలంగా దేశంలోని ఆహార సరఫరాలో గొప్ప మార్పు సంభవించింది. 1866లో బెంగాలు ఒరిస్సా ప్రాంతాలలో సంభవించిన కరువు సమయంలో ప్రజల కష్టాలు పరాకాష్ట పొందడానికి ముఖ్య కారణం ఆహార ధాన్యాలు పండించే భూములన్నీ వాణిజ్య పంటలకు వినియోగించడమే అని తేలింది. కరువుకు పైన తెలిపిన కారణాలను పరిశీలించడానికి నియమించబడిన కాల్‌రిల్ ప్రకారం పై ప్రాంతాలలో నిలిమందు

తయారి అధికం అయినందువల్ల సర్వ సాధారణంగా ఉత్పత్తి అయ్యే ఆహార ధాన్యాలు తగ్గుతూ వచ్చాయి. ప్రతి ఏడూ నీలిమందు ఉత్పత్తి అధికం కావడం వల్ల 1866 కరువు ఉద్భృతమైందని అతడు అభిప్రాయ పడ్డాడు.

వ్యవసాయం వాణిజ్యీకరణ చెందిన కారణంగా రైతు ఎక్కువగా రుణగ్రస్తుడు గావడం జరిగిందని చెప్పవచ్చు. భూములను తనిఖీ చేయడం వంటి వాటి నుంచి ప్రభుత్వం రైతులకు రక్షణ కల్పించినా వారికి అప్పు అవసరం కాని విధానాన్ని ఏర్పరచ లేకపోయింది. రైతుల రుణభారం ఈ చట్టాల మూలంగా తొలగలేదు. వడ్డీ వ్యాపారులు కబంధ హస్తాలలో చిక్కుకొన్న రైతులకు ప్రభుత్వం ఏ ఉపశమనం కలిగించలేదు. సంస్థాగత రుణ సదుపాయాల ద్వారా ఈ పరిస్థితిని మెరుగుపరచి ఉండవచ్చు. అందువల్ల వడ్డీ వ్యాపారుల ఆట కట్టడానికి వీలుంది. సులభంగాను, తక్కువ వడ్డీ రేటుతో రుణాలు లభించే వీలు మాత్రమే గాకుండా రుణాలు అవసరమైనపుడు లోపాయికారి పరిస్థితులను అధిగమించే సౌకర్యాలు కలగజేయడం ప్రధానమైన కృషి. అందువల్ల ప్రభుత్వ సహకార సంఘాల ద్వారా రుణ సదుపాయాలు వంటివి చేపట్టి ఉండవలసింది.

వాణిజ్యపరమైన వ్యవసాయం వల్ల భూమి మారకాలు ఎక్కువయ్యాయి. 1860-1900 మధ్యకాలంలో రైతుల భూములు అధిక మొత్తాలలో వడ్డీ వ్యాపారుల హస్తగతమైనట్లు, అప్పటి లెక్కలు రుజువు చేస్తున్నాయి. జనాభా పెరుగుదల దానితోబాటు భూమి విలువల పెరుగుదలకూడా అటువంటి మారకాలకు దారితీశాయి. ప్రభుత్వ చట్టాలు ఈ భూమారకాలను పూర్తిగా అరికట్టలేదు. వీటి ఫలితాలు మరీ దుర్భరంగా ఉండేవి. భూకామందుల సంఖ్య పెరిగింది. కౌలుదార్లపై వారు అధికారాన్ని చెలాయించసాగారు.

కొన్ని వాణిజ్యపంటలు రైతుల అభీష్టానికి విరుద్ధంగా బ్రిటిషు అధికార్ల నిర్బంధం వల్ల పండించ బడ్డాయి. ఉదాహరణకు బెంగాలు రాష్ట్రంలో నీలిమందు పంటను పండించిన రైతులు అనేక ఇక్కట్లు ఎదుర్కొనవలసి వచ్చింది. చిన్న రైతుల ప్రమేయం లేకుండా బ్రిటిషు పెట్టుబడిదారు తమ భూకమతాల్లో కూలీలను ఉపయోగించి ఈ పంటను పండించడం ప్రారంభించారు. రైతులకు కావలసిన మొత్తాలను ముందుగా ఇచ్చేవారు. నీలి తప్ప మరి ఏ ఇతర పంటను పండించకుండా నిర్బంధించారు. ఐరోపాలో గొప్ప గిరాకి ఉన్న కారణంగా బ్రిటిష్ వ్యాపారులు. నీలి పంటను బెంగాలులో మిక్కిలి ప్రోత్సహించారు. అనేక ప్రాంతాలలో నీలి మందు తయారు చేసే కర్మాగారాలు స్థాపించబడ్డాయి. మాల్దా, పూర్ణియ, పబ్న, నదియ, జస్సోర్, మిడ్నాపూర్, రంగపూర్, రాజషాహి మొదలైన చోట్ల నీలిమందు ఫ్యాక్టరీలు స్థాపించబడ్డాయి. చిన్న చిన్న రైతులు బ్రిటిషు పెట్టుబడిదార్లు ఎరగా చూపే అడ్వాన్సులకు ఆశపడి నీలిపంటను చేపట్టారు. కాని 1850 తరవాత బెంగాలు జిల్లాలో జనుము విస్తరించబడింది. నీలి పంటకన్నా జనుము లాభదాయకంగా తోచినందున రైతులు నీలిపంటకు సుముఖత చూపలేదు. బ్రిటిషువారు నీలిని నిర్బంధంతో పండించ ప్రయత్నించినప్పుడు తిరుగుబాట్లు సంభవించాయి.

బెంగాలులో ఒక బిగ భూమిలో పొగాకు పండించి రైతు 11 రూపాయలు లాభం పొందేవాడు. కాని అదే భూమిలో నీలిపండించి 9 రూపాయల నష్టం పొందేవాడని 1860లో ప్రకటించిన నీలి కమీషన్ నివేదిక తెల్పింది. బెంగాలు రైతులు నీలిపంటకు వ్యతిరేకత తెల్పే సమయంలో బీహార్, బెనారస్ ప్రాంతాలలో ఈ పంట విస్తరించబడింది. కాని 1896-97 ప్రాంతంలోజర్మనీ రసాయనాలతో కూడిన కృత్రిమ అద్దకాలను ప్రవేశపెట్టిన కారణంగా నీలిపంట ఉత్పత్తి నిర్లక్ష్యం చేయడమైంది.

బెంగాలులో ఎక్కువగా ఆర్థిక మార్పులను తెచ్చిన వాణిజ్య పంట జనపనార. వస్తువుల ఎగుమతి దిగుమతులకు గోనె సంచుల అవసరం ప్రపంచ వ్యాప్తంగా ఎక్కువవడం వల్ల జనపనార ప్రాముఖ్యత విపరీతంగా పెరిగింది. జర్మనీలో దుప్పట్లు, సరసరమైన తివాచీలు, జనపనారతో తయారు చేయడం చేత జర్మన్ దేశానికి కూడా భారతదేశం జనుము అవసరమైంది. 1855లో భారతదేశంలో మొట్టమొదటి జనపనార కర్మాగారం స్థాపించబడింది. ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో జనపనార ఉత్పత్తి బాగా పెరిగింది. 1920 నాటికి 77 జనపనార కర్మాగారాలు స్థాపితమై దాదాపు 30 లక్షల కార్మికులకు ఉపాధి ఏర్పడింది. బ్రిటిషు పెట్టుబడిదార్లయిన రల్లి కంపెనీ, డేవిడ్ కంపెనీ, సిమ్ కంపెనీల వారు జనుము ఎగుమతిలో పేరు పొందారు.

వ్యవసాయ వాణిజ్యీకరణ విస్తరణను పరిశీలిస్తే విదేశీ వ్యాపార ప్రాముఖ్యత తెలుస్తుంది. మనదేశంలో పత్తి విదేశీ వ్యాపారాభివృద్ధి మూలంగా వాణిజ్య పంటగా రూపొందింది. ఐరోపాలో పత్తి అవసరాలన్నీ భారతదేశం నుంచి లేదా అమెరికా నుంచి వచ్చే దిగుమతులవల్ల తీరేవి. బొంబాయి వర్తక మండలి పత్తి ఎగుమతులకై దేశంలో పత్తిపంట విస్తరణను ప్రోత్సహించింది. 1850 తర్వాత రైలు మార్గాల వ్యాప్తివల్ల నాగపూర్, బీహార్, గుజరాత్ మొదలైన ప్రాంతాలలో పండిన పత్తి బొంబాయికి రవాణా అయ్యింది. బొంబాయిలో కూడా బ్రిటిషు పెట్టుబడిదార్లు పత్తి ఎగుమతులకు ఎక్కువ ఉత్సాహం చూపినా, స్వదేశీ వాణిజ్యానికి పెట్టుబడి ధనం, 19వ శతాబ్దంలో పత్తి ఎగుమతులకు ఉపయోగించడమైంది. గుజరాత్, మార్వాడి వ్యాపారులు దేశంలో అనేకచోట్ల పత్తి కొనుగోలు చేసి బ్రిటిషు వ్యాపారులకు అమ్మేవారు. విదేశాలకు కూడా వారు బ్రిటిషు కంపెనీల ద్వారా ఎగుమతులు చేసే వారు. పార్సీలు విదేశీ వ్యాపారంలో ప్రవేశించి చైనా, ఇంగ్లండులో వారి కంపెనీలు స్థాపించారు. నూలు మిల్లుల వ్యాప్తితో పత్తిపంట విస్తరించబడింది. ముఖ్యంగా బొంబాయి, సింధు, మధ్య పరగణాలు, మద్రాసు, పంజాబు, మొదలైన చోట్ల పత్తి పండించబడింది. దేశంలో పత్తికి విపరీతమైన గిరాకీ పెరిగింది. విదేశీ ఎగుమతులకు భారతీయ పత్తికి మంచి గిరాకీ ఉండేది. 1920 నాటికి మనదేశం చేసిన ఎగుమతులన్నింటిలో పత్తి 41 శాతం ఉంది. కనక పత్తి పంట ఎంత అభివృద్ధి చెందిందో తెలుస్తున్నది.

మద్రాసు రాష్ట్రంలో 19వ శతాబ్దంలో పత్తిపంట విస్తరించబడింది. మద్రాసు రేవు వల్ల పత్తి ఎగుమతులకు సౌకర్యం కలిగింది. గుజరాతీలు, మర్వాడీలలాగా మద్రాసులో చెట్టియార్లు పత్తి వ్యాపారంలో చొరవ చూపారు. పెద్ద మొత్తాలను ఈ వ్యాపారంలో పెట్టుబడి పెట్టి, తమ వ్యాపార కార్యకలాపాలను శ్రీలంక, బర్మా ప్రాంతాలకు కూడా విస్తరింపజేశారు. అక్కడి స్థానికుల సహకారంతో వారు ఆ ప్రాంతాలలో నూలు మిల్లులు స్థాపించారు.

జనుము, పత్తిలాగా చక్కెర పరిశ్రమకు విదేశీ ఎగుమతుల ప్రోత్సాహం లభించలేదు. చెరకు పంట విస్తరణ చక్కెర పరిశ్రమాభివృద్ధితో పాటే జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు బీహార్‌లో దాదాపు 9 చక్కెర కర్మాగారాలు స్థాపించబడ్డాయి. మధ్యపరగణాల ప్రాంతంతో 19వశతాబ్దారంభంలో చెరకు పంట అభివృద్ధి గాంచింది. దో ఆబ్ ప్రాంతంలోని కాలువల అభివృద్ధివల్ల అయోధ్య రోహిల్‌ఖండ్ రైల్వే మార్గాల వల్ల ఈ ప్రాంతంలో చెరకు పంటకు ప్రోత్సాహం లభించింది. 1870 నాటికి చెరకు ఖరీఫ్ పంటగా రోహిల్‌ఖండ్ ప్రాంతంలో విస్తరించబడింది. ఆగ్రాలో 1878-79 నాటికి దాదాపు 6వేల ఎకరాలలో చెరకు పండించబడింది. మీరట్‌లో 1807లో 22వేల భాగాలు ఈ పంటకింద సాగైంది. కాలువల అభివృద్ధితో బాటు చెరకు పంట

అభివృద్ధి కొనసాగింది. 1900 నాటికి ది 1 లక్ష 10వేల ఎకరాలకు చేరింది. కాని 1942 తర్వాత ఆహార ధాన్యాల వైపు మొగ్గు చూపిన కారణంగా చెరకు పంట విస్తీర్ణత మీరట్ ప్రాంతంలో తగ్గింది.

బీహార్ ప్రాంతంలో కూడా 19వ శతాబ్దంలో చెరకు పంట విస్తరించబడింది. అజామ్‌గర్, గోరక్‌పూర్ నుంచి వచ్చిన వారి మూలంగా చంపారాన్‌లో చెరకుపంట ప్రవేశించింది. కాని 1850 తరవాత నీలిమందు వ్యాప్తివల్ల చెరకు పంట తగ్గుముఖం పట్టింది. కాని రసాయన రంగుల మూలంగా నీలిపంటకు ప్రాధాన్యత తగ్గిన తర్వాత చెరకు విరివిగా పండించడమైంది. ముజరాపూర్, షాబాద్, బెత్తయ, సరన్ ప్రాంతాలలో చెరకు పంట విస్తరించబడింది. గయ ప్రాంతంలో సోన్ కాలువ తవ్వకం తర్వాత గంజాయి తోటలు సైతం చెరకు తోటలుగా మారాయి. మాంఘీర్, పాలమౌ లోయలో కూడా చెరకు అభివృద్ధి చేయబడింది. చెరకు రసం తీయడానికి ఇనుప రోలర్ మిల్లులు ఉపయోగించడం చేత ఈ పంటను పండించడంలో మరీ ప్రోత్సాహం లభించింది. దర్భాంగలో మధుబని ప్రాంతం చెరకు పంటకు మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ప్రస్తుత శతాబ్దం ప్రారంభంలో బిర్లా, జైన్, సింఘానియా మొదలైన కంపెనీలు చక్కెర కర్మాగారాలు స్థాపించాయి. బీహార్‌లో చక్కెర ఉత్పత్తి ధరలు బొంబాయి, మద్రాసు రాష్ట్రాలతో పోల్చినప్పుడు తక్కువ. కాని సరాసరి దిగుబడి ఎక్కువగా ఉండేది. 1930 ప్రాంతానికి మద్రాసు రాష్ట్రంలో చెరకు బాగా విస్తరించింది. పంజాబులో గోధుమలు, పత్తి గిరాకి ఎక్కువైనందున చక్కెర పరిశ్రమ తగ్గుముఖం పట్టింది. కోయంబత్తూరు వద్ద చెరకు పరిశోధనా సంస్థ కృషి ఫలితంగా ఎక్కువ దిగుబడిగల చెరకు వంగడాలు రూపొందింపబడ్డాయి. సామర్లకోటలో ప్రభుత్వం ఒక చెరకు ప్రయోగాత్మక క్షేత్రాన్ని కూడా స్థాపించింది.

వేరుశనగ పంటను వాణిజ్య పంటలలో ప్రధానమైందిగా పేర్కొనవచ్చు. విదేశీ ఎగుమతుల దృష్ట్యా ఇది మన దేశంలో విస్తరించింది. వేరుశనగకు ఫ్రాన్సులో విపరీతమైన గిరాకీ ఉండేది. ఎరువుల తయారీకి పనికి వచ్చే గానుగ పిండి ఇంగ్లండు, జర్మనీ, శ్రీలంక దేశాలకు ఎగుమతి చేయబడింది. శనగనూనె దేశంలో అధికంగా అమ్ముడుపోయినా కూడా దానికి ఇంగ్లండు, మారిషస్, సిలోన్లో గిరాకీ ఉండేది. 1880 నాటికి వేరుశనగ పంట 1,12,000 ఎకరాలలో సాగైంది. అందులో దాదాపు 70వేల ఎకరాలు బొంబాయి రాష్ట్రంలో కాగా 34 వేల ఎకరాలు మద్రాసు రాష్ట్రంలోనిది. తక్కినది ఇతర ప్రాంతాలలో సాగైంది. 1895 నుంచి మద్రాసు వేరు శనగ ఉత్పత్తికి ప్రధాన కేంద్రంగా మారింది. మెట్ట భూములు వేరుశనగ పంటకు ఉపయోగించడం చేత ఈ అభివృద్ధి సాధ్యమైందని అంచనా వేయబడింది. 1890 ప్రాంతంలో ప్రభుత్వం శ్రద్ధ వహించి సెనగల్, మొజాంబిక్, జపాన్, అమెరికా మొదలైన దేశాల నుంచి అధికనూనె దిగుబడి ఉన్న మేలురకాల విత్తనాలను దిగుమతిచేసి ప్రభుత్వ క్షేత్రాలలో పండించి, ఆ పంటకు విత్తనాలకై జిల్లా కలెక్టర్ల మూలంగా రైతులకు పంపిణీ చేయించింది. ఈ కృషివల్ల ఎక్కువ ఎండకు తట్టుకోగలిగిన, చీడలు మొదలైన వాటి బారి నుంచి రక్షించుకోగలిగిన వేరుశనగ పంట ప్రచారం పొందింది. పంట దిగుబడి కూడా పెరగడం చేత రైతులు ఈ పంటను పండించడానికి ఉత్సాహం చూపారు.

వరి, పొగాకు వంటి పంటల అభివృద్ధితో బాటు నాణ్యమైన విత్తనాలను కూడా, పంపిణీ చేయించడానికి ప్రభుత్వం శ్రద్ధ వహించింది. వాణిజ్యీకరణ కోసం అభివృద్ధి చెందిన పనిముట్లను కూడా ప్రభుత్వం ప్రవేశపెట్టడానికి ఆసక్తి చూపింది. 'క్లైమాక్స్' నాగలి వంటి వాటిని ఆ సమయంలో ప్రవేశపెట్టడం జరిగింది. అనేక సంచార ప్రదర్శన శాలలు ఏర్పాటు చేసి ఆ పనిముట్లను ప్రచారంలోనికి తేవడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. కాని సనాతన పనిముట్లను వాడటానికి అలవాటు పడ్డ రైతులు కొత్త పరికరాల పట్ల మోజు

చూపలేదని తెలుస్తుంది. ఆ పని ముట్ల కోసం స్థానికంగా లభించే ముడి పదార్థాలు వాడడం వల్ల, చెడిపోయినప్పుడు కాలహరణం లేకుండా అప్పటికప్పుడే దగ్గరలో మరమ్మతు చేయడానికి వీలయ్యేది. అందువల్ల రైతులు పాత పనిముట్ల వాడకానికే ఇష్టపడేవారు. నాగలి, బండి మొదలైనవి ముఖ్యంగా ఆయా ప్రాంతాలలో ఉన్న పశువుల ననుసరించి తయారుఅయ్యేవి. ఈ కారణంగా కొత్తవాటికి ఆసక్తి ఉండేది కాదు.

వ్యవసాయం ప్రధానంగా వాణిజ్యీకరణ పొందినా పేద రైతుల ఆర్థిక స్థితిలో పెద్ద మార్పు లేదు. వ్యవసాయంలో ఎట్టి మార్పు సంభవించినా సర్వసాధారణంగా అది సాంకేతిక అభివృద్ధికి దారితీసి యాంత్రిక వ్యవసాయ స్థితికి చేరి ఉండవలసింది. కాని అది సంభవించలేదు. అందువల్ల వ్యవసాయ రంగం చాల వరకు రైతులకు అభివృద్ధి నిరోధకంగా తయారైందనే చెప్పాలి.

# అధ్యాయం - 12

# నీటి వనరుల అభివృద్ధి

భారతదేశంలో చాలా ప్రాచీనకాలం నుంచి నీటి వనరుల అభివృద్ధి పథకాలు అమలు జరిపినట్లు తెలిపే ఆధారాలున్నాయి. వ్యవసాయం తెలిసిన నాటి నుండి నీటి పారుదల పద్ధతులు ప్రారంభమైనాయనవచ్చు. అందువల్ల దేశంలో నీటిని శాస్త్రీయంగా ఉపయోగించే విధానాలు శతాబ్దాల తరబడి అనుసరించి శాస్త్రీయంగా రూపొందించబడ్డాయి. ఇనుమును ఉపయోగించడం తెలుసుకొన్నప్పటి నుంచి నీటి పారుదల మెలకువలు క్షుణ్ణంగా అనుసరించడం జరిగింది. అంటే దాదాపు గడచిన మూడువేల ఏండ్ల నుంచి మనదేశంలో నీటిపారుదల పద్ధతులు అనుసరించడం జరిగింది. ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో నీటిని సక్రమమైన విధంగా వ్యవసాయానికి ఉపయోగించడం కూడా తెలియని సమయంలో భారతదేశంలో అనేక ఆనకట్టలు నిర్మితమయ్యాయి. దక్షిణదేశంలో నిర్మించిన ఆనకట్టలు వాస్తు శాస్త్ర అద్భుతాలుగా ప్రసిద్ధమయ్యాయి. చోళులు, విజయనగర రాజులు, కాకతీయులు నిర్మించిన తటాకాలు కొన్ని నేటికీ ఉపయోగింపబడుతున్నాయి. ఢిల్లీ సుల్తానులు, మొగల్ చక్రవర్తులు నీటి కాలువలకు ప్రాధాన్యం ఇచ్చారు. సింధు ప్రాంతంలో గంగా, యమున లోయలో అనేక కాలువలు నిర్మాణమయ్యాయి.

ప్రాచీన కాలంలో సర్వసాధారణంగా నీటి పారుదలలో మూడు ప్రధాన విధానాలుండేవి. అవి నదీ కాలువలు, తటాకాలు, బావులు. కాలువలు చాలవరకు నదుల ప్రవాహాన్ని కృత్రిమంగా అడ్డగట్టి నది నీటిని కాలువల ద్వారా మళ్ళించి పంటలకు నీరు అందించడానికి పనికి వచ్చాయి. హిమాలయ పర్వత ప్రాంతాలలో ఈ పద్ధతి అనుసరించారు. దక్షిణంలో కావేరి నదిపై క్రీ.శ. 2వ శతాబ్దంలో నిర్మించిన ఆనకట్ట ప్రాచీన భారతీయుల నేర్పరితనానికి ప్రతీక. 1892లో పంజాబులో ఇంజనీరుగా పనిచేసిన పి.జె. ఫ్లిన్ అనే ఆయన ప్రపంచం అంతటా కాలువల త్రవ్వకపు నైపుణ్యానికి భారతదేశం చక్కని ఉదాహరణ అని చెపుతూ "పొలాలకు నీటిని చేరవేసే పద్ధతిలో వాటికి మించినవి ఎక్కడా లేవు" అని పేర్కొన్నాడు. కాలువల కట్టడాలు దాదాపు శాశ్వతమైనవి. నదులు లేని ప్రాంతాలలో వర్షాకాలంలో మాత్రం ప్రవహించి ఆ కొండ వాగులను వృధా చేయకుండా పల్లపు ప్రాంతాలకు ఎంపిక చేసి ఎత్తైన కట్టలు నిర్మించి చెరువులను ఏర్పరచారు. వృధాగా పోయే నీటిని ఆ విధంగా నిల్వ చేయడం వల్ల కొన్ని నెలలపాటు ఆ చెరువు కింద పంట పొలాలకు నీటిని సరఫరా చేయడానికి వీలవుతుంది. కొన్ని సమయాల్లో ఈ చెరువులకు నదుల నుంచి మళ్ళించిన కాలువల నీరు కూడా సరఫరా అయ్యేది. ఇటువంటి చెరువులను "ఏరి", "కన్మయి" అని దక్షిణ దేశంలోను, 'అహర్' అని బీహర్ ప్రాంతంలోను వ్యవహరించేవారు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో చెరువుల ప్రస్తావన ఉంది. అంతకు ముందు వాటిని గురించి 'సంగం' కాలం నాటి రచనలలోను. జాతక కథలలోను వివరాలు ఉన్నాయి. నేటి తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, బీహార్, కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సా మొదలైన రాష్ట్రాలలో నేటికీ చెరవులేని గ్రామాలు చాలా అరుదు. దేశంలో మొత్తం రెండు లక్షల చెరువులున్నాయని అంచనా. చెరువుల వలె బావులు కూడా మనదేశంలో ప్రాచీన కాలం నుంచి ఉన్నాయి. బావుల మూలంగా నీటిసరఫరా చాలా పరిమితమైన కారణంగా రైతులు తమ వరకు మాత్రమే సరిపోయే విధంగా ఉపయోగించుకొనేవారు. బావులు ప్రధానంగా పశ్చిమ ప్రాంతంలో తవ్వబడ్డాయి. నదులు ప్రవహించే ప్రాంతాలలో కూడా బావుల తవ్వకం కొనసాగేది.

ఏర్పాధారమైన ప్రాంతాలలో మరీ ఎక్కువ. గంగానది లోయలో ఒకటి రెండు మీటర్ల లోతు తవ్వడంతో నీరు పుష్కలంగా ఉండేది. కాని ఇటువంటి బావులు రెండు మూడేళ్ళలో పూడిపోయేవి అందుచేత వీటిని 'కచ్చా' బావులనే వారు. మూడేండ్ల తర్వాత మళ్లీ ఆ బావులను బాగుచేయ వలసి వచ్చేది. ఈ మూడు ప్రధాన పద్ధతులే గాక నీటిపారుదలకు అనేక ఇతర పద్ధతులు కూడా అనుసరించేవారు.

బ్రిటిషు వారు మన దేశానికి వచ్చినప్పుడు వారు మన దేశంలోని నీటి వనరుల ప్రాధాన్యతను గుర్తించలేదు. ఉన్న నీటి సరఫార వివరాలనూ పరిశీలించనూ లేదు. 18వ శతాబ్దంలో బ్రిటిషు వారి రాజకీయ అధికార విస్తరణ కార్యక్రమం ఉధృతంగా కొనసాగుతున్న సమయంలో వారి ఆక్రమిత ప్రాంతాలలో నీటి వనరుల రక్షణ చాలా వరకు నిర్లక్ష్యానికి గురి అయ్యింది. స్థానికుల ప్రమేయంతో కొన్ని వనరులు మాత్రం కొనసాగాయి. 1766లో ఉత్తర సర్కారులు బ్రిటిషువారి వశమైనప్పటికీ కృష్ణా నదీలోయ ప్రాంతం ఆర్థికంగా సంపన్నంగానే ఉండేది. కాని 18వ శతాబ్దాంతానికి నీటి పారుదలలు లేని కారణంగా ప్రజా జీవనం దుర్భరంగా ఉండేదని కోస్తా ప్రాంతం నుంచి అనేకులు ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళవలసి వచ్చిందని సర్ ఆర్థర్ కాటన్ తన రచనలలో పేర్కొన్నాడు. తమ పూర్వీకులు నిర్మించిన ఆనకట్టల వంటివాటిని పదిలంగా రక్షించలేని బ్రిటిషువారు 'నవీన అనాగరికుల'ని స్థానికులు తలపోసినట్లు కాటన్ మహాశయుడు పేర్కొన్నాడు.

1820 నుంచి తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వం భారతదేశంలో నీటివనరుల అభివృద్ధి విషయంలో శ్రద్ధ వహించడం ప్రారంభించింది. ఇంగ్లండులోని డైరెక్టర్లు కూడా దీనిపై ఆసక్తి చూపారు. ఫలితంగా నేడు సర్వసాధారణమైన ఆధునాతన నీటి పారుదల పద్ధతులు వ్యాప్తిలోకి వచ్చాయి. బ్రిటిషువారు ప్రాజెక్టులు చేపట్టడంలో సామాన్య ప్రజానీకానికి కలిగే సౌకర్యాలతో బాటు ప్రభుత్వానికి కూడా ఆర్థిక లాభాలు కలగాలని ఆకాక్షించారు.

బ్రిటిషు వారి పాలనాకాలంలో 1850 వరకు కాలువల నిర్మాణం వంటి పనులు మిలటరీ బోర్డువారి ఆధ్వర్యంలో జరిగాయి. కాని తర్వాత సివిల్ డిపార్ట్‌మెంట్ పరంగా లార్డ్ కర్జన్ కాలంలో పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ స్థాపితమయింది. తంజావూరు, ఢిల్లీ ప్రాంతాలలోని జలాశయాల పునర్నిర్మాణ కార్యక్రమంలో ప్రభుత్వపు ఉదాసీనత గోచరిస్తుంది. ప్రాచీన కాలంలో కావేరి నదిపైన నిర్మాణమైన ఆనకట్ట ఆనాటి ప్రభుత్వం అధీనంలో ఉండేది. బ్రిటిషు వారు వచ్చిన తర్వాత వారి అధికారం కిందికి రావడంలో అసంగతమేమీ లేదు. కాని అటువంటి ఆనకట్టకు కావలసిన మరమ్మతులు చేయించడం ఇతర విధాల ఆనకట్టపై ఖర్చు చేయడం కూడా కంపెనీ ప్రభుత్వం బాధ్యతగా గుర్తించవలసి ఉండేది. 1804లో జరిగిన సర్వే మూలంగా ఈ బాధ్యత గురించి తెలియవచ్చింది. కావేరి నది ఆనకట్టను పునరుద్ధరించడంలో ప్రభుత్వం మొదట ఎక్కువ శ్రద్ధ చూపలేదు. కేవలం ప్రతి ఏడూ పేరుకొనే మట్టిని తీయడానికి మాత్రమే ప్రభుత్వం దృష్టి మళ్ళించింది. 1829-30 నాటి కావేరి డెల్టా ప్రాంతంలోని వరి పండించే రైతుల అవస్థలు ఎక్కువయ్యాయి. తర్వాత కొన్ని సంవత్సరాలలో ఆనకట్ట మరమ్మతు పనులు మొదలయ్యాయి: సర్ ఆర్థర్ కాటన్ చాకచక్యంతో కోలిరూన్ నదిపై శాశ్వత ఆనకట్టకు పథకాలు రూపొందించారు. 1838లో ఇది 83 వేల రూపాయల వ్యవసాయంతో పూర్తి అయింది. ఇది ఎంతో విజయవంతమైన నీటిపారుదల ప్రాజెక్టుగా రూపొందింది.

బ్రిటిషువారు 1801లో ఢిల్లీ ప్రాంతాన్ని ఆక్రమించుకొనడానికి దాదాపు 40 ఏండ్లకు ముందే యమునా నదిపై నిర్మించిన కాలువ కూడా నిరుపయోగమైంది. యమునా నదికి పడమర దిశలోని కాలువలు

తూర్పు దిక్కునగల కాలువలకన్న మెరుగైనవిగా ఉండేవి. ఎంతో శ్రద్ధతో మరమ్మతులు చేయడం వల్ల వాటిని పునరుద్ధరించడం సులువైంది. 1811 తర్వాత ఆ కాలువల మరమ్మతు ప్రారంభమైంది. 1821 తరువాత యమునా నది పశ్చిమ కాలువలను ఒక ఏకీకృత పథకం కిందికి తేవడానికి ఇంజనీర్లు కృషి చేశారు. 240 మైళ్ళ పొడవుగల "ఫిరోజ్‌షా కాలువ"ను (దీనిని ముందు ఢిల్లీ సుల్తానైన ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో తవ్వారు. తర్వాత పూడుకు పోయింది) హిమాలయాల నుండి హిస్సార్, హన్సీ వరకు రెండేండ్లలో కాలువ పనిపూర్తి చేసి 1825లో ఉపయోగంలోకి తెచ్చారు. పశ్చిమ యమున కాలువల మరమ్మతు 1830 ప్రాంతంలో మరీ ముమ్మరంగా కొనసాగింది.

ఇంతలో బ్రిటీషు పార్లమెంటు సభ్యులతో ఒక కమిటీ నియమితమైంది. ఆ కమిటీ భారతదేశంలోని నీటి పారుదల, రోడ్డు రవాణా విషయాలపై పెట్టదగిన ఖర్చు అటువంటి పెట్టుబడులపై రాబడి మొత్తాలను అంచనా వేయడానికి ఉద్దేశించబడింది. నీటి కాలువల మూలంగా అధికలాభాలు వస్తాయని అనిపిస్తే అటువంటి జలాశయాలను చేపట్టాలనీ అలాకాని పక్షంలో రోడ్లు వేసి రవాణా సౌకర్యాల అభివృద్ధి చేసినట్లయితే ప్రభుత్వానికి రాబడి అధికమవుతుందని ఆ కమిటీ నివేదించింది.

ప్రభుత్వానికి నీటిపారుదల విషయాలపై కచ్చితమైన ప్రణాళిక ఏదీ లేనందువల్ల కమిటీ సూచనల మేరకు పలు జలాశయాల మూలంగా లాభం కలుగుతుందో లేదా నష్టం కలుగుతుందో తెలుసుకొనే స్థితిలో లేదు. నీటివనరుల బాధ్యత కంపెనీ అధికారంలో స్థానిక సంస్థల ఆధ్వర్యంలో కొనసాగింది. ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలు కూడా విభిన్న అభిప్రాయాలుగల ప్రభుత్వ ఉద్యోగుల ప్రవర్తనలకు లోనయ్యాయి. మద్రాసులో ప్రభుత్వం నదుల నీటిని మళ్ళించే విషయంలోను కొన్ని సందర్భాలలో మాత్రం చెరువుల విషయంలోను తన బాధ్యతను స్వీకరించింది. కాని అనేక వేల కాలువలు ఇతరుల అధీనంలో కొనసాగి నీటిని ఆనకట్టల నుంచి పొలాలకు చేరవేసేవి. ఇటువంటి కాలవలపై ప్రభుత్వానికి అధికారం ఉండేది గాదు. అందుచేత నీటి తీరువ విధించడం కూడా కష్టతరమైంది. అందువల్ల మద్రాసులో నీటిపైగాక నీటి పారుదల గల భూములపై నీటి తీరువా వేసేవారు. అన్ని భూములు నంజ-పుంజ అని విభజించి నంజ భూములపై అధికశిస్తు విధించేవారు. ఉత్తర భారతదేశంలో నీటి వనరుల పునరుద్ధితమైన వెంటనే నీటిపై శిస్తు విధించి వసూలు చేశారు. బెంగాల్‌లో ఇంజనీర్లకు జలాశయాలను నిర్మించడం, రక్షించడం మాత్రమే గాక నీటిని సరఫరా చేయడం కాలువల మూలంగా పొలాలకు చేరిన నీటిపై పన్ను వసూలు చేయడం కూడా ఉండేది. యమున కాలువలకు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరే నీటి పన్ను వసూలు చేసే అధికారి.

నీటి వనరుల ఉపయోగాలు వాటివలన కలిగే ఆర్థిక లాభాలను గురించి అంచనా వేయడం స్థానిక ప్రభుత్వాలకు అప్పుడెప్పుడం జరిగింది. పార్లమెంటు కమిటీ నివేదికలో తెలిపినట్లు ప్రతీ జలాశయం ఆర్థిక ప్రయోజనాన్ని అప్పటికప్పుడే లెక్కగట్టడం కష్టతరమైన పని. తిరుచునాపల్లి దగ్గర కావేరి నదిపై సర్ ఆర్థర్ కాటన్ 1836లో నిర్మించిన ఆనకట్టు మద్రాసు రాష్ట్రంలో పెద్దతరహా నీటిపారుదల అభివృద్ధికి నాంది పలికింది. తర్వాత పదేళ్ళలో దాదాపు యాభై లక్షల రూపాయిలతో తూర్పు కోస్తాతీరంలో రాజమండ్రి నుంచి మధుర వరకు గల నీటివనరులు మరమ్మతులకు విస్తరణలకు, కొత్త వాటిని చేపట్టడానికి వినియోగించారు. ఈ జలాశయాల నిర్మాణానికి అయిన ఖర్చును, అందుమూలంగా వసూలయిన తీరువాతో పోలిస్తే మద్రాసు ప్రభుత్వానికి లాభదాయకంగా తోచింది. కాని ఈ లెక్కలు తయారు చేయడం పూర్తిగా శాస్త్రీయంగా

జరిగిందనడానికి వీలులేదు. ఒక ప్రాంతంలో వ్యవసాయ అభివృద్ధి చెందిందనడానికి ఒక్క నీటిపారుదల మాత్రమే గాక, ఇతర కారణాలు కూడా లేకపోలేదు. అటువంటి సౌకర్యాలు తక్కువైన ప్రాంతాలలో నీటిపారుదల మాత్రం అట్టే విప్లవాత్మక మార్పులు తేలేకపోవడం కూడా సహజమే.

బ్రిటిషు కంపెనీ ప్రభుత్వం తన పాలనా ప్రారంభదశలో పరిపాలనా సంస్కరణల పేరుతో జలాశయాల నిర్వహణ విషయంలో ప్రమేయమున్న అనేక స్థానిక నాయకులను తొలగించింది. అటువంటి నీటివనరుల బాధ్యత కంపెనీ ఉద్యోగులకు అప్పజెప్పింది. రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టకుండా ఈ పరిస్థితినే కల్పించింది. చెరువులు మొదలైన జలాశయాలు ప్రభుత్వానికీ చెందిన కారణంగా కంపెనీ ఉద్యోగులే వాటి బాగోగులు గమనించాలి. రెవిన్యూ అధికారుల అధీనంలో భూమి శిస్తు సక్రమంగా వసూలు చేయడానికి చర్యలు తీసుకున్నారుగాని వారు చెరువుల మరమ్మతులపై, వాటిని శాస్త్రీయంగా పరిరక్షించే పద్ధతుల అధ్యయనంపై ఆసక్తి కనబరచలేదు. అందుచే కంపెనీ పాలనాకాలంలో మద్రాసు రాష్ట్రంలో దాదాపు అన్ని ప్రాంతాలలో చెరువులు నిర్లక్ష్యానికి గురి అయ్యాయి. తర్వాత చెరువు మరమ్మతుకై సూపరిండెంట్ ఇంజనీర్ నియమితుడయ్యాడు. దేశంలో నీటిపారుదలకు ప్రత్యేకంగా ఏర్పరిచిన మొదటి కార్యాలయమిదేనని అనవచ్చు. మరమ్మతులకై అనేక సివిల్ ఇంజనీర్లు ఎందరో నియమితమవుతున్న కారణంగా 1819లో మద్రాసు రాష్ట్రస్థాయిలో ప్రత్యేక శాఖ స్థాపితమైంది.

బెంగాలు రాష్ట్రంలో సివిల్ ఇంజనీర్లకు నీటిపారుదల విషయాలలో పూర్వానుభవం లేని కారణంగాను, జమిందారీ పద్ధతిలో జలాధారాల విషయాలు జమిందార్లు మాత్రమే చూడవలసి ఉన్నందువల్ల బ్రిటిషు కంపెనీ ఉద్యోగులు నీటిపారుదల విషయాలను విస్మరించారు. కాని గంగా-యమున తీరంలోని నీటివనరులను అభివృద్ధి చేసే కార్యక్రమాలను బెంగాలు ఇంజనీర్లు చేపట్టి కొనసాగించారు.

మద్రాసు రాష్ట్రంలో అనేక ప్రాచీన జలాశయాలను బాగు చేయడం గ్రామప్రాంతాల చెరువుల మరమ్మతు చేయడం వంటి పనులు ఇంజనీరింగ్ శాఖకు అతీతంగా ఉన్న కారణంగా పెద్ద పెట్టుబడులకు అనువైన భారీ వనరుల నిర్మాణాన్ని గురించి ఇంజనీరు శాఖ తలపెట్టడం ప్రారంభించింది. 1840 నాటికి గోదావరి కృష్ణా డెల్టా ప్రాంతాల అభివృద్ధికై ఆర్థర్ కాటన్ వివరమైన పథకాలు వేసి అంచనాలు లెక్కగట్టాడు. శిథిలమైన ప్రాచీన వనరుల పునరుద్ధరించడం పెద్ద ఎత్తున కొత్త పనులు చేపట్టడం వంటివన్నీ సూచించబడ్డాయి. నౌకాయానానికి పొలాల ఉపయోగానికి పనికివచ్చే విధంగా కొత్త పథకాలు రూపొందించారు. గోదావరి ఆనకట్ట 1847లో ప్రారంభమై 1853 నాటికి పూర్తి అయ్యింది. 15 లక్షల రూపాయిలు అప్పటికి ఖర్చయింది. కాని మరో 9 లక్షల రూపాయలు మిగిలిన పనులకై కేటాయించడం జరిగింది. 1853లో ప్రారంభించిన కృష్ణానది ఆనకట్ట కూడా 15 లక్షల ఖర్చుతో 1855 నాటికి పూర్తి అయ్యింది. ఈ రెండు ఆనకట్టల నిర్మాణానంతరం భూమిశిస్తు మూలంగా ప్రభుత్వానికి అమితంగా లాభాలు చేకూరిన కారణంగా నీటి పారుదల అభివృద్ధి విషయాలను పరిశీలించడానికై పబ్లిక్ వర్క్స్ విభాగం ప్రత్యేకంగా నీటిపారుదల విషయాలకై స్థాపితమయ్యింది.

యమునా నదిపై కాల్వలను ప్రభుత్వం మొదటి నుంచి వ్యాపార దృష్టితో పరిశీలించింది. 1830లో మిలిటరీ బోర్డు అధీనంలోని పబ్లిక్ వర్క్స్ పరిధిలో మార్పులు చేశారు. అప్పటికి దాదాపు పదేళ్ళపాటు పశ్చిమ యమున కాలువ పని చేస్తూ వచ్చింది. తూర్పుకాలువ కూడా ప్రారంభమయ్యింది. కాలువలను పర్యవేక్షించిన

ఇంజనీరింగ్ విభాగాలను విస్తృతపరచారు. అధికార్ల విధులు స్పష్టంగా తెలియజేశారు. దాదాపు 445 మైళ్ళ పొడవు గల కాలువలను అందులో ప్రవహించే సుమారు 2.277 క్యూసెక్కుల (క్యూబిక్ ఫీట్ ఫర్ సెకండ్) నీటిని ఈ విభాగం పర్యవేక్షించింది. యమున కాల్వల అభివృద్ధికి పరిరక్షణకు ప్రభుత్వానికి 1820-21లో రెండు లక్షల రూపాయలు ఖర్చుకాగా ఇది 1846-47 నాటికి ముప్పై లక్షలకు పెరిగింది. ఈ ప్రాంతంలో జరిగిన ప్రభుత్వపు మొత్తం ఖర్చులో దాదాపు 48 శాతం నీటిపారుదల. వ్యవసాయాలకు మాత్రమే వెచ్చించారు. కాలువలకై పెట్టిన ఖర్చు కచ్చితంగా లాభాలను చేకూరుస్తుందనే ధీమా ప్రభుత్వానికి ఎక్కువైంది. ప్రభుత్వం తెల్పిన ఖర్చు మొత్తాలు ఎప్పుడూ రాబడి అంచనాలకు అధికంగా లేదు. దానికి మరొక కారణం కూడా లేకపోలేదు. మద్రాసు రాష్ట్రంలోలాగా ప్రాచీనకాలపు జలాశయాలు, వాటి మూలంగా కలిగే ఆర్థిక లాభాలను ప్రత్యేకంగా లెక్కగట్టక పోవడం చేత ప్రభుత్వానికి అయ్యే ఖర్చు కన్న లాభాలు ఎక్కువగానే ఉండేవి. ఉదాహరణకు 1820లో పశ్చిమ యమున కాలువ మూలంగా ఆదాయం 15వేల రూపాయిలు కాగా 1846లో ఇది 40 లక్షలకు పెరిగింది. పొలాలకు నీరు అందించడమే గాకుండా ఈ కాలువలు వల్ల అనేక ఇతర లాభాలు కూడా ఉండేవి. ఈ కాలువలు ద్వారా కలపను విశేషంగా రవాణా చేసేవారు. ప్రభుత్వం దానికి పన్ను వసూలు చేసేది.

రైతులు సౌకర్యంగా పంటలు పండించడానికి సమర్థవంతమైన నీటి పంపిణీ. ప్రభుత్వం కట్టుదిట్టంగా వసూలు చేయడానికి తగిన ఆదాయం ఉండేటట్లు బెంగాల్ ఇంజనీర్లు నీటివనరుల అభివృద్ధికి కృషి చేశారు. అందువల్ల ప్రధాన కాలువల నుంచి పొలాలు చేరడానికి తగిన అనేక చిన్న కాలువల నిర్మాణాన్ని చేపట్టారు. ఇటువంటి చిన్న కాలువలకు "రాజ్ బుహాలు" అని పేరు. ఇటువంటి రాజు బుహాలును స్థానిక ప్రభుత్వం ఆధ్వర్యంలో చేపట్టారు. ప్రాచీనకాలంలో నిర్మితమైన ప్రధాన కాల్వలకు చేసే మరమ్మతులు. దానికి అనుబంధంగా తవ్విన రాజబుహాలు, వీటికి తయారుచేసిన పథకాల విషయంలో ఇంజనీర్లు అనేక సమస్య నెదుర్కోవలసి వచ్చింది. కంపెనీ ప్రభుత్వం కేటాయించే మొత్తాలు సరిపోనందువల్ల కూడా అటువంటి సమస్యలు ఎక్కువయ్యాయి. దీనికి తోడు, కాలువల నిర్వహణ సమయంలో భూమి సేకరణ విషయాలలో కూడా సమస్యలు ఎదురయ్యాయి.

ఇదే సందర్భంలో ప్రభుత్వం కాలువల నీటిపారుదల విషయంలో పాలనా బాధ్యతను, రివెన్యూ అధికారాలను విడదీసింది. పరిపాలనా విభాగం ప్రధాన కాలువకు, అనుబంధ కాలువలకు తూములు నిర్మించడం వరకే బాధ్యత వహించింది. నీటిని రైతులకు పంపిణీ చేయడం గ్రామాలకు కౌలుకు అప్పజెప్పడం జరిగింది. కౌలు సాధారణంగా 18 లేక 20 ఏళ్ళకు ఇచ్చేవారు. ఇది దాదాపు మూడేళ్ళ కాలంలో ఆ గ్రామం చెల్లించిన నీటిపన్నును ప్రాతిపదికగా తీసుకొని నిర్ణయించే వారు. ఈ కాంట్రాక్టు పద్ధతి వల్ల దాదాపు 1840 వరకు ప్రభుత్వపు ఆదాయంలో ఎటువంటి మార్పు ఉండేది గాదు. నీటి పెంపుదల మూలంగా కలిగిన లాభాల వలన ప్రభుత్వం ఏ విధంగానూ అధిక ఆదాయం పొందలేదు.

తూర్పు యమున కాలువ చిన్నదైనా దాని మూలంగా దాదాపు 538 క్యూసెక్కుల నీరు సరఫరా అయ్యేది. పశ్చిమ యమున కాల్వతో పోల్చినట్లయితే ఇది నిడివిలో మూడింట ఒక వంతు మాత్రమే అయినా దాదాపు అందులో సగభాగం భూమికి నీరు అందించగలిగింది. 1830లో ప్రారంభమైన ఈ కాలువపై 1846 నాటికి దాదాపు 20 లక్షల రూపాయిలు ఖర్చు పెట్టబడింది. ఈ కాలువపై ఆదాయం కూడా కొన్ని ఏళ్ళు బాగా

అభివృద్ధి చెందింది. నీటి పన్ను వసూలు చేసే పద్ధతులు సంస్కరించబడ్డాయి. ఉపయోగించిన నీటి పరిమాణం తెలిపే చెక్క సిలీండరులు ఉపయోగించడం వల్ల ఇది వీలైంది. దీనివల్ల అనేక అవకతవకలు ఉత్పన్న మయ్యాయి. కాని కొంతకాలంలోనే నీటి పరిమాణాన్ని తెలిపే యాంత్రిక సాధానాలుపయోగించడం చేత ఈ లోపాలు సవరించబడ్డాయి.

నీటి పారుదల అభివృద్ధివల్ల వ్యవసాయంలో ఉత్పత్తి పెరుగుదల మాత్రమే గాక వర్షాభావం వల్ల కలిగే విపత్తుల నుంచి రైతులకు రక్షణ కూడా అవసరమని గుర్తించిన ప్రభుత్వం నీటి పారుదల అభివృద్ధికై అధికమొత్తాలను ఖర్చుపెట్టి గంగానదిని అంతర్వేది ప్రాంతానికి తరలించ దలచింది. 1841లో కరువు సంభవించిన కారణంగా బ్రిటీషు తూర్పు ఇండియా కంపెనీ గంగా కాలువల పథకాన్ని మంజూరు చేసింది. 1843లో కర్ణాటక ప్రాంతంలో ప్రజలు పెద్ద ఎత్తున జ్వర పీడితులయ్యారు. గంగా కాలువ పూర్తి అయితే ఇటువంటి జ్వరాల పీడన మరీ ఎక్కువగుతుందనే అనుమానం కలిగింది. వెంటనే ప్రభుత్వం ఒక కమిటీని నియమించి దీని విషయమై పరిశీలించమని ఆదేశించింది. కమిటీ తన నివేదికలో మలేరియా జ్వరాలను తగు జాగ్రత్తలతో నివారించ వచ్చని తెలియజేసింది. నీటి సరఫరాల అభివృద్ధికి వాతావరణానికి గల సంబంధాలను పరిశీలించడానికి నియమితమయిన అటువంటి కమిటీలలో ఇది మొదటిది. 1854 ఏప్రిల్ నాటికి గంగా కాలువ పూర్తి అయ్యింది. అప్పుడది 900 మైళ్ళ పొడవు ఉంది; 6,750 క్యూసెక్కుల నీటిని సరఫరా చేసి 15 లక్షల ఎకరాల భూమి సాగుకు ఉపయోగపడింది.

పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ స్థాపితమయిన అనంతరం క్రమేణ మిలటరీ బోర్డు స్వాధీనంలోని అన్ని బాధ్యతలను కొత్త విభాగం తీసుకొంది. 1854 నాటికి ప్రభుత్వపు హోంశాఖ మిలిటరీ బోర్డులోని సివిల్ వ్యవహారాలన్నిటిని తన స్వాధీనం చేసుకోసాగింది. మరు సంవత్సరం మిలటరీ బోర్డును తొలగించారు.

నీటిపారుదల శాఖకు విస్తృతమైన బాధ్యతలు, సంక్రమించాయి. దక్షిణంలో గోదావరి, కృష్ణా, కావేరి డెల్టా ప్రాంతాలలో పనులు కొనసాగాయి. గ్రామీణ ప్రాంతాలలోని అనేక వేల చెరువులు కూడా పబ్లిక్ వర్క్స్ శాఖ కిందికి తెచ్చారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో గంగా-యమున అంతర్వేది ప్రాంతంలో మూడు ప్రధానకాలువల పథకాలు విస్తరింపజేశారు. 1842లో సింధు ఆక్రమణతో మరో నీటి పారుదల గల రాష్ట్రం కంపెనీ అధికారం కిందికి వచ్చింది. 1849లో పంజాబును బ్రిటిషు వారు ఆక్రమించగా అధిక నీటిపారుదల ప్రాధాన్యత గల రాష్ట్రం కంపెనీ అధికారం కిందికి వచ్చింది. 1849లో పంజాబును బ్రిటిషు వారు ఆక్రమించగా అధిక నీటిపారుదల ప్రాధాన్యత గల రాష్ట్రం వారి అధీనమైంది. వేల సంఖ్యలోని కాలువలు ఆ విధంగా పబ్లిక్ వర్క్స్ అధీనంలోనికి వచ్చాయి.

నీటి వనరుల అభివృద్ధిలో ధనాన్ని పెట్టుబడి పెట్టడం ప్రభుత్వానికి లాభకరంగా తోచింది. అప్పటికి అభివృద్ధి చెందుతున్న రైల్వేలు లాగా ప్రభుత్వేతర పెట్టుబడులను నీటి పారుదలకు కూడా వినియోగించదలచింది కాని 1857లో సంభవించిన తిరుగుబాటు ఫలితంగా తాత్కాలికంగా ఈ ప్రభుత్వ ఉద్దేశం కార్యరూపం దాల్చలేదు. ఉత్తరదేశంలోని కాలువలు కంపెనీ ప్రభుత్వం పట్ల ప్రజలకు కలిగిన అసంతృప్తికి కొంతవరకు దోహదం చేశాయి. కర్నాల్, ముజఫర్ నగర్ ప్రాంతాలలో మట్టి పేరుకుపోవడం వల్ల

పట్టించుకోలేదు. తూర్పు గంగ కాలువ సముదాయంలోని రాజు బుహాల పరిధిలో కూడా భూస్వాముల బారి నుంచి పేదరైతులను ప్రభుత్వం రక్షించలేకపోయింది. 1857 తిరుగుబాటు సమయంలో నీటి వనరులకు అపారనష్టం వాటిల్లింది. పెద్ద ఎత్తున కాలువలపై దాడులు జరిగాయి.

1858లో భారతదేశంలో కంపెనీ అధికారం తొలగి బ్రిటీషు ప్రభుత్వం స్వయంగా పాలనా బాధ్యతలు స్వీకరించిన తరువాత నీటిపారుదల పథకాలలో గొప్ప మార్పులు సంభవించాయి. ఈ శాఖకు ప్రత్యేక బడ్జెట్ కేటాయించారు. నిధుల పెట్టుబడులు, రాబడి పద్దులు ప్రత్యేకంగా రూపొందించారు. అధికారం బదిలీ తరువాత కొద్దినెలలో మేజర్ సర్ స్ట్రాచీ నాయకత్వం కింద ఏర్పడిన సంఘం నివేదిక ప్రకారం ప్రజాపనులన్నీ రెండు వర్గాలుగా విభజించారు. అవి 1. రాష్ట్రపనులు, 2. అభివృద్ధి పనులు. సైనికుల నివాసాలు, న్యాయస్థానాలు, పాఠశాలలు మొదలైనవి రాష్ట్ర పనులుగా చేపట్టారు. వాటి మూలంగా లాభాలు పెద్దగా ఉండవు. కాని అభివృద్ధి పనులుగా చేపట్టిన వాటి నుంచి వ్యాపారదృష్టితో అప్పటికప్పుడే లాభాలను ఆర్జించే అవకాశం ఉంది. అటువంటి అభివృద్ధి పనులు ఇంగ్లండులోని అధినేతల ఉత్తరువులు లేకుండా 10 లక్షల రూపాయిల అంచనాలకు మించని పనులు చేపట్టవచ్చునని కమిటీ సూచించింది.

1858లో ప్రభుత్వానికి ఈ పనులన్నిటికీ నిధులను ఎట్లా సమకూర్చాలన్న సమస్య ఎదురైంది. ప్రభుత్వ అవసరాల విస్తరణతో బాటు రాష్ట్రపనుల విస్తరణ కూడా కొనసాగింది. అభివృద్ధి పనులు అత్యవసరమైనందు వల్ల అందులో ప్రధానమైన నీటిపారుదలకు ప్రభుత్వం అత్యంత శ్రద్ధ చూపవలసి వచ్చింది. అందులో పెట్టుబడి పెట్టటం కూడా అమిత లాభదాయకంగా తోచింది. కాని ప్రారంభంలో వెచ్చించగల పెట్టుబడి మొత్తాలు అధికంగా అవసరమైనందువల్ల ప్రభుత్వం మాత్రమే ఇటువంటి మొత్తాలను వెచ్చించలేకపోయింది. లార్డ్ స్టేన్లీ సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా నియమితమైన తర్వాత ప్రైవేటు వ్యక్తులు నీటి పారుదల ప్రాజెక్టులపై పెట్టుబడి పెడితే మేలని భావించారు. సిపాయిల తిరుగుబాటుకు ముందు ఇటువంటి సూచన చేసినది సర్ ఆర్థర్ కాటన్. ప్రభుత్వపు కనీస గ్యారంటి 5 శాతంగా ప్రైవేట్ వ్యక్తుల నుంచి మద్రాసు రాష్ట్రంలో అటువంటి పెట్టుబడులను ప్రోత్సహించాలని అతడు సూచించాడు. కాని అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ డల్హౌసీ అందుకు సముఖంగా లేడు. పంటలు, పండించడానికి అవసరమయ్యే నీటి సరఫరా చేయవలసిన బాధ్యత ప్రభుత్వానిదైనందువల్ల అటువంటి బాధ్యత ప్రైవేట్ వ్యక్తులకు, కంపెనీలకు, అప్పజెప్పడం అనుచితమని అప్పుడు భావించాడు. కాని ఈ పద్ధతిలో అనేక సదుపాయాలున్నాయని లార్డ్ స్ట్రాచ్ సూచించాడు.

1859లో మద్రాసు నీటిపారుదల కాలువల కంపెనీ ప్రైవేట్ పెట్టుబడులను స్వీకరించడానికి అనుమతి పొందింది. ఆ కంపెనీ చేపట్టే పనులకై వెచ్చించే మొత్తాలపై 5 శాతం లాభాలకు గ్యారంటి ఇవ్వడానికి, ప్రభుత్వ అజమాయిషిలో కంపెనీ నడవడానికి 25 ఏళ్ల తర్వాత కంపెనీ పనులన్నీ ప్రభుత్వమే అప్పటి విలువల ననుసరించి కొనుక్కొనడానికి నిర్ణయమైంది. 1863లో ఈ పథకాలు చేపట్టారు. కర్నూలు వద్ద తుంగభద్రకు ఆనకట్ట నిర్మాణానికి తగు పథకాలు వేశారు. ఉత్తరభాగంలో మహానదిపైన గోదావరి కృష్ణా ఆనకట్టల లాగా నీటి పారుదలకు, నౌకాయానానికి ప్రాజెక్టులు నిర్మించాలని నిర్ణయించారు. కాని బ్రిటీషు ప్రభుత్వం మద్రాసుకు దగ్గర గల ప్రాజెక్టులను మాత్రం చేపట్టింది "ఈస్టిండియా ఇరిగేషన్ కంపెనీ" అనే మరొక ప్రైవేట్ కంపెనీ మహానది ప్రాజెక్టును చేపట్టి 1863లో పని ప్రారంభించింది. జలాశయాల అభివృద్ధివల్ల

ప్రభుత్వ ఆదాయం పెరిగింది. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో 1860-61లో సంభవించిన కరువు సమయంలో నీటిపారుదల గల జిల్లాలో కరువు ప్రభావం తక్కువగా ఉన్నట్లు తేలింది.

సర్ ఛార్‌లెస్ వుడ్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ గా నియమితమైన తర్వాత, నీటి పారుదల ప్రైవేట్ కంపెనీల అధీనంలో ఉండడం అనే విషయాన్ని పునరాలోచన చేశాడు. 1864లో అతడు ప్రభుత్వానికి పంపిన నివేదికలో నీటివనరుల అభివృద్ధి పథకాలు ప్రభుత్వమే చేపట్టడం సమంజసమని తెలియజేశాడు. అందుచేత ప్రభుత్వం చిన్న నీటివనరులను తక్కువ పెట్టుబడితో స్థానిక ప్రభుత్వాల సహకరంతో చేపట్టింది. ప్రభుత్వం చేపట్టిన మరొక విభాగం భారీ వనరుల నిర్మాణం. ఈ పథకాలను తయారు చేయడంలో ఆ పథకాలు ఎంతవరకు లాభదాయకమనే విషయానికి ప్రాధాన్యం ఇచ్చారు. మద్రాసు రాష్ట్రంలో అటువంటి పథకాలు అమిత లాభాలు చేకూర్చేవిగా భావించారు.

ప్రభుత్వం స్వయంగా జలవనరుల నిర్మాణానికి ఆసక్తి చూపడం ప్రారంభించిన వెంటనే ప్రైవేట్ కంపెనీల ఉత్సాహం తగ్గింది. కాలువల పనితీరు మందకొడిగా తయారైంది. గండ్లు పడగా వెల్లువలైన నీరు బురద గుంట్లను తయారు చేసింది. దీనివల్ల జ్వరాలు - అధికసంఖ్యలో మరణాలు సంభవించాయి. కాలువల పథకాల కింద లాభాలు ఎక్కువగా కనిపించినా నిజానికి 3 శాతంకన్న ఎక్కువ లేదు. కాలువల మూలంగా ప్రయోజనం తక్కువని తోచింది.

మద్రాసు రాష్ట్రంలో దీనికి భిన్నంగా అధిక లాభాలు పొందారు. దక్షిణంలో నదులపై నిర్మితమైన ఆనకట్టలు వాటి నిర్మాణంలో అనుసరించిన సాంకేతిక నైపుణ్యం లాభదాయకంగా పరిణమించింది. దీనితోబాటు నదులపై జరిగిన రవాణా కూడా లాభాలకు కారణమయ్యింది. కాని గంగా, యమున కాలువలపై ఆ విధంగా వ్యవసాయం రవాణా రెండూ లాభదాయకంగా కొనసాగలేదు.

1867లో మొట్టమొదటిసారిగా నీటిపారుదల శాఖకు ఒక డైరెక్టర్ జనరల్‌ను నియమించడం జరిగింది. బ్రిటన్ అధీనంలోని భారతదేశంలో ఒకే విధమైన పథకాలు రూపొందించడానికి ప్రయత్నాలు జరిగాయి. నీటివనరులను కల్పించడంలో ప్రభుత్వం ఎక్కువ లాభాలు వచ్చే వ్యాపార దృష్టిలో గాక ఎక్కువ మంచిని కల్పించే వనరులను చేపట్టవలసిన ఆవశ్యకత దృష్టి ముఖ్యమని భావించడం జరిగింది. నీరు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిది అన్న సూత్రంతో పనులు రూపొందించబడ్డాయి. ఈ దృక్పథంతో ప్రజాపనుల శాఖ క్రొత్త నీటి వనరుల పథకాలు తయారుచేసింది.

1869లో మద్రాసు, బొంబాయి రాష్ట్ర ప్రభుత్వాలు అనేక కొత్త పథకాలను రూపొందించాయి. సింధ్ ప్రాంతంలో నీటివనరులు అంత లాభదాయకంగా తోచలేదు. సుక్కూర్ కాలువ అప్పటికీ ప్రారంభమైంది. కానీ అనేక అవాంతరాల కారణంగా పనులు చురుకుగా కొనసాగలేదు. ఒరిస్సా, బీహార్ ప్రాంతాలలో కూడా ఈస్టిండియా ఇరిగేషన్ కంపెనీ స్వాధీనపరచిన వనరులు ప్రభుత్వానికి ఎటువంటి లాభాలూ ఆపాదించలేదు.

మద్రాసు, ఒరిస్సాలో లాగా రాష్ట్రంలో రూపొందించిన పథకం ద్వారా దాదాపు 15 లక్షల ఎకరాలకు నీరు సరఫరా చేసే అంచనాలు వేశారు. కాని 1867 నాటికి కేవలం 10వేల ఎకరాలు మాత్రం సాగుబడిలోకి

వచ్చాయి. పార్లమెంటులో భిమగ్నలు లేవదీశారు. రైల్వేలు, నీటిపారుదల రెండింటిపైన దాదాపు 37 శాతం పెట్టుబడి పెట్టినట్లు అంచనాలు వేశారు. నీటిపారుదల మూలంగా బెంగాలులో 2.5 శాతం లాభం రాగా, పంజాబులో 4.5 శాతంగాను, 15 శాతం బొంబాయిలో, 16 శాతం మద్రాసులోను వచ్చినట్లు తేలింది. 1876 ప్రాంతంలో సుమారు నలభై ఆరు నీటి ప్రాజెక్టులు ప్రభుత్వానికి లాభాలు చేకూర్చేవిగా పరిగణించబడ్డాయి.

1870 నాటికి భారతదేశంలో కరువు సర్వసాధారణంగా సంభవించే విపత్తు అని దానిని ప్రజాపనుల వంటి సౌకర్యాల వల్ల నివారించవచ్చని గుర్తించారు. కాని ఆ సమయాలలో రవాణా సౌకర్యాలకు ముఖ్యంగా రైల్వేలకు ప్రాధాన్యం ఎక్కువగా ఇచ్చారు. దేశంలో ఆహార కొరత లేదుగాని ఆహారాన్ని అన్ని ప్రాంతాలకు సక్రమంగా రవాణా చేయలేక పోవడంచేత కరువులు సంభవించాయని అప్పటి నమ్మకం. కాని అసలు కరువులు సంభవించకుండా నివారణ చర్యలు తీసుకోవాలంటే దానికి ప్రధానమార్గం నీటిపారుదల. 1876-78లో మద్రాసు రాష్ట్రంలో సంభవించిన కరువు తర్వాత నియమితమైన కమీషన్ తన సూచనలలో నీటివనరుల ప్రాధాన్యం చర్చించింది. నీటిపారుదల పథకాల ప్రయోజనాన్ని మదింపు వేయడంలో కేవలం ఆర్థిక పరమైన ఫలితాలేగాక, ఇతర సామాన్యమైన లాభాలను ముఖ్యంగా వ్యవసాయంపై ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాన్ని కూడా పరిశీలించమని కమీషన్ ఆదేశం పొందింది.

ఉత్తర భారతదేశంలో కాలువలు ఎక్కువగా ఉన్న పంజాబ్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో నీటిపారుదల సౌకర్యంవల్ల వ్యవసాయం బాగా అభివృద్ధి చెందింది. వర్షపాతం మామూలుగా ఉన్న సమయాలలో నీటిపారుదల ప్రాజెక్టుల మూలంగా గోధుమలు, బార్లీ, చెరకు వంటి లాభదాయకమైన పంటలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. కాని వర్షాభావం ఏర్పడినప్పుడు కాలువల నీటికి ఒత్తిడి ఎక్కువయ్యేది. అందువల్ల ప్రభుత్వానికి ఆదాయం కూడా ఎక్కువైంది. మద్రాసు రాష్ట్రంలో కొత్త ఆనకట్టల నిర్మాణంవల్ల అప్పటికే గల నీటిపారుదల బాగా మెరుగైంది గాని ఉత్తరాది ప్రాంతాలలోవలె అనేక భూములు కొత్తగా నీటిపారుదల పొందలేదు. అందువల్ల ప్రభుత్వం ఆదాయంలో పెద్దమార్పు జరగలేదు. డెల్టా ప్రాంతాలలో వరిసాగు గడ్డు సంవత్సరాలలో కూడా ఆనకట్టల మూలంగా సర్వసాధారణంగా కొనసాగింది. కాని అటువంటి రక్షణలేని మెట్ట ప్రాంతాలలో కరువు సంభవించినపుడు నష్టం అధికంగా ఉన్నట్లు కమీషన్ తెలియజేసింది. సింధ్ ప్రాంతంలో కాలువలపై ఆధారపడి నందువల్ల అవసరమైనపుడు కాలువలను అభివృద్ధి చేయడం కష్టతరమైనది గాదు. కాని బొంబాయి రాష్ట్రంలో భౌగోళికంగా కాలువలు త్రవ్వడానికి అనువైన అవకాశాలు లేనందువల్ల 1870 నాటికి నీటిపారుదల పొందిన ప్రాంతం చాలా తక్కువ. మెట్ట పంటలు గల ప్రాంతం అధికంగానే ఉండేది. బెంగాల్ (బీహార్, ఒరిస్సాల)లో కూడా నీటివనరులు, వాటివల్ల వ్యవసాయానికి లభించిన లాభాలు తక్కువగానే కొనసాగాయి.

సాంకేతిక శ్రద్ధాసక్తులు, సివిల్ ఇంజనీర్ల ఆసక్తి, భారీ నీటివనరుల నిర్మాణానికి మాత్రమే పరిమితమైంది. 19వ శతాబ్దమంతా అటువంటి భారీ ప్రాజెక్టుల నిర్మాణానికి మాత్రమే అమిత ఆసక్తి కనబరచారు. కొన్ని సందర్భాలలో సిపాయిల తిరుగుబాటు, మరికొన్ని సందర్భాలలో ప్రాజెక్టులు లాభదాయకంగా లేవని తెలిసిన తర్వాత అటువంటి ప్రాజెక్టులు కుంటుబడ్డాయి. ఆ శతాబ్దాంతానికి ప్రభుత్వానికి నీటిపన్నుల విలువలను అంచనా వేయటం పెద్ద సమస్యగా తయారైంది. 1882లో అన్ని ప్రధానమైన నీటిపనులు పునర్విభాజితమయ్యాయి. కొన్ని ఉత్పాదకమైనవి గాను, మరికొన్ని రక్షిత పథకాలుగాను, వర్గీకృతమయ్యాయి

మద్రాసు రాష్ట్రంలో బాగుచేసిన ప్రాచీన కాలంనాటి ఆనకట్టలు ఎంతో లాభదాయకంగాను. తరవాత నిర్మాణమైన కడప-కర్నూలు కాలువ వంటి వాటివల్ల లాభాలు లేనట్లు తెలిసింది. కావేరి ఆనకట్టవల్ల నికర ఆదాయం 80 శాతానికి పైగా ఉందని లెక్కగట్టారు. ఉత్పాదక పథకాలు, రక్షిత పథకాలుగా పరిగణింపబడిన నీటివనరులు, వ్యవసాయపు ప్రగతి కేవలం కాలువలపై ఆధారపడలేదని నిరూపించాయి. కాలువల నిర్మాణానికి భౌగోళికంగా తగినట్లు లేకపోయినట్లయితే లాభాలు అట్టే ఉండవు. ప్రాంతీయ వ్యత్యాసాల ప్రాధాన్యాన్ని 1879 కమీషన్ నివేదికలో తెలిపింది. పెద్దపెద్ద నీటి ప్రాజెక్టుల పథకాలు సూచించవలసిన ప్రాంతాలలో అట్టి ప్రాజెక్టులు నిర్మించబడ్డాయని కరువు కమీషన్ తెలియజేసింది.

ప్రజా పనులకై ప్రభుత్వం కేటాయించిన మొత్తాలలో అధికభాగం రైల్వేలకు వినియోగించారు. 1880 నుంచి 1895 వరకు నీటిపారుదలకు సాలీన చేసిన ఖర్చు తక్కిన ఖర్చులో నాల్గింట ఒక భాగం మాత్రమే. నీటివనరుల అభివృద్ధి కోసం 1880 నుంచి 1900 వరకు ఖర్చు చేసిన 145 మిలియన్ల రూపాయిలలో 52 శాతం వాయవ్య సరిహద్దు ప్రాంతంలోను. 37 శాతం పంజాబులోను, వెచ్చించారు. తక్కిన ప్రాంతానికంతా 11 శాతం మాత్రమే వినియోగించారు. భారీపనులు చేపట్టడం చేత లాభాలు తక్కువని కూడా ప్రభుత్వానికి తెలిసింది. కరువు కమీషన్ బెంగాల్, దక్కన్ గుజరాత్ తదితర ప్రాంతాలలోని నీటిపనులు, లాభదాయకంకాదని నివేదించింది. భౌగోళికంగా పెద్ద నీటి ప్రాజెక్టులకు అనువుగా లేని ప్రాంతాలలో వ్యవసాయ సమస్యలు లేకపోలేదు. 19వ శతాబ్దంలో సంభవించిన కరువులు అటువంటి మరీ ఎక్కువ నష్టాలను ఆపాదించింది.

భారతదేశంలో పలుచోట్ల నీటిపారుదల సౌకర్యాలు లేకుండా వ్యవసాయం కొనసాగించడం దుర్లభమని తేలింది. భారీనీటి పనుల మూలంగా లాభాలు తక్కువని తెలిసినందువల్ల, కరువు కాటకాలను నివారించడానికి నీటిపారుదల మాత్రమే చాలదనే భావం ప్రచారంలోకి వచ్చింది. నీటిపారుదలను విస్తరించడం మూలంగా కలిగే లాభాలు మితమైనవనే అభిప్రాయం కలిగింది. దేశంలోని సాంకేతిక సలహాలను సేకరించాలనే ఉద్దేశంతో ప్రభుత్వం 1900లో ఇరిగేషన్ కమీషన్‌ను నియమించింది. రెండేళ్ళ కాలవ్యవధిలో ఈ కమీషన్ భారీ పనులకుగాక, చిన్న నీటివనరుల అభివృద్ధికి గల ప్రాముఖ్యాన్ని తెలియజేసింది. అప్పటికే ఉన్న నీటి పనులను విస్తృతపరచడం కూడా ప్రభుత్వం విధిగా తెలియజేసింది. చిన్న నీటివనరుల నిర్మాణం, అభివృద్ధి మొదలైన పనులు పై విధంగా నీటి పారుదల కమీషన్ నివేదిక ప్రకారం ప్రస్తుత శతాబ్దారంభంలో మాత్రమే చేపట్టడం జరిగింది.

నీటి వనరుల అభివృద్ధి వల్ల, రుతుపవనాల పైన మాత్రమే ఆధారపడవలసిన అవసరం కొంతవరకు తగ్గింది. కరువు కాటకాల గురించి ఏర్పడిన భయాందోళనలు, వ్యవసాయదారులను వేధించడం తగ్గింది. తన భూమిని అభివృద్ధిపరచుకోవాలనే కాంక్ష నీటి సరఫరావల్ల ఎక్కువైంది. అధిక పెట్టుబడి పెట్టడానికి ధైర్యం కూడా నీటిపారుదల మూలంగా కలిగింది. నీటివనరుల అభివృద్ధి చేత వ్యవసాయదారునికి లాభదాయకమైన వాణిజ్య పంటలను పండించడానికి వీలైంది. వ్యవసాయంలో వాణిజ్యకరణ నీటిపారుదల అభివృద్ధి మూలంగా సులభతరమైంది. భూమి విలువల పెరుగుదల కూడా నీటిపారుదల సౌకర్యం మూలంగా జరిగింది.

# అధ్యాయం - 13

## కరువులు - సహాయ పథకాలు

ఇతర వ్యావసాయిక దేశాలలోలాగా భారతదేశం కూడా పూర్వకాలంలో కరువు సంఘటనలకు లోనైంది. సంస్కృతంలోనూ, పాళీ భాషలోనూ ఉన్న ప్రాచీన గ్రంథాల్లో కరువు వచ్చిన సందర్భాల ప్రసక్తి ఉంది. కాని ఈ కరువులు తరచుగా ఉండేవా లేదా కరువుకు. కరువుకు మధ్య ఎంత కాలవ్యవధి ఉండేది అనే విషయం వివాదాస్పదమయ్యింది. మహమ్మదీయుల పరిపాలనా కాలంలో కరువులు అతి కొద్దివని, కరువులు సంభవించినపుడు ఫిరోజ్ తుగ్లక్, అక్బర్, షాజహాన్ వంటి చక్రవర్తులు అనేక కరువు నివారణోపాయాలను చేపట్టేవారని తెలుస్తున్నది. కాని బ్రిటిషువారి రాక తర్వాత భారతదేశంలో కరువు కాటకాలు అధికమయ్యాయి. కరువు సంభవించినపుడు దాని ఫలితాలు కూడా మిక్కిలి ఉధృతంగా ఉండేవి. కరువు ఏర్పడటానికి అనేక కారణాలు పేర్కొనవచ్చు.

ప్రాచీనకాలంలో రాజకీయ అవాంతరాలు, యుద్ధం, దోపిడీ అరాచకం మొదలైనవి, పంటల నాశనానికి దారితీసి దాని మూలంగా ఉధృతమైన కరువు కాటకాటకాలు సంభవించేవి. జనాభా పెరుగుదల అధికంగా కొనసాగి దానికి తగినట్లు పారిశ్రామికాభివృద్ధి జరగక పోయిన, వ్యవసాయ రంగంపై వత్తిడి ఎక్కువవడం వల్ల, భూకమతాలు మరీ చిన్నవవడం వల్ల, వ్యవస్థాపరమైన రుణాలు లభించకపోవడం వల్ల వ్యవసాయం ఆశించిన ఫలితాలను ప్రసాదించలేని కారణంగా కరువులు పరిపాటి అయ్యాయి. కాని కరువు సంఘటనలకు వాతావరణం ప్రధానమైన పాత్ర వహించడం గమనించతగ్గది. ప్రధానంగా వర్షాభావం ఏర్పడినప్పుడు పంటలు ఎండిపోవడం వెంటనే కరువు సంభవించడం పరిపాటి. అనావృష్టిలాగా అతివృష్టి, వరదలు, కరువులకు కారణాలు. పూర్వకాలంలో మిడతలు మొదలైన ఈతిబాధలు కూడా కరువుకు కారణభూతమయ్యేవి.

బ్రిటిషు వారి పరిపాలనలో భూమిశిస్తు వసూలు పద్ధతిలో అనేక మార్పులు జరిగాయి. అంతకు పూర్వం పండినపంటలో కొంతభాగాన్ని శిస్తుగా చెల్లించేవారు. కానీ బ్రిటిషు వారు ధనరూపంలో శిస్తు వసూలు చేసేవారు. అందుచేత రైతు తాను పండించిన పంటలో అధికభాగం విక్రయించవలసి వచ్చేది. అందువల్ల ఆహార ధాన్యాల కొరత ఏర్పడేది. వాణిజ్య పంటల వ్యాప్తి మూలంగాకూడా ఆ కొరత సంభవించింది. జనాభా పెరుగుదల వల్ల కూలీ జనాల సంఖ్య అధికమైంది. దీనికి తోడు ఋతుపవనాలు విఫలమవడం కూడా సర్వసాధారణమైంది. 19వ శతాబ్దం మధ్యభాగం వరకు వర్షాభావం వల్ల ఆహారధాన్యాల కొరత ఆయా ప్రాంతాలకు మాత్రమే పరిమితమై ఉండేది. ఇతర ప్రాంతాల నుంచి అవసరమైన ఆహారధాన్యాలను రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందిన తరువాత ముఖ్యంగా రైల్వేలను ప్రవేశపెట్టిన అనంతరం కరువు పరిస్థితిలో కూడా మార్పు సంభవించింది. భారతదేశంలో వ్యవసాయం వర్షాధారమైనందువల్ల ఎప్పుడూ నిలకడగా ఉండేది కాదు. వ్యవసాయ రంగాన్ని ప్రభుత్వం బాగా నిర్లక్ష్యం చేసి నీటిపారుదలను పూర్తిగా విస్మరించింది. బ్రిటిషువారు తమ పరిపాలనా సౌలభ్యం దృష్టితో, రక్షణ అవసరాలకు తగు రోడ్లు, రైలు బాటల వంటి వాటికి ప్రాధాన్యతనిచ్చి అమితవ్యయం చేసేవారు. గ్రామాలలో ఇతర ఉపాధి సౌకర్యాలు లేని కారణంగా

వ్యవసాయం విఫలమైనప్పుడల్లా ప్రజలు ఆకలి బాధలకు గురి అయ్యేవారు. ఆ విధంగా బ్రిటిషు అధికార స్థాపనానంతరం కరువులు ఉధృతమైనాయని చెప్పవచ్చు.

కరువు సంభవించినప్పుడు వ్యవసాయంపై ఆధారపడిన సాధారణ ప్రజలు దారుణ ప్రభావానికి లోనయ్యేవారు. వ్యావసాయిక పెంపుదల కరువు సందర్భాల్లోనే కాక, తక్కువ పెట్టుబడి మూలంగా తరవాతి సందర్భాల్లో కూడా కుంటుబడుతుంది.

1860 సంవత్సరానికి ముందు వర్షాభావం వల్ల ఏర్పడ్డ కరువుల మూలంగా ఆహార ధాన్యాలకొరత, పశువులు దాణా లోపం సంభవించేది. అందువల్ల ప్రజలు, పశువులు, అధిక సంఖ్యలో మరణించేవారు. కాని రాకపోకల అభివృద్ధి వల్ల, ప్రభుత్వం కరువు నివారణా కార్యక్రమాలు చేపట్టింది. ఆహారధాన్యాలు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సులభంగా తరలించడానికి వీలైనందువల్ల కరువు ప్రభావం తగ్గు ముఖం పట్టింది. ఆకలి చావులు పశుమరణాలు కూడా తగ్గాయి. కాని పోషకాహారం లోపించిన కారణంగా పేదప్రజలు అనేక రోగాలకు లోనయ్యారు. కలరా, ప్లేగువంటి అంటురోగాలు సర్వసాధారణమయ్యాయి. కరువు సందర్భాలలో పెద్ద ఎత్తున ప్రజలు వలస వెళ్ళడం సర్వసాధారణమైంది. గ్రామీణ ప్రజలు కరువు సందర్భాలలో ఎదుర్కొన్న సమస్యలు కేవలం ఆర్థికమైనవే కాక అనేక ఇతర సాంఘిక దుష్పరిణామాలతో కూడినవిగా కూడా ఉండేవి.

కంపెనీ పరిపాలన స్థాపనానంతరం మొట్టమొ... కరువు 1769-70లో బెంగాలు, బీహారు, ఒరిస్సా ప్రాంతాలలో సంభవించింది. ప్లాసీ యుద్ధం తర్వాత బెంగాలులో స్థాపితమైన ద్వంద్వ పరిపాలన ఫలితంగా ఏర్పడిన అరాచకం మూలంగా ఈ కరువు సంభవించింది. ఆ సందర్భంలో గ్రామీణ జనాభా బాగా తగ్గింది. ఆకలి చావులు, అధిక సంఖ్యలో వలస వెళ్లడం దీనికి కారణం. ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరగడం కూడా ఆకలి చావులకు ఒక కారణం అని చెప్పవచ్చు. కరువుకు ముందు దాదాపు రెండేళ్లు పంటలు నష్టమయ్యాయి. సాధారణంగా రైతులకు రుణాలను అందచేసే ధాన్యం వర్తకులు, ఇచ్చిన అప్పులను తిరిగి వసూలు చేయడం కష్టమని అప్పు ఇచ్చేవారు కాదు. పండిన కొద్దిపాటి ధాన్యాలను ప్రభుత్వమే సైనికుల అవసరాలకై కొనుగోలు చేయడం మూలంగా ధాన్యం మార్కెట్టులో అవకతవకలు ఏర్పడి సామాన్య ప్రజానీకానికి ఆహారధాన్యాలు అందుబాటులో లేకపోయాయి.

బెంగాలులో సంభవించిన ఈ కరువు మూలంగా దాదాపు మూడింట ఒక భాగం జనాభా నాశనమైందని కంపెనీ డైరెక్టర్లు అంచనా వేశారు. తర్వాత రాష్ట్రంలో పర్యటన చేసిన వారన్‌హేస్టింగ్స్ కూడా 1772లో అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. రాజషాహి జిల్లాలో 65 శాతం, భీర్‌భుంలో 25 శాతం, షాబాద్‌లో 48 శాతం జనాభా తగ్గినట్లు అంచనావేయడమైంది. జనాభా తగ్గుదల మూలంగా సంభవించిన వ్యవసాయ క్షీణత మూడింట ఒక భాగంగా లెక్కకట్టారు. కూలీ జనం దొరకడం కష్టమైన ప్రాంతాలలో కరువు ఫలితాలు మరీ దారుణంగా తయారయ్యాయి. 1776లో సమర్పించిన అతని నివేదికలో వ్యవసాయం దెబ్బతిన్న కారణంగా జమిందార్లు పన్ను వసూలు చేయడంలో పడిన ఇబ్బందులు, తెలియజేయడం జరిగింది. కంపెనీ ప్రభుత్వం ఈ కరువు సందర్భంలోనే పదిలక్షల పౌన్లు రుణంగా ఇవ్వమని బ్రిటీషు ప్రభుత్వాన్ని కోరింది. కంపెనీ చేసిన ఆ అభ్యర్థన 1773లో రెగ్యులేటింగ్ చట్టం ప్రవేశపెట్టడానికి కారణమైంది. దీని తర్వాత ఉత్తర హిందూదేశంలో 1789లో ఉధృతమైన కరువు సంభవించింది. 1784 నుంచి 1834 వరకు గల కాలంలో బొంబాయిలో ఆరు కరువులు, బెంగాలులో మూడు, మధ్య ఇండియాలో రెండు సంభవించాయి. 19వ శతాబ్దాంతం తరవాత కొన్ని కరువులు ఉధృతమైనవిగా పరిణమించాయి. 1860 నుంచి 1900 వరకు గల

కాలంలో దాదాపు పదహారు కరువులు సంభవించాయి. 20వ శతాబ్దారంభంలో మూడు పెద్ద కరువులు సంభవించాయి. అందులో 1943లో సంభవించిన బెంగాలు కరువు సమయంలో ప్రజలు చాలా కష్టాలను ఎదుర్కొన్నారు.

కరువు నివారణ కోసం కంపెనీ ప్రభుత్వం ఏ విధానాలను రూపొందించలేదు. ఈ దుర్ఘటన గురించి అనేక ప్రత్యక్ష కథలున్నాయి. స్థానిక పరిస్థితులను పూర్తిగా అవగాహన చేసు కొనలేని కంపెనీ ప్రభుత్వం కరువు నివారణ పథకాలపై శ్రద్ధ వహించలేదు. 1813 తర్వాత ప్రభుత్వం స్వయంగా వ్యాపారంలో శ్రద్ధ వహించని కారణంగా ఆహారధాన్యాలను ప్రైవేట్ వర్తకుల మూలంగా అధిక మొత్తాల్లో ఎగుమతి చేయడం జరిగింది. ఇది కరువుల ఉధృతానికి ప్రధాన కారణంగా చెప్పవచ్చు.

సిపాయిల తిరుగుబాటు సమయంలో జరిగిన పోరాటాలు, తదనంతరం ప్రభుత్వ కక్ష సాధింపు చర్యగా జరిపిన హింసాకాండ మూలంగా వ్యవసాయం దెబ్బతిని 1860లో కరువు సంభవించింది. దానికి వర్షాభావం తోడయ్యింది. ఉత్తర భారతదేశంలో అనేక ప్రాంతాలు కరువుకు గురయ్యాయి. భూస్వాములు కరువు సమయంలో వడ్డీ వ్యాపారుల నుంచి రుణాలు పొందగలిగారు. కానీ, సామాన్య రైతులు తమ భూములను వదలి, గ్రామాలను విడిచి ఇతర ప్రాంతాలకు వెళ్ళవలసి వచ్చింది. బయర్డ్ స్మిత్ అనే బ్రిటిషు అధికారి దాదాపు 25వేల చదరపు మైళ్ళ మేరకు విస్తరించిన ఈ కరువు ప్రభావాన్ని గురించి ఒక పత్రాన్ని తయారుచేసి సమర్పించాడు. అందులో రైతుల ఇక్కట్లు తొలగడానికి జమిందారీ పద్ధతి అనువైందని అతడు సూచించాడు. కానీ కరువు నివారణకు ప్రభుత్వం ఏ పద్ధతులను అనుసరించాలనే విషయాన్ని గురించి అతడు ఏమీ చెప్పలేదు.

1865-66లో సంభవించిన కరువుకు "ఒరిస్సా కరువు" లేదా "గంజాం కరువు" అని అంటారు. బీహార్, బెంగాల్, మద్రాసు ప్రాంతాలలో కూడా ఈ కరువు ప్రభావం గోచరించింది. ఆ సమయంలో ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరిగాయి. అధికార ప్రకటన మూలంగా ఆ సమయంలో ఆహారం కొరతలేదని, ధాన్యాన్ని వర్తకులు దాచడం వల్ల ఈ కృత్రిమ కొరత ఏర్పడి కరువుకు దారితీసిందని తెలుస్తున్నది. కటక్, పూరి మొదలైన ప్రాంతాలలో దాదాపు అన్ని దుకాణాలు మూతబడ్డాయి. 1866 మే నెల్లో ఛోటా నాగపూర్‌లో దాచిన ధాన్యం నిలువలపై దోపిడీలు జరిగాయి. ధాన్యం ధర మూడింతలుగా పెరిగినా రైతుకూలీల వేతనాలలో మార్పు లేదు. బీహార్‌లో 1862లో ఒక తూము ధాన్యం 2 రూపాయిలు కాగా, అది 1866లో 5 రూపాయిలకు పెరిగింది. కరువు కొనసాగే సమయంలో విపరీతమైన వర్షాలు పడినందున అతివృష్టి కూడా సంభవించి మరింత నష్టాన్ని కలిగించింది. ఒరిస్సాలో రవాణా సౌకర్యాల లోపం ఈ కరువుకు ప్రధాన కారణంగా ప్రభుత్వం తరపున కారణాలు పరిశీలించిన కాంప్‌బెల్ అభిప్రాయపడ్డాడు. వాతావరణాన్ని ముందుగా తెలియజేయక పోవడం కూడా నష్టానికి హేతువని అభిప్రాయ పడ్డాడు. ధాన్యాన్ని దాచిపెట్టి కృత్రిమ లోటును సృష్టించిన వర్తకుల ఆట పట్టించడానికి ప్రభుత్వం ఏ చర్యను తీసుకోలేదు.

1868లో మరొక కరువు రాజస్థాన్ ప్రాంతంలో సంభవించింది. ఇది పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో కూడా తన ప్రభావాన్ని చూపింది. ఈ కరువు సందర్భంలో బికనీర్, మాళ్వాప్రాంతాలల్లో మూడింట ఒక భాగం, అజ్మీర్‌లో నాల్గింట ఒక భాగం జనాభా నశించింది. పశువుల మరణం కూడా అధికంగా ఉంది.

పశువుల దాణా దొరకడం దుర్లభమైంది. ధరలు విపరీతంగా పెరిగాయి. ఈ కరువు సందర్భంలో పరిస్థితులను పరిశీలించిన సర్ విలియం మ్యూర్ "ప్రతి జిల్లా అధికారి ఆ ప్రాంతంలో సంభవించిన ఆకలి చావులకు బాధ్యత వహించాలి" అని ఆదేశించినా, అనేకులు మరణించారు. అనేక పశువులు కూడా నశించాయి. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని పరిస్థితులను పరిశీలించిన హెన్వీ అనే ఆయన రైతు కూలీలు విపరీతమైన బాధలు పడినట్లు తెలియజేశాడు.

19వ శతాబ్దంలో భారతదేశంలో సంభవించిన కరువుల్లో 1876-78లో సంభవించిన మద్రాసు కరువు ఎంతో భయంకరమైనది. దీనికి "పెద్ద కరువు" అని, ధాతు సంవత్సరంలో ప్రారంభమైనందు వల్ల "ధాతుకరువు" అని కూడా పేర్లున్నాయి. రెండేళ్ళు పూర్తిగా వర్షాలు లేకపోవడం చేత ఈ కరువు విపరీత పరిణామాలకు దారితీసింది. 1877లో దక్షిణ భారతదేశమే గాక పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు కూడా కరువుకు లోనయ్యాయి. దక్షిణంలో మద్రాసు. మైసూరు, హైదరాబాదు అతిక్లిష్ట పరిస్థితి నెదుర్కోవాల్సి వచ్చింది. మద్రాసు రాష్ట్రంలో ధాన్యం ధరలు పెరిగాయి. వెంటనే వర్తకులు ధాన్యాన్ని మార్కెట్ల నుంచి దాచడానికి పూనుకొన్నారు. కాని వైస్రాయి లార్డ్ లిట్టన్ స్వేచ్ఛా వ్యాపారాన్ని కొనసాగింపచేశాడు. ఈ మద్రాసు కరువు మూలంగా దాదాపు యాభై లక్షల ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. ఆకలి చావులకు ప్రజలు, పశువులు ఈగల వలే మరణించినట్లు ఆనాటి అధికార పత్రాలు కూడా తెలియజేస్తున్నాయి. 1878లో నియమితమైన కరువు కమీషన్ దీనిని బ్రిటిష్ పాలనలో జరిగిన అన్ని కరువుల్లోకి అతిదారుణమైన కరువు అని ఉదహరించింది.

'మద్రాసు కరువు' సందర్భంలో ప్రభుత్వం కరువు నివారణ ప్రణాళికను తెల్పుతూ ఏ పరిస్థితుల్లోనైనా ప్రజల ప్రాణాలను ఆకలి బాధ గురించి రక్షించాల్సిన అవసరం ప్రభుత్వానికుంది. కానీ ఏ సహాయం అందించాలి ఏది అక్కరలేదు అనే విషయాల్లో నిర్ణయాధికారం జిల్లా అధికార్లకు ఇవ్వడం జరిగింది అని ప్రకటించింది. అందువల్ల ఇది ఎవరినీ సంతృప్తి పరచలేదు. ప్రభుత్వం కరువు సమయాల్లో తీసుకోదగ్గ చర్యలను గూర్చి అనుసరించవలసిన విధులను గూర్చి సక్రమంగా తెలియపరిచే ఉద్దేశంతో 1878లో సర్ రిచర్డ్ స్ట్రాచీ అధ్యక్షతలో ఒక కరువు కమీషన్‌ను నియమించడం జరిగింది.

స్ట్రాచీ కమీషన్ తన నివేదికను 1880లో ప్రభుత్వానికి సమర్పించింది. అందులో కరువు సమయాల్లో తీసుకోదగిన సాధారణ చర్యల గూర్చి తెల్పడమేగాక కరువు నివారణకై ముందు జాగ్రత్తగా తీసుకోదగిన చర్యలను కూడా ఉదహరించింది. ప్రజలకు తమ జీవనోపాధికై అవసరమయ్యే పనులు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిదని వివరించడం జరిగింది. దీనికై కమీషన్ అనేక సూచనలను చేసింది. ఆ సూచనల ప్రకారం దేహదారుఢ్యం ఉన్న బీద ప్రజలు చేసిన ఇతోధికమైన పనికి తమ పోషణకు సరిపడే కూలీ పొందాలి. పనిచేయలేని వారు ప్రభుత్వం ఖర్చుతో తమ తమ గృహాలలో ఉండిగానీ, లేదా ప్రభుత్వం నడిపే బీద గృహాలకు వెళ్ళిగాని ఉపాధి పొందాలి అనీ. గ్రామీణ ప్రజల పరిస్థితులను తెలుసుకోడానికి అప్పుడప్పుడు అధికారులు గ్రామాలను పర్యవేక్షించాలనీ, గ్రామీణ ప్రాంతాలను చిన్న చిన్న విభాగాలుగా విభజించి తర్ఫీదు పొందిన అధికారుల అధీనంలో ఉంచాలనీ, వ్యాపార విధానంలో జోక్యం కలిగించుకో కూడదనీ. కరువు సమయాల్లో భూమి శిస్తు మినహాయింపులు ఇవ్వాలనీ. భూములు గలవారికి ఋణ సదుపాయాలు కల్పించాలనీ ఈ కమీషన్ సూచించింది. కరువు సమయాల్లో ప్రభుత్వ భూములు అడవులు మొదలైన వాటిలో పశువులను మేతకు ఉచితంగా అనుమతించాలని కూడా సూచించడం జరిగింది.

స్ట్రాచీ కమీషన్ నివేదిక ప్రకారం 1883లో కరువు చట్టాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది. కరువు సమయాల్లో చెల్లించాల్సిన కూలీరేట్లు గూర్చి వివరణలు అందులో ఉన్నాయి. ప్రభుత్వం కరువు భీమా నిధిని ఏర్పాటు చేసి సాలీన 1 1/2 కోట్ల రూపాయలు ఈ నిధికి ఇచ్చింది. ఈ నిధిని కరువు నివారణ కోసం తీసుకోవాల్సిన పనులకు, రైల్వేలకు, కాలువలు తవ్వడానికి రుణ విముక్తి పథకాలకు వెచ్చించడం జరిగింది.

1880 తర్వాత కూడా అనేక కరువులు సంభవించాయి. కానీ వాటి ప్రభావం అంత ఉధృతంగా ఉండేదిగాదు. 1889లో బీహారు, మద్రాసు ప్రాంతాలలో కరువు సంభవించింది. 1892లో బెంగాలు, బర్మా, అజ్మీర్, మద్రాసులో క్షామ పరిస్థితులు ఏర్పడ్డాయి. 1890లో వర్షాలు లేని కారణంగా 1897-98లో ఉత్తర భారతదేశంలో మరో కరువు ఏర్పడింది. బొంబాయి ప్రాంతంలో కరువుకు తోడు ప్లేగు కూడా సంభవించింది. హోల్డర్ నెస్ అనే ఆయన "ఈ కరువు బీద, ధనిక విభేదం లేక అందరినీ బాధించింది" అని రాశాడు. కానీ ఈ కరువు సమయంలో కూడా ధర బాగా పెడితే ఏ ప్రాంతంలోనైనా ఆహారధాన్యాలు దొరికేవి అని మరొక విశ్లేషణ కూడా ఉంది. అంతకు ముందు కరువు సంభవించదనుకొన్న కొన్ని సంపన్న ప్రాంతాలను కూడా మినహాయించకపోవడం దీని ప్రత్యేకత. ఉదాహరణకు బీరార్ అంతకుముందు కరువులకు గురి కాకపోయిన కారణంగా ఉపాధి కల్పన విషయంలో సిద్ధంగాలేని ప్రభుత్వ యంత్రాంగం 1897లో వెంట వెంటనే నివారణ పథకాలు చేపట్టలేక పోయింది. కరువు సంభవించిన పిదప ప్రజలు అనేక కష్టాల పాలు కావలసిన పరిస్థితి ఏర్పడింది. అందువల్ల బ్రిటీషు ప్రభుత్వం 1898లో రెండో కరువు కమీషన్‌ను నియమించింది. ఈ కమీషన్‌కు సర్‌జాన్ లాయెల్ అధ్యక్షుడు.

కొత్త కమీషన్ సామాన్య ప్రజలను కరువు బారినుంచి రక్షించడంలో పూర్తిగా సఫలం కాకపోయినా అంతకు ముందున్న వాటికన్న ఈ కమీషన్ కొంత మెరుగనే విషయం మాత్రం తెలుస్తున్నది. చాల విషయాలలో లాయెల్ కమీషన్, స్ట్రాచీ కమీషన్ మాదిరిగానే సూచించింది. కాని కొన్ని చిన్న విషయాల్లో మాత్రం అది చేసిన సూచనలు కొంచెం భిన్నంగా ఉన్నాయి. ప్రధానంగా నేతపనివారికి, ఆటవీకులకు ఉపాధి కల్పన కొత్తగా సూచించినదే. అంతేకాక ధర్మసంస్థలు ఏర్పరచిన ఉపాధి బాధ్యతలు పర్యవేక్షించడాన్ని, క్రమబద్ధమైన ప్రణాళికలు అందజేయడాన్ని ప్రభుత్వ విధిగా గుర్తించడం జరిగింది. ఉపాధి పనుల సమయంలో ఇచ్చే కూలీ అధికం చేయడం ప్రభుత్వం ఇచ్చే ధన సహాయం కూడా మెరుగు పరచడం వంటి సూచనలు లాయెల్ కమీషన్ కొత్తగా గావించింది.

పందొమ్మిదవ శతాబ్దాంతంలో 1899-90లో వచ్చిన కరువు ఎక్కువ మందిని బాధించలేదు కాని దాని ప్రభావం మాత్రం చాలా ఉధృతమైంది. మధ్యభారతదేశం ఎక్కువ బాధలకు గురైంది. ఉపాధి కార్యక్రమాలకు దాదాపు 15 కోట్ల రూపాయిలను వెచ్చించడం జరిగింది. పశుగ్రాసం కొరత మూలంగా పశుమరణాలు అధికంగా ఉండేవి. గుజరాత్‌లో దాదాపు పూర్తిగా పశువులు నాశనమయ్యాయి. ప్రభుత్వం పశుగ్రాసాన్ని సేకరించడం కోసం ప్రత్యేక శ్రద్ధ వహించి, అనేక ప్రాంతాలలో కూలీ జనాన్ని నియమించి అడవులలో గ్రాసాన్ని కోయించి, ఎండబెట్టి నిల్వల నేర్పాటు చేసి ప్రజలకు అమ్మే ఏర్పాట్లు చేసింది. కొన్నిచోట్ల అడవుల్లో మేతపన్నును రద్దుచేయడం జరిగింది.

1901లో మూడో కరువు కమీషన్‌ను సర్ ఆంథోనీ మాక్డొవెల్ అధ్యక్షతన నియమించడమైంది. ఈ కమీషన్ కరువు సమయాల్లో ప్రభుత్వం అందిస్తున్న ఉపాధి సహాయం మరీ ఎక్కువగా ఉందనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. సహాయకార్యక్రమాలు ఉపాధి చేపట్టడానికి ముందు ప్రభుత్వం ప్రజల స్థితిగతులను. క్షామప్రభావాన్ని క్షుణ్ణంగా పరిశీలించకపోవడం వల్ల అధిక సంఖ్యలో ప్రజలు సహాయపనులకు ఎగబడడం చేత అధికంగా ఖర్చు అవుతున్నదని, కనుక దాన్ని నివారించడం కోసం కొత్త కమీషన్ అనేక సూచనలను చేసింది. దాని ప్రకారం కరువు సమయాల్లో శిస్తు మినహాయింపు చేయాలని, విత్తనాలు, పశువులు కొనడానికి, బావులు తవ్వడానికి తగు రుణాలు సమకూర్చాలని. కరువు నివారణ పథకాల్లో అనధికారులను కూడా ప్రోత్సహించి వారి సహకారం పొందడం అవసరం అని. కరువు సమయాల్లో తీసుకొనే పనులు చాలవరకు గ్రామీణ జనులకు దగ్గరగా ఉండే చిన్న చిన్న పనులై ఉండాలని. చాలపెద్ద ఎత్తున జరపాల్సిన పనులు అధికంగా ఉండరాదని. ఉపాధి కల్పన ఎవరికి అత్యవసరమో వారికి మాత్రమే కల్పించాలని. పశుగ్రాసాన్ని ప్రజలకు అందజేసి పశుసంరక్షణ కూడా కరువు నివారణలో ఒక భాగంగా పరిగణించాలని ఈ సూచనల సారాంశం.

1943 బెంగాల్ కరువు సందర్భంగా 'బెంగాలు కరువు కమీషన్'ను నియమించడం జరిగింది. కమీషన్ నివేదిక ప్రకారం ఈ కరువు ఆహారధాన్యాల పంపిణీ సరిగ్గా లేని కారణంగా ఏర్పడిందని, ప్రభుత్వ ఉద్యోగుల నిర్లక్ష్య వైఖరి వల్ల ఇది పరాకాష్ఠను పొందిందనితేలింది. అందువల్ల ఈ కరువు ప్రకృతి వైపరీత్యాల వల్ల వచ్చింది మాత్రమే కాదని, కృత్రిమ కారణాలవల్ల కూడా వచ్చిందని తేలింది. బెంగాలు కరువు దేశంలోని ఆహార ధాన్యాల పరిస్థితిని వెల్లడించింది.

కరువు నివారణలో ప్రభుత్వం అనుసరించిన పద్ధతుల్లో రెండు భిన్న అంశాలున్నాయని తెలుస్తున్నది. అందులో ఒకటి సహాయ కల్పన, రెండోది కరువు రాకుండా తగు జాగ్రత్త పడి నివారణ పథకాలు చేపట్టడం. 1869లో విలియం మూయిర్ అన్నట్లు జిల్లా అధికార్లు ఆకలి మరణాలకు బాధ్యత వహించాలి. ఆ విధంగా చేసినట్లైతే జిల్లా యంత్రాంగం కరువు బాధితులకు తగిన రక్షణను సహాయాన్ని కలిగించడానికి జాగ్రత్త వహిస్తారని భావన. కానీ అందులో ఆశ్రిత పక్షపాతం వంటి అనేక లోపాలున్నాయి. 1877లో ప్రభుత్వం తన బాధ్యతను ఈ విధంగా నిర్వచించింది. "ప్రజల ప్రాణాలను ఆకలి బారి నుంచి రక్షించడం అన్నింటికన్నా చాల ముఖ్యమైంది. కానీ ప్రజలు తమంత తాము కష్టపడి సంపాదించుకోడానికి సుముఖత చూపాలి. ప్రభుత్వ అధికార్లు అలాంటి వారికి ప్రోత్సాహమివ్వాలి. ప్రభుత్వంపై ఎక్కువ ఆధారపడకుండా చేయడంలో వారు శ్రద్ధ వహించాలి.'

కరువులకు ప్రధానంగా వర్షాభావం కారణం కనుక వాతావరణ సూచనలు అనేది ముందు జాగ్రత్త చర్యలలో ప్రధానమైనదిగా గుర్తించబడింది. ప్రభుత్వం ఆయా ప్రాంతాలకు సంబంధించిన వర్షపాతం లెక్కలు సేకరించడం పంటలను గురించి ధరలు, జనన మరణాల లెక్కలు మొదలైన వివరాలను సేకరించడానికి ప్రాధాన్యమివ్వడం జరిగింది. పంటలు విఫలమైనప్పుడు రుణం లభించని పరిస్థితుల్లో సాధారణంగా నిరుద్యోగం మొదలౌతుంది. ప్రజలు పనులకోసం ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వలసవెళ్ళడం జరుగుతుంది. ధాన్యాల దొంగతనాలు ప్రారంభమౌతాయి. వాటిని ప్రభుత్వం కనిపెట్టి కరువు

పరిస్థితులకు అది ఆనవాళ్లుగా గుర్తించాలి. కరువు నివారణ కార్యక్రమంలో ఎంత అభివృద్ధి సాధించినా ప్రభుత్వం ఆ విధానాలను కట్టుదిట్టం చేయలేకపోయింది. స్థానిక సంస్థలు, ప్రభుత్వేతర సంఘాలు, మిషనరీలు అలాంటి కార్యక్రమాలు చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. ఉపాధి పనులకై కేటాయించిన నిధులు పూర్తిగా ఖర్చు చేయలేదు. వ్యవసాయ రంగానికి ఉద్దేశించబడిన నిధులు ఇతర రంగాలకు తరలించడం, నీటిపారుదలకు అతి తక్కువ ప్రాధాన్యత ఇవ్వడం వంటివాటి వల్ల కరువు నివారణ పథకాలు తాత్కాలికంగా మాత్రం ఉపశమనం కలిగించాయి.

ప్రభుత్వం అనుసరించిన నివారణ పథకాలు బ్రిటిషువారు అనుసరించిన స్వలాభాల పద్ధతికి చక్కని దృష్టాంతం. ప్రభుత్వం స్వేచ్ఛా వ్యాపారాన్ని సమర్థించింది. అందులో అధికార ధాన్యాల ధరను అదుపులో ఉంచడం ప్రభుత్వ ఉద్దేశం కాదు. కరువు సమాయల్లో వర్తకులను అదుపులో ఉంచి, ధాన్యాల ధరలు తగ్గించడానికి ప్రభుత్వం పూనుకొనలేదు. కరువు సమయాల్లో గ్రామీణ కూలీలకు పనివారికి తగిన పనులు కలిపించాల్సిన అవసరం ఏర్పడింది. శాశ్వత ప్రయోజనాలున్న పనులపై ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ వహించాలని కమీషన్లు సూచించాయి. కరువు సమయాల్లో ప్రభుత్వ ఉపాధి కార్యక్రమాలు చాలా ప్రధానమని కూడా ఆ కమీషన్లు వివరించాయి. కానీ దాదాపు అన్ని కమీషన్లలో రైల్వేల పాత్ర, దానితోబాటు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయగల అవసరాన్ని తెలియజేయడం జరిగింది. పశుగణాభివృద్ధి, పశువులకు సర్వ సాధారణంగా సోకే రోగాల నిర్మూలన, కొత్త జాతి పశువుల అభివృద్ధి, దాణా సరఫరా ఎక్కువ చేయడం మొదలైనవన్నీ అవసరమైన కార్యక్రమాలుగా గుర్తించడం జరిగింది. అన్నింటికీ మించి భారతదేశంలో క్షామాలకు సాగుచేసే భూమి కౌలు విధానాలకు సంబంధమున్నట్లు కూడా వెల్లడైంది. సౌకర్యమైన పద్ధతులు నెలకొన్నప్పుడు రైతు ఆర్థిక పరిస్థితి బాగా ఉంటే కరువు కాటకాలను ఎదుర్కొనగలడు. భూస్వామి, వడ్డీ వ్యాపారి, ప్రభుత్వం విధించే అధికశిస్తు మొదలైన వాటికబంధ హస్తాల్లో చిక్కిన సాధారణ రైతు, కరువు పరిస్థితుల్లో విపరీతమైన బాధలకు గురికాక తప్పలేదు.

# అధ్యాయం - 14

# పారిశ్రామికాభివృద్ధి

భారతదేశం అనాదినుంచి మంచి నాణ్యతగల వస్తూత్పత్తులకు పేరు పొందింది. పలు ఆస్థానాల్లోని ప్రభువులు, ధనిక వర్గాలవారు కొనడం మాత్రమేగాక ఇవి విదేశాలకు కూడా ఎగుమతి అయ్యేవి. హస్తకళలకు పేరెన్నిక గన్న కొన్ని కేంద్రాలు, నేత వస్తువులు, ఇతర విలాస వస్తువుల ఉత్పత్తికే పేరుపొందాయి. మస్లిన్‌ల తయారీతో బాటు నూలు, పట్టుబట్టలు, ఉన్ని దుస్తులు పెద్ద మొత్తాల్లో తయారయ్యేవి. బెనారస్‌లో లోహాల పరిశ్రమలు విరివిగా స్థాపితమయ్యాయి. వెండి, బంగారు నగల తయారీ, పాలరాతి పనులు, ఉక్కుపోత పనులు కూడా పెద్ద ఎత్తున కొనసాగేవి. కావలసిన రుణ సదుపాయాలు కలిగించడానికి మొగలుల కాలంలో అనేక నగర సేట్‌లు ఉన్నట్లు తెలుస్తున్నది. భారతదేశంలో తయారైన ఇటువంటి ఉత్పత్తులకు విదేశాల్లో అమిత గిరాకీ ఉండేది.

కంపెనీ ప్రభుత్వం మొదలు భారతీయ వస్తువుల తయారీకి ప్రోత్సాహం చూపినా 18వ శతాబ్దాంతానికి క్రమేణ మనదేశంలో తయారైన వస్తువుల ప్రాధాన్యత తగ్గించి, ఇంగ్లండు నుంచి దిగుమతులను ప్రోత్సహించింది. దీనిలో ప్రాచీన పరిశ్రమలు మరుగునపడ్డం జరిగింది. బ్రిటిషు ఉద్యోగులు సాంప్రదాయ పరిశ్రమలు భారతదేశంలో క్షీణిస్తున్నాయన్న విషయాన్ని గుర్తించినా అది తప్పనిసరి అని భావించారు. పాశ్చాత్య దేశాలలో లాగా భారతదేశంలో కూడా యంత్రాలు చేతి ఉత్పత్తులను మరుగు పరచాయి. ఇది ఆధునీకరణకు చెల్లించాల్సిన ధర అని వారి భావన. కాని ఇంగ్లండులో యంత్రాలు రావడం చేత చేతివృత్తులు నశించినందువల్ల ఎవరికీ కష్టాలు కలగలేదు. చేతి పనివారి కందరికీ అధిక సంఖ్యలో, కర్మాగారాలలో ఉద్యోగాలు దొరికాయి. కానీ భారతదేశంలో అలాగాక బ్రిటిషువారి దిగుమతుల ధాటికి చేతివృత్తులు నాశనమయ్యాయి. 1850-60 నాటికి భారీ పరిశ్రమలు కూడా చాలా తక్కువ. పారిశ్రామికీకరణ మరీ నిదానంగా కొనసాగింది. అందువల్ల బ్రిటిషువారు భారీ పరిశ్రమల స్థాపనకు ముందు భారతీయ పరిశ్రమలు పూర్తిగా నశింపజేసి, తర్వాతనే కొత్త పరిశ్రమలను కర్మాగారాల పద్ధతిలో నెలకొల్పారని చెప్పవచ్చు.

19వ శతాబ్దంలో బ్రిటిషువారు తమ పెట్టుబడులకు భారతదేశం అనువైన చోటుగా భావించారు. భారతీయ రైల్వే సంస్థ అటువంటి పెట్టుబడికి మూలకందంగా పరిణమించింది. కేవలం రేవు పట్టణాలకు పరిమితమైన రైలుమార్గాలు ఇతర నగరాలకు కూడా త్వరితగతిలో వ్యాపించాయి. భారతదేశాన్ని ఆర్థికంగా దోచుకోడానికి రైల్వేలు శక్తిమంతంగా ఉపయోగపడ్డాయి. బ్రిటిషు పెట్టుబడులకు ఆకర్షించిన మరోశాఖ నీటివనరులు. బ్రిటిషు పెట్టుబడులతో నిర్మించిన ప్రాజెక్టులు కేవలం వాణిజ్య పంటలు పండించడానికో లేదా ఎగుమతులకు మాత్రమే పంటలు పండించే ప్రాంతాలకో మాత్రమే పరిమితమై ఉండటం గమనించ తగ్గది. రైల్వేలు, నీటిపారుదల ప్రాజెక్టులు బ్రిటిషువారి ఆధీనంలో మాత్రమే కొనసాగిన కారణంగా ఈ విషయాల్లో ప్రభుత్వ ప్రభావం అధికంగా కొనసాగింది. బ్రిటిషు పెట్టుబడులు భారతదేశంలో అనేక పరిశ్రమలకి ఉపయోగించడం జరిగింది. ముడిసరుకులు సులభంగా లభ్యంకావడం, సరసమైన కూలీ, విరివిగా లభించే కార్మికులు, అనే అంశాలు పరిశ్రమలకు ప్రోత్సాహాన్నిచ్చాయి. అన్నిటికీ మించి 1858లో బ్రిటిషు ప్రభుత్వం

స్వయంగా భారతదేశ పాలనాధికారాన్ని చేపట్టడం వల్ల బ్రిటిష్ పెట్టుబడిదార్లకు తమ మొత్తాలను మనదేశంలో వెచ్చించడానికి తగు రాజకీయపరమైన ధైర్యం కలిగింది. కంపెనీ పాలనాకాలంలో అటువంటి ధీమా ఉండేది కాదు. బ్రిటిషు పెట్టుబడిదార్లు తోటల పరిశ్రమల్లో కర్మాగారాల స్థాపన, ఇనుము, ఉక్కు, బొగ్గు గనుల తవ్వకాలు, నూలు మిల్లులు, జనపనార మిల్లులు, కాగితం, సిమెంటు, చక్కెర కార్మగారాల స్థాపన మొదలైన వాటి పైన ఆసక్తి చూపారు.

## తోటలు :

బ్రిటిషు వారి దృష్టిని ఆకర్షించిన తోటల పరిశ్రమలలో మొదటిది తేయాకు. 19వ శతాబ్దారంభం నుంచి తేయాకు భారతదేశంలో ప్రధానతోటల పరిశ్రమలు. 1820లో అస్సాంలో అక్కడక్కడ విచ్చలవిడిగా పెరిగే తేయాకు మొక్కలను కనుగొన్నారు. కానీ అవి నిజంగా తేయాకు మొక్కలేనా అనే అనుమానం కలిగింది. 1834లో లార్డ్ విలియం బెంటిక్ చైనా దేశానికి ఒక కమిటీని పంపాడు. ఆ దేశపు తేయాకు వంగడాలను తెప్పించి ఉత్తర హిందూదేశంలో కొండ ప్రాంతాలలో తేయాకు విస్తరణకు ప్రయత్నించాడు. మరు సంవత్సరం ప్రభుత్వం ఒక ప్రయోగాత్మక క్షేత్రాన్ని స్థాపించింది. కాని కొన్ని సంవత్సరాల తరవాత దాన్ని అస్సాం టీ కంపెనీకి అమ్మివేసింది. 1852లో మొట్టమొదటి తేయాకుతోట ప్రభుత్వేతర రంగంలో స్థాపితమైంది. వెంటనే అనేకులు ఈ పరిశ్రమలో ప్రవేశించిన కారణంగా 1850 నాటి దేశీయ తేయాకు అస్సాం బెంగాల్ ప్రాంతాల్లో, దక్షిణంలో వైజాగ్, నీలగిరి, తిరువాన్కూర్ ప్రాంతాల్లో కూడా అభివృద్ధి చెందింది. శ్రీలంక తేయాకు తోటలకు చాలా ప్రసిద్ధి చెందింది.

బ్రిటిషు పెట్టుబడిదార్లు అమిత ఆసక్తి కనబరచిన కారణంగా తోటల లావాదేవీలు ఎక్కువై 1860 తరవాత తేయాకు పరిశ్రమలో కొంత అస్థవ్యస్థ పరిస్థితి ఏర్పడింది. కానీ 1870 తరవాత తోటల విస్తృతి అధికమైంది. దానితోపాటు ఆధునిక పద్ధతులు అవలంబించడం వల్ల తేయాకు ఉత్పత్తి ఎక్కువైంది. ఈ శతాబ్దాంతానికి భారతదేశ తేయాకు చైనా దేశం నుంచి అంతవరకు దిగుమతి చేసుకొన్న తేయాకు కన్నా శ్రేష్ఠమైందనే పేరు గడించింది. ఇరవయ్యో శతాబ్దారంభంలో తేయాకు అధికంగా ఉత్పత్తి కావడం చేత ధరలు బాగా పడిపోయాయి. కానీ మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయిన తరవాత ధరలధికమవ్వడం వల్ల ఉత్పత్తి పెరిగింది. తేయాకుకు మంచి గిరాకీ ఉన్న కారణంగా అంతవరకూ బీటవాలువారిన, భూములు వ్యవసాయ యోగ్యమయ్యాయి. దీనివల్ల అనేక వ్యవసాయ కార్మికులకు ఉపాధి కూడా లభించింది.

కాఫీ మొక్కలను 16వ శతాబ్దంలో అరబ్బు వర్తకులు ప్రవేశపెట్టారు. దక్షిణంలో అనేక ప్రాంతాలలో దీన్ని సాగుచేసేవారు. కానీ కాఫీ మొక్కల పెంపకం 1830 తరవాత మాత్రమే క్రమబద్ధం చేశారు. కాఫీ తోటలకి ప్రధాన కేంద్రాలు మైసూరు, కూర్గు, తిరువాన్కూర్, వైజాగ్, నీలగిరి మొదలైనవి. 1860-70 వరకు దశాబ్దకాలంలో కాఫీ ఎగుమతులు దాదాపు 10 రెట్లు పెరిగాయి. తరవాత సుమారు పదేళ్లు కాఫీ తోటలకు గడ్డు రోజులొచ్చాయి. కాఫీ తోటలను నాశనం చేసే చీడపురుగులు అధికం అయ్యాయి. 1825 నాటికి భారతదేశంలో, శ్రీలంకలో కాఫీ తోటలను పెంచే భూములను తేయాకు తోటలకు ఉపయోగించారు. దీనికి తోడు బ్రెజిల్ దేశపు కాఫీ చాలా తక్కువ ధరకు భారతదేశానికి దిగుమతి అయ్యేది. కానీ 1900 ప్రాంతంలో బ్రెజిల్ దేశంలోని రాజకీయ అలజడుల కారణంగా వారి కాఫీ దిగుమతులు తగ్గిపోయాయి. కాఫీ తోటల పెంపకానికి తగు కూలీలను పక్క ప్రాంతాల నుంచి రప్పించేవారు. దాంతో అనేకమంది వ్యవసాయ రంగం నుంచి వచ్చిన కూలీలై ఉండేవారు.

తేయాకు, కాఫీతోటలతో పోలిస్తే రబ్బరు తోటలు కొంత ఆలస్యంగా అభివృద్ధి చెందాయి. 19వ శతాబ్దాంతంలో, 20వ శతాబ్దారంభంలో ఇవి వ్యాప్తి చెందాయి. ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో రబ్బరు ఉపయోగం తెలియవచ్చింది. రబ్బరు తయారీకి, అమ్మకాలకు తగు చట్టాలు రూపొందించారు. కేరళ, మద్రాసు, కూర్గు మొదలైన ప్రాంతాలు రబ్బరు ఉత్పత్తికి ప్రధాన కేంద్రాలు. కానీ నీలిమందు బట్టల అద్దకానికి ప్రాచీన కాలంనుంచి ఉపయోగంలో ఉంది. గుజరాతు రాష్ట్రంలోని, పశ్చిమ ప్రాంతాలలో దీనిని పండించేవారు. తూర్పు ఇండియా వర్తక సంఘంవారు నీలిపంట ఉత్పత్తికి శ్రద్ధ వహించారు. అమెరికా ఎగుమతుల పోటీ కారణంగా 18వ శతాబ్దాంతానికి నీలిమందు వ్యాపారం తగ్గుముఖం పట్టింది. కంపెనీ ప్రభుత్వం పశ్చిమ ఇండియా దీవుల్లోని బ్రిటిషు వ్యాపారులను ప్రోత్సహించి వారి మూలంగా బెంగాల్‌లో నీలితోటల పెంపకాన్ని అభివృద్ధి చేసింది. 1850వరకు నీలిమందు విపరీతంగా ఉత్పత్తి చేసేవారు. బ్రిటిషు వ్యాపారులు రైతులకు రుణాలిచ్చి వారి భూముల్లో కొంత భాగం తప్పనిసరిగా నీలిని పండించాలని నిర్బంధించారు. తోటల సొంతదారుల అఘాయిత్యాలకు వ్యతిరేకంగా నీలిమందు పండించే రైతులు 1859లో తిరుగుబాటు ప్రారంభించారు. దీని తర్వాత నీలిమందు పంట ప్రధానంగా మధ్యపరగణాల్లో కేంద్రీకరించారు. 1897 తర్వాత జర్మనీలో రసాయనిక అద్దకాలు ప్రచారంలోకి వచ్చిన తర్వాత నీలిమందు పరిశ్రమ తగ్గుముఖం పట్టింది.

## బొగ్గు గనుల పరిశ్రమ :

పశ్చిమ దేశాలలో సంభవించిన పారిశ్రామిక విప్లవం సరసమైన ధరకు లభించే ఇంధనంపై ఆధారపడింది. డచ్ దేశంలో కుళ్ళిన ఆకుకూరలు, దుంపలు మొదలైన వాటి నుంచి లభ్యమైన 'పీట్' అనే ఇంధనంతో యంత్రాలను నడిపారు. ఇంగ్లండులో బొగ్గును ఉపయోగించి కర్మాగారాలు పనిచేశాయి. విద్యుచ్ఛక్తి వాడకంలోకి వచ్చిన తరవాత కూడా బొగ్గుకు ఉన్న ప్రాధాన్యత తగ్గలేదు. ధర్మల్ విద్యుత్ తయారీకి బొగ్గు అవసరమవడం దీనికి కారణం. బొగ్గు పరిశ్రమ 1820లో రాణిగంజ్ బొగ్గుగనుల తవ్వకాలతో ప్రారంభమైంది. కాని రైల్వే మార్గాలు ఏర్పడే వరకు బొగ్గు ఉపయోగం ఎక్కువగా లేదు. బొగ్గును రవాణా చేయడానికి కూడా రైల్వేలు పనికి వచ్చాయి. రైలు మార్గాల వ్యాప్తితో బొగ్గు గిరాకి దేశవ్యాప్తంగా పెరిగింది. బెంగాలులోని బొగ్గు గనులలో 1857లో ఉత్పత్తి 3 లక్షల టన్నులు కాగా 1880 నాటికి అది 10 లక్షల టన్నులకు పెరిగింది. 1914 నాటికి దేశంలో బొగ్గు ఉత్పత్తి సుమారు 165 లక్షల టన్నులకు పెరిగింది. బొగ్గు ఉత్పత్తి పెరగడానికి ముఖ్యంగా రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందడం, కర్మాగారాలు అధికం కావడం. గనుల తవ్వకాలలో ఆధునిక పద్ధతుల ననుసరించడం ప్రధాన కారణాలని చెప్పవచ్చు.

బొగ్గు గనులను ప్రారంభించడంలో తొలుత పెట్టుబడి పూర్తిగా ఐరోపా నుంచి మాత్రమే వచ్చింది. కానీ 19వ శతాబ్దం నాటికి భారతీయ పెట్టుబడిదార్లు కూడా ఈ పరిశ్రమల్లో ప్రవేశించారు. సాంకేతిక విషయాలను గమనించడానికే బొగ్గు పరిశ్రమలోని ఇతర సమస్యలను పరిశీలించడానికీ దానికీ అనేక కమిటీలు స్థాపించడం జరిగింది. భాతర బొగ్గు క్షేత్రాల కమిటీ, బొగ్గు గనుల కమిటీ మొదలైనవి ప్రభుత్వానికి చేసిన సూచనల ననుసరించి గని కార్మికుల పరిస్థితులు, గనుల పనితీరు సంస్కరించడం జరిగింది.

## నూలు మిల్లులు :

భారతదేశంలో రైల్వేలకు ముందు నూలు మిల్లుల స్థాపనకు చేసిన ప్రయత్నాలన్నీ రవాణా చార్జీలు అధికంగా వుండడంచేత విఫలమయ్యాయి. కలకత్తాలో 1838లో మొదట నూలుమిల్లు స్థాపించినా, 1853లో కౌవాస్జినానాభాయ్ దావర్ అనే పార్శీ వ్యాపారి బొంబాయిలో స్థాపించిన నూలు మిల్లు చాలా విజయవంతమైన మొదటి నూలు మిల్లు. 1865 ప్రాంతంలో నూలు పరిశ్రమ అమెరికా అంతర్యుద్ధం మూలంగా అనేక కష్టాలకు లోనైంది. ఆ సమయంలో పత్తి ధరలు విపరీతంగా పెరిగి పోవడమే దీనికి కారణం. 1885 తర్వాత అభివృద్ధికరమైన యంత్రాల ఉపయోగంతో పరిశ్రమ ముందడుగు వేయగలిగింది. నూలు పరిశ్రమ మొదటి నుంచి భారతీయుల అధీనంలో నడిచింది. భారతదేశంలో పెంపొందిన నూలు పరిశ్రమ ఇంగ్లండులోని లంకషైరుపై తన ప్రభావాన్ని చూపింది. 1882లో బ్రిటిషు నూలు మిల్లుల అలజడికి కారణంగా హిందూదేశంలో దిగుమతి సుంకాలు రద్దుచేయబడ్డాయి. కాని నూలు మిల్లుల పరిశ్రమ అభివృద్ధి చెందుతూ వచ్చింది. మొదట ఈ పరిశ్రమ కేవలం నూలు తీయడానికి మాత్రమే పరిమితమై వుండేది. కాని 1890-95 మధ్య బట్టలు నేయడానికి కూడా అభివృద్ధి చెందింది. బొంబాయి, అహమ్మదాబాద్ నూలు మిల్లులు, లంకషైరులోని మిల్లులతో పోటీకి నిలబడగలిగాయి. చైనా, జపాన్‌లోని నూలు మిల్లులకు కూడా ఇవి తీసిపోవని పేరు పొందాయి.

19వ శతాబ్దాంతానికి పత్తి మిల్లులు అనేక సమస్యల నెదుర్కోవాల్సి వచ్చింది. 1896లో సంభవించిన ప్లేగు మూలంగా కార్మికుల సంఖ్య తగ్గిపోయి, వేతనాలు ఎక్కువయ్యాయి. మొదటి ప్రపంచ యుద్ధానంతరం భారతదేశం తన ఎగుమతులను అధికంగా పోగొట్టుకొన్నది. నూలు మిల్లులకు కావాల్సిన యంత్రాలను, వస్తువులను ఇంగ్లండు నుంచి దిగుమతి చేసుకోవడానికి వీలులేక పోయింది. అందుచే యుద్ధ సమయంలో నూలు మిల్లుల సంఖ్య బాగా తగ్గింది. 1921లో ప్రభుత్వ ఆదాయాన్ని అభివృద్ధి చేయడానికై నూలు వస్త్రాల దిగుమతిపై సుంకాలు విధించింది.

## జనపనార :

పూర్వకాలం నుండి బెంగాల్ జనపనార నేతకు ప్రసిద్ధి గాంచింది. దారాలు, సంచులు ప్రధానంగా జనపనార నుండి తయారు చేసేవారు. బెంగాల్లో జనపనార అభివృద్ధి చెందడానికి అనేక కారణాలున్నాయి. ఆ ప్రాంతంలో ముడిజనుము విశేషంగా లభించడం, జనపనార మిల్లులు నడపడానికి మంచి సామర్థ్యంగల స్కాట్‌లాండ్ పెట్టుబడిదార్లు ముందుకు రావటం, దీనికి తోడు చౌకగా కూలీ జనులు లభించటం, ప్రధాన కారణాలు బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీ తొలిరోజుల నుండి జనపనార వ్యాపారం మిక్కిలి ప్రధానమైందిగా కొనసాగింది. 1830 వరకు జనుముతో సంచులు, జనపనార బట్టలు తయారు చేయడం బెంగాలు నేత పనివారికి మాత్రమే పరిమితమై ఉండేది. అది వారి గుత్తాధికారంగా పరిణమించింది. క్రమేఁ జనపనార బట్టల ఎగుమతులు ఎక్కువయ్యాయి. దండి జనపనారకు అనువైనదిగా పరిణమించింది. క్రమంగా బెంగాల్‌లో జనపనార పరిశ్రమ తగ్గుముఖం పట్టింది. క్రిమియా యుద్ధం సమయంలో విదేశీ జనుము చాలనందున భాతరదేశంలో తయారైన జనుము ఆ కొరతను తీర్చగలిగింది. ఆ సమయంలో ఎగుమతైన జనుము చాలా వరకు ముడి జనుముగా ఉండేది. కాని రాణిగంజ్ బొగ్గు గనుల తవ్వకాలు ప్రారంభమైన తరువాత బెంగాలులో జనపనార మిల్లులు ప్రారంభమయ్యాయి. 1889లో సెరంపూర్ వద్ద రి షారాలో మొట్టమొదటి జనపనార మిల్లు కార్మగార పద్ధతిలో స్థాపితమైంది. అక్‌లాండ్ దానిని ప్రారంభించాడు. మరు

సంవత్సరం బర్నగోర్ వద్ద జనపనార పవర్‌లూమ్ స్థాపించడం జరిగింది. ఈ పరిశ్రమ మంచి అభివృద్ధి సాధించింది. 1868 నుండి 1873 వరకు రిషర మిల్లు మినహా మిగిలిన ఐదు మిల్లులు విపరీతమైన ధనాన్ని ఆర్జించాయి. మొత్తం మగ్గాల సంఖ్య 1250కి పెరిగింది.

ప్రారంభంలో బెంగాలులో తయారైన జనుము మిక్కిలి ముతకగా ఉండడం చేత దానిని స్థానికంగా మాత్రమే విక్రయించడం జరిగింది. ఎగుమతులు బర్మాకు పరిమితమై ఉండేవి. 1870లో జనపనార ఉత్పత్తులకు మంచి ప్రోత్సాహం లభించింది. కొత్త కంపెనీలు అధిక సంఖ్యలో స్థాపించడం జరిగింది. జనపనార వస్తువుల ఎగుమతులు అధికమయ్యాయి. 1880 నాటికి భారతదేశంలో 22 మిల్లులు స్థాపించబడ్డాయి. 22వేల కార్మికులకు ఉపాధి కల్పించడం జరిగింది. 20వ శతాబ్దారంభానికి జనపనార పరిశ్రమ వడిగా అభివృద్ధి చెందింది. 1924 నాటికి 64కు పైబడి మిల్లులు స్థాపించడం జరిగింది. ప్రపంచ యుద్ధ సమయంలో ఇసుక సంచుల గిరాకీ పెరిగిన కారణంగా జనపనార పరిశ్రమకు ప్రోత్సాహం లభించింది. సైనిక అవసరాలకు కూడా జనపనార బట్టలు అవసరమయ్యాయి. జనపనార పరిశ్రమ మిక్కిలి కట్టుదిట్టంగా నడిచింది. దాదాపు అన్ని మిల్లులు కలకత్తా సమీపంలో హుగ్లీ నదీ తీరంలోనే కేంద్రీకృతమయ్యాయి. 1884లో జనపనార మిల్లుల సంఘం స్థాపించడం జరిగింది. దీనితో వ్యాపారం చాలవరకు క్రమబద్ధం చేయడం జరిగింది. జనపనార పరిశ్రమకు మొదటి నుంచి ఎదురైన ప్రధాన సమస్య కార్మిక సమస్య. మిల్లు యజమానులకు మంచి లాభాలు కలిగినా, మిల్లుల్లో పనిచేసిన కార్మికులకు సదుపాయాలు తక్కువగానే ఉండేవి.

## ఇనుము - ఉక్కు పరిశ్రమ :

ఇనుమును కరగించి పోత పోయడం భారతదేశంలో ప్రాచీనకాలం నుంచి అనుసరించడం జరిగింది. ఆధునిక పద్ధతుల్లో ఇనుము కరగించే విధానం 19వ శతాబ్దారంభంలో మాత్రం ప్రవేశపెట్టడం జరిగింది. సుప్రసిద్ధ నవలాకారుడు ఛార్లెస్ డికెన్స్ స్నేహితుడైన జోసయ మార్షెల్ హీత్ మనదేశంలో ఇనుప పరిశ్రమను మొదట స్థాపించాడు. 1830లో అతడు కంపెనీ ప్రభుత్వం సహాయంతో మద్రాసు రాష్ట్రంలోని దక్షిణ ఆర్కాటు జిల్లాలో పోర్టినోవొ వద్ద ఒక ఇనుప కర్మాగారాన్ని స్థాపించాడు. ఇనుప కడ్డీలను తయారు చేసి ఇంగ్లండుకు ఎగుమతి చేసి అప్పటికి స్వీడన్ నుంచి వచ్చే ఇనుముకు పోటీగా రూపొందించాలని అనుకున్నాడు. కానీ ఇది ఫలించలేదు. ఇదే సమయంలో బెంగాలులో ఇనుప పరిశ్రమలు స్థాపించడానికి ప్రయత్నాలు కొనసాగాయి. 1875లో బార్‌కార్ ఇనుప కార్ఖానాల కంపెనీ స్థాపించడం జరిగింది. కానీ 1879లో అది మూత పడింది. 1881లో ప్రభుత్వం స్వయంగా ఆ కంపెనీని స్థాపించి 1889లో బెంగాలు ఇనుము ఉక్కు కంపెనీకి దీనిని అప్పజెప్పింది. 1900 నాటికి ఈ కంపెనీ ఏటా 35వేల టన్నుల ముడి ఇనుము తయారు చేసింది. 1905లో ఈ కంపెనీ ఉక్కు విభాగాన్ని కూడా ప్రత్యేకంగా ప్రారంభించింది. కాని ఉక్కు ఉత్పత్తి ఆర్థికంగా లాభదాయకం కాలేదు. ఐరోపా నుంచి దిగుమతియైన ఉక్కు చౌకగా లభించడమే దీనికి కారణం.

భారతదేశంలో ఉక్కు పరిశ్రమకు పితామహుడు జంషెడ్జీ టాటా. ఒక జర్మన్ నిపుణుడు తయారు చేసిన నివేదికను చదివిన టాటా మధ్యపరగణాలలో చందా జిల్లాలో ఇనుము నిల్వలు విస్తారంగా ఉన్నట్లు తెలిసి ఇనుము - ఉక్కు పరిశ్రమ స్థాపనకు ఉత్సాహం చూపాడు. కాని అధికారుల నిర్లిప్తత వల్ల ప్రభుత్వం నుంచి పొందాల్సిన లైసెన్సు మొదలైన వాటి జాప్యం మూలాన అప్పట్లో అది ముందుకు సాగలేదు.

కొంతకాలం తరవాత అప్పటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ అయిన 'జార్జి హామిల్టన్'' ప్రోత్సాహంతో అధికార పక్షం నుంచి సహకారం లభించింది. అతడు అమెరికన్ నిపుణులను రప్పించి బెంగాలు, బీహార్ ప్రాంతాలను సర్వే చేయించి పెద్ద ఎత్తున ఇనుప కర్మాగారాలన్నీ స్థాపించే విషయంలో సలహాలను కోరాడు. ఆ సర్వే ఫలితంగా 1907లో భారతీయ పెట్టుబడితో తాతా ఇనుము-ఉక్కు కర్మాగారానికి ఛోటా నాగపూర్ వద్ద సాక్చి అనేచోట శంకుస్థాపన జరిగింది. వెంటనే కర్మాగార నిర్మాణం పూర్తయి 1911లో ఇనుము, రెండేళ్ళ తర్వాత ఉక్కు ఉత్పత్తి ప్రారంభమైంది. సాక్చి గ్రామానికి కర్మాగార వ్యవస్థాపకుడైన జెంషెడ్జీ తాతా పేరుతో 'జెంషెడ్పూర్'గా పేరు మార్చడమైంది.

## ఇతర పరిశ్రమలు :

19వ శతాబ్దారంభంలో స్థాపించి ఇతర పరిశ్రమలలో వ్యవసాయ సంబంధమైనవి కూడా అనేకం ఉన్నాయి. చక్కెర పరిశ్రమ వాటిలో ప్రధానమైంది. మనదేశంలో తయారైన చక్కెర తూర్పు ఇండియా కంపెనీ ఎగుమతి చేసేది కానీ క్రమేణా బ్రిటీషు ప్రభుత్వం పశ్చిమ ఇండియా దీవుల నుంచి చక్కెర దిగుమతి చేయడం ప్రారంభించింది. 19వ శతాబ్దం మధ్యభాగంలో ఆధునిక పద్ధతుల్లో పంచదారను శుద్ధి చేసే పద్ధతులు ప్రవేశపెట్టడం జరిగింది. 1863 తర్వాత మారిషస్ దీవుల నుంచి భారత దేశానికి చక్కెర దిగుమతి చేసుకోడం జరిగింది. కాని క్రమంగా బీట్ దుంపల నుంచి తయారైన చక్కెరను పాశ్చాత్య దేశాల నుంచి దిగుమతి చేసుకోడం ప్రారంభించింది. 1870-94 మధ్యకాలంలో చక్కెర ఉత్పత్తి క్లిష్టమైంది. 1894లో దిగుమతులపై సుంకాలు విధించడం జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో చక్కెరపై 10 శాతం సుంకం అధికం చేయడం జరిగింది. ఈ సుంకాల మూలంగా విదేశీ చక్కెర దిగుమతులు తగ్గటంతో స్వదేశీ పంచదార పరిశ్రమ ఎంతో అభివృద్ధి చెందింది. దక్షిణంలో కోయంబత్తూరులో స్థాపించి చెరకు పరిశోధన సంస్థ ఆ పంటను అభివృద్ధి పరచటానికీ, కొత్త వంగడాల ఉత్పత్తికీ, అనేక పరిశోధనలు కొనసాగించింది. కాన్పూరులోని పంచదార తయారీ సంస్థ కృషి ఫలితంగా నాణ్యమైన పంచదార ఉత్పత్తి విధానాలను కనిపెట్టడం జరిగింది.

చక్కెర లాగా కాగితపు పరిశ్రమ కూడా 19వ శతాబ్దాంతానికి ఎక్కువగా అభివృద్ధి చెందింది. 1870లో భారతదేశపు మొదటి కాగితపు మిల్లు కలకత్తా వద్ద స్థాపించడం జరిగింది. ఆ సముదాయంలో కాగితపు మిల్లులు దిగుమతి చేసుకొన్న కర్రగుజ్జును, సాబై గడ్డితో చేసిన గుజ్జును ఉపయోగించాయి. కాని తరవాత స్థానికంగా లభించే వెదురు గుజ్జును ఉపయోగించారు. లక్నో, పూనా నగరాల్లో కూడా కాగితపు మిల్లులను స్థాపించడం జరిగింది.

వ్యవసాయానికి మొదటి నుంచి పశు సంపద ముడిపడి ఉన్నందువల్ల మనదేశం చర్మ పరిశ్రమకు కేంద్రమై ఉండాల్సింది. కానీ కంపెనీ పాలనాకాలంలో చాలవరకు మనదేశం నుంచి ముడి చర్మాలు, ఇతర దేశాలకు ఎగుమతి చేయడం జరుగుతుండేవి. ఆధునిక పద్ధతిలో, దిగుమతి చేయబడిన రసాయనిక పదార్థాలతో చర్మాలను శుద్ధి చేసే ఇంధనం 1860లో కాన్పూరులో ప్రభుత్వ కార్మగారాన్ని స్థాపించిన తర్వాత కొనసాగింది. ముఖ్యంగా మద్రాసు రాష్ట్రంలో 1876-78లో సంభవించిన ధాతు కరువు సమయంలో అధిక సంఖ్యలో పశువులు మరణించినప్పుడు రాణిపేట, ఆర్కాటు, వాలాజ మొదలగు చోట్ల చర్మాన్ని శుద్ధి చేసే కర్మాగారాలను అధిక సంఖ్యలో స్థాపించడం జరిగింది.

అగ్గిపెట్టెలు వంటి వస్తువులు తయారు చేసే కర్మాగారాలను కూడా 19వ శతాబ్దంలో అధికసంఖ్యలో స్థాపించడం జరిగింది. వీటిని మొదట 1895 అహమ్మదాబాద్‌లో ప్రారంభించడం జరిగింది. ఇతర రసాయనిక ఇంజనీరింగ్ పరిశ్రమలను కూడా ఆ సమయంలో స్థాపించడం జరిగింది.

## పరిశ్రమలు - ఏజన్సీ విధానం :

భారతదేశంలో బ్రిటిషు పెట్టుబడులతో స్థాపించి పరిశ్రమలు మంచి లాభాలనార్జించడం చేత భారతీయ పెట్టుబడిదార్లు పరిశ్రమల స్థాపనకు ముందుకు వచ్చారు. కాని బ్రిటిషు వారికి ఉన్న అనుభవం, చొరవ లేనందువల్ల పరిశ్రమలు స్థాపించడానికి సంకోచించేవారు. ఆ పరిస్థితులను పోగొట్టడానికై ఆనాడు ప్రపంచవ్యాప్తంగా అనుసరించిన 'మేనేజింగ్ ఏజన్సీ' విధానాన్ని భారతదేశంలో అనుసరించారు. ఏదైనా ఒక సంస్థను ప్రారంభించడానికి దాన్ని నడపడానికి ఈ పద్ధతిని అనుసరించడం జరిగేది. భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధి చాలవరకు ఈ మేనేజింగ్ ఏజన్సీ విధానం వల్లనే జరిగింది. భారతీయ పెట్టుబడులను ప్రోత్సహించడానికి ఈ పద్ధతి పనికివచ్చింది. భారతదేశంలో అనుభవం ఉన్న డైరెక్టర్ల లోపించిన కారణంగా ఈ పద్ధతి చాలా అవసరమైంది. పెట్టుబడి పెట్టేదానికి కావలసిన ధనం ఉండి నడిపే అనుభవం లేని పెట్టుబడిదార్లు, కొత్త పరిశ్రమలను స్థాపించి వాటిని సక్రమంగా నడిపే బాధ్యతను నమ్మకం ఉన్న ఏజెంట్లకు అప్పగించవచ్చు. ఈ పద్ధతి వల్ల కొద్దికాలంలో భారతదేశంలో అనేక మేనేజింగ్ ఏజెన్సీ సంస్థలను స్థాపించడం జరిగింది. వాటిలో బిర్లా సోదరులు, టాటా సంస్థ, సాహుజైన్ లిమిటెడ్, దుల్మియా కంపెనీ, జైపూరియా సోదరుల కంపెనీ, నౌరోజి వాడియా మొదలైనవి అనేకం ఉన్నాయి.

మేనేజింగ్ ఏజెంట్లు పరిశ్రమల స్థాపన విషయంలో అనేక విధాలుగా కృషిచేశారు. పరిశ్రమలను స్థాపించడంలో ఉన్న అన్ని బాధ్యతలను వారు నిర్వహించారు. భారతదేశంలో అలాంటి ఏజన్సీ కంపెనీలు, తమ పరిశోధక దృక్పథంతో ఏఏ పరిశ్రమ ఏ విధంగా ప్రవర్తించాలో కూడా నిర్ధారణ చేయగలిగాయి. నూలు మిల్లులు, ఇనుము, ఉక్కు, జనుము మొదలైన అన్ని కర్మాగారాలు వారి చొరవ మూలంగానే స్థాపితమయ్యాయి. కర్మాగారాలను స్థాపించడమేగాక, అవి సక్రమంగా పనిచేయడానికి, మంచి పద్ధతిలో పురోగమించడానికి కృషిచేశాయి. ఈ ఏజెంట్లు కంపెనీల విస్తరణకు, ఆధునీకకరణకు కూడా బాధ్యత వహించారు. ముడి వస్తువులను కొనడానికి, యంత్రాలను ఖరీదు చేయడానికి తయారైన వస్తువులను అమ్మడానికి భీమా చేయించడానికి కూడా తగు జాగ్రత్తలు తీసుకొని తాము బాధ్యత వహించిన కర్మాగారాల అభివృద్ధికి సకల విధాలా కృషి చేశారు. కాని మేనేజింగ్ ఏజెంట్లు, పరిశ్రమల అభివృద్ధి నిరోధకులుగా తయారైన సందర్భాలు లేకపోలేదు. వారి వలన సొంతదార్లకు కావలసిన తర్ఫీదు, ఎప్పుడూ లభించేది కాదు. ఈ ఏజెంట్లకు ఒకేసారి అనేక కంపెనీలను నడిపే బాధ్యత ఉండడం చేత ఒక్కొక్కప్పుడు సామర్థ్యం లోపించేది. మొత్తానికి మంచి సామర్థ్యం ఉన్న మేనేజింగ్ ఏజెంట్ల మూలంగా భారతీయ పరిశ్రమలకు మేలు జరిగిందనే చెప్పవచ్చు.

## విదేశీ పెట్టుబడులు :

భారతదేశంలో సహజ సంపదలు పుష్కలంగా ఉన్నాయన్న విషయాన్ని బ్రిటిషువారు గ్రహించారు. వ్యాపారులు తమ తమ వర్తకాన్ని యథావిధిగా కొనసాగించారు. 1770 తర్వాత స్థానిక వ్యాపారులు వాణిజ్య విషయాల్లో ఎక్కువ ఆసక్తి చూపారు. యాంత్రిక పద్ధతిలో తయారైన వస్తువుల దిగుమతులు ఎక్కువైన

కారణంగా స్వదేశీ పెట్టుబడి తగ్గు ముఖం పట్టింది. 1851వ శతాబ్దంలో నమోదైన జాయింట్ స్టాక్ కంపెనీల్లో స్వదేశీ పెట్టుబడిని 37 కోట్ల రూపాయలుగా అంచనా వేయడం జరిగింది.

బ్రిటిషు పాలకులు భారతదేశాన్ని ఆధునికీకరణ చేయడానికి కృషి చేశారని వాదించేవారు. రైల్వేల అభివృద్ధి, తోటల పెంపకం, బ్రిటిషు పెట్టుబడులతో స్థాపించిన కర్మాగారాలు, గనులు, ఆధునిక బ్యాంకులు మొదలైన వాటిని సాధారణంగా దీనికి ఉదాహరణలుగా పేర్కొంటారు. కాని నిశితంగా పరిశీలిస్తే బ్రిటిషు ఆర్థికావసరాల కోసం ప్రోత్సహించినవే అవన్నీ. భారతీయ రైలు మార్గాలు, బ్రిటిషువారి పరిశ్రమలకు కావలసిన ముడి సరకుల రవాణాకు, తయారైన వస్తువులను మార్కెట్లకు చేరవేయడానికి, సైనిక సౌకర్యాలకు, పరిపాలనా పటుత్వానికి ఉద్దేశించినవే. తోటల పరిశ్రమలు, గనులు, ఇనుము, ఉక్కు పరిశ్రమలు జనపనార మిల్లులు, బ్యాంకింగ్, భీమా మొదలైన పరిశ్రమలన్నీ ఏజెన్సీ విధానంలో కొనసాగినందువల్ల అతి త్వరగా అభివృద్ధి చెందాయి. అనేక బ్రిటిషు ఏజెంట్లు ఎక్కువ ధనాన్ని ఆర్జించగలిగారు. నిజానికి భారతీయ ఆర్థిక వికాసం కన్నా భారతదేశంలో స్థాపించిన పరిశ్రమలకు బ్రిటిషు ఆర్థికాభివృద్ధి మాత్రమే ప్రధాన లక్ష్యమైంది.

భారతదేశంలో బ్రిటిషు పెట్టుబడులు అమిత లాభాల నార్జించే దృష్టితో వెచ్చించడం జరిగింది. ఇంగ్లండుతో పోలిస్తే ఇక్కడ పనిచేసే కార్మికులు చౌకగా లభించడం వల్ల, ముడిసరకులు సులభంగా లభ్యంగావడం వల్ల భారతదేశంలోను, పక్క దేశాలలోను మార్కెట్లు విరివిగా దొరకడం చేత, బ్రిటిషు పరిపాలన, బ్రిటిషు పెట్టుబడులను ఆకర్షించడానికి అన్ని చర్యలను తీసుకొన్నది. కానీ పరిశ్రమల అభివృద్ధికి మూలకందమైన మౌలిక పరిశ్రమలేవీ భారతదేశంలో స్థాపితం కాలేదు. రైల్వేలకు కావలసిన సామగ్రి ఇంగ్లండులో మాత్రం తయారయ్యేవి. విదేశీయులు స్థాపించిన పరిశ్రమలలో భారతీయులు బాధ్యతాయుతమైన పదువులు పొందలేదు. కార్మికులుగా మాత్రం పనిచేశారు. సాంకేతిక సిబ్బంది పూర్తిగా విదేశీయులే. కావలసిన వస్తువులన్నీ విదేశాల నుంచి మాత్రమే దిగుమతి చేయబడేవి.

బ్రిటిషు పాలనలో పారిశ్రామిక ప్రగతి దేశాభ్యున్నతికి దోహదకారి కాలేదు. స్థానికంగా ఉన్న సాంప్రదాయక పరిశ్రమలు కుటుంబ సభ్యుల కృషితో వ్యవసాయంతో మేళవించడం జరిగి సనాతన ఆర్థిక విధానానికి తగినట్లు కొనసాగేది. ఆ పరిశ్రమలను రక్షించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోలేదు. కర్మాగారాల పద్ధతిలోగల పరిశ్రమల స్థాపనవల్ల ఉత్పత్తి సంబంధాలలో అనేకమైన మార్పులు సంభవించాయి. ఇంగ్లండులోని తమ పరిశ్రమలను రక్షించడానికై భారతదేశంలో స్వేచ్ఛా వ్యాపారం కొనసాగించింది. పారిశ్రామిక ప్రగతికి సాంకేతిక పరిజ్ఞానం ప్రధానం కాని భారతదేశంలో సాంకేతిక విద్యను బోధించడానికి ఏ చర్యలను తీసుకోడం జరగలేదు. దేశంలో బ్రిటిషు దిగుమతులకు మాత్రమే ప్రోత్సాహం ఉండేది. వలస పాలనలో సామాన్య ప్రజలు బీదరికంతోనే కొనసాగారు. ప్రజల ఆర్థిక అవరోధాలు సాంఘిక, సాంస్కృతిక రాజకీయ కార్యక్రమాలకు గొప్ప ప్రతిబంధకాలుగా తయారయ్యాయి. కాని బ్రిటిషువారి పరిశ్రమల మూలంగా జరిగిన సహాయం, విశేషంగా కూలీజనం ఉత్పత్తి. భారతదేశం కూలీలు అతికొద్ది వేతనాలతో అత్యంత ఎక్కువ కృషిని అందజేస్తారన్న పేరు గడించారు. బ్రిటిషు పాలనలో సాగిన పారిశ్రామికాభివృద్ధి ఫలితంగా భారతదేశంలో పెట్టుబడిదారీ వర్గం, సామాన్య కూలీజనం ఉన్న కార్మిక వర్గం అనే రెండు కొత్త వర్గాలు మాత్రం ఒక దానికొకటి భిన్నంగా ఆవిర్భవించాయి.

# అధ్యాయం - 15

# జాతీయోద్యమ బీజాలు

నిరంకుశ విదేశీ పరిపాలన ఏ దేశంలోనైనా జాతీయ ప్రతిఘటనను రేకెత్తించక మానదు. భారతదేశంలోని సాంఘిక వ్యవస్థ, ముస్లిం వ్యతిరేక సమస్య, స్థానిక సంస్థానాల ప్రాతినిధ్యం, పాశ్చాత్య విద్యా పద్ధతుల ప్రభావం, 1857 తిరుగుబాటు తదనంతరం ఏర్పడ్డ జాతి వైషమ్యాల ప్రభావం వంటి కారణాలవల్ల ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమం ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకొన్నది. 1870 వరకు చెదురుమదురుగా జరిగిన తిరుగుబాట్లను ప్రభుత్వం సులభంగా అణచివేసింది. స్థానిక సంస్థానాధీశులు, జమిందార్లు తమకు విక్టోరియా రాణి ప్రకటనలో ఇచ్చిన అభయం ప్రకారం తమ అధికారాలకు భంగం లేనందువల్ల బ్రిటిషు వ్యతిరేక ఉద్యమాలకు నాయకత్వం వహించలేదు. 1857 తిరుగుబాటు ప్రధానంగా మహమ్మదీయుల అసంతృప్తివల్ల జరిగిందని చిత్రించబడి వారు బ్రిటిషువారికి బద్ధ శత్రువులుగా పరిగణితమయ్యారు. అందువల్ల వారిని అణచి ఉంచడానికి చర్యలు తీసుకొన్నది. ఈ కారణంగా మహమ్మదీయులు తర్వాత బ్రిటిషు వారిపై ప్రతిఘటన ఉద్యమాలను, లేవనెత్త సంకల్పించలేదు. బ్రిటిషు పాలనలో వారు ప్రేక్షకులుగా మాత్రమే చాలకాలం కొనసాగారు. కాని ఆంగ్లేయులు అనుసరించిన ఆర్థిక రాజకీయ ప్రణాళికలు సామాన్య ప్రజల జీవితాలను పీడించిన కారణంగా దేశవ్యాప్తంగా రైతు ఉద్యమాలు, గిరిజనుల తిరుగుబాట్లు కొనసాగాయి. క్రమంగా రాజకీయ చైతన్యం, జాతీయ భావాలు విస్తరించి, రాజ్యాంగ సంస్కరణలు వీటితో బాటు స్వాతంత్ర్యోద్యమం ప్రబలింది. 19వ శతాబ్దాంతానికి వార్తా పత్రికల ప్రమేయం, జాతీయ కాంగ్రెసు కృషి, పెంపొందిన రవాణా సౌకర్యాలు మొదలైన వాటివల్ల బ్రిటిషు పాలనకు ప్రతిఘటనోద్యమం చైతన్యవంతమైంది.

## రైతు పోరాటాలు :

ప్లాసీ యుద్ధం ముగిసిన తర్వాత కంపెనీ అధికార్లు రాజ్యాక్రమణను కొనసాగించే సమయంలో దాదాపు అన్ని ప్రాంతాలలోను, అధికారాలు కోల్పోయిన స్థానిక నాయకులు, జమిందార్లు, మఠాధికార్లు మొదలైనవారు తమ అసంతృప్తిని బహిరంగంగా సైనిక ఉద్యమాల ద్వారా తెలియజేశారు. బ్రిటిషు పరిపాలనాకాలంలో ఆ ఉద్యమాలు 77కు మించి ఉన్నాయని కెత్లన్ గస్ అనే సామాజిక శాస్త్రవేత్త అంచనా. కాని 1857 తిరుగుబాటు అనంతరం స్థానిక ప్రభువులు, జమిందార్లు మొదలైన వారితో బ్రిటీషు ప్రభుత్వం సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొన్న కారణంగా ఆ ఉద్యమాలు తగ్గుముఖం పట్టాయి. కానీ సామాన్య ప్రజలు ముఖ్యంగా రైతులు, చేతిపనివారు గిరిజనులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిపిన ఉద్యమాలు కొనసాగాయి.

గిరిజనులు బహుశా మిగిలిన అన్ని వర్గాలకన్నా ఉధృతంగా ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలు కొనసాగించారు. అనాగరికులుగా వేటతో మాత్రమే జీవించే కొన్ని ప్రత్యేక తెగలు మినహా, సర్వసాధారణంగా గిరిజనులు భారతీయ సాంఘిక జీవన స్రవంతిలో అంతర్భాగంగానే కొనసాగారు. వారు "పోడు" పద్ధతిలో వ్యవసాయదారుగ, కూలీలుగా వ్యవహరించేవారు. బ్రిటిషు పాలనలో వాణిజ్య ప్రధానమైన వ్యవసాయం చేత

గిరిజనుల ఆర్థిక స్వాతంత్ర్యం హరించుకొని పోయింది. వడ్డీ వ్యాపారులు, దుకాణాదార్లు, భూ ఆక్రమణదార్లు, కాంట్రాక్టర్లు మొదలైనవారు అడవి ప్రాంతాలలో నివసించే గిరిజనులను గుప్పిట పెట్టుకోవడం ప్రారంభించారు. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన భూమిశిస్తు విధానాలు గిరిజనుల ఉమ్మడి భూమిపద్ధతిని హర్షించలేదు. ఇది గిరిజనుల ఆందోళనకు కారణమైంది. బీహార్, అస్సాం ప్రాంతాలలో క్రైస్తవ మిషనరీలు గిరిజన నివాస స్థలాలలో తమ మతం మార్పిడి కార్యక్రమాలను ఉధృతంగా కొనసాగించారు. 1870-80 మధ్యకాలంలో బ్రిటీషు ప్రభుత్వం అడవుల నుంచి వచ్చే ప్రభుత్వాదాయాన్ని అధికం చేయడానికి కొత్త పద్ధతులను ప్రవేశపెట్టింది. అడవులలోని కలప సేకరించడానికి పశువులను మేపుకోడానికి పన్నుి వసూలు చేసి అడవులపై ప్రభుత్వం గుత్తాధికారం ప్రకటించింది..

గిరిజనులు అప్పుడప్పుడు హింసాత్మక ఉద్యమాలు మాత్రమేగాక అంతరంగికంగా మత, సాంఘికపరమైన సంస్కరణోద్యమాలు కూడా కొనసాగించారు. 1855లో జరిగిన సంతాల్ తిరుగుబాటు గిరిజనులు నడపిన మొదటి ప్రధానమైన ఉద్యమమని చెప్పవచ్చు. 1870లో ప్రారంభమైన సావాహర్ ఉద్యమం ప్రారంభంలో సాంఘిక పరమైనదిగా గోచరించినా క్రమంగా అది రెవెన్యూ వసూలు పద్ధతికి వ్యతిరేకంగా మారింది. గిరిజనుల కడగండ్లు తొలగుతాయని, సువర్ణశకం ప్రారంభమవుతుందనే నమ్మకంతో 1868లో గుజరాత్‌లోని నైక్డా గిరిజనులు పోలీసు ఠాణాలను ఎదుర్కొన్నారు. కచార్ రాజ్యంలోని నాగజాతి వారు శంభుదన్ అనేవారి నాయకునికి తుపాకి గుండ్లను అధిగమించే వింత శక్తులున్నాయని నమ్మి అతని నాయకత్వంలో బ్రిటిషువారిని ఎదిరించారు. అదే విధంగా విశాఖపట్టణం ఏజన్సీ ప్రాంతంలో కొర్రమల్లయ్య అనే ఒకకొండదొర అతడు పాండవులలో ఒకని అవతారమని, అతని కొడుకు కృష్ణుడని, బ్రిటిషువారిని తరిమి కొట్టడానిక అవతారమెత్తినట్లు చాటి దాదాపు నాలుగైదు వేల గిరిజనులను పోగుచేశారు. బ్రిటిషువారు వారిలో అనేకులను బంధించారు. అందులో కొంతమందిని ఉరితీశారు. గోదావరి ఏజన్సీ ప్రాంతం కూడా 1879-80లో పెద్ద ఉద్యమాలకు నిలయమైంది. చోడవరం దగ్గర 'రంపా' ప్రాంతంలో కోయ, కొండదొరలు, మఠాదార్లు 1813 నుంచి విప్లవాలు సాగిస్తూ వచ్చారు. 1879లో అతిప్రధానమైన ఉద్యమం సాగించి కలప పన్ను, మేత పన్ను మొదలైన వాటికి వ్యతిరేకత తెల్పారు. 1920-22 సంవత్సరాల మధ్యకాలంలో ఈ ప్రాంతంలోని గిరిజనులను, అల్లూరి సీతారామరాజు ప్రభావితం చేసి, విప్లవ నాయకుడై బ్రిటిషు వారి ఆట కట్టించడానికి ప్రయత్నించాడు.

రాంచి ప్రాంతంలో 1899లో ముండా తెగలవారు, బ్రిటిషువారికి ఎదురు తిరిగి అక్కడి బేత్ బేగరి, అధే వెట్టి చాకిరీ, క్రైస్తవ మత వ్యాప్తి, వడ్డీ వ్యాపారుల దురాగతాలను వ్యతిరేకించారు. బిర్సా అనే అతడు ముండా తెగవారికి నాయకత్వం వహించి ఈ తిరుగుబాటును నడిపాడు. అతని నాయకత్వంలో 'ముండా' లు అనేక తికాదారులను, జాగీర్దార్లులను, క్రైస్తవ నాయకులను చంపారు. పోలీసులను కాల్చారు. కానీ 1900 జనవరిలో ఈ తిరుగుబాటు దార్లను ఓడించడం జరిగింది. బిర్సాను పట్టి బంధించారు. అనేక 'ముండా' తిరుగుబాటుదార్లు చంపడం జరిగింది. కానీ ఈ తిరుగుబాటు మూలంగా ఛోట నాగపూర్ ప్రాంతంలో ఆటవికులకు తమ భూములపై కొన్ని అధికారాలను ఇవ్వడం జరిగింది. బిర్సాను ఇప్పటికీ ఆ ప్రాంతపు గిరిజనులు తమ పాలిట దైవంగా గుర్తిస్తారు.

1879లో మహారాష్ట్రలో వాసుదేవ ఫాడ్కే సాగించిన ఉద్యమం అటు విద్యవంతులైన వారి జాతీయతత్వాన్ని, సాధారణ ప్రజల తిరుగుబాటు తనాన్ని మేళవించింది. ఆంగ్ల భాషాధ్యయాన్ని చేసిన ఫాడ్కే

ముఖ్యంగా బ్రిటిషువారి ఆర్థిక విధానాలను గర్హించాడు. దోపిడీలు కొనసాగించి, కొత్త రహస్య సైన్యాలను రూపొందించి బ్రిటిషు వ్యతిరేక ఉద్యమాలు కొనసాగించి, రవాణా వార్తా సౌకర్యాలను తెంచి, బ్రిటిషు వారిని తరిమి కొట్టి హిందూరాజ్యాన్ని స్థాపించదలచాడని అతని రచనలలో చెప్పుకొన్నాడు. కాని ఫాడ్కే తన అనుచరులతో బాటు పట్టుబడ్డాడు. కేరళలో మోప్లా ఉద్యమాలు భూస్వాముల వ్యతిరేకతను, బ్రిటిషు అధికారానికి వ్యతిరేకంగా సాగాయి. అందులో వారు మతోన్మాదాన్ని మేళవించారు. మలబారు తీరంలోని ముస్లింలకు మోప్లాలని పేరు. 1792లో టిప్పు అధికారం నుంచి బ్రిటిషు వారికి ఈ ప్రాంతాలు సంక్రమించిన తరువాత వచ్చిన అనేక భూమి అమరక విధానంలోని మార్పులు, మోప్లాలను అసంతృప్తిపరులను చేశాయి. దక్షిణ మలబారులోని ఎర్నాదు, వల్లువనాడు తాలూకాలలో 1836-1854 ప్రాంతంలో దాదాపు 22 తిరుగుబాట్లు జరిగినట్లు నమోదైంది. 'జన్మా' అనే భూస్వాములకు, వ్యతిరేకంగా ఈ తిరుగుబాట్లు జరిగాయి. వడ్డీ వ్యాపారులను ఎదిరించడానికి బ్రిటిషు అధికార్లను ధిక్కరించడానికి కూడా ఈ ఉద్యమాలు కొనసాగాయి. 1919లో సహాయ నిరాకరణోద్యమం సమయంలో కూడా ఖిలాఫత్ ఉద్యమాన్ని ఆసరాగా తీసుకొని మోప్లాలు భూస్వాముల నెదిరించారు.

రైతులు, గిరిజనులు సాగించిన తిరుగుబాట్లు చాలావరకు భూ అమరక విధానంలోని మార్పులకు, భూకామందుల నిరంకుశాధికారాలకు వ్యతిరేకంగా కొనసాగాయి. కాని మహారాష్ట్రలోని దక్కనులో 1875 ప్రాంతంలో ఉన్నత వర్గీయులైన రైతులు కూడా బ్రిటిషు వ్యతిరేక ఉద్యమాలు కొనసాగించారు. వీటికి దక్కను అలజడులని పేరు. 1860 నుంచి పత్తిపంట మూలంగా మంచి లాభాల నార్జించి ధనవంతులైన రైతులు 1870 నాటికి ధరలు పడిపోవడం చేత ఇబ్బందుల నెదుర్కొన్నారు. దీనికి తోడు 1867 నుంచి భూమి శిస్తును కూడా అధికం చేయడం జరిగింది. ఫలితంగా రుణభారం పెరిగింది. ఆ ప్రాంతాన్ని గుప్పిటలో పెట్టుకొన్న మార్వాడీ వడ్డీ వ్యాపారులను రైతులందరూ నిరసించారు. అనేకచోట్ల వారిని ఎదుర్కొన్నారు. పూనా, అహమ్మద్‌నగర్ జిల్లాల్లో దాదాపు ఆరు తాలూకాల్లో జరిగిన ఈ తిరుగుబాట్లు దక్కను కలతలుగా ప్రసిద్ధి చెందాయి. వడ్డీ వ్యాపారులను అటకాయించి వారివద్ద ఉన్న అప్పు పత్రాలను కాజేసి కాల్చివేశారు. ఈ కలతల తరవాత 1879లో ప్రభుత్వం రుణదాతల దురాగతాలను అరికట్టడానికై రైతుల సౌకర్యార్థం దక్కన్ వ్యవసాయదార్ల ఉపాధి చట్టాన్ని కల్పించింది.

వడ్డీ వ్యాపారులకు వ్యతిరేకంగా ఉద్యమాలు బెంగాలులో కూడా కొనసాగాయి. మహాజన్‌లనే పేరు పొందిన ఈ వడ్డీ వ్యాపారులు సాధారణంగా స్థానిక భూస్వాములుగానో లేక జమిందార్లుగానో ఉండేవారు. వ్యవసాయంలో రుణాల అవసరం అధికంగా ఉండేది. జమిందార్లు రైతుల నుంచి పన్ను వసూలు చేసేవారేగాని, వారికి కావలసిన రుణ సదుపాయాలు కలిగించేవారు కాదు. కాబట్టి ధనవంతులైన రైతులు తమ ఆగ్రహాన్ని జమిందార్లపై చూపారు. 1870-80 ప్రాంతంలో తూర్పు బెంగాలులో ముఖ్యంగా పబ్నా జిల్లాలో తిరుగుబాట్లు అధికంగా జరిగాయి. 1873లో రైతులు ఒక వ్యవసాయక సంఘాన్ని నెలకొల్పి రైతుల సౌకర్యార్థం ఒక నిధిని ఏర్పాటు చేశారు. రైతుల సమస్యలు చర్చించడానికై సమావేశాలు ఏర్పాటుచేసి, అప్పుడప్పుడు పన్ను చెల్లించడాన్ని నిరాకరించి ప్రభుత్వానికి తమ వ్యతిరేకతను తెల్పారు. అదేవిధమైన ఉద్యమాలు బెంగాలులోని ఇతర ప్రాంతాలలో కూడా కొనసాగాయి. ఢాకా, మైమన్‌సింగ్, త్రిపుర, బేకర్‌గంజ్, ఫరీద్‌పూర్ మొదలయిన జిల్లాల రైతులు కూడా ఉద్యమాలు కొనసాగించారు. ఈ ఉద్యమాలు చాలవరకు శాంతియుతంగానే కొనసాగాయి. జమిందార్ల నిర్లిప్త వైఖరిని వీరు ఖండించారు. పబ్నా రైతు ఉద్యమాలు

గట్టిగా బ్రిటిషు ఉద్యమాలనడానికి కూడా వీల్లేదు. కొన్ని సందర్భాల్లో వారు బ్రిటీషు ప్రభుత్వానికి అధీనులైన రైతులుగా మాత్రమే గుర్తించబడాలని, జమిందార్ల అధీనంలోని రైతులుగా పరిగణితం కావడాన్ని ఎదిరించారని తెలుస్తుంది. బెంగాల్ గవర్నర్ కాంప్‌బెల్ 1873లో ఒక ప్రకటనలో రైతులు సమాఖ్యగా ఏర్పడడం న్యాయబద్ధమైనదేనని కాని హింసాకాండ చట్టబద్ధం కాదని తెలిపాడు. పబ్న రైతు ఉద్యమం బెంగాలు మధ్య తరగతి, ధనిక వర్గీయుల దృష్టిని వివిధ పంథాలలో ఆకర్షించింది. జమిందార్లు అధిక సంఖ్యాకులుగా ఉన్న బ్రిటిష్ - ఇండియా సంఘాలు పబ్న ఉద్యమాన్ని ఎదిరించాయి. కాని ఇతర వృత్తుల వారు సాధారణ ప్రజలు ఈ ఉద్యమాలను మనస్ఫూర్తిగా ప్రోత్సహించారు.

జమిందారీ ప్రాంతాలేకాక రైత్వారీ భూములలో కూడా ప్రభుత్వం భూమి శిస్తు అధికం చేసిన కారణాలవల్ల కూడా రైతుల ప్రోద్బలంతో ప్రారంభమైనా స్థానిక నాయకుల సహాయంతో కొనసాగి, విద్యాధికుల సానుభూతిని పొందగలిగాయి. అధిక శిస్తులకు వ్యతిరేకంగా అస్సాంలో కామరూప్‌లోను, బెంగాల్‌లో అనేక ప్రాంతాల్లోను ఉద్యమాలు లేచాయి. 1896-97లో జరిగిన కరువు మూలంగా మహారాష్ట్రలోని దక్కను ప్రాంతంలో ఆహారధాన్యాల దుకాణాలు, కొల్లగొట్టడం శిస్తు మినహాయింపు కోరుతూ ఉద్యమాలు జరిగాయి. తిలక్ ఆధ్వర్యంలో పూనా సార్వజనిక సభ కరువు సమయాల్లో రైతులకు గల హక్కులను తెలియజేస్తూ తన సభ్యులను గ్రామ ప్రాంతాలకు పంపింది. వీరు సమావేశాల నేర్పాటు చేసి కరపత్రాలను పంచి అనేక జిల్లాలలో, రైతులలో చైతన్యాన్ని కలిగించారు. క్రమేణ రైతు సమస్యలను చర్చించడానికి జాతీయ నాయకులు అధిక సంఖ్యలో ముందుకు వచ్చారు.

## జాతీయతా - భావాలు :

1857 తరవాత దేశవ్యాప్తంగా జాతీయతా భావం గాఢంగా తలెత్తింది. ఈ జాతీయ భావం సాంఘిక, మత సంస్కరణోద్యమాల మూలంగా ప్రారంభమైనా తరవాత రాజకీయ ప్రాముఖ్యతను సంతరించుకొని రాజ్యాంగ హక్కులకోసం బ్రిటిషు పాలనకు వ్యతిరేకంగా కొనసాగింది. జాతీయ పునర్వికాసానికి పత్రికలు ప్రధాన పాత్ర వహించాయి. దాదాపు అర్థ శతాబ్దానికి ముందు సర్‌థామస్ మన్రో పత్రికా స్వాతంత్ర్యం విప్లవాన్ని తప్పకుండా తెస్తుందని చెప్పినట్లుగానే దిన, వార పత్రికలు చదువుకొన్న భారతీయులను ఒకటి చేయగలిగాయి. కుల, మత ప్రాతిపదికలపై సాంఘిక విభజన ఉన్న సువిశాల భారతదేశంలో పత్రికలు జాతీయ భావైక్యతకు దోహదం చేశాయి. బెంగాలులో హిందూ పేట్రియాట్, అమృత బజార్, బెంగాలీ మొదలైన పత్రికలు స్థాపితమయ్యాయి. బెంగాలీ పత్రికకు సురేంద్రనాథ్ బెనర్జీ సంపాదకత్వం నెరపాడు. సివిల్ సర్వీస్ నుంచి తొలగించబడ్డ సురేంద్రనాథ్ ఉత్తరోత్తర 1919లో మాంట్‌ఫర్డ్ సంస్కరణల అనంతరం మంత్రి కాగలిగాడు. మద్రాసులో 'హిందూ' పత్రిక ప్రభుత్వ వ్యతిరేకంగా ఉద్యమాన్ని కొనసాగించింది. బొంబాయి రాష్ట్రంలో మరాఠా, కేసరి అదే విధంగా పలుకుబడి ఉన్నవి. అటువంటి జాతీయ పత్రికలకు వ్యతిరేకంగా కొన్ని బ్రిటిషు పత్రికలు కూడా ప్రారంభమయ్యాయి. బెంగాలు హార్కారు ఆ కోవకు చెందింది. 1878లో భారతీయ పత్రికల చట్టం ప్రవేశపెట్టడం జరిగింది. కానీ ఈ చట్టం పరిధి ఆంగ్ల భాషలో ప్రచురించబడిన పత్రికలకు వర్తించలేదు. పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించిన లార్డ్ లిట్టన్ భారతీయుల జాతీయతా భావాలను రేకెత్తించాడని చెప్పవచ్చు.

భారతీయ భాషా సాహిత్యాలు కూడా జాతీయ భావ విస్తరణకు కారణాలు. విద్యాధికుల దేశాభిమానం సర్వ సాధారణంగా వాఙ్మయ రూపం పొందుతుంది. రాజా రామమోహనరాయ్, ఈశ్వర చంద్ర

విద్యాసాగర్ మొదలైన వారి రచనలు బెంగాల్లో జరిగిన సాంఘిక సంస్కరణోద్యమాలకి దగ్గర సంబంధం ఉంది. 1860-70లో దేశభక్తి పద్యాలు బెంగాలీలో రాయబడ్డాయి. నాటక సమాజాలు బ్రిటిషు వ్యతిరేక అంశాలుగల ప్రదర్శనలు ఏర్పాటు చేశాయి. దీనబంధుమిత్ర తన 'నీల్ దర్పణ్' అనే నాటకంలో నీలిమందు ఉత్పత్తి రైతుల అగచాట్లను వివరించాడు. ఈ రచన ప్రచురణ నీలిమందు రైతుల తిరుగుబాటుకు సరాసరి కారణమైంది. బంకించంద్ర చటర్జీ రాసిన 'ఆనంద్ మఠ్' వంటి చారిత్రక నవలలు ప్రజలను అమితంగా ప్రభావితం చేశాయి. బెంగాలు వలె బొంబాయిలో మహదేవ గోవిందరానడే మరాఠీ భాష పెంపుదలపై రాసిన గ్రంథం మిక్కిలి ఆదరణ పొందింది. 1890 నాటికి గురు రామదాస్ హిందూ తీవ్రవాదాన్ని సమర్థించిన శివాజీ ఉద్దేశాలను తిలక్, కేల్కర్ వంటి నాయకులు పునః ప్రతిష్ఠింపజేశారు. దక్షిణంలో అదే విధంగా తమిళ, తెలుగు వాఙ్మయంలో నూతన ధోరణులను, జాతీయ తత్త్వాన్ని రేకెత్తించాయి.

బ్రిటిషు పాలనలోని ఆర్థిక విధానాల గురించి, భారతదేశం నుంచి బ్రిటిషు పాలకులు తరలించే పెద్ద మొత్తాల ధనాన్ని గురించి అనేక మంది ఆర్థికవేత్తలు తులనాత్మక గ్రంథాలు ప్రచురించారు. 1870 నుంచి దాదాభాయ్ నౌరోజీ, రమేష్ చంద్రదత్, రానడే, జి.వి. జోషి మొదలైన వారు తమ రచనల్లో భారతదేశంలోని సహజ సంపదల గురించి, బ్రిటిషువారు నాశనంచేసిన చేతిపనుల గురించి స్వేచ్ఛా వ్యాపారం గురించి, పన్నుల భారాన్ని గురించి, వలస పాలనలోని ఆర్థిక అవకతవకల గురించి వివరించారు. ఆ గ్రంథాలు ఆర్థిక జాతీయ వాదానికి దోహదం చేశాయి. భారతీయులే కాక విలియం డిగ్బీ వంటి ఆంగ్లేయులు కూడా బ్రిటిషు వారు అనుసరించిన దోపిడి విధానాన్ని నిశితంగా విమర్శిస్తూ గ్రంథాలు రాశారు. భారత సంపద వెల్లువలుగా ఇంగ్లండు చేరుతుందన్న వీరి వాదన ప్రధానంగా భారత జాతీయ కాంగ్రెసు సంస్థ విస్తరణ క్రమానికి బాగా ఉపయోగపడింది.

1860-70 ప్రాంతంలో సివిల్ సర్వీస్ పరీక్షల కోసం లేదా న్యాయపట్టాలు పొందడానికోసం ఇంగ్లండు వెళ్లి అక్కడ దాదాభాయ్ నౌరోజీ వంటివారి ప్రభావానికి లోనైన బొంబాయి, కలకత్తా ప్రాంతాలకు చెందిన విద్యార్థులు కాంగ్రెసు స్థాపనలో ప్రధానపాత్ర వహించినవారు ఫిరోజ్‌షా మెహతా, బద్రుద్దీన్ త్యాబ్జీ, డబ్ల్యు సి. బెనర్జి, లాల్ మోహన్‌ఘోష్, సురేంద్రనాథ్ [illegible]ర్జీ, ఆనంద్ మొహబోస్, రమేష్ చంద్రదత్ మొదలైన వారు అందులో ముఖ్యులు. వీరుగాక కలకత్తాలో ద్వారకనాథ గంగూలి, రానడే, జివి. జోషి, పూనాలో కె.టి., బొంబాయిలో తెలాంగ్, మద్రాసులో సుబ్రహ్మణ్య అయ్యర్, వీర రాఘవాచారి, పనపాకం ఆనందాచార్యులు అనేక స్థానిక సంఘాలు ప్రారంభించడానికి చర్యలు తీసుకొన్నారు. వీరందరు సాధారణ మధ్యతరగతికి చెందినవారు మాత్రమే. వీరు ప్రారంభించిన సంస్థలన్నిటిలోనికి చాల ప్రధానమైనవి పూనా సార్వజనిక సభ, భారత సంఘం, మద్రాసు మహాజనసభ, బొంబాయి రాష్ట్ర సమావేశం మొ॥ 1883లో ఒక జాతీయ సమావేశం కూడా ఏర్పాటు చేయటం జరిగింది. కానీ 1885లో ఆలెన్ ఆక్టేవియన్ హ్యూమ్ తీసుకున్న శ్రద్ధతో భారత జాతీయ కాంగ్రెసు స్థాపన జరిగింది. డిసెంబర్ నెలలో బొంబాయిలో జరిగిన ప్రథమ సమావేశం దాదాపు 70 మంది ప్రతినిధులతో ప్రారంభమైంది. కాంగ్రెస్ సంస్థ ఉత్తరోత్తర ప్రధాన పాత్ర వహించి, జాతీయ ఉద్యమాన్ని కొనసాగించి కడపటికి స్వాతంత్ర్య సముపార్జనకు కారణభూతమైంది.

ప్రారంభంలో కాంగ్రెస్ సంస్థ ఎదుర్కొన్న అడ్డంకులు కాంగ్రెస్ వాదుల ఉద్దేశాలు, మొదటి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన డబ్ల్యు.సి. బెనర్జి చేసిన ప్రసంగం మూలంగా తెలుస్తుంది. "లార్డ్ రిప్పన్ యొక్క పరిపాలనలో ప్రధాన అంశంపరిపూర్ణమైన జాతీయ ఐక్యతను సాధించడం. ఇది కాంగ్రెసు ప్రధాన ఆశయాలలో

ఒకట''ని అతడు ప్రకటించాడు. కాంగ్రెస్ దాదాపు ఇరవై సంవత్సరాలు మితవాద సిద్ధాంతాన్ని అనుసరించింది. ప్రతీ సంవత్సరం ఒక్కొక్క ప్రధాన నగరంలో సమావేశమైంది. మొదటి అధ్యక్షుడు బెనర్జి క్రైస్తవ మతస్థుడు. రెండో అధ్యక్షుడు దాదాభాయ్ నౌరోజీ. పార్శీ మతస్థుడు. కాగా మూడో అధ్యక్షుడు బద్రుద్దీన్ త్యాబ్జి ఇస్లాం మతానికి చెందినవాడు. నిజమైన జాతీయ సంస్థగా పరిగణింపబడటానికి కాంగ్రెసు ప్రయత్నించింది. కాంగ్రెస్ సభల్లో నాయకులు బ్రిటీషు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించడంగాని లోటుపాట్లను తెలియజేయడం గాని జరగలేదు. కావలసిన సౌకర్యాలకై విజ్ఞాపనలు, వినతి పత్రాలు అభ్యర్థనలు పంపేవారు. బ్రిటీషు అధికారాన్ని ప్రతిఘటించే చర్యలుండేవి కావు.

కాని కొద్దికాలంలోనే కాంగ్రెస్ అభ్యర్థనల పద్ధతిని విడనాడింది. ప్రముఖులైన ఆంగ్లేయులతో సన్నిహిత సంబంధాలు కొనసాగిస్తూ క్రమేణ ప్రభుత్వ పద్ధతులను విమర్శించడం కొనసాగించింది. డేవిడ్ యూల్. సర్ విలియం, వెడ్డర్‌బర్న్, సర్ హెన్రీ కాటన్ మొదలైన వారికి కాంగ్రెసుతో సన్నిహిత సంబంధముండేది. ఇంగ్లండులో కూడా భారతదేశంపై అభిమానం గల వారు ఒక సంఘంగా ఏర్పడ్డారు. అమిత పలుకుబడి ఉన్న ఈ వర్గంవారు కాంగ్రెసుకు మద్దతుగా 'ఇండియా' అనే పత్రికను నడిపారు. దాదాభాయ్ నౌరోజీని బ్రిటిషు పార్లమెంట్‌కు ఎంపిక కావ. 'నికి వారు కారకులయ్యారు. 1892నాటికి కాంగ్రెస్ భారత కౌన్సిల్ చట్టాలను తీవ్రంగా దుయ్యబట్ట గలిగింది. ప్రభుత్వ పాలనా యంత్రాంగంలో భారతీయులకు కొంత ప్రదేశాన్ని కల్పించడానికన్నా ప్రభుత్వ కార్యనిర్వహణలో, పథకాల రూపకల్పనలో భారతీయులకు ప్రాధాన్యతను సంపాదించడం కాంగ్రెస్ లక్ష్యం. అందువల్ల ప్రభుత్వం కాంగ్రెస్‌కు పూర్తిగా వ్యతిరేకమయ్యింది. ప్రభుత్వ ఉద్యోగులు కాంగ్రెస్‌లో సభ్యులుగా ఉండరాదని ప్రకటించింది.దాదాపు 20 సంవత్సరాల కాంగ్రెసు నాయకత్వం అటు తీవ్రవాదులకు. ఇటు ప్రభుత్వ ఆగ్రహానికి మధ్య కొనసాగింది. అయినా తమ ఓర్పును ప్రదర్శించి. నమ్ముకొన్న సిద్ధాంతాలను విడువక తీవ్రవాదులకు లొంగక మితవాదులు కొనసాగారు. 1907లో సూరత్‌లో ఈ ఇరువర్గాల మధ్య ఘర్షణ బహిరంగంగా కూడా తయారైంది.

తీవ్రవాదుల సిద్ధాంతం ముఖ్యంగా దేశంలోని యువక వర్గాన్ని మొదట ఆకర్షించింది. విదేశీ నాగరికతా ప్రభావానికి పూర్తిగా లొంగి పోవడాన్ని, భారతీయులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి బ్రిటిషువారికి లోకువగా కొనసాగడాన్ని హిందూ మతక్షీణతను కోరే శక్తులను ప్రతిఘటించడం కోసం తీవ్రవాదం ప్రబలింది. మొదటి నుంచీ పాశ్చాత్య నాగరికతను నిరసించి హిందూమతాన్ని సమర్థించిన సనాతన వాదులను, కాంగ్రెసు మితవాద సిద్ధాంతాలు నచ్చని యువకులను తీవ్రవాదం ఒకటి చేయగలిగింది. బాలగంగాధర్ తిలక్ జీవితం, సనాతన ధర్మాన్ని అధునాతన తీవ్రవాద దృక్పథాన్ని మేళవించిన ఉదాహరణ.

కాంగ్రెసు స్థాపన దానితో పాటు ప్రధానంగా ప్రబలిన తీవ్రవాదులు ప్రభావం మూలంగా భారతదేశంలో ముస్లింల వేర్పాటువాద ధోరణి క్రమేణ అధికమైంది. 19వ శతాబ్దాంతానికి భారతదేశంలోని ముస్లింలలో బ్రిటిషువారికి అనుకూలురుగాను, ప్రతికూలురుగాను, రెండు భిన్న వర్గాలు ఏర్పడ్డాయి. 1857 తిరుగుబాటు తర్వాత ముస్లింలు బ్రిటిషువారిని పరమ విరోధులుగా పరిగణించిన కారణంగా ఆంగ్ల విద్యాభ్యాసానికి మొగ్గు చూపలేదు. ప్రభుత్వ ఉద్యోగాలకు వారు దూరంగా ఉండిపోయారు. కానీ ఈ పరిస్థితి నుంచి భారతీయ ముస్లింలను మార్చడానికి ప్రయత్నించినవాడు సర్ సయ్యద్ అహమ్మద్‌ఖాన్ (1817-98).

అతడు అలిఘర్‌లో ఆంగ్ల బోధనకోసం 1874లో పాఠశాలను స్థాపించాడు. కాని నాలుగేళ్ళ తర్వాత దానిని ఆంగ్లో ఓరియంటల్ కళాశాలగా ఏర్పరచాడు. 'అలిఘర్' ఉద్యమానికి ఈ విద్యాలయం కేంద్రంగా మారింది.

సర్ సయ్యద్ అహమ్మద్ రాసిన '1857 తిరుగుబాటుకు కారణాలు' అన్న కరపత్రంలో తిరుగుబాటు ముస్లింల అసంతృప్తి వల్ల కాదని నిరూపించ ప్రయత్నించాడు. 1885 కాంగ్రెస్ స్థాపనతో సర్ సయ్యద్ అహమ్మద్ బ్రిటిషువారి సహాయ సహకారాలు ముస్లింలకు మాత్రం అందించడానికి కృషి చేశాడు. ఇల్బర్ట్ బిల్ వ్యతిరేకోద్యమ సమయంలో బ్రిటిషువారికి వ్యతిరేకంగా పనిచేయవద్దని ముస్లింలకు సలహా ఇచ్చిన సర్ సయ్యద్ 1886 ముస్లింల విద్యా సదస్సును ఏర్పాటు చేశాడు. అది నిజానికి అతడు స్థాపించిన రాజకీయ ఉద్యమం.

కాంగ్రెసును బలవంతపరచిన ముస్లిం నాయకులు ప్రధానంగా బొంబాయి, మద్రాసు రాష్ట్రాలకు చెందినవారు. బద్రుద్దీన్ త్యాబ్జి వీరి నాయకుడు. 1887లో అతడు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడ్డాడు. ఆర్.ఎం. సమాని, మౌలానా అబుల్‌కలాం అజాద్ మొదలైన హకిం అజ్‌మహల్‌ఖాన్, హసన్ ఇమామ్, మౌలానా మహమ్మదాలీ మున్నగువారు కూడా కాంగ్రెసు సభ్యులుగా కొనసాగి జాతీయోద్యమంలో కృషి చేశారు. 1905లో లార్డ్ కర్జన్ బెంగాలును విభజించిన తర్వాత హిందూ, మహమ్మదీయ నాయకుల మధ్య బ్రిటిషు వారు సులభంగా విభేదాలు సృష్టించగలిగారు. 1906లో ముస్లిం లీగ్ స్థాపించబడింది. క్రమేణా ముస్లింల వేర్పాటు ధోరణి ప్రబలి మహమ్మదాలి జిన్నా నాయకత్వంలో 1930-47 మధ్య "రెండూ దేశాల వాదం" విజయవంతంగా కొనసాగింది. అది స్వాతంత్ర్యంతో బాటు దేశ విభజనకు, పాకిస్థాన్ ఆవిర్భావానికి కూడా కారణమైంది.

19వ శతాబ్దంలో ప్రబలిన హిందూ పునర్వికాస ఉద్యమం బహుశా పశ్చిమ భారతంలో ఉధృతంగా కొనసాగింది. కాని దేశంలో అన్ని మూలలకు ఇది ప్రసరించింది. 1857 తిరుగుబాటు తరువాత ప్రబలిన జాతీయతత్వం దీనికి కారణం. బెంగాలులో రామకృష్ణ పరమహంస, అతని ప్రధాన శిష్యులైన స్వామి వివేకానంద హిందూ మత ప్రాశస్త్యం గురించి, మత గ్రంథాల ప్రాముఖ్యత గురించి వివరించారు. దయానంద సరస్వతి 1877లో ఆర్య సమాజాన్ని స్థాపించి వేదాల గొప్పతనాన్ని గూర్చి వివరించాడు. అనేక పాశ్చాత్య దేశాలకు చెందిన దివ్యజ్ఞాన సమాజ సభ్యులు కూడా భారతీయ నాగరికత హిందూ మత ఔన్నత్యాన్ని గూర్చి ప్రచారం కొనసాగించారు. అవి హిందూమత పునరుజ్జీవనానికి, దానికోసం తీవ్రవాదం వ్యాప్తి చెందడానికి కారణాలయ్యాయి.

తొలుత హిందూ పునర్వికాసం పూర్తిగా మత సంబంధంగానే ఉండేది. కాని క్రమేణ అది రాజకీయంగా తయారైంది. దయానంద సరస్వతి 1882 గోసంరక్షణ సమాజాన్ని స్థాపించాడు. తిలక్ శివాజీ ఉత్సవాలను గణేశ్ పూజలను పునరుద్ధరించాడు.

దక్కనులో తిలక్, పంజాబులో లాలాలజపతి రాయ్, ముఖ్యంగా మత పునరుద్ధరణ కార్యాలను రాజకీయాలకు ఉపయోగించడానికి ప్రధాన కారకులు. జాతీయోద్యమ సమరంలో తిలక్ అనేక విధాల మార్గదర్శకుడు. విద్యార్థులను ఉత్తేజ పరచి జాతీయ కార్యక్రమాలలో పాల్గొనేట్లు చేశాడు. కేసరి, మరాఠా

మొదలైన పత్రికల సంపాదకుడుగా ప్రభుత్వానికి వ్యతిరేక పోరాటం సాహసంతో సాగించాడు. 1896లో బొంబాయిలో సంభవించిన ప్లేగు, ఆ సమయంలో ప్రభుత్వం అనుసరించిన దమననీతిని, ప్లేగు అధికార్లు రాంజ్, అయరెస్ట్ ల దురాగతాలను తిలక్, కేసరి పత్రికలో వివరించాడు. ఫలితంగా ఆ ఇద్దరు బ్రిటిషు అధికార్లను, ఛాపేకర్ సోదరులు హతమార్చారు. హంతకులైన ఛాపేకర సోదరులకు మరణశిక్ష పడింది. వారిని ప్రోత్సహించాడనే నేరంపై తిలక్‌కు 18 నెలల కారాగార శిక్షపడింది.

బెంగాలులో సైతం తీవ్రవాద జాతీయోద్యమం కొనసాగింది. కాంగ్రెసు పద్ధతులకు తీవ్ర ఆక్షేపణలు తెలియజేశారు. అశ్వని కుమార్ దత్ కాంగ్రెస్ సభలను మూడు రోజులు జరుగు తమాషాలో విమర్శించాడు. బెంగాలులోని శాశ్వత శిస్తు విధానం మూలాన హిందూ మతానికి చెందిన పలుకుబడి ఉన్న 'భద్రలోగ్' లను శిస్తు వసూలు చేసే మధ్య వర్గీయుల అధికారంతో కొనసాగారు. వీరు జమిందారులను కూడా ధిక్కరించ గలిగిన ధనవంతులైనందువల్ల రాజకీయాలకు సులభంగా ఆకర్షితులయ్యారు. బిపిన్ చంద్రపాల్, అరబిందు ఘోష్, రాజ్యాంగ పరమైన పద్ధతులుగాక 'ప్రత్యక్ష చర్య' పద్ధతిని ప్రోత్సహించారు. కొన్ని విషయాలలో తిలక్ మార్గాన్ని వీరు అనుసరించారు. స్వామి వివేకానంద సోదరులైన భూపేంద్రనాథ్ దత్త, 'యుగంధర్' అనే తీవ్రవాద పత్రికకు సంపాదకత్వం వహించాడు. తాంత్రిక పూజా విధానాల పునఃస్థాపన, కాళికాదేవి పూజల పునరుద్ధరణ మొలయినవి ఈ నాయకుల కృషికి ప్రాతిపదికగా తయారయ్యాయి. వైస్రాయి కర్జన్ అనుసరించిన పద్ధతులు ప్రధానంగా తీవ్రవాద వ్యాప్తికి దోహదం చేశాయి. కలకత్తా మునిసిపల్ కౌన్సిల్ చట్టం స్థానిక ప్రభుత్వానితో సంబంధమున్న ప్రతి స్థానికునికి అసంతృప్తి కలిగించింది. అతని విశ్వవిద్యాలయాల చట్టం విద్యాధికులకు ముఖ్యంగా ఉపాధ్యాయులకు ఆగ్రహాన్ని తెచ్చింది. కాని అతని బెంగాలు విభజన భారతదేశంలో జాతీయోద్యమం విజృంభించడానికి ప్రధాన కారణమైంది.

# ఉపయుక్త గ్రంథాలు


Anil Seal. **The Emergence of Indian Nationalism**, (Cambridge, 1968)

G. Anderson, **British Administration in India,** (London, 1913)

C.J. Baker and D.A. Washbrook, **South India, 1880 - 1940** (Delhi, 1975)

Bipan Chandra, **The Rise and Growth of Economic Nationalism in India** (New Delhi, 1977)

R.P. Dutt, **India Today** (Bombay, 1947)

R.C. Dutt **Economic History of India** 2 Vols. (London, 1901, 1903)

Dharma Kumar and Tapan Ray Chaudhuri (ed) **The Cambridge Economic History of India**, 2 Vols. (Delhi. 1984)

Elizabeth Whitcombe, **Agrarian Conditions in North India** (New Delhi, 1971)

Edward Thompson and G.T. Garratt, **Rise and Fulfilment of British Rule in India**, (Allahabad, rpt 1976)

S. Gopal, **British Policy in India : 1858 - 1905,** (Cambridge, 1965)

B.N. Ganguli, **Dadabhai naoroji and the Drain theory,** (Bombay, 1965)

E.J. Hobsbawm and others (ed). **'Peasants in History; Essays in honour of Danial Thorner,** (Oxford, 1980).

K.A. Neelakanta Sastri and G. Srinivasachari, **Advanced History of India,** (Calcutta, 1970).

C.H. Philips, **Evolution of India and Pakistan : 1858 - 1947**, (London, 1962)

Percival Spear (ed) **Oxford History of India**, (rpt. New Delhi, 1987).

A.v. Raman Rao, **Economic Development of Andhra Pradesh**, (Bombay, 1958).

I.V. Pavlov, **Historical Premises for India's Transition to Capitalism**, (Moscow, 1979)

Sabyasachi Bhattacharya, **Financial Foundation of the British Raj**, (Simla)

Sumit Sarkar, **Modern India, 1885 - 1947** (rpt. Madras, 1986)

A. Sarada Raju, Economic Conditions in **Madras Presidency 1900 - 1950** (Madras, 1941)

Eric Stokes, **The English Utilitarians and India,** (Oxford, 1959)

Vera Austey, **Economic Development of India,** (Third edn. London, 1949)

William Digby, **'Prosperous' British India,** (London, 1901).

# తప్పొప్పుల పట్టిక

| పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| సబ్ హెడ్డింగ్ | | ప్లానీయుద్ధం | ప్లాసీయుద్ధం |
| ,, | | ప్లాసి తర్వాత పరిస్థితులు | ప్లాసీ తర్వాత పరిస్థితులు |
| 4 | 1 | క్లైవు | క్లైవు |
| 3 | 12 | సేకరించబడేది | సేకరించబడేవి |
| 1 | 4 | సాపిచంమని | స్థాపించమని |
| 3 | 6 | భారతదేంంలో | భారతదేశంలో |
| 3 | 13 | General Service Enlistnent Act | General Service Enlistment Act |